శ్రీశ్రీ గురు గౌరాంగౌ జయతః

# శ్రీకృష్ణోద్ధవ సంవాదము

## (ఉద్ధవగీత)

శ్రీ వేదవ్యాస మహర్షి విరచిత శ్రీమద్భాగవతాంతర్గతము

సంపాదకులు:

శ్రీ చైతన్య మఠమునకును, తచ్ఛాఖలగు శ్రీ గౌడీయ మఠములకును

సభాపతులు, ఆచార్యులు నగు

శ్రీ శ్రీ మద్భక్తి విలాస తీర్థ గోస్వామి మహారాజ్

ఆంధ్రానువాదము:

శ్రీ జన్నాభట్ల వాసుదేవశాస్త్రి

శ్రీ రామానంద గౌడీయ మఠము,
కొవ్వూరు
శ్రీ గౌడీయ మఠము,
గుంటూరు

ప్రథమ ముద్రణము
1,000 ప్రతులు
18-7-76
(నళ సం॥ ఆషాఢ కృష్ణ సప్తమి)
వెల : 5-00

# SRI UDDHAVA GEETA

*in Sanskrit*

**By Sri Vedavyasa Maharshi**

*Translated into Telugu by* **Sri J. Vasudeva Sastry**

*from Bengali rendering by*

**SRI SRILA**
**BHAKTI SIDDHANTA SARASWATI THAKUR**




ప్రాప్తి స్థలములు :
శ్రీ రామానంద గౌడీయ మఠము
కొవ్వూరు, 534350
శ్రీ గౌడీయ మఠము
గుంటూరు, 522001
శ్రీ గౌడీయ మఠము
మద్రాసు, 600014

ముద్రణము :
'రవి ప్రెస్'
గుంటూరు - 3

**THIS BOOK**

**IS PUBLISHED**

*on the Glorious and Auspicious Occasion of*

*the*

# INSTALLATION CELEBRATION OF

**THE SRIMURTHIS**

**SRI CHAITANYA MAHAPRABHU**

**&**

**SRI RAI RAMANANDA**

*on 18th July, 1976*

**By**


**Sri Srimad Bhakti Vilas Tirtha Goswami Maharaj**

*President of*

**Sree Chaitanya Math and its Branches Sree Gaudiya Maths**

Sri Chaitanya Math, Sree Mayapur

( BIRTH PLACE OF SRI CHAITANYA MAHAPRABHU )

DIST. NADIA (WEST BENGAL)

శ్రీ చైతన్య మఠమునకును, దాని శాఖలగు

శ్రీ గౌడీయ మఠములకును ఆచార్యులగు

**శ్రీ శ్రీ మద్భక్తి విలాస తీర్థ గోస్వామి మహారాజులచే**

ప్రతిష్ఠితములగు

**శ్రీశ్రీ చైతన్యమహాప్రభు శ్రీల రాయరామానందుల**

విగ్రహ ప్రతిష్ఠా మహోత్సవ సందర్భమున

ఈ గ్రంథము

ప్రకటింపబడినది.

# భూమిక

శ్రీకృష్ణచంద్రుడు ప్రకటలీలను ఉపసంహరించుట కుద్యుక్తుడయ్యెనను విషయమును దెలిసికొని అంతరంగ పార్షదుడు భక్తప్రవరుడు నగు ఉద్ధవుడు శ్రీకృష్ణుని ధామము నకు బోవ గోరికను దెలుపగా ఆయన యాసమయమున ఉద్ధవున కేయే విషయముల నుపదేశించెనో అవియన్నియు శ్రీమద్భాగ వతములోని యేకాదశ స్కంధమునందు ఆఱవ అధ్యాయము మొదలుకొని యిరువది తొమ్మిదవ అధ్యాయమువఱకు వర్ణింప బడినవి. అదియె 'ఉద్ధవగీత' యను పేరుతో ప్రసిద్ధి చెందినది. ఈ యుద్ధవగీత యను గ్రంథమున మూలశ్లోకములతో పాటు తెలుగు అనువాదము, ఆ యా స్థలములలో విశేషాంశములు పొందుపఱుపబడినవి. శ్రీకృష్ణుని యీ యుపదేశము లన్నియు శాశ్వతసుఖాభిలాషులగు జనులకు మాటిమాటికి అనుశీలింప దగినవై యున్నవి. ఆ యుపదేశములసారము క్రింద వ్రాయ బడుచున్నది.

స్వయంభగవానుడగు శ్రీకృష్ణచంద్రుడు మొదటిసారిగ ఉద్ధవునకు అవధూతయదు సంవాదమును గుర్తునకు దెచ్చి ప్రపంచ నశ్వరతను వర్ణించెను. యయాతి నందనుడగు యదు మహారాజు జడోన్మత్తపిశాచమువలెను, పరమానందముతోను సంచరించు ఒకానొక యవధూతను దర్శించి అట్లుండుటకు

గారణమడిగెను. అవధూత తాను ఇరువది నలుగురు గురువుల కడ వివిధములగు నుపదేశములను బొంది ముక్త భావముతో విహరించుచున్నానని ప్రత్యుత్తర మిచ్చెను. ఆ యుపదేశ ములు క్రింద వ్రాయబడు చున్నవి—

1. పృథివికడ స్థైర్యమును, పర్వతవృక్ష రూపిణి యగు పృథివికడ పరోపకారవృత్తిని. పరాధీనవృత్తిని నేర్చెను.

2. ప్రాణవాయువునుండి - ప్రాణ వృత్తితోనె సంతుష్టి చెందుటను, బాహ్యవాయువునుండి దేహమునందు, విషయ ములయందు నిర్లిప్తతగా నుండుటను నేర్చెను.

3. ఆకాశమునుండి - సర్వవ్యాపియగు ఆత్మయొక్క అపరిచ్ఛిన్నత్వమును, అదృశ్యత్వమును నేర్చెను.

4. జలమునుండి నిర్మలత్వ పావనత్వములను నేర్చెను.

5. అగ్నినుండి-సర్వభక్షకత్వమును, నిర్మలీకరణమును నేర్చెను. దాతయొక్క సర్వాశుభ వినాశత్వమును, సర్వ దేహములయం దుండు ఆత్మ అన్నిచోట్ల ఉండునను విషయ మును, ఉత్పత్తి వినాశముల అలక్ష్యత్వమును నేర్చెను.

6. చంద్రునినుండి-దేహముయొక్క హెచ్చు తగ్గులను నేర్చెను.

7. సూర్యునినుండి—విషయములను స్పృశించినప్పటికిని వానియందాసక్తి లేకుండుటను నేర్చెను.

8. పావురమునుండి - భార్యాపుత్రుల యందాసక్తి యుండుటవలన కలుగు పరిణామమును నేర్చెను.

9. అజగరమునుండి-అదృష్టమువలన లభించిన వస్తువు ద్వారా సంతుష్టి చెంది భగవద్భజనమున ఆసక్తిగలిగి యుండు టను నేర్చెను.

10. సముద్రమునుండి-ప్రసన్నత్వమును, గాంభీర్యమును సుఖదుఃఖములయందు చలింపకుండుటను నేర్చెను.

11. మిడతనుండి-రూపముపై గల ఆసక్తిచే కలుగు ఫలితమెట్టిదో నేర్చెను.

12. తేనెటీగనుండి మాధూకరీవృత్తిని, కూడబెట్టుట వలన గలుగు ఫలితమును నేర్చెను.

13. స్పర్శసుఖమువలన గలుగు అనర్థము ఏనుగు నుండి నేర్చెను.

14. ఇతరులచే గూడబెట్టబడిన ద్రవ్యముద్వారా జీవిత మును గడుపుకొను ఉపాయమును తేనెను దీయువానినుండి నేర్చెను.

15. సంగీతమునందు ఆసక్తి యుండుటవలన కలుగు అనర్థమును లేడినుండి నేర్చెను,

16. చేపనుండి-జిహ్వాచాంచల్యమువలన కలుగు ఫలి తమును నేర్చెను.

17. 'పింగళ' యను వేశ్యనుండి నైరాశ్యమును నేర్చెను.

18. కురర పక్షినుండి-విషయములయందు ఆసక్తి లేకుం టను నేర్చెను.

19. బాలునినుండి నిశ్చింతతను నేర్చెను.

20. కుమారినుండి సాంగత్య త్యాగమును నేర్చెను.

21. బాణమును చేయువానినుండి చిత్తైకాగ్రతను నేర్చెను.

22. సర్పమునుండి ఒంటరితనమును, నిర్దిష్టవాస స్థాన శూన్యత్వమును, అలక్ష్యగతిని నేర్చెను.

23. సాలెపురుగునుండి సృష్టిప్రళయాది కార్యములను నేర్చెను.

24. భ్రమర కీటకమునుండి - స్నేహము, ద్వేషము, భయము మున్నగువానిద్వారా వస్తువులసారూప్యమును నేర్చెను. ధీరుడగువ్యక్తి మనుష్యదేహముయొక్క సుదుర్లభత్వమును, అనిత్యత్వమును దెలిసికొని మోక్షమును బొందుటకు ప్రయత్నింపవలెను.

ప్రవృత్తి మార్గమున నిరవచ్ఛిన్న మగుసుఖము లేక పోవుటవలన, విషయధనము స్వప్నమువలె విఫలమైనదని తెలిసికొని భగవదాశ్రితుడగు వ్యక్తి పంచరాత్రాది విధానము ననుసరించి గురుసేవయందు ఆసక్తిగలవాడయి వైష్ణవ ధర్మమును ఆచరించుచు నిష్కామచిత్తుడయి కాలమును గడుపవలెను.

అవిద్య జీవుని సంసార బంధనమునకు, విద్య జీవుని ముక్తికి హేతువై యున్నది, అవిద్యాయుక్తుడు, త్రిగుణ తాడితుడు నగు జీవుడు అహంకార విమూఢుడై 'నేను' 'నాది' యనుచు శోకమోహాదులకు వశుడై తాను చేసిన కర్మఫలము ననుభవించును. కాని విద్యాయుక్తుడగు జీవుడు విస్తృతదర్శన

ప్రభావముచే యుక్తవైరాగ్య మనుఖడ్గముచే ఛిన్నసంశయుడై శ్రీకృష్ణుని పాదపద్మములయందు మనస్సునుంచి పరమశాంతిని బొందును. బుద్ధిమంతుడగు వ్యక్తి సాధుసాంగత్యముచే ఆత్మతత్త్వమును దెలిసికొనినవాడయి వివిధములగు భక్త్యంగములను అనుష్ఠించుటద్వారా మొదట స్వరూపసిద్ధిని పిమ్మట వస్తుసిద్ధిని బొందును. శమదమములు, కృష్ణైకశరణత్వము మున్నగు నిరువదియాఱు గుణములు సాధువుల లక్షణములు. సాధుసాంగత్యము సంసారాసక్తిని నాశనము చేసి భగవంతుని వశము చేసికొను సామర్థ్యమును గలిగించును, కాని స్వాధ్యాయము, తపస్సు యమ నియమములు మున్నగునవి అట్టివి కావు. ప్రతి యుగమునందును రజస్తమ స్వభావము గల వ్యక్తులు వేదాధ్యయనాదులుగాని, ఇతర సాధనాంగములుగాని లేకయే సాధుసాంగత్యప్రభావముచే భగవంతుని చరణముల బొందగలిగిరి. అబలలగు వ్రజస్త్రీలు భగవత్స్వరూప విషయమును ఎఱుంగని వారయినను జారబుద్ధితో భగవత్సేవాభిలాషతో బ్రహ్మాదులకు గూడ లభింపని భగవంతుని పాదపద్మముల బొందగలిగిరి. వారికి శ్రీకృష్ణునియందు ఎంతటి గాఢమైన ఆసక్తియున్నదనిన రాసలీలా రాత్రియందు శ్రీకృష్ణుని సాంగత్యములో వారు సహస్రయుగపరిమితమగు సమయమును అరక్షణమువలె గడిపిరి. అంతేకాక శ్రీకృష్ణుడు మథురకు వెడలినపుడు భగవద్విరహముచే వారు ఒక్కొక్క రాత్రిని ఒక్కొక్క కల్పముగ గడచుచున్నట్లు తలంచిరి. కృష్ణవిరహకాతరులగు గోపికలకు శ్రీకృష్ణ సాంగత్యముతప్ప మఱియేదియు సుఖకరము కానట్లు తోచినది. కనుక గోపికలప్రేమ మిక్కిలి యుత్కృష్టమైనది.

సత్త్వ రజస్తమో గుణములు మూడును బుద్ధికి సంబంధించినవి కాని ఆత్మకు సంబంధించినవి కావు. సత్త్వగుణము ద్వారా రజస్తమములను లోబఱచుకొనవలెను. సాత్త్విక పదార్థములను సేవించుటవలన సత్త్వగుణము వృద్ధి యగును. వివేకి యగు వ్యక్తి విషయములయందనాసక్తుడయి యుక్త వైరాగ్యముతో కేవల భక్తి నాశ్రయించును. సనకాదులచే నడుగబడినవాడై బ్రహ్మ సమాధానము చెప్పుటకు నసమర్థుడయ్యెను. అపుడు భగవానుడు హంస రూపముతో నవతరించి ఆత్మతత్త్వమును గుఱించియు, త్రివిధావస్థలను గుఱించియు, సంసారమును జయించు ఉపాయమును గుఱించియు బోధించెను. ఋషులు భగవత్కృపచే సంశయరహితులై శుద్ధభక్తిద్వారా భగవాను నారాధించిరి.

వేదవాణి ప్రళయకాలమున అదృశ్యముకాగా భగవానుడు సృష్టిప్రారంభమున బ్రహ్మకు దానిని బోధించెను. బ్రహ్మ మనువునకు, మనువు భృగువు మున్నగు ఋషులకును భాగవత ధర్మమును బోధించెను. వారిద్వారా దేవదానవాదులలో నీ వైదికధర్మము ప్రచారము నందినది. కాని వాసనా వైచిత్ర్యమువలన విభిన్నములగు ఆలోచనలుగల మానవులు శ్రేయస్సాధనములైన నానావిధములగు శాస్త్రములను వ్రాసిరి. కొందఱు ధర్మమును, కొందఱు పుణ్యకర్మలను, కొందఱు కీర్తిని, కొందఱు తపస్సును ఇంకను మున్నగువానిని సాధనములని వర్ణించిరి. కాని భగవద్భక్తియె నిజమైన శ్రేయస్సును గలిగించును. శుద్ధ భక్తియె భగవంతుని బొందుటకు సమర్థమైనదిగాని ఇతరములైనవి కావు. అష్టాంగ యోగాదులవలన

అష్టాదశసిద్ధులు సాధకుని చిత్తమును ప్రలోభపఱచి వ్యర్థముగ కాలమును గడుపునట్లు చేయును. అవిభజనమునకు ఆటంకమును గలిగించును.

ప్రపంచములో గల తేజస్సు, సౌందర్యము, కీర్తి, ఐశ్వర్యాదులు సమస్తము భగవానుని విభూతులె. కాని భగవద్భక్తు లెప్పుడును వానియం దభినివేశము గలవారయి యుండరాదు.

కృతయుగమున కేవలము హంసవర్ణముండెను. మానవులు అనన్య భక్తిపరాయణులై ధ్యాన యోగముచే భగవద్భజనముద్వారా కృతకృత్యులగుచుండెడివారు, అందువలన దీనిని కృతయుగ మనిరి. త్రేతాయుగమున యజ్ఞరూపుడగు భగవాను డవతరించెను. చాతుర్వర్ణ్యములు, చతురాశ్రమములు ఆయననుండి యవతరించినవి. పిమ్మట శ్రీకృష్ణుడు చాతుర్వర్ణ్య ధర్మములను, ఆశ్రమధర్మములను, ఆ యా వర్ణముల స్వభావములను, అంత్యజుల స్వభావములను వర్ణించెను.

నిజమగు విద్వాంసుడు ద్వైత ప్రపంచమును, తత్సాధనములను పరిత్యజించి సర్వప్రభువగు శ్రీహరికి సుఖమును గలిగించుటయందు ఆసక్తిగలవాడై యుండును. తప జపాది పుణ్యకర్మలకంటె జ్ఞానయోగము శ్రేష్ఠమైనది, దానికంటె శుద్ధ భక్తి శ్రేష్ఠమైనది. భగవత్కథలను వినుటయందు శ్రద్ధ, ఎల్లప్పుడు భగవంతుని కీర్తించుట, పూజించుట, స్తుతించుట, నమస్కరించుట, భక్తులను పూజించుట మున్నగువాని ద్వారా భక్తి వృద్ధియగును.

మోక్షమును సాధించుటకై కర్మలు, జ్ఞానము, భక్తి వర్ణింపబడినవి. విరక్తి చెందని వ్యక్తులకై కర్మయోగము-కర్మత్యాగులగు వారి నిమిత్తమై జ్ఞానయోగము, యుక్తవైరాగ్యము గల వ్యక్తులకై భక్తియోగము చెప్పబడినవి. కర్మఫలాభోగమునందు విరక్తి, భగవత్కథలయందు శ్రద్ధ కలుగనంతవఱకు కర్మల నాచరించుచుండ వలసినదె, త్యాగులైనవారు, భక్తులైనవారు కర్మల నాచరింపవలసిన పని లేదు. మానవజన్మయందె భగవద్భక్తి లభించును. దానికై దేవతలు మానవశరీరమును గోరుచుందురు. కనుక బుద్ధిమంతుడగు వ్యక్తి సంసార సముద్రమును దాటుటకు నౌకాస్వరూపమగు మానవదేహమునుబొంది శుద్ధభక్తుని కర్ణధారునిగ ఆశ్రయించి అనాయాసముగ భవసాగరమును దాటుటకు ప్రయత్నించును. భగవద్భక్తిద్వారానే సర్వసిద్ధులు కలుగును. భక్తుని పక్షమున నెట్టి వైరాగ్యాది సాధనములకు ప్రయోజనము లేదు.

జ్ఞాన భక్తులయందు సిద్ధులగు వ్యక్తులకు దేశ కాలపాత్రగతమగు నెట్టి దోషములుగాని. గుణములుగానియుండవు. కర్మనిష్ఠులగు సాధకుల చిత్తములను శోధించుటకై నిత్యనైమిత్తిక కర్మ విధాన మున్నది. వాని ననుష్ఠించుటవలన గుణములు, అనుష్ఠింపకపోవుటవలన దోషములు కలుగును. జ్ఞాననిష్ఠులయినవారికి జ్ఞానాభ్యాసము, భక్తులకు శ్రవణాది భక్తి గుణము, కామ్యకర్మలు శ్రేయస్సాధనములు గావు. వాని యుద్దేశ్యము-ప్రవృత్తిని తగ్గించుట, శ్రేయస్సును గలిగించు వానియందు ఆసక్తిని గలిగించుట. వేదములయందు ఆపాతమనోహరములగు వాక్యములచే నాకృష్టచిత్తులగు వ్యక్తులు

దానిని తెలిసికొనలేరు. భగవంతునకుదప్ప ఇతరు లెవ్వరికిని వేదముల తాత్పర్య మవగతము కాదు.

తత్త్వ సంఖ్యను నిర్దేశించుటలో అనేకములగు అభిప్రాయ భేదములు కనబడుచున్నవి. భగవన్మాయా ప్రభావముచే నీ యభిప్రాయభేదములు అసంభవములు గావు. తత్త్వజ్ఞానము లేకపోవుటవలన విషయవిమూఢుడగు జీవుడు ప్రాపంచిక గతిని బొందును. ఆత్మ విషయముల ననుభవింపజాలదు. ఆ విషయములను ఇంద్రియము లనుభవించును. అందువలన శ్రేయస్కాముడగు వ్యక్తి వివేకము నవలంబించి విషయముల ననుభవించు ప్రయత్నమును వదలి తన్నుద్ధరించుకొనుటకు ప్రయత్నించును. భగవచ్చరణముల నాశ్రయించిన జనులు ఏవిధముగను విషయములకు లోబడరు. వారు క్షోభితులు, అవమానితులు, తాడితులునైనను ధైర్యము నవలంబించి తమ్ము తాము రక్షించుకొందురు. అవంతీదేశీయు డైనబ్రాహ్మణభిక్షుకుడే దానికి ఉదాహరణస్వరూపుడయియున్నాడు. అతడు మిక్కిలి లోభి, కోపస్వభావుడు. అందువలన బంధువులు, జ్ఞాతులు వాని కప్రియులైరి. కాలక్రమమున వాని సంపదను దొంగలు, జ్ఞాతులు, దైవము హరించివేసిన ధనహీనుడయి అందఱిని విడచి అతడు నిర్వేదగ్రస్తుడయి అర్థము అనర్థములకు గారణ మని తెలిసికొని జీవితములోని మిగిలినభాగమును హరిసేవయందు గడుపుటకు నిశ్చయించుకొనినవాడయి త్రిదండసన్న్యాసమును గ్రహించెను. అతడు భిక్షార్థమై నగరాదులకు వెడలినప్పుడు జనులు వాని ననేకవిధముల బాధింపదొడగిరి. కాని యతడు చలింపకుండగ వానిని సహించి, మనస్సు సుఖ

దుఃఖములకు గారణము, సర్వసాధనములు మనోనిగ్రహార్థములే యను సిద్ధాంతమును స్థిరపఱచుకొనెను. భగవచ్చరణముల యందు మనస్సు నుంచుటయె సర్వసాధనముల సారమై యున్నది.

పురుషుని ద్వారా క్షుబ్ధమగుప్రకృతినుండి మహత్తత్త్వము, దానినుండి త్రివిధములగునహంకారములు, వాని నుండి దేవతలు, మనస్సు, పది యింద్రియములు, పంచభూత ములు, పంచతన్మాత్రలు నుత్పన్నములైనవి. పురుషుని నాభి కమలమునుండి బ్రహ్మ ఆవిర్భవించెను. ఆయన పదునాలుగు భువనములను సృష్టించెను. జగత్తుయొక్క ఉనికి యంతయు నశ్వరమైనదియే. అది ప్రకృతిపురుషుల సంయోగమువలన గలిగి నదె, కాని ఆత్మ నిత్యమైనది. ఈ సాంఖ్యజ్ఞానము సర్వసంశ యములను, బంధనములను నాశనము చేయునట్టిది.

శమదమాదులు సత్త్వగుణవృత్తులు, కామమదాదులు రజోగుణవృత్తులు, క్రోధ లోభ మోహాదులు తమో గుణ వృత్తులు. సత్త్వప్రకృతి కర్మనిరపేక్షకము, రజఃప్రకృతి ఫలా కాంక్షి, తమఃప్రకృతి హింసాకాంక్షి. జీవునియందు త్రిగుణము లును నున్నవి. కాని శ్రీహరి నిర్గుణుడు. త్రిగుణసాంగ త్యమును వదలి భగవంతుని సేవింపవలెను.

భగవత్పరాయణు డగు వ్యక్తి మాయానుండి ముక్తు డగును. మాయాబద్ధులైనవారు శిశ్నోదరపరాయణులు, చెడు నడతగలవారు నగుదురు. వారి సాంగత్యమువలన మానవుడు అంధతామిస్ర మనునరకమున బడును. ఊర్వశీసాంగత్యముగ్ధు డగు పురూరవచక్రవర్తి నిర్వేదమును బొంది స్త్రీ సహవాసము

వలన గలుగు పరిణామము అసహ్యము, భయంకరము ననివర్ణించెను. చర్మమాంసాస్థిమయ మగు స్త్రీదేహమునం దాసక్తులగువారు కృమివంటివారు. స్త్రీకి వశులయినవారి విద్య, తపస్సు, మౌనము మున్నగు గుణము లన్నియు నిష్ఫలములే. స్త్రీ సహవాసమును, స్త్రీకి లోబడిన వారి సాంగత్యమును పూర్తిగ వదలవలెను. అందువలన బుద్ధిమంతు లగువ్యక్తులు ఈ దుస్సాంగత్యముల నన్నింటిని వదలి సాధుసాంగత్యమున శ్రద్ధ కలిగియుండవలెను. సాధువులు ముక్తులు, భగవత్పరాయణులు. సాధువులు సదుపదేశములద్వారా మనస్సులోని ఆసక్తులను ఛేదింప సమర్థులగుదురు.

భగవదర్చనము చిత్తమునకు ఆనందమును ప్రసన్నతను గలిగించును. (1) వైదికము, (2) తాంత్రికము, (3) మిశ్రమము నని అర్చన మూడు విధములు. ప్రతిమ లెనిమిది విధములు. సాత్వతవిధి ననుసరించి భగవంతు నర్చింపవలెను. భగవంతుడు చెప్పినట్లు అర్చన చేసినచో భగవద్భక్తి కలుగును.

ప్రపంచములోని భావము లన్నియు ప్రాకృతములు, త్రిగుణజాతములు, అనిత్యములు. వానిలో మంచి చెడుల తేడా ఉన్నది. కాని జడవస్తువులయం దాసక్తి యుండి వానిని నిందించినను, స్తుతించినను పరమార్థహాని కలుగును. విశ్వమంతటిలోను ఆత్మయొక్కటియె కార్యకారణ రూపమున పని చేయుచున్నది. ఈ యాలోచనము ననుసరించి అనాసక్త భావముతో ప్రపంచమున జీవితమును గడుపవలెను. దేహేంద్రియాదులతో సంబంధ మున్నంతవఱకె ప్రాపంచిక ప్రతీతి

యుండును. సూటిగ జెప్పినను, వ్యతిరేకముగ జెప్పినను పరబ్రహ్మ మొక్కటియె అన్నిచోట్ల, ఎల్లప్పుడు నుండును. సద్గురువు కృపవలన బ్రహ్మజ్ఞానమును బొంది దేహాదులను ఆత్మ కాదని యెఱింగి విషయసాంగత్యమును వదలి దృఢమయిన భక్తి యోగము నవలంబింపవలయును. యోగాద్యుపాయము లచే శరీరమునందు యౌవనమును స్థిరముగ నుంచుకొనుటకు జేయు ప్రయత్నము వ్యర్థము. అది దేహాసిద్ధియె యగును.

భగవన్మాయామగ్ధులు, అభిమానులు, కర్మిష్ఠులు, యోగులు నగువారు భగవానుని పాదపద్మముల నాశ్రయింపరు. ఆ పాదపద్మములు పరమహంసలచే నారాధ్యములు. భగవంతుడు చైత్యగురురూపముతోను ఆచార్యరూపముతోను అమంగళముల నన్నింటిని దొలగించి స్వస్వరూపమును బ్రదర్శించును, సర్వకర్మలను భగవంతుని నిమిత్తమె నాచరింపవలెను. భగవంతుని లీలాస్థలములను ఆశ్రయించి భగవత్సేవను, యాత్రామహోత్సవాదులను చేయవలెను. అంతట, అన్నిప్రాణులలోను కృష్ణుడే యున్నాడని తెలిసికొని సమదృష్టి కలవాడయినచో వాని యహంకారము వినష్టమగును. అనన్యభావముతో భగవతున కాత్మసమర్పణమును జేసినచో భగవంతునకు బ్రీతి కలుగును.

శ్రీకృష్ణుని పై యుపదేశములను విని, హృదయమున శ్రీకృష్ణుని నిలుపుకొని, ఆయన ఆదేశము ననుసరించి ఉద్ధవుడు బదరికాశ్రమమునకు వెడలి శ్రీకృష్ణుని ధ్యానించుచు, తపస్సు చేయుచు, ఆయన ధామమును బొందెను.

భవభయమపహంతుం జ్ఞానవిజ్ఞానసారం
నిగమకృదుపజహ్రే భృంగవద్వేదసారం,
అమృతముదధితశ్చాపాయయద్ భృత్యవర్గాన్
పురుషమృషభమాద్యం కృష్ణసంజ్ఞం నతోఽస్మి ॥

వేదకర్త యగుజనార్దనుడు జీవుల సాంసారికభయమును బోగొట్టుటకై తుమ్మెదవలె సర్వవేదములనుండి సారరూపము, జ్ఞానవిజ్ఞానశ్రేష్ఠము నగు భక్తిరసామృతమును సేకరించి తన భక్తులకును, సముద్రమునుండి అమృతమును వెలికిదీసి మోహినీ రూపముతో నసురుల నంచించి తన్ను సేవించు దేవతలకును పంచిపెట్టెను. జగత్కారణుడు, ఆద్యుడు, కృష్ణ సంజ్ఞకుడు నగు నా పరమపురుషునకు నమస్కరించుచున్నాను.

హేకృష్ణ! కరుణాసింధో! దీనబంధో! జగత్పతే!
గోపేశ! గోపికాకాంత! రాధాకాంత! నమోఽస్తుతే॥

భాగవత దాసానుదాస
త్రిదండిభిక్షు శ్రీ భక్తి విలాస తీర్థ

# అనువాదకుని మనవి



వేదమహర్షి లోకోపకారార్థమై అష్టాదశ పురాణములను, శ్రీమన్మహాభారతమును రచించెను. పురాణములలో నొక్కటియగు శ్రీమద్భాగవతము శ్రీకృష్ణభగవానుని లీలలను సమగ్రముగ వర్ణించినది. దీనిలో వేణుగీత, భ్రమరగీతలు గోపికాగీతలు, ఉద్ధవగీత మున్నగు గీత లెన్నియో గలవు. వానిలో ప్రస్తుతగ్రంథ మొకటి. శ్రీకృష్ణభగవానుడు తనకు భక్తుడు, బంధువు నగు ఉద్ధవున కుపదేశించిన విషయము లెన్నియో ప్రస్తుత "శ్రీకృష్ణోద్ధవ సంవాద"మను గ్రంథమున పొందుపఱుపబడినవి. మహాభారతమున భగవానుడు అర్జునున కుపదేశించిన విషయములతో గూడిన శ్రీమద్భగవద్గీతకు నీ యుద్ధవ సంవాదమున (ఉద్ధవగీత)కు నెన్నియో విషయములలో పోలిక గలదు.

భగవద్గీతకును ఉద్ధవగీతకును ప్రవక్త శ్రీకృష్ణ భగవానుడే. శ్రోతలు అర్జునుడు, ఉద్ధవుడు. స్వాభావ పరిశీలనము చేసిన ఇట్టి విషయములను గ్రహించుటకు సర్వవిధముల ఉత్తమమైన అర్హత గలవాడు ఉద్ధవుడే యని యనిపించును. వయస్సునందును, మనస్సునందును పరిణతి, అర్హతలలో ఉద్ధవుడే మిన్న. భగవద్గీత కురుపాండవ సంగ్రామ ప్రారంభమునందు ఆవిర్భవించినది. అప్పుడర్జునుడు విషాదమున మునిగిన

వాడు. విషయగ్రహణమునకు వలసినంత స్థిమితము లేనివాడు. ఆ వాతావరణము సర్వవిధముల రజోగుణమును విజృంభింప జేయునది. కృష్ణుడు గూడ పార్థుని కర్తవ్యోన్ముఖుని గావించుటకు భగవద్గీతను ప్రారంభించి అర్జునుని ప్రశ్నలకు సమాధానములుగ ననేక విషయములను అందు ప్రతిపాదించెను. ఇంతగా జెప్పిన విషయమును విస్మరించుటచే అర్జునునకు తుది పర్వములందు మరల అనుగీతలను బోధించెను.

ఉద్ధవునకు బోధించునాటికి శ్రీకృష్ణుడు సర్వసంగపరిత్యాగియై పరమపదమును ప్రవేశించుటకు సిద్ధముగా నుండెను. ఆయన అహంకారమమకారముల కతీతుడై యుండెను. భక్తవరేణ్యుడగు నుద్ధవునకు బరమార్థము నుపదేశించుటకు అది ఆయనకు తగిన సమయము. ఉద్ధవుడుగూడ జిజ్ఞాసతో అనుష్ఠానకాంక్షతో ప్రశాంతమైన సత్త్వగుణప్రధానమగు మనస్సుతో భగవానుని ప్రశ్నించెను. ఉద్ధవగీత జనించిన సమయసన్నివేశములు రెండును సత్త్వప్రధానములె. తత్త్వవిషయమును ప్రతిపాదించుటకు గ్రహించుటకు సమర్థములై యుండెను. అట్టి ప్రశాంతమైన సమయమున 24 అధ్యాయములు గల ఉద్ధవగీత చతుర్వింశతి తత్త్వములతో ప్రకాశించు జగన్నిర్మాణమునకు దీటై వెలుగొందుచున్నది. ఇంతియగాక భగవద్గీతలో నిరూపింపబడని విషయము లిందు అనేకము ప్రతిపాదింపబడినవి. అవధూతోపాఖ్యానము. విగ్రహస్వరూప నిరూపణము, అర్చనావిధానము, భాగవతధర్మనిరూపణము మున్నగు ననేకవిషయములు సాధకులకు సర్వవిధముల మార్గదర్శకములై యిందు నిరూపింపబడినవి.

తత్త్వబోధకమును, గ్రంథకర్తయును నొక్కడే యగుట వలన భగవద్గీతయందలి కొన్ని విషయములు ఉద్ధవగీతయందు ప్రత్యక్షమగును. జ్ఞాన కర్మ భక్తి యోగములు, సాంఖ్య యోగము, గుణత్రయ విభాగ యోగ స్వరూపము మున్నగు నవి న్యూనాధికముగ నిందు కాన్పించును. భగవద్గీతయందలి దశమాధ్యాయమగు విభూతియోగము ఉద్ధవగీతయందు పదు నారవ యధ్యాయమున క్రొత్తక్రొత్తల మేలు కలయికగా భాసిల్లును. ఈవిధముగనే సమ్యక్పరిశీలన మొనర్చిన నెన్ని యో విశేషములు ఉద్ధవగీతయందు స్ఫురించును.

శ్రీమద్భాగవతమునందలి యేకాదశ స్కంధములోనిది యగు నీ శ్రీకృష్ణోద్ధవ సంవాదమును ప్రభుపాద శ్రీ శ్రీల భక్తి సిద్ధాంత సరస్వతీ ఠాకురులు వంగ భాషలోని కనువ దించిరి. ఆంధ్ర దేశములోని భక్తుల యుపయోగార్థము పై గ్రంథమును తెలుగుభాషలోనికనుదింపవలసినదిగా త్రిదండి స్వామి శ్రీభక్తి కమలపద్మనాభ మహారాజగారును, త్రిదండి స్వామి భక్తి సుధీర దామోదర మహారాజగారును, త్రిదండి స్వామి శ్రీ విజయ విష్ణు మహారాజగారును నన్నాదేశించిరి. దానికనుగుణముగ శ్రీ చైతన్య మఠమునకును, దానిశాఖలగు శ్రీ గౌడీయ మఠములకును ఆచార్యులగు శ్రీ శ్రీమద్భక్తి విలాసతీర్థ గోస్వామి మహారాజుల ఆమోదము గూడ లభించి నది. ఆ గ్రంథము ననువదించు సామర్థ్యము నాలో లేకపోయి నను పై మహాత్ముల ఆజ్ఞను శిరసావహింపక తప్పలేదు. వారి యందరికి నా సాష్టాంగ ప్రణామములు. శ్రీకృష్ణచంద్రుని పై భారమువైచి అనువాదము చేసితిని. అనువాదములో దోషము

లుండవచ్చును, అట్టివి యున్నచో క్షమింపవలసినదిగా పండిత వరేణ్యులను ప్రార్థించుచున్నాను.

లిఖిత ప్రతిని సరిచూచిన నా సోదరుడు చి॥ జన్నాభట్ల వీరేశ్వరశాస్త్రి 'భాషాప్రవీణ' M. A., ను శ్రీకృష్ణ చంద్రుడనుగ్రహించు గాక !

నాయీ యనువాదమును ఓపికతో విని, ఆయా స్థలములలో దగు సూచనల నిచ్చిన త్రిదండిస్వామి శ్రీ విజయవిష్ణు మహారాజుగారికి పునః పునః ప్రణామముల నాచరించుచున్నాను.

ఈ గ్రంథమును ముచ్చటగా ముద్రించిన 'రవి ప్రెస్' అధిపతులగు శ్రీ తోట సుబ్బారావుగారికి కృతజ్ఞతాభినందనములు—

గుంటూరు,<br>4–7–76

ఇట్లు,<br>భక్తాంఘ్రిరేణువు<br>**జన్నాభట్ల వాసుదేవశాస్త్రి**

# విషయసూచిక

# శ్రీకృష్ణోద్ధవ సంవాద

## కథాసారము

స్వేచ్ఛామయుడగు శ్రీకృష్ణ భగవానునకు దన ప్రకట లీలను ఉపసంహరించుకొన వలయునను కోరిక కలుగగా ఆయన నాభికమలమునుండి జన్మించినవాడు, లోకపితామహుడు నగు బ్రహ్మ లోకమంగళకరుడగు శివుడు మున్నగు దేవతలు గంధర్వాదులతో గూడి ద్వారకకు వెడలి శ్రీకృష్ణచంద్రుని పూజించి, స్తుతించి, ఆయన యీ పృథివియందు అవతరించిన యుద్దేశ్యము సఫలమైనదని తెలిపి, తన లీలలను ఉపసంహరించుకొన వలసినదిగా ప్రార్థించిరి. శ్రీకృష్ణ భగవానుడు లోకపితామహుడగు బ్రహ్మకు ముందు జరుగబోవు యదువంశ నాశనమును గూర్చి వివరించి, దేవతల నందఱను తమ తమ నిలయములకు వెడలవలసినదిగా ఆదేశించెను. అనంతరము భగవానుని యిచ్ఛచే ద్వారకలో నానావిధములగు అరిష్టములు కనబడ సాగినవి. అపుడు శ్రీకృష్ణుడు యదువంశములోని పెద్దలను పిలచి ద్వారకలో నివసించుట మంచిది కాదనియు ప్రభాస తీర్థమునకు వెడలుట క్షేమమనియు ఉపదేశించెను. ఈ సంభాషణమును విని కృష్ణప్రియుడగు ఉద్ధవుడు భగవానునికడకు వెడలి యేకాంతముగ ఆయన యుద్దేశ్యములోని రహస్యమును దెలిసికొని, ఆయనవలని యెడబాటును సహింపజాలనని విన్నవించుకొనెను. అంతట శ్రీకృష్ణుడు తాను తన నిలయమునకు

వెడలవలయుననియు, తాను ఇచట అవతరించిన ఉద్దేశ్యముసిద్ధించినదనియు. తన లీలను ఉపసంహరించుకొనిన పిమ్మట జగత్తు కలిప్రభావముచే అస్తవ్యస్తమగుననియు దెలిపెను. సన్న్యాసమును స్వీకరించి దానియందు మనస్సునుంచి జ్ఞానవిజ్ఞాన సంపన్నుడవై నిర్లిప్త భావముతోను, సర్వభూతములను సుహృద్భావముతోను జూచుచు మాయామయ మగు నీ జగత్తులో విహరింపవలసినదిగా నుద్ధవున కుపదేశించెను. ఇది విని యుద్ధవుడు విషయాసక్త జీవులు అనాసక్తితో నుండుట మిక్కిలి కష్టమని పలికెను. భగవానుడు ఉద్ధవుని దృష్టిలో నుంచుకొని సామాన్యజనుల కందఱకు బోధపడునట్లు జగత్తుయొక్క అనిత్యతనుగూర్చి యిట్లు చెప్పెను — యయాతి తనయుడు పరమభాగవతుడు నగు యదువు జడోన్మత్త పిశాచము వలె నున్నను పరమానందముతో సంచరించుచు నున్న ఒకానొక అవధూతను జూచి ఆయన అట్టి యవస్థలో నుండుటకు గల కారణము నడిగెను. అపుడు అవధూత తాను పుడమిపై సంచరించుచు ఇరువది నలుగురు గురువులకడ వివిధ విషయములను ప్రత్యక్షముగ నేర్చికొని ముక్త భావముతో సంచరించు చున్నానని చెప్పెను. 1) పృథివినుండి ధైర్యమును, పర్వతరూపము, వృక్షరూపమునగు ధరణినుండి పరోపకారచేష్టను, పరార్థ పరాయణత్వమును, 2) ప్రాణవాయువునుండి ప్రాణవృత్తిద్వారా సంతోషమును, బాహ్యవాయువునుండి దేహమునందు, విషయములయందు అనాసక్తిని, 3) ఆకాశమునుండి సర్వవ్యాపి యగు ఆత్మయొక్క అపరిచ్ఛిన్నత్వమును, అదృశ్యత్వమును, 4) జలమునుండి నిర్మలత్వమును, పావనత్వమును 5) అగ్ని

నుండి సర్వభక్ష్యత్వ నిర్మలకారిత్వములను, దాతయొక్క సర్వా శుభవినాశత్వమును, సర్వదేహములలో నుండు ఆత్మయొక్క ఉనికిని, ఉత్పత్తి వినాశముల అలక్ష్యత్వమును 6) చంద్రుని నుండి అనిత్యమగు దేహముయొక్క క్షయ వృద్ధులను 7) సూర్యునినుండి విషయములలో నున్నను వానియందు ఆసక్తి లేకుండగ నుండుటను 8) పావురమునుండి దారాపుత్రాదుల యందత్యాసక్తి యున్నచో దానివలన కలుగు చెడుపరిణామ మును, 9) అజగరములనుండి యదృచ్ఛాప్రాప్తమగు ద్రవ్య ముచే సంతుష్టిచెంది యెల్లపుడు భగవద్భజనమున ఆసక్తి గలిగి యుండుటను, 10) సముద్రమునుండి ప్రసన్నత్వమును, గాంభీర్య మును, సుఖ దుఃఖములయందు నిశ్చలముగ నుండుటను, 11) పతంగమునుండి రూపజమగు మోహమువలన గలుగు చెడు పరిణామమును, 12) (క) తుమ్మెదనుండి మాధూకరీవృత్తిని, (ఖ) తేనెటీగనుండి కూడబెట్టుకొనుటవలన గలుగు చెడు పరి ణామమును, (13) ఏనుగునుండి స్పర్శనుఖాసక్తివలన గలుగు అనర్థమును, 14) తేనెను దీయువానినుండి అన్యులచే సంగ్ర హింపబడిన ద్రవ్యముతో జీవితమును గడుపుకొను విధానమును 15) హరిణమునుండి గానమునందాసక్తి యుండుటచే కలుగు అనర్థమును, 16) చేపనుండి జిహ్వావేగమువలన గలుగు పరి ణామమును, 17) పింగళ యను వేశ్యనుండి నైరాశ్యమును, 18) కురరపక్షినుండి విషయములయందనాసక్తిని, 19) బాలుని నుండి చింతాశూన్యత్వమును, 20) కుమారినుండి సంగవర్జన మును 21) బాణము చేయువానినుండి చిత్తైకాగ్రతను, 22) సర్పమునుండి—ఏకచరత్వమును, నిర్దిష్టవాసస్థాన శూన్య

త్వమును, అలక్ష్యగతిని 23) సాలెపురుగునుండి సృష్టిప్రళయాదు లను, 24) భ్రమర కీటకమునుండి స్నేహ ద్వేష భయాది నిమిత్తమైన వస్తువుయొక్క సారూప్యమును నేర్చుకొంటిని. అంతేకాక ఆయన స్వదేహమునుండి వైరాగ్యమును వివేక జ్ఞానమును దెలిసికొనెను. మానవదేహము సుదుర్లభము, అనిత్యము. సర్వదేహములవలె మనుష్యదేహము విషయ భోగమునకు యోగ్యమైనదైనను ఈ దేహము తప్ప మఱి యేదియు భగవద్భజనమునకు యోగ్యము కాదు. అందునలన ధీరుడగు వ్యక్తి దేహము ఉత్పత్తివినాశశీలమైనదనియు, క్షణ భంగురమైనదనియు దెలిసికొని శరీరముపై ఆసక్తిని వదలి తత్త్వానుసంధాన పూర్వకముగ నిత్యశుభమునకై ప్రయత్న పరుడు కావలెను.

[ 11 స్కం. 6, 8, 9 అధ్యాయములు ]

ప్రవృత్తి మార్గమున జీవునకు నిరవచ్ఛిన్నమగు సుఖము కలుగదు. విషయసుఖ ధ్యానము స్వప్నమువలె నిష్ఫలమని తెలిసికొని భగవచ్చరణముల నాశ్రయించిన వ్యక్తి పంచ రాత్రాది విధానముచే గురుసేవా పరాయణు డగును. విష్ణు సేవాధర్మమును, వైష్ణవసేవా ధర్మమును పాలించుటయందు తత్పరుడై నిష్కామమగు చిత్తముతో కాలము గడుపును. గురుదేవుడు భగవానుని ప్రకాశవిగ్రహము. సద్గురు వొక్కడె శుద్ధమగు ఆత్మజ్ఞానమును బోధింప సమర్థుడు. ఆత్మ స్థూల సూక్ష్మ దేహద్వయముతో భిన్నముగ నున్నది. దేహము నందు ప్రవేశించిన ఆత్మకర్మానుయాయియగు దేహధర్మమును

స్వీకరించును. ఉద్ధవుడు బద్ధ ముక్త జీవులకు సంబంధించిన సవిశేషతత్త్వమును దెలిసికొనదలచి భగవానుని ప్రశ్నించెను.

[ 10 వ అధ్యాయము ]

భగవదంశయగు అణుత్వధర్మ పరియుక్తమగు జీవాత్మ అవిద్యవలన సత్త్వాదిగుణరూపమగు ఉపాధినిబొంది అనాది కాలమునుండి బద్ధుడయియున్నాడనియు విద్యనాశ్రయించుట వలన శుద్ధభక్తిని బొంది నిత్యముక్తుడై యున్నాడనియు చెప్ప బడుచున్నాడు. కనుక విద్య జీవుని సంసారముక్తికిని, అవిద్య సంసార బంధనమునకును గారణము. విద్యావిద్యలు రెండును శ్రీకృష్ణ మాయా రచితములె. అవిద్యాయుక్తుడగు జీవుడు అహంకారవిమూఢుడై శోకమోహములకు సుఖదుఃఖాదులకు వశుడై స్వయంకృతమగు కర్మ ఫలమును అనుభవించును. కాని విద్యాయుక్తుడగు జీవుడు ఉపాసదర్శనప్రభావముచే యుక్తవైరాగ్యమగు ఖడ్గముచే ఛిన్నసంశయుడై శ్రీకృష్ణ పాదపద్మములయందు చిత్తమునుంచి ఉత్కృష్టమగు శాంతిని బొందును, జీవాత్మ పరమాత్మ లిరువురు దేహమునందు నివ సింతురు. అయినచో విభుచిత్తుడగు పరమాత్మ కర్మఫలము ననుభవింపడు, సాక్షిరూపమున నుండును. కాని అణుచిత్తు డగు బద్ధజీవుడు అనభిజ్ఞుడగుటవలన కర్మఫలము ననుభవించును. పక్షాంతరమున జీవాత్మ సహజముగ దేహగతములగు సుఖ దుఃఖముల ననుభవింపకపోయినను స్వప్నద్రష్టయగు వ్యక్తి వలె తన దేహగతములగు సుఖదుఃఖముల ననుభవించుచున్నా నని యభిమానపడును. బుద్ధిమంతుడగు వ్యక్తి సత్సాంగత్య ముచే ఆత్మ తత్త్వమును దెలిసికొని భక్తికి సంబంధించిన

వివిధాంగములను పాటించుటద్వారా స్వరూపసిద్ధిని వస్తుసిద్ధిని బొందును. దాక్షిణ్యము, శమదమతితిక్షాదులైన ఇరువది యాఱు గుణములు సాధువుల లక్షణములు. వానిలో కృష్ణైక శరణాత్వమె సాధువుల ముఖ్యలక్షణము. శ్రీ వి గ్ర హ ము యొక్క, శుద్ధ భగవద్భక్తులయొక్క దర్శన స్పర్శన అర్చనాదు లయిన అరువది నాలుగు విధములగు భక్త్యంగములు, భగవ త్పూజాపద్ధతి వర్ణితము లైనవి. సాధుసాంగత్యమే భగవ త్ప్రాప్తి. సత్సాంగత్యమువలన గలిగిన భక్తి తప్ప మఱియొక యుపాయ మేదియు మానవుని సంసారమునుండి తరింప జేయ జాలదు. [ 11 వ అధ్యాయము ]

సత్సంగము జీవునకు సంసారాసక్తిని నాశనము చేసి శ్రీకృష్ణుని వశము చేసికొనుటకు సహాయపడునట్లుగ యోగము, సాంఖ్యము, ధర్మము, స్వాధ్యాయము, తపస్సు, త్యాగము, ఇష్టకర్మలు, పూర్తకర్మలు, దక్షిణలు, వ్రతములు, దేవ పూజలు, సరహస్యమగు మంత్రము, తీర్థములు, యమనియమ ములు మున్నగునవేవియు సహాయపడవు. రజస్తమప్రకృతివిశిష్టు లగు దైత్యులు, రాక్షసులు, ఖగములు, మృగములు మున్నగు నవియు, మనుష్యులలో వైశ్య శూద్ర స్త్రీ అంత్యజులు మున్నగువారు వేదాధ్యయనాదుల చేయకపోయినను కేవలము సత్సంగము చేయుటవలన కలుగు ప్రభావముచేతనె భగవానుని పాదపద్మముల బొందుటకు సమర్థులై యున్నారు. వ్రజస్త్రీలు జారబుద్ధితో సేవించి బ్రహ్మాదులకు గూడ లభింపని శ్రీకృష్ణ భగవానుని పాదపద్మముల బొందగలిగిరి. వారు శ్రీకృష్ణుని

యందు గాఢమగు ఆసక్తిగలవారై రాసలీల జరిపిన రాత్రుల యందు సహస్రయుగపరిమితమగు సమయమును అర్ధక్షణముగ గడిపిరి. కాని కృష్ణుడు మధురలో నున్నపుడు ఆ యెడబాటు వలన వారు ఒక్కొక్క రాత్రిని ఒక్కొక్క కల్పముగా భావించిరి. కృష్ణవిరహాకాతరులగు గోపికలకు కృష్ణ సాంగత్యము తప్ప మఱియేదియు సుఖము కలిగింపదు. కావున గోపీ ప్రేమయే సర్వోత్కృష్టమైనది. ధర్మాధర్మములను వదలి భగవంతుని బొందుటకు ఆ గోపికలనే శరణు పొందవలసినదిగా భగవాను డుద్ధవున కుపదేశించెను. (12 అధ్యాయము)

సత్త్వరజస్తమము లను మూడుగుణములు బుద్ధికి సంబంధించినవిగాని ఆత్మకు సంబంధించినవి కావు. సత్త్వగుణముచే రజస్తమోగుణముల రెండింటిని నాశనముచేసి చివరకు విశుద్ధ సత్త్వవృత్తిద్వారా మిశ్రసత్త్వమును నాశనము చేయవలెను. ఆగమములు, జలము, దేశము, కాలము, పాత్రము, కర్మ, జన్మ, ధ్యానము, మంత్రములు, సంస్కారములు — అను ఈ పదింటి ప్రభావముచేతనే త్రిగుణములు వృద్ధి బొందును. వివేకము లేకపోవుటచేతనే దేహాదులయందు అహంకార బుద్ధి కలుగును. వివేకియగు పురుషుడు విషయములయందనాసక్తుడయి యుక్తమగు వైరాగ్యము నవలంబించి భక్తిని మాత్రమే ఆశ్రయింపవలెను.

సనకాదులైన బ్రహ్మ మానస పుత్రులు తండ్రికడకు వెడలి చిత్తమునుండి విషయవాసనలు తొలగు నుపాయమును జెప్పవలసినదిగా గోరిరి. బ్రహ్మ దానికి సమాధానము చెప్ప లేక వారిని వెంటనిడుకొని భగవానుని శరణు జొచ్చెను. భగ

వానుష హంస రూపముతో నవతరించి ఆత్మతత్త్వమును, బుద్ధ్యవస్థలైన జాగ్రత్స్వప్నసుషుప్తు లనుమూడింటిని, సంసార ముచు జయించు నుపాయమును వివరించెను. మునులు భగవంతుని కృపచే సంశయ రహితులై శుద్ధ భక్తితో భగవాను నారాధించిరి. (13 అధ్యాయము)

ప్రళయ కాలమున వేదవాణి అదృశ్యముకాగా భగవానుఁడు సృష్టి ప్రారంభమున బ్రహ్మదేవునకు దానిని బోధించెను, బ్రహ్మ మనువునకు, మనువు భృగువు మున్నగు ఋషులకు, వారు దేవదానవమానవాదులకు వేదధర్మమును బోధించిరి. జీవుల చిత్తములలో వాసనల వైచిత్ర్య ముండుటవలన భిన్నభిన్నములగు మతము లుద్భవించినవి. అందువలన మానవులు భక్తిని విడచి తమతమ యభీష్టము ననుసరించి నానా విధములగు శ్రేయస్సాధనముల వర్ణించిరి. కొందఱు ధర్మమును, కొందఱు యశస్సును, కొందఱు కామమును, కొందఱు సత్యమును, దమమును, శమమును, కొందఱైశ్వర్యమును, కొందఱు దానభోగములను, కొందఱు యజ్ఞతపో దాన వ్రతములను, యమనియమములను, ఇంకను మఱికొన్నింటిని శ్రేయస్సాధనములని చెప్పి వ్యాఖ్యానించిరి. ప్రకృతముగా భక్తియె శ్రేయస్సును లేదా శుభమును గలిగించునదై యున్నది. భగవంతునికడకు జేర్చు సాధనము భక్తియె గాని మఱియొకటి యేదియు లేదు. సత్సాంగత్యముచే భక్తి గలిగినచో స్త్రీ సాంగత్యాది సంసార బంధనము లన్నియు తగ్గిపోవును. ఉద్ధవు డడిగిన దానికి సమాధానముగ భగవానుడు ధ్యేయరూపమును గూర్చి యుపదేశించెను. (14 అ॥)

అష్టాంగ యోగాదులవలన అణిమాద్యష్టసిద్ధులు సాధకుని చిత్తమును లోభపరచి వాని కాలమును వ్యర్థపుచ్చును. భజనమునకు ఆటంకములు గలుగజేయును. భక్తి యోగము కంటె విలువైనది, సిద్ధులకు మఱియొకటి యేదియు లేదు.

( 15 అ )

జగత్తులో గల తేజస్సు, సౌందర్యము, కీర్తి, ఐశ్వర్యము, లజ్జ, దానము, మనోహరత్వము, భాగ్యము, వీర్యము, తితిక్ష, జ్ఞానము మున్నగునవన్నియు భగవద్విభూతులె. ఈ విభూతులన్నియు ఆకాశకుసుమమువలె మనోవికారమాత్రములె. వాస్తవములో యథార్థములుగావు. కావున వీనియందభినివేశ ముంచుట భగవద్భక్తునకు దగదు. (15 అ)

కృత, త్రేతా ద్వాపర కలియుగములలో కృత యుగమున నొక్క హంసవర్ణము మాత్రమే యుండెను. జన్మించుట తోడనె మానవులు అనన్యభక్తిపరాయణులై కృతకృత్యులగుటవలన ఈ యుగమును కృతయుగమని చెప్పుచున్నారు. త్రేతాయుగమున యజ్ఞరూపముతో భగవాను డవతరించినాడు. చతుర్వర్ణములు, చతురాశ్రమములు ఆయననుండియె యుత్పన్నములైనవి. వర్ణాశ్రమముల ధర్మములు, అంత్యజులగు వ్యక్తుల స్వభావములు వర్ణితములైనవి. బ్రహ్మచారులకు గురుసేవ, గృహస్థులకు భూతరక్షణము, యజ్ఞము, వానప్రస్థులకు తపస్సు, సన్న్యాసులకు శమము, అహింస అనునవి ప్రధాన ధర్మములుగా వర్ణింపబడినవి. అన్నింటికంటెను భగవదారాధనయె సర్వజీవులధర్మమని నిరూపింపబడినది. (17, 18 అ)

నిజమైన విద్వాంసుడు, ఆత్మతత్త్వజ్ఞుడు, అపరోక్ష జ్ఞానము కలవాడు నగు వ్యక్తి ద్వైతప్రపంచమును, తత్సాధన

జ్ఞానమును విడచి సర్వప్రభువగు శ్రీహరికి సుఖమును గలిగించుటకు ప్రయత్నపరుడు కావలెను. కర్మయోగముకంటె జ్ఞానయోగము శ్రేష్ఠమైనది. దానికంటె శుద్ధభక్తియె శ్రేష్ఠమైనది. సాధుసాంగత్యముచే శ్రీకృష్ణకథాశ్రవణమున గలుగు శ్రద్ధద్వారా ఎల్లపుడు భగవత్కీర్తన, పూజ, స్తుతి, వందనము—అనువానిద్వారా, సాధుసేవద్వారా భక్తి కలుగును.

( 18 అ )

మోక్షప్రాప్తికై కర్మజ్ఞానభక్తియోగములు వర్ణితములైనవి. విరక్తి చెందని కాముకులగు పురుషులకై కర్మయోగము, కర్మఫలవిరక్తులు కర్మత్యాగులు నగు పురుషులకై భక్తియోగము నిర్దిష్టములైనవి. కర్మఫల భోగమునందు వైరాగ్యము, భగవత్కథయందు శ్రద్ధ కలుగనంతవఱకు కర్మలనాచరింపవలసినదే. త్యాగులకు, భక్తులకు కర్మానుష్ఠానమునవసరము లేదు. కేవలము మానవజన్మయందె భగవద్భక్తి కలుగును. కనుకనే దేవతలు మానవదేహమును వాంఛించుచున్నారు. అందువలన బుద్ధిమంతులగు వ్యక్తులు భవసాగరమునకు నౌకవంటి దగుమానవదేహమును బొంది శుద్ధభక్తునను కర్ణధారుని ఆశ్రయించి అనాయాసముగ భవసాగరమును దరించుటకు ప్రయత్నపరుడు కావలెను. భక్తివలననె సర్వసిద్ధులు కలుగును. భగవత్సాక్షాత్కారమును బొందుటచే సమస్తమగు అహంకారము, సర్వసంశయములు, కర్మరాశి నాశనమగును. కనుక భక్తునకు జ్ఞానవైరాగ్యాది సాధనముల వలన ప్రయోజనము లేదు. ఏకాంత భక్తులకు విధినిషేధముల వలన గలుగు పుణ్యపాపములు సంభవింపవు. (20 అ)

జ్ఞానభక్తులయందు సిద్ధపురుషులకు దేశకాలపాత్రగతమగు దోషగుణమేదియు నుండదు. కర్మనిష్ఠ గలిగిన వ్యక్తి చిత్తశోధకములగు నిత్యనైమిత్తిక కర్మలను జేయుట గుణము అవి చేయకుండుట దోషము. దోషమునకు ప్రాయశ్చిత్తము గుణము. జ్ఞాననిష్ఠవ్యక్తికి జ్ఞానాభ్యాసము, భక్తునకు కృష్ణకథాశ్రవణాది భక్తిగుణము. కామ్యకర్మలు జీవునకు శ్రేయస్సాధకములు గావు. జడవిషయములయందు భోగప్రవృత్తిని తగ్గించుకొనుట, శ్రేయస్సాధకములగువానియందు అభిలాషను పెంచుకొనుట అనునది వేదముల తాత్పర్యము. కుబుద్ధులైనవారు దీనిని తెలిసికొనలేక వేదములయందలి పుష్పితమైన ఫలశ్రుతిని వేదతాత్పర్యమనిచెప్పుచున్నారు. వేదకర్తయగు భగవానునకు దప్ప వేదములలోని నిగూఢ తాత్పర్యము మఱియెవ్వరికిని తెలియదు. (21 అ)

భగవన్మాయాప్రభావముచే తత్త్వసంఖ్యను నిర్దేశించుటలో పెక్కు మతభేదములు కనబడుచున్నవి.

జీవేశ్వరులలో ఏమాత్రము భేదముగూడ లేదు. అవ్యక్త పురుషుడు ప్రకృతియందు దృష్టిని ప్రసరింపజేయును. పురుషునకధీనమగు ప్రకృతి కార్యకారణరూపిణియై జగత్తును సృష్టించును. ఆపాతదృష్టిచే పురుషప్రకృతులలో అభేదము వెల్లడియైనను నిరువురిలో నాత్యంతిక భేదమున్నది. భగవద్విముఖులగుజీవులు తత్త్వజ్ఞానము లేకపోవుటవలన సంసారగతిని బొందుచున్నారు, జీవులు స్వీయకర్మద్వారా నానావిధములగుదేహముల బొందుచున్నారు, విడచుచున్నారు. కర్మసంస్కారమయమగు మనస్సు ఇంద్రియాదులతో గూడ దేహమునుండి మఱియొక దేహములోనికి వెడలుచున్నది.

ఆత్మ వానిని అనుసరించుచున్నది. కాని విషయాభినివేశము వలన దానికి పూర్వస్మృతి యుండదు. దేహమునకే జననమరణాద్యవస్థలు. ద్రష్టయగు ఆత్మ దేహముకంటె వేఱుగ నుండును. ఆత్మచేతనము, కనుక ఆత్మ జడవిషయములగు భోగముల ననుభవింపదు. ఇంద్రియములే దాని ననుభవించును. శ్రేయస్సును గోరు వ్యక్తి ధైర్యముతో వివేకము నవలంబించి విషయభోగములనుండి విరతుడై ఆత్మ నుద్ధరింపవలెను. భగవచ్చరణముల నాశ్రయించిన వ్యక్తులు విషయములచే చిక్కుబడరు. వారు వదలివేయబడిన వారైనను, అవమానితులైనను, లేదా కొట్టబడినవారైనను ధైర్యమును వహించి తమ్ము తాము రక్షించుకొనవలెను.

అవంతీదేశీయుడగు బ్రాహ్మణుడు దాని కుదాహరణముగ నున్నాడు. ఆయన బ్రాహ్మణుడైనను కృషికర్మ ద్వారా ధనవంతు డయ్యెను. కాని యతడు మిగుల లోభియు, కోప స్వభావుడును నయ్యెను. దానివలన భార్యాపుత్రులు, జ్ఞాతులు, బంధువులు వానికప్రియులైరి. క్రమముగ దొంగలు, జ్ఞాతులు, దైవము మున్నగువారిచేత వాని ధనమంతయు నపహృతమయ్యెను. ఆత్మీయు లందఱు వానిని వదలిరి. విషయములయందు నిర్వేదమును బొందినవాడై, అర్థము అనర్థమునకు కారణమని తెలిసికొని జీవితములోని మిగిలిన భాగమును హరిభజనమునందే కడపదలచి త్రిదండసన్న్యాసమును గ్రహించెను. అతడు పరివ్రాజకరూపముతో నానాదేశములయందు తిరుగుచు భిక్షార్థమై నగరాదులలో సంచరించుచుండగ దుష్టులగు జనులు వానిని నానావిధములుగ బాధించుచుండిరి. అతడు వానిని సహనముతో నెదుర్కొనుచు జనులు, దేవతలు, ఆత్మ,

గ్రహములు, కర్మ, మనస్సు—వీనిలో నేదియు జీవుని సుఖ దుఃఖములకు గారణము కాదనియు మనస్సే కారణమనియు, మనస్సే జీవుని సంసారచక్రమున పడవేయుననియు, మనోనిగ్రహము సకల సాధనముల తాత్పర్యమనియు, కృష్ణభగవానుని చరణసేవచేతనే దురంతమగు సంసారమును దాటగలడనియు దెలిసికొనెను. (22-23 అ)

పురుషునిచే క్షోభితము త్రిగుణాత్మికము నగు ప్రకృతి నుండి జ్ఞానక్రియాశక్తియుక్తమగు మహత్తత్త్వము వెల్లడి యైనది. మహత్తత్త్వమునుండి సాత్త్వికము, రాజసికము, తామసికము అను త్రివిధరూపములతో నున్న అహంకారము వ్యక్తమైనది. సాత్త్వికాహంకారమునుండి పదునొకండుగురు దేవతలు, మనస్సు; రాజసాహంకారమునుండి పది యింద్రియములు; తామసాహంకారమునుండి పంచమహాభూతములు పంచతన్మాత్రలు వెల్లడియైనవి. పురుషుని నాభికమలమునుండి బ్రహ్మ జన్మించెను. ఆయన పదునాలుగు లోకములను సృష్టించెను. జగత్తులోగల సత్త యంతయు పురుషప్రకృతుల సంయోగము వలననే ఏర్పడినది. అది అనిత్యము, ఆత్మ యొక్కటియె నిత్యమైనది. ఈ సాంఖ్యజ్ఞానము జీవుల సంశయములను, మోహమును నాశనము చేయునట్టిది. (24 అ)

శమదమతితిక్షాదులు మిశ్రముగాని సత్త్వవృత్తులు. కామము, కర్మచేష్టలు, మదము మున్నగునవి మిశ్రముకాని రజోగుణవృత్తులు. క్రోధ లోభ మోహాదులు మిశ్రముకాని తమోగుణ వృత్తులు. సత్త్వప్రకృతివిశిష్టుడగు వ్యక్తి కర్మ నిరపేక్షకుడు, రజఃప్రకృతియుక్తుడగు వ్యక్తి ఫలాకాంక్షి.

తమఃప్రకృతియుక్తుడగు వ్యక్తి హింసాకాముకుడు నగును. బద్ధజీవునియందే త్రిగుణములుండును. భగవానుడు త్రిగుణాతీతుడు. ద్రవ్య, దేశ, ఫల, కాల, జ్ఞాన, కర్మ, కర్తా, శ్రద్ధా, అవస్థా, ఆకృతి, నిష్ఠ అనునవన్నియు త్రిగుణాత్మకములై, కాని భగవత్సంబంధములైనచో నివి నిర్గుణములు. శుద్ధ భక్తిచేతనే త్రిగుణములను జయింపవచ్చును. అందువలన వివేకియుడగు వ్యక్తి త్రిగుణసాంగత్యమును వదలి హరి భజనము చేయవలెను. (25 అ)

సాధువు భగవత్పరాయణుడు, ముక్తుడు నగును. సాధువుగాని వ్యక్తి శిశ్నోదరపరాయణుడు, బద్ధుడు నగును. అసత్పురుషుల సాంగత్యమువలన జీవుడు అంధతామిస్రమను నరకమును బొందును. దేవవేశ్యయగు ఊర్వశి సహవాసముచే మోహితుడగు పురూరవచక్రవర్తి ఆమెవిరహముచే నిర్వేదమును బొందినవాడై స్త్రీసాంగత్యము జుగుప్సావహము, భయావహము నను విషయమును వర్ణించెను. స్త్రీచే జయింపబడినవాని విద్య తపస్సు మున్నగునన్నియు విఫలములగును. స్త్రీని, స్త్రీ సహవాసులతోడి సాంగత్యమును సంపూర్ణముగ విడువవలెను. బుద్ధిమంతుడగు వ్యక్తి చెడుసహవాసమును విడచి సత్సంగములోనికి ఆకర్షింపబడవలెను. సర్వసంగపరిత్యాగులు భగవత్సేవాపరాయణులు నగు సాధువులె సదుపదేశముద్వారా మనస్సుయొక్క ఆసక్తిని ఛేదింపగలరు. (26 అ)

భగవదర్చనము వెంటనే మనస్సునకు ప్రసన్నతను కలిగించును. అర్చన వైదికము, తాంత్రికము, మిశ్రమునని మూడు విధములుగ నున్నది, శైలి, దారుమయము, లౌహము, లేప్యము, లేఖ్యము, సైకతము, మనోమయము, మణిమయము

నని ప్రతిమలు ఎనిమిది విధములుగ నున్నది. చలము, అచలము ననుభేదముచే ప్రతిమ రెండు విధములు. సాధన విధిని అనగా శాస్త్రవిధిని అనుసరించువారు అర్చనము చేయవలెను. భగవంతుడు చెప్పిన విధిచే అర్చన చేసినచో భగవద్భక్తి కలుగును. (27 అ)

ప్రపంచములోని భావము లన్నియు ప్రాకృతములు, త్రిగుణజాతములు, ఇంద్రియగ్రాహ్యములు, అసత్యములు కనుక జగద్భావములలో లేదా వ్యాపార సమూహములో మంచి చెడులలేదా యుండును. జడవస్తువులయం దభినవేశము వలన వీని నన్నింటిని నిందించుటగాని, ప్రశంసించుటగాని పరమార్థహానికి హేతువగును. విశ్వమంతట ఆత్మయొక్కటియె కార్యకారణరూపములో నున్న దనుఆలోచన ననుసరించి అనాసక్తభావములో సంసారమున నివసింపవలెను. ఆవాస్తవములైన దేహేంద్రియాదులతో సంబంధ మున్నంతవఱకు ఆత్మకు వాస్తవముగ సంసారప్రతీతి యుండును. జనన మరణములు, శోకహర్షాదులు నగు సాంసారిక భావములన్నియు ప్రాకృతాహంకారమునకు సంబంధించినవే కాని ఆత్మకు సంబంధించినవి కావు. ఆత్మానాత్మ వివేకమే అహంకారమును నాశనము చేయునది. అన్వయవ్యతిరేక భావముచే అంతట ఎల్లప్పుడు నొక్కే బ్రహ్మ మున్నది. బ్రహ్మము స్వతస్సిద్ధవస్తువు. జగత్తు బ్రహ్మముయొక్క ప్రకాశము లేదా కార్యము. సద్గురువు కృపవలన నీ బ్రహ్మ విషయకమగు జ్ఞానమును బొంది దేహాదుల అనాత్మత్వమును దెలిసికొని విషయములను విడచుటకు దృఢమగు భక్తియోగము నాశ్రయింపవలెను, సిద్ధికి ముందు సాధకభక్తుడు దేహమును త్యజించినచో కర్మబంధనము కలు

గను. అనంతర జన్మమున వెనుకటి సాధనయందు ప్రవృత్తు డగును. సాధనకాలమున రోగాదులచే దేహము శిథిలమైనచో దగిన ఉపాయములచే దానికి చికిత్స చేసికొనవలెను. యోగా ద్యుపాయములచే దేహముయొక్క యౌవనమును స్థిరముగా నుంచుటకు చేయుప్రయత్నములు వ్యర్థములు, అవి కేవలము దేహసిద్ధి మాత్రములు. నామసంకీర్తనముద్వారా కామాదులు, సత్పురుష సేవద్వారా అహంకారము నాశనమగును. భగవచ్ఛరణాశ్రయముచే భగవత్పరాయణుడగు సాధకుడు విఘ్నరహితమగు పరమసిద్ధినిబొంది పూర్ణానందమునకు అధికారి యగును. (28 అ)

భగవన్మాయా విమోహితులు, అభిమానులునగు కర్మిష్ఠులు, యోగులు భగవానుని పాదపద్మముల నాశ్రయింపరు. సారాసార వివేకపరాయణులగు హంసలె దాని నాశ్రయించును. భగవానుడు జీవునిహృదయములో చైత్యగురు రూపముతోను బయట ఆచార్య రూపముతోను నుండి జీవుల సమస్తములగు నమంగళములను పోగొట్టి వారికి స్వస్వరూపమును జూపును. సర్వకర్మలు భగవాను నుద్దేశించి చేయవలెను, భగవానుని లీలాస్థలములను లేదా ధామాదులను ఆశ్రయించి భగవత్సేవను యాత్రా మహోత్సవాదులను చేయవలెను. తన యాత్మలో నంతర్యామిగ శ్రీ కృష్ణుడె యున్నాడని తెలిసికొని అంతట సమదృష్టి కలవాడైనచో వాని అసూయాహంకారాది దోషములు వినష్టములగును. అనన్య భావముతో భగవానునకు ఆత్మ సమర్పణము చేసినచో ఆయన విశేషముగ సంతుష్టుడగును. భగవానుని ఆదేశము ననుసరించి భక్తప్రవరుడగు ఉద్ధవుడు ద్వారకకు, బదరికాశ్రమునకు వెడలెను. (29 అ)

శ్రీ శ్రీ గురు గౌరాంగౌ జయతః

శ్రీమద్భాగవతాంతర్గతమగు

# శ్రీ కృష్ణోద్ధవ సంవాదము

## ఆఱవ అధ్యాయము

స్వధామమునకు వెడలవలసిన దనిదేవతలు
భగవానుని ప్రార్థించుట. ప్రభాసక్షేత్ర
మునకు బోవ సంసిద్ధు లగుచున్న
యాదవులను జూచి యుద్ధవుడు
భగవాను డగుశ్రీకృష్ణుని
కడకు వెడలుట.

### శ్రీ శుక ఉవాచ

అథ బ్రహ్మాఽఽత్మజైర్దేవైః ప్రజేశై రావృతోఽభ్యగాత్ ।
భవశ్చ భూతభవ్యేశో యయౌ భూతగణై ర్వృతః ॥ 1

శ్రీ శుకదేవుడు పలికెను : పరీక్షిన్మహారాజా ! దేవర్షి యగునారదుడు వసుదేవున కుపదేశించి వెడలిన పిమ్మట బ్రహ్మదేవుడు తన పుత్రు లగుసనకాదులతోడను, ఇంద్రాది దేవతలతోడను, మరీచ్యాది ప్రజాపతులతోడను, సర్వభూతములకు మంగళములను గలుగజేయు శంకరుడు భూతగణములతోడను గూడికొని ద్వారకానగరమునకు జేరికొనిరి

ఇంద్రో మరుద్భిర్భగవానాదిత్యా వసవోఽశ్వినౌ ।
ఋభవోఽఙ్గిరసో రుద్రా విశ్వేసాధ్యాశ్చ దేవతాః ॥ 2

గంధర్వాప్సరసో నాగాః సిద్ధచారణ గుహ్యకాః ।
ఋషయః పితరశ్చైవ సవిద్యాధర కిన్నరాః ॥ 3

ద్వారకాముపసంజగ్ముః సర్వే కృష్ణ దిదృక్షవః ।
వపుషా యేన భగవాన్ నరలోక మనోరమః ।
యశో వితేనే లోకేషు సర్వలోకమలాపహమ్ ॥ 4

రాజా! మరుద్గణములతో నింద్రుడు, ద్వాదశాదిత్యులు, అష్టవసువులు, అశ్వినీకుమారు లిరువురు, ఋభువులు, అంగిరసులు, ఏకాదశరుద్రులు, విశ్వేదేవులు, సాధ్యులు, దేవతలు, గంధర్వులు, అప్సరసలు, నాగులు, సిద్ధులు, చారణులు, గుహ్యకులు, ఋషులు, పితరులు, విద్యాధరులు, కిన్నరులు ఆచటికి వచ్చిరి. తన శ్రీ విగ్రహముచే మానవుల మనస్సులను రంజింప జేయుశ్రీకృష్ణభగవానుడు సర్వలోకములయందలి పాపములను నాశనము జేయుకీర్తిని లోకములయందు వ్యాపింపజేసెను. ఇట్టి కృష్ణభగవానుని దర్శించు నభిలాషతో పైవా రందఱు ద్వారకానగరమునకు విచ్చేసిరి.

తస్యాం విభ్రాజమానాయాం సమృద్ధాయాం మహర్ద్ధిభిః ।
వ్యచక్షతావితృప్తాక్షాః కృష్ణమద్భుతదర్శనమ్ ॥ 5

మహారాజా! అనంతర మాబ్రహ్మాదిదేవతలు సర్వవిధసంపదలతో గూడినట్టి, అలౌకిక మగుకాంతితో ప్రకాశించునట్టి ద్వారకానగరమున అద్భుతదర్శను డగుకృష్ణభగవానుని అతృప్తనయనములతో జూడసాగిరి.

స్వర్గోద్యానోపగైర్మాల్యైశ్ఛాదయన్తో యదూత్తమమ్ ।
గీర్భిశ్చిత్రపదార్థాభిస్తుష్టువుర్జగదీశ్వరమ్ ॥ 6

వారు నందనవనము, చైత్రరథము మున్నగు స్వర్గోద్యానముల యందలి దివ్యపుష్పములతో జగదీశ్వరు డగుకృష్ణుని యలంకరించిరి, అనంతరము చిత్రవిచిత్రము లగుపదములతోను, అర్థములతోను గూడిన వాక్కులచే ఆయనను స్తుతింపసాగిరి.

## దేవా ఊచుః

నతాః స్మ తే నాథ పదారవిందం
బుద్ధీన్ద్రియప్రాణమనో వచోభిః ।
యచ్చిన్త్యతేఽన్తర్హృది భావయుక్తై-
ర్ముముక్షుభిః కర్మమయోరుపాశాత్ ॥ 7

**దేవతలు పలికిరి :** దేవా! యోగులు కర్మమయము లగు దృఢబంధనములనుండి ముక్తిని బొందదలచి తమ హృదయమున నిరంతరము ధ్యానించు నీచరణకమలములను దర్శించి మేము మా బుద్ధీంద్రియములతోను, ప్రాణమనోవాక్కులతోను నీకు నమస్కరించుచున్నాము*.

---

* దోర్భ్యాం పాదాభ్యాం జానుభ్యామురసా శిరసా దృశా ।
మనసా వచసా చేతి ప్రణామోఽష్టాంగ ఈరితః ॥

చేతులు, పాదములు, మోకాళ్లు, వక్షఃస్థలము, శిరస్సు, నేత్రములు, మనస్సు, వాక్కు — ఈయెనిమిది అవయవములతో చేయబడునమస్కారమును సాష్టాంగప్రణామ మందురు

త్వం మాయయా త్రిగుణయాఽఽత్మని దుర్విభావ్యం
వ్యక్తం సృజస్యవసి లుంపసి తద్గుణస్థః ।
నైతైర్భవానజితకర్మభిరజ్యతే వై
యత్స్వే సుఖేఽవ్యవహితేఽభిరతోఽనవద్యః ॥ 8

అజితుడా ! నీవు మాయికము లగురజస్సు మున్నగుగుణములలో నుండి అచింత్యనామరూపాత్మక మగునీప్రపంచమును త్రిగుణమయ మగు మాయచే నీయందే సృష్టించుకొనుచున్నావు, పాలించుచున్నావు, సంహరించుచున్నావు. ఇట్లు చేయుచున్నను నీవు రాగద్వేషాదిదోషరహితుడవై యున్నావు; నిరావరణము, అఖండము, స్వరూపభూతము, నగుపరమానంద మున మగ్నుడ వైయున్నావు. అందువలన నీ వీకర్మలచే లిప్తుడ వై యుండవు.

శుద్ధిర్నృణాం న తు తథేడ్య దురాశయానాం
విద్యాశ్రుతాధ్యయనదానతపః క్రియాభిః ।
సత్త్వాత్మనామృషభ తే యశసి పవృద్ధ-
సచ్ఛ్రద్ధయా శ్రవణసంభృతయా యథా స్యాత్ ॥ 9

జగత్తుచే స్తుతింపదగినవాడా ! పురుషోత్తమా ! విమల మైననీ కీర్తిని వినుటవలన కలిగినప్రకృష్ట మగు శ్రద్ధచే సత్పురుషులు విశుద్ధిని బొందుచున్నారు. ఈశుద్ధిని విషయవాసనాయుక్తు లగుమానవులు ఉపాసన, వేదార్థశ్రవణము, అధ్యయనము, దానము, తపస్సు మున్నగువాని నాచరించినను బొందలేరు.

స్యాన్నస్తవాంఘ్రిరశుభాశయ ధూమకేతుః
క్షేమాయ యో మునిభిరార్ద్రహృదోహ్యమానః ।

యః సాత్వతైః సమవిభూతయ ఆత్మవద్భి-
ర్వ్యూహేఽర్చితః సవనశః స్వరతిక్రమాయ ॥ 10

ప్రభూ ! మననశీలు రగు ముముక్షువులు పరమశుభముల బొందు టకై ప్రేమార్ద్రహృదయములతో వేనిని స్మరించుచున్నారో, ఆశ్రితు లగుభక్తులు సమానైశ్వర్యముల బొందుటకై వాసుదేవుడు, సంకర్షణుడు, ప్రద్యుమ్నుడు, అనిరుద్ధుడు - అనునీచతుర్వ్యూహరూపమున వేనిని ఆరాధించుచున్నారో, జితేంద్రియు లగుధీరపురుషులు గొందఱు స్వర్గము నతిక్రమించి వైకుంఠపదమును బొందుటకై త్రికాలములయందు వేనిని అర్చించుచున్నారో అట్టినీ పాదపద్మములు మా విషయవాసలకు ధూమకేతు వగుగాక !

యశ్చిన్త్యతే ప్రయతపాణిభిరధ్వరాగ్నౌ
త్రయ్యా నిరుక్తవిధినేశ హవిర్గృహీత్వా ।
అధ్యాత్మయోగ ఉత యోగిభిరాత్మమాయాం
జిజ్ఞాసుభిః పరమభాగవతైః పరీష్టః ॥ 11

జగదీశా ! యాజ్ఞికులు వేదత్రయోక్తమగువిధిచే సంయతము లగుహస్తములతో హవిర్భాగమును గ్రహించి యజ్ఞకుండమున ఆహుతుల నిచ్చి వేనిని స్మరించుచున్నారో, యోగులు అణిమాదిసిద్ధులను పొందదలచి అధ్యాత్మయోగముచే వేనిని ధ్యానించుచున్నారో, పరమభాగవతులు వేని నంతట అర్చించుచున్నారో, అట్టినీ చరణకమలములు మా విషయవాసన లను దహింపజేయుగాక !

పర్యుష్టయా తవ విభో వనమాలయేయం
సంస్పర్ధినీ భగవతీ ప్రతిపత్నివచ్ఛ్రీః ।

యః స్వప్రణీతమముయార్హణమాదదన్నో
భూయాత్ సదాంఘ్రిరశుభాశయధూమకేతుః ॥ 12

దేవా ! తాను హృదయమున నివసించుచుండగ సపత్నివలె యీ వాడిపోయిన వనమాల యేమి యనిలక్ష్మి యీర్ష్యపడుచున్నది. అయినను నీ వావిషయమును లెక్కపెట్టక భక్తులు సమర్పించిన ఈమాలలను స్వీకరించుచున్నావు. భక్తవత్సలుడ వగునీ చరణకమలములు ఎల్లపుడు మా విషయవాసనలను నశింపజేయుగాక !

కేతుస్త్రివిక్రమయుతస్త్రిపతత్పతాకో
యస్తే భయాభయకరోఽసురదేవచమ్వోః ।
స్వర్గాయ సాధుషు ఖలేష్వితరాయ భూమన్
పాదః పునాతు భగవన్ భజతామఘం నః ॥ 13

అనంతా ! వామనావతారమున బలిచక్రవర్తిచే నీయబడిన భూమిని కొలుచుటకు నీ వెత్తినపాదము త్రిలోకములయందును వ్యాపించి విజయ ధ్వజమువలెనుండెను, ఆపాదములనుండి జనించినట్టియు, త్రిలోకవిహారిణియు నగుగంగాదేవి పతాకమువలె శోభిల్లుచుండెను. అట్టి నీపాదపద్మములు అసుర సైన్యమునకు భయమును, దేవసేనకు నిర్భయమును గలుగజేయుచుండెను. సాధుస్వభావు లగుపురుషులు నీధామ మగువైకుంఠమును బొందుటకును, దుష్టు లధోగతిని బొందుటకును కారణము లగుచున్నవి. దేవా ! అట్టినీ పాదపద్మములు భజనశీలుర మగు మా పాపతాపముల నన్నింటిని నశింప జేయుగాక !

నస్యోతగావ ఇవ యస్య వశే భవన్తి
బ్రహ్మాదయస్తనుభృతో మిథురర్ద్యమానాః ।

కాలస్య తే ప్రకృతిపూరుషయోః పరస్య
శంన స్తనోతు చరణః పురుషోత్తమస్య ॥ 14

దేవా! పరస్పరకలహపీడితు లగుబ్రహ్మాదిజీవులు ముకుత్రాళ్ళ వేయబడిన గోసమూహమువలె ప్రకృతిపురుషాతీతు డగుకాలపురుషుని యధీనములో నున్నారు. ఆకాలపురుషుడవు నీవే. అట్టిపురుషోత్తముడ వైననీ చరణకమలములు మాకు సుఖములకలుగజేయుగాక!

అస్యాసి హేతురుదయస్థితి సంయమానా-
మవ్యక్తజీవమహతామపి కాలమాహుః ।
సోఽయం త్రిణాభిరఖిలాపచయే ప్రవృత్తః
కాలో గభీరరయఉత్తమపూరుష స్త్వమ్ ॥ 15

దేవా! శ్రుతులు నిన్ను ప్రకృతిపురుషమహత్తత్త్వములకు నియామకుడ వనిచెప్పి కీర్తించుచున్నవి. అందువలన నీవే యీజగత్తుయొక్క సృష్టిస్థితిలయములకు కారణ మగుచున్నావు. శీతగ్రీష్మవర్షాకాలము లను నాభిత్రయముచే (చాతుర్మాస్యత్రయముతో) గూడినసంవత్సరరూపమున జగత్తు నంతటిని సంహరించుకాలము నీవె. నీవే పురుషోత్తముడవు.

త్వత్తః పుమాన్ సమధిగమ్య యయాస్యవీర్యం
ధత్తే మహాన్తమివ గర్భమమోఘవీర్యః ।
సోఽయం తయానుగతఆత్మన అండకోశం
హైమం ససర్జ బహిరావరణైరుపేతమ్ ॥ 16

కారణాబ్ధిశాయి, అమోఘవీర్యుడు నగుమహావిష్ణువు నీవలన శక్తిని బొంది మాయతో గూడి యీజగత్తులో బీజస్వరూప మైనమహత్తత్త్వమును సృష్టించును అనంతరము ఆమహత్తత్త్వము త్రిగుణమయ మగుమాయ

సమసరించి *సప్తవ్యాహృతు లనెడుఏడు ఆవరణములు గలిగిన ఈసువర్ణమయ మగుబ్రహ్మాండమును సృష్టించుచున్నది.

తత్తస్థుషశ్చ జగతశ్చ భవానధీశో
యన్మాయయోత్థగుణవిక్రియయోపనీతాన్ ।
అర్థాన్ జుషన్నపి హృషీకపతే న లిప్తో
యేఽన్యే స్వతః పరిహృతాదపి బిభ్యతి స్మ ॥ 17

హృషీకేశా ! మాయచే నావిర్భూత మగునింద్రియసమూహముచే ప్రాప్త మైనవిషయముల ననుభవించినను నీవు వానియం దాసక్తుడవుగావు. అందుచేత నీవే స్థావరజంగమములకు నధీశ్వరుడ వైయున్నావు. కాని అన్యజీవులు లేదా యోగులు స్వయముగ పరిత్యక్తము లైన ఆవిషయభోగములకు భయపడుదురు.

స్మాయావలోకలవదర్శిత భావహారి-
భ్రూమండలప్రహితసౌరతమంత్రశౌండైః ।
పత్న్యస్తు షోడశసహస్రమనఙ్గబాణై-
ర్యస్యేన్ద్రియం విమథితుం కరణైర్న విభ్వ్యః ॥ 18

దేవా ! రుక్మిణీదేవి మున్నగు పదునాఱువేలమంది భార్యలు నిన్ను వెంటనంటి యుందురు. వారు తమ మృదుమందహాసవిలసితములు, అపాంగవీక్షణాయుతములు నగుమనోహరము లైనకనుబొమల సంజ్ఞలచేత సురతాలాపములచేత ప్రౌఢములు, సమ్మోహకములు నగు మన్మథబాణములను నీపై వదలుచున్నారు. కామకళయందలి వివిధరీతులతో నీమనస్సు

*సప్తవ్యాహృతులు;—1. ఓంభూః, 2. ఓంభువః, 3 ఓగ్ం సువః, 4 ఓంమహః, 5. ఓంజనః, 6 ఓంతపః, 7. ఓగ్ం సత్యం.

నాకర్షింపదలంచుచున్నారు. కాని పరిపుష్టము లైనవారిమన్మథబాణములు నీమనస్సు నేమాత్రమును లోగొనజాలక పోయినవి.

విభ్వ్యస్తవామృతకథోదవహాస్త్రిలోక్యాః
పాదావనేజసరితః శమలాని హన్తుమ్ ।
ఆనుశ్రవం శ్రుతిభిరంఘ్రిజమంగసంగై-
స్తీర్థద్వయం శుచిషదస్త ఉపస్పృశన్తి ॥ 19

దేవా ! త్రిలోకములయందలి పాపరాశిని నాశనము జేయుటకు నీవు రెండుపవిత్రనదులను ప్రవహింపజేసితివి. వానిలో నొకటి అమృతమయ మగు నీలీలతో నిండినకథానది, రెండవది నీపాదప్రక్షాళనజలముతో నిండిన గంగానది. అందువలన వివేకవంతు లగుపురుషులు కర్ణములచే నీకథానది లోను,శరీరముచే గంగానదిలోను మునకలువేసి రెండు తీర్థములను సేవించుచు తమ పాపతాపములను నశింపజేసికొనుచున్నారు.

బాదరాయణిరువాచ :

ఇత్యభిష్టూయ విబుధైః సేశః శతధృతిర్హరిమ్ ।
అభ్యభాషత గోవిందం ప్రణమ్యామ్బరమాశ్రితః॥ 20

శుకదేవుడు చెప్పెను : పరీక్షిన్మహారాజా ! సర్వదేవతలతోను,శంకరునితోనుగూడి బ్రహ్మదేవు డీవిధముగ కృష్ణభగవానుని స్తుతించెను. అనంతరము వారు నమస్కరించి తమ తమ ధామములకు వెడల దలచినవారై ఆకాశమునుండి భగవానునితో నిట్లనిరి.

బ్రహ్మోవాచ :

భూమేర్భారావతారాయ పురా విజ్ఞాపితః ప్రభో ।
త్వమస్మాభిరశేషాత్మం స్తత్తథైవోపపాదితమ్ ॥ 21

బ్రహ్మ పలికెను : సర్వాత్మకుడ వగునోదేవా ! భూభార హారణమునకై అవతరింపవలసినదిగా మేము మొదట నిన్ను ప్రార్థించి తిమి. దాని ననుసరించి నీవాకార్యమును దగినవిధముగ నెరవేర్చితివి.

ధర్మశ్చ స్థాపితః సత్సు సత్యసంధేషు వై త్వయా ।
కీర్తిశ్చ దిక్షు విక్షిప్తా సర్వలోకమలాపహా ॥ 22

ప్రభూ ! నీవు సత్యాన్వేషకు లగుసత్పురుషుల క్షేమముకొఱకై ధర్మమును స్థాపించి దశదిశలయందు సర్వలోకములలోని పాపమును నశింపజేయుకీర్తిని వ్యాపింపజేసితివి.

అవతీర్య యదోర్వంశే బిభ్రద్రూపమనుత్తమమ్ ।
కర్మాణ్యుద్దామవృత్తాని హితాయ జగతోఽకృథాః ॥ 23

నీవీ సర్వోత్తమ రూపమును ధరించి, యదువంశమున నవతరించి తివి. జగద్ధితమునకై అప్రతిహతవిక్రమముతో గూడినకర్మల నెన్నింటినో ఆచరించితివి.

యాని తే చరితానీశ మనుష్యాః సాధవః కలౌ ।
శృణ్వన్తః కీర్తయన్తశ్చ తరిష్యన్త్యంజసా తమః ॥ 24

కలియుగమున నీ యీలీలలను శ్రవణకీర్తనముల జేసిన సాధుస్వభావు లగుమనుజులు సుగమముగనే యీఅజ్ఞానాంధకారమును దాటగలరు.

యదువంశేఽవతీర్ణస్య భవతః పురుషోత్తమ ।
శరచ్ఛతం వ్యతీయాయ పంచవింశాధికం ప్రభో ॥ 25

పురుషోత్తమా ! నీ వీ యదువంశమున అవతరించి నూటయిరువదియైదు సంవత్సరములు గడచినవి.

నాధునా తేఽఖిలాధార దేవకార్యావశేషితమ్ ।
కులం చ విప్రశాపేన నష్టప్రాయమభూదిదమ్ ॥ 26

అఖిలాధారా ! నీ విపుడు చేయవలసిన దేవకార్యమంతయు పూర్తి యైనది. బ్రాహ్మణుల శాపమువలన నీ యీవంశము నష్టప్రాయ మయ్యెను.

తతః స్వధామ పరమం విశస్వ యది మన్యసే ।
సలోకాన్ లోకపాలాన్నః పాహి వైకుంఠ కింకరాన్ ॥ 27

అందువలన ఉచిత మనితోచినచో నీవు నీపరమధామమునకు వెడలుము. నీ సేవకులము, లోకపాలకులము నగుమమ్ము,మా లోకములను గాపాడుము.

## శ్రీ భగవానువాచ :

అవధారితమేతన్మే యదాత్థ విబుధేశ్వర ।
కృతం వః కార్యమఖిలం భూమేర్భారోఽవతారితః ॥ 8

భగవానుడు పలికెను : దేవతాశ్రేష్ఠుడ వగుబ్రహ్మదేవా నీవు చెప్పినది సత్యమనియే తలంచుచున్నాను. నేను మీకార్యముల నన్నింటని పూర్తిచేసి భూభారమును దొలగించితిని.

తదిదం యాదవకులం వీర్యశౌర్యశ్రియోద్ధతమ్ ।
లోకం జిఘృక్షద్ రుద్ధం మే వేలయేవమహార్ణవః॥ 29

ప్రస్తుత మీయదువంశము బలశౌర్యసంపదలచే మదించియున్నది భూమి నంతటిని గ్రసింపవలెనని తలంచుచున్నది. సముద్రమును చెలియలికట్టవలె నే నీయదువంశము నాపియున్నాను.

యద్యసంహృత్య దృప్తానాం యదూనాం విపులం కులమ్ ।
గన్తాస్మ్యనేన లోకోఽయముద్వేలేన వినంక్ష్యతి ॥ 30

మదమత్తమైన ఈ యాదవ వంశము నంతటిని సంహరింపక నేను నా ధామమునకు వెడలినచో నిది తన హద్దు నతిక్రమించి సర్వ లోకములను నాశనము చేయును.

ఇదానీం నాశఆరబ్ధః కులస్య ద్విజశాపతః ।
యాస్యామి భవనం బ్రహ్మన్నేతదన్తే తవానఘ ॥ 31

అనఘుడవగు బ్రహ్మదేవా ! ఇపుడు బ్రాహ్మణుల శాపమువలన ఈ వంశనాశన మారంభమైనది. ఇది పూర్తియైనతరువాత నేను నీలోకము గుండా వైకుంఠమునకు వెడలుదును.

శ్రీ శుక ఉవాచ :

ఇత్యుక్తో లోకనాథేన స్వయంభూః ప్రణిపత్య తమ్ ।
సహ దేవగణైర్దేవః స్వధామ సమపద్యత ॥ 32

**శుకుడు చెప్పెను :** రాజా ! జగదీశ్వరుడగు శ్రీ కృష్ణ డిట్లు చెప్పగా బ్రహ్మదేవు డాయనకు నమస్కరించి దేవతలతో గలసి తన ధామమునకు వెడలెను.

అథ తస్యాం మహోత్పాతాన్ ద్వారవత్యాం సముత్థితాన్ ।
విలోక్య భగవానాహ యదువృద్ధాన్ సమాగతాన్ ॥ 33

అనంతరము ద్వారకా నగరమున నెన్నియో అపశకునములు కన బడసాగెను. వానిని జూచి యదువంశములోని పెద్దలు శ్రీకృష్ణుని కడకు వచ్చిరి. ఆయన వారితో నిట్లు చెప్పెను.

## శ్రీ భగవాను వాచ :

ఏతే వై సుమహోత్పాతా వ్యత్తిష్ఠన్తీహ సర్వతః ।
శాపశ్చ నః కులస్యాసీద్బ్రాహ్మణేభ్యో దురత్యయః ॥ 34

**శ్రీకృష్ణ భగవానుడు పలికెను :** పెద్దలారా ! ప్రస్తుతము ద్వారకలో నెటుచూచినను నానావిధములగు నుత్పాతములు కనబడుచున్నవి. బ్రాహ్మణులు మన వంశమున కిచ్చిన శాపము దురతిక్రమణీయము.

న వస్తవ్యమిహాస్మాభిర్జిజీవిషుభిరార్యకాః ।
ప్రభాసం సుమహత్పుణ్యం యాస్యామోఽద్యైవమాచిరమ్ ॥ 35

పెద్దలారా ! ప్రాణములను రక్షించుకొన దలచితిమేని మన మిచట నుండగూడదు. ఇక నాలస్యము చేయనవసరము లేదు. మనము నేడే పవిత్రమగు ప్రభాసక్షేత్రమునకు బయలుదేరుదము.

యత్ర స్నాత్వా దక్షశాపాద్గృహీతో యక్ష్మణోడురాట్ ।
విముక్తః కిల్బిషాత్సద్యో భేజే భూయః కలోదయమ్ ॥ 36

దక్షప్రజాపతి శాపముచే చంద్రుడు క్షయ రోగమునకు గురియై, ప్రభాస క్షేత్రమునకు వెడలి స్నానము చేసి, పావనమ్మగు నా క్షయ రోగమునుండి ముక్తుడై కళావృద్ధి నందెను.

వయం చ తస్మిన్నాప్లుత్య తర్పయిత్వా పితౄన్ సురాన్ ।
భోజయిత్వోశిజో విప్రాన్ నానాగుణవతాన్ధసా ॥ 37
తేషు దానాని పాత్రేషు శ్రద్ధయోప్త్వా మహాన్తి వై ।
వృజినాని తరిష్యామో దానైర్నౌభిరివార్ణవమ్ ॥ 38

మనముగూడ ప్రభాస క్షేత్రమునకు వెడలి స్నానము చేయుదము. దేవతలకు, పితరులకు తర్పణముల నిమిత్తము, దానితోపాటనేక విధములగు పిండివంటలను సిద్ధముచేసి యుత్తమ బ్రాహ్మణులకు భోజనముల పెట్టుదము. ఆ సత్పాత్ర బ్రాహ్మణుల కనేక దక్షిణల నిత్తము. ఓడ ద్వారా సముద్రమును దాటిన మానవునివలె మనముగూడ వారి దయవలన ఈ విపత్తునుండి బయటపడుదము.

## శ్రీ శుక ఉవాచ :

ఏవం భగవతాఽఽదిష్టా యాదవాః కురునందన ।
గంతుం కృతధియస్తీర్థం స్యందనాన్ సమయూయుజన్ ॥ 39

శుకుడు చెప్పెను : రాజా! భగవానుడగు శ్రీకృష్ణుడిట్లాజ్ఞాపించినంతనే యాదవు లందఱు ప్రభాస క్షేత్రమునకు వెడలుటకు నిశ్చయించుకొనిరి. అనంతరము వారు తమ తమ రథములకు గుఱ్ఱములను పూన్చిరి.

తన్నిరీక్ష్యోద్ధవో రాజన్ శ్రుత్వా భగవతోదితమ్ ।
దృష్ట్వారిష్టాని ఘోరాణి నిత్యం కృష్ణమనువ్రతః ॥ 40
వివిక్త ఉపసంగమ్య జగతామీశ్వరేశ్వరమ్ ।
ప్రణమ్య శిరసా పాదౌ ప్రాంజలిస్తమభాషత ॥ 41

రాజా! ఉద్ధవుడు శ్రీకృష్ణ ప్రేమికుడు, సేవకుడు. అతడు యాత్రకు సిద్ధమగుచున్న యాదవులను జూచెను, భగవానుని ఆజ్ఞను వినెను, ఘోరములగు నపశకునముల జూచెను. అప్పుడతడు ఏకైక జగన్నాయకుడగు శ్రీకృష్ణ భగవానునికడకు నేకాంతముగ వెడలి, ఆయన చరణములపై శిరమునుంచి నమస్కరించెను. చేతుల జోడించి ఆయన నిట్లు ప్రార్థించెను

## ఉద్ధవ ఉవాచ :

దేవ దేవేశ యోగేశ పుణ్యశ్రవణకీర్తన ।
సంహృత్యైతత్ కులం నూనం లోకం సంత్యక్ష్యతే భవాన్
విప్రశాపం సమర్థోఽపి ప్రత్యహన్న యదీశ్వరః ॥ 42

**ఉద్ధవుడు పలికెను :** యోగేశ్వరా ! నీవు దేవాదిదేవుల కధీశ్వరుడవు. నీ లీలలను శ్రవణము చేయుటవలన, కీర్తించుటవలన జీవుడు పవిత్రుడగును. నీవు సర్వశక్తిమంతుడ వగు పరమేశ్వరుడవు. నీవు తలచుకొనిన బ్రాహ్మణుల శాపమును తొలగింపగలవు. కాని యట్లు చేయలేదు. ఇపుడు నీవు యదువంశమును సంహరించి యీ లోకమును విడచిపెట్టుటకు సిద్ధముగా నున్నట్లు నేను భావించుచున్నాను

నాహం తవాంఘ్రికమలం క్షణార్ధమపి కేశవ ।
త్యక్తుం సముత్సహే నాథ స్వధామ నయ మామపి ॥ 43

కాని కేశవా ! నే నర్ధక్షణము గూడ నీ పాద పద్మముల విడచుట కిష్టపడుటలేదు. అందువలన నాథా ! నన్నును నీ ధామమునకు దీసికొని పొమ్ము.

తవ విక్రీడితం కృష్ణ నృణాం పరమమంగళమ్ ।
కర్ణపీయూషమాస్వాద్య త్యజత్యన్యస్పృహాం జనః ॥ 44

కృష్ణా ! పరమ మంగళప్రదము, శ్రుతి సుఖజనకమునగు నీ లీలా చరితామృతమును పానము జేసిన మానవులు ఈ లోకమున నున్న విషయ వాసనల నన్నింటిని పరిత్యజింతురు.

శయ్యాసనాటనస్థానస్నానక్రీడాశనాదిషు ।
కథం త్వాం ప్రియమాత్మానం వయం భక్తాస్త్యజేమహి ॥ 45

దేవా ! పరుండునపుడు, కూర్చుండునపుడు, తిరుగునపుడు, నిలుచుండునపుడు, స్నానము చేయునపుడు, క్రీడించునపుడు, భోజనముచేయునపుడు ఇతర కార్యము లన్నింటిలోను ప్రియుడవు, ఆత్మస్వరూపుడవు నగు నిన్ను భక్తులమగు మేమెట్లు విడువగలము ?

త్వయోపభుక్తస్రగ్గన్ధవాసోఽలంకారచర్చితాః ।
ఉచ్ఛిష్టభోజినో దాసాస్తవ మాయాం జయేమహి ॥ 46

మేము నీవు ధరించిన మాలను ధరించితిమి, నీవు పూసికొనిన చందనమును పూసికొంటిమి, నీవు త్యజించిన వస్త్రమును ధరించితిమి, నీవు ధరించిన ఆభూషణములతో మమ్ము మే మలంకరించుకొంటిమి. నీవు తినగా మిగిలినదానిని తినునట్టి సేవకులము మేము. అందువలన మేము తప్పక నీ మాయను జయింపగలము.

వాతవసనా య ఋషయః శ్రమణా ఊర్ధ్వమన్థినః ।
బ్రహ్మాఖ్యం ధామ తే యాన్తి శాన్తాః సన్న్యాసినోఽమలాః ॥

దిగంబరులు, ఊర్ధ్వరేతస్కులు, శ్రమణులు, శాంతులు, నిర్మల చిత్తులు, ఋషులు, సన్న్యాసులు బ్రహ్మచర్యాదికఠినసాధనములద్వారా బ్రహ్మలోకమును బొందుచున్నారు.

వయంత్విహ మహాయోగిన్ భ్రమన్తః కర్మవర్త్మసు ।
త్వద్వార్తయా తరిష్యామస్తావకైర్దుస్తరం తమః ॥ 48
స్మరన్తః కీర్తయన్తస్తే కృతాని గదితాని చ ।
గత్యుత్స్మితేక్షణక్ష్వేలి యన్నృలోకవిడంబనమ్ ॥ 49

మహాయోగీశా ! మే మీ కర్మమార్గమున అనగా ప్రపంచమున సంచరించుచున్నను నీ భక్తులతో గలసి నీ కథలను కీర్తించుచుందుము.

మనుష్య లీలా స్వరూపుడ వగు నీ గతిని, హాస్యమును, దృష్టిపాతమును, పరిహాసమును, కర్మలను, ఉపదేశములను స్మరించుచు, కీర్తించుచు దుస్తరమగు సంసారదుఃఖము నతిక్రమింతుము.

శుక ఉవాచ :

ఏవం విజ్ఞాపితో రాజన్ భగవాన్ దేవకీసుతః ।
ఏకాన్తినం ప్రియం భృత్యముద్ధవం సమభాషత ॥ 50

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే పారమహంస్యాం
సంహితాయాం వైయాసిక్యామేకాదశ
స్కంధే భగవదుద్ధవసంవాదే
షష్ఠోఽధ్యాయః

శుకుడు పలికెను : పరీక్షిన్మహారాజా ! దేవకీనందనుడగు శ్రీకృష్ణ భగవానుని ఉద్ధవు డిట్లు ప్రార్థింపగా, అయన తన కనన్యప్రియుడు, భృత్యుడునగు నుద్ధవుని జూచి యిట్లు పలుకసాగెను.

ఈ విధముగ శ్రీ మద్భాగవతము నందలి
ఏకాదశ స్కంధములోని ఆఱవ
అధ్యాయము సమాప్తము.

# ఏడవ అధ్యాయము

## అవధూతోపాఖ్యానము — భూమి మొదలు పావురమువఱకు గల యెనమండ్రు గురువుల కథ.

### శ్రీ భగవానువాచ :

యదాత్థ మాం మహాభాగ తచ్చికీర్షితమేవ మే ।
బ్రహ్మా భవో లోకపాలాః స్వర్వాసం మేఽభికాంక్షిణః ॥ 1

**భగవానుడు పలికెను :** మహాభాగ! ఉద్ధవా! యదుకుల సంహారమునందును, వైకుంఠలోకగమన విషయమునందును నాకు గల అభిలాషను నీవు వెల్లడించితివి. వాస్తవముగ నదియంతయు సత్యమే. బ్రహ్మరుద్రులు, ఇంద్రాదిలోకపాలురు తమ లోకములద్వారా వైకుంఠమునకు వెడలవలసినదిగా నన్ను గోరుచున్నారు.

మయా నిష్పాదితం హ్యత్ర దేవకార్యమశేషతః ।
యదర్థమవతీర్ణోఽహమంశేన బ్రహ్మణార్థితః ॥ 2

భూలోకమున దేవతలకు జేయవలసిన పని నంతటిని పూర్తి చేసితిని. బ్రహ్మదేవుడు ప్రార్థింపగా నీ పనికొఱకే నేను బలరామునితో గలసి యవతరించితిని.

కులం వై శాపనిర్దగ్ధం నంక్ష్యత్యన్యోన్యవిగ్రహాత్ ।
సముద్రః సప్తమేఽహ్న్యేనాం పురీం చ ప్లావయిష్యతి ॥ 3

ఇపుడు బ్రాహ్మణశాపముచే దగ్ధమైన ఈ యదుకులము పరస్పర

వివాదకారణముగ వినష్టము కాగలదు. సరిగ నేటి కేడవనాడు సముద్ర మీ పట్టణమును ముంచివేయగలదు.

యర్హ్యేవాయం మయా త్యక్తో లోకోఽయం నష్టమంగళః ।
భవిష్యత్యచిరాత్ సాధో కలినాపి నిరాకృతః ॥ 4

ఉద్ధవా! నే నీమర్త్యలోకమును పరిత్యజించిన వెంటనే దీనిలోని సర్వశుభములు నష్టమై పోవును. కొలది దినములలోనే కలియుగము ప్రవేశించును.

న వస్తవ్యం త్వయైవేహ మయా త్యక్తే మహీతలే ।
జనోఽధర్మరుచిర్భద్ర భవిష్యతి కలౌ యుగే ॥ 5

కలియుగములో మానవు లెక్కువగా నధర్మములయం దాసక్తి గలవారై యుందురు. కాన నాచే త్యజింపబడిన ఈ పృథివిపై నీవు నివసింప దగదు.

త్వం తు సర్వం పరిత్యజ్య స్నేహం స్వజనబంధుషు ।
మయ్యావేశ్య మనః సమ్యక్ సమదృగ్విచరస్వ గామ్ ॥ 6

ఇపుడు నీవు నీ ఆత్మీయులను, స్వజనులను, బంధువులను, స్నేహితులను వదలుము. అనన్యప్రేమతో నాయందు మనస్సును లగ్నము చేసి సమదృష్టితో భూమిపై స్వచ్ఛందముగ విహరింపుము.

యదిదం మనసా వాచా చక్షుర్భ్యాం శ్రవణాదిభిః ।
నశ్వరం గృహ్యమాణం చ విద్ధి మాయామనోమయమ్ ॥ 7

ఉద్ధవా! మనస్సు, వాక్కు, చక్షువులు, కర్ణములు మున్నగు నింద్రియ సమూహమునకు విషయీభూతమైన ఈ ప్రపంచ మంతయు మాయామనః కల్పితము, నశ్వరమునని తెలిసికొనుము.

పుంసోఽయుక్తస్య నానార్థో భ్రమః స గుణదోషభాక్ ।
కర్మాకర్మవికర్మేతి గుణదోషధియో భిదా ॥ 8

విక్షిప్తచిత్తుడు అనగా అశాంతము, అసంయతము నగు మనస్సు గల మానవునకే యీ జగత్తులో నానావస్తు విషయక భ్రమ కలుగును. ఈ భ్రమయే గుణదోషయుక్తమైనది. ఇట్టి గుణదోషములకు వశుడయిన వ్యక్తి చిత్తమున కర్మ(1)అకర్మ(2)వికర్మ(3)రూపభేద ముదయ మగును.

తస్మాద్యుక్తేన్ద్రియగ్రామో యుక్తచిత్త ఇదం జగత్ ।
ఆత్మనీక్షస్వ వితతమాత్మానం మయ్యధీశ్వరే ॥ 9

ఉద్ధవా! మొదట నీవు నీ యింద్రియములను వశము చేసికొనుము, చిత్తవృత్తుల నన్నింటిని నిరోధించుము. సుఖదుఃఖమయమగు నీజగత్తు ఆత్మయందే యున్న దనియు, ఆత్మ పరమాత్మరూపుడనగు నా యందే యున్నదనియు దెలిసికొని దర్శింపుము.

జ్ఞానవిజ్ఞాన సంయుక్త ఆత్మభూతః శరీరిణామ్ ।
ఆత్మానుభవతుష్టాత్మా నాన్తరాయైర్విహన్యసే ॥ 10

నిశ్చయజ్ఞానము, అనుభవరూపవిజ్ఞానము కలవాడవై నీవు నీ యాత్మానుభవమున ఆనందమగ్నుడవై యుందువు. సర్వదేవతాది శరీరధారులకు ప్రీతిపాత్రుడ వగుదువు. అందువలన నిన్నెట్టి విఘ్నములు బాధింపవు.

దోషబుద్ధ్యోభయాతీతో నిషేధాన్న నివర్తతే ।
గుణబుద్ధ్యా చ విహితం న కరోతి యథార్భకః ॥ 11

---

(1) విహితకర్మ, (2) విహిత కర్మ లోపము, (3) నిషిద్ధకర్మ.

గుణములకంటెను, దోషబుద్ధికంటెను అతీతుడయిన పురుషుడు బాలునివలె నిషిద్ధకర్మనుండి నివృత్తుడగునుగాని దోషబుద్ధితో మాత్రము గాదు అతడు విహితకర్మ ననుష్ఠించునుగాని గుణబుద్ధితో మాత్రము కాదు.

సర్వభూతసుహృచ్ఛాన్తో జ్ఞానవిజ్ఞాన నిశ్చయః ।
పశ్యన్ మదాత్మకం విశ్వం న విపద్యేత వై పునః ॥ 12

జ్ఞాన విజ్ఞాన సంపన్నుడు, శాంతుడు, సమదర్శియు నగు పురుషుడు ఈ విశ్వమును నా స్వరూపమని తెలిసికొనును. దానిచే నతడు మఱల యీ జనన మరణ చక్రమునందు జిక్కుకొనడు.

శుక ఉవాచ :

ఇత్యాదిష్టో భగవతా మహాభాగవతో నృప ।
ఉద్ధవః ప్రణిపత్యాహ తత్త్వజిజ్ఞాసురచ్యుతమ్ ॥ 13

శుకుడు పలికెను : రాజా! శ్రీకృష్ణ భగవాను డిట్లాదేశించినంతనే మహాభాగవతుడగు నుద్ధవుడు తత్త్వజ్ఞానమును దెలిసికొన దలచినవాడై ఆయనకు నమస్కరించి యిట్లు ప్రశ్నించెను.

ఉద్ధవ ఉవాచ.

యోగేశ యోగవిన్యాస యోగాత్మన్ యోగసంభవ ।
నిఃశ్రేయసాయ మే ప్రోక్తస్త్యాగః సన్న్యాసలక్షణః ॥ 14

ఉద్ధవుడు పలికెను - దేవా! నీవే యోగవేత్తలకు అతి గోప్య మగునిక్షేపవిశేషమవు, యోగులకు [illegible] రుడవు. నీవే సర్వయోగులకు ఆధారుడ[illegible] స్వరూపుడవు నీవే. నీవు మా పరమ [illegible] త్యాగము నుపదేశించితివి.



త్యాగోఽయం దుష్కరో భూమన్ కామానాం విషయాత్మభిః
సుతరాం త్వయి సర్వాత్మన్నభక్తైరితి మే మతిః ॥ 15

కాని అనంతా! విషయాసక్తచిత్తు లగుపురుషు లావిషయభోగము లను, కోరికలను విడచుటమిక్కిలి కష్టము. వారిలోగూడ భగవద్విముఖు లగు మానవు లిట్టివానిని విడచుట పూర్తిగ నసంభవమనియే నా నిశ్చయము.

సోఽహం మమాహమితి మూఢమతిర్విగాఢ-
స్త్వన్మాయయా విరచితాత్మని సానుబంధే,
తత్త్వంజసా నిగదితం భవతా యథాఽహం
సంసాధయామి భగవన్ననుశాధిభృత్యమ్ ॥ 16

దేవా! నేను నీ మాయాకల్పిత మైనదేహమునందు, పుత్రకళత్రాది విషయమునందు నుండి "నేను, నాది" యనుభావమున మగ్నుడ నై యున్నాను. నేను మిగుల మూఢుడను, అందువలన నీవుపదేశించిన సన్న్యాస తత్త్వమును సుగమముగ ననుసరించునట్లు భృత్యుడనగు నాకువివరింపుము.

సత్యస్య తే స్వదృశ ఆత్మన ఆత్మనోఽన్యం
వక్తారమీశ విబుధేష్వపి నానుచక్షే ।
సర్వే విమోహితధియ స్తవ మాయయేమే
బ్రహ్మాదయ స్తనుభృతో బహిరర్థభావాః ॥ 17

దేవా! నీవు త్రికాలాబాధిత మైన సత్యస్వరూపుడవు, స్వప్రకాశు డవు నా కాత్మతత్త్వము నుపదేశించుటకు నీవు తప్ప దేవతలలో సమర్థు డైనవా డెవ్వడున్నాడు? బ్రహ్మాదిదేవత లందఱు నీ మాయచే మోహితు

లైనవారే వారి బుద్ధి మాయకు వశమైయున్నది. అందువలన వారు దేహ పుత్రాదిబాహ్యవిషయములనే పరమార్థము లని భావించుచున్నారు.

తస్మాద్భవ న్తమనవద్యమనంతపారం
సర్వజ్ఞమీశ్వరమకుంఠవికుంఠధిష్ణ్యమ్ ।
నిర్విణ్ణధీరహముహే వృజినాభితప్తో
నారాయణం నరసఖం శరణం ప్రపద్యే ॥ 18

దేవా! అందువలన నేను దుఃఖసంతప్తుడను, వైరాగ్య యుక్తుడనునై దేశకాలాద్యపరిచ్ఛిన్నుడవు, సర్వజ్ఞుడవు, సర్వశక్తిమంతుడవు, అనశ్వరమగు వైకుంఠమున నివసించువాడవు, నరసఖుడవు నగు నిన్ను శరణుజొచ్చితిని.

## శ్రీ భగవాను వాచ.

ప్రాయేణ మనుజా లోకే లోకతత్త్వవిచక్షణాః
సముద్ధరన్తి హ్యాత్మానమాత్మనైవా శుభాశయాత్ ॥ 19

**భగవానుడు పలికెను :-** ఉద్ధవా! జగత్తులోని తత్త్వవిశారదు లగుమానవులు వివేకబుద్ధిబలముచేతనే చిత్తమున నిండి యున్న విషయవాసనలనుండి తమ్ము తా ముద్ధరించుకొందురు.

ఆత్మనో గురురాత్మైవ పురుషస్య విశేషతః
యత్ప్రత్యక్షానుమానాభ్యాం శ్రేయోఽసావనువిన్దతే॥

మానవుడు ప్రత్యక్షానుమానములద్వారా తన హితాహితముల నిర్ణయించుకొనుటకు సమర్థుడై యున్నాడు. అందువలన మానవునకు ముఖ్యముగ తన ఆత్మయే గురువై యున్నది.

పురుషత్వే చ మాం ధీరాః సాంఖ్యయోగవిశారదాః ।
ఆవిస్తరాం ప్రపశ్యంతి సర్వశక్త్యుపబృంహితమ్ ॥ 21

సాంఖ్యయోగవిశారదులు, ధీరులు నగు పురుషులీమానవజన్మలో నె సర్వశక్తిసంపన్నుడ నగునన్ను సంపూర్ణముగ ప్రకటరూపముగ దర్శింతురు.

ఏకద్విత్రిచతుష్పాదో బహుపాదస్తథాపదః ।
బహ్వ్యః సన్తి పురః సృష్టాస్తాసాం మే పౌరుషీప్రియా ॥ 22

నేను ఏకపాది, ద్విపాది, త్రిపాది, చతుష్పాది, బహుపాది అపాది మున్నగు ప్రాణుల నెన్నింటినో సృష్టించితిని. వానిలో నాకు అన్నిటికంటె పురుషార్థసాధకమగుటవలన ప్రియమైనది మానవశరీరమే.

అత్ర మాం మృగయన్త్యద్ధా యుక్తా హేతుభిరీశ్వరమ్
గృహ్యమాణైర్గుణైర్లింగైరగ్రాహ్యమనుమానతః ॥ 23

నా స్వరూపము ప్రత్యక్షగోచర మైనను ఈ మానవదేహమునందున్న జీవులు బుద్ధ్యాదిగుణసమూహమును, ప్రకాశాప్రకాశరూపలక్షణమును దర్శించి అనుమానబలముతో తత్సముదాయప్రవర్తక స్వరూపుడ నగు నన్ను అన్వేషింతురు.

అత్రాప్యుదాహరన్తీమమితిహాసం పురాతనమ్ ।
అవధూతస్య సంవాదం యదోరమితతేజసః ॥ 24

ఈ విషయములో పరమతేజస్వియగు అవధూతకు యదుమహారాజునకు జరిగినసంభాషణరూప మగునీ పురాతనేతిహాసమును ప్రాజ్ఞులుచెప్పిరి.

అవధూతం ద్విజం కంచిచ్చరంతమకుతోభయమ్ ।
కవిం నిరీక్ష్య తరుణం యదుః పప్రచ్ఛ ధర్మవిత్ ॥ 25

ఒకమారు ధర్మజ్ఞు డగుయదుమహారాజు నిర్భయముగ విహరించు వాడు, వివేకి, తరుణ వయస్కుఁడు నగు నొక అవధూత బ్రాహ్మణుని దర్శించి యిట్లు ప్రశ్నించెను.

యదురువాచ.

కుతో బుద్ధిరియం బ్రహ్మన్నకర్తుః సువిశారదా ।
యామాసాద్య భవాంల్లోకం విద్వాంశ్చరతి బాలవత్ ॥ 26

**యదువు పలికెను:-** బ్రాహ్మణుడా ! నీ వెట్టిసత్కర్మను ననుష్ఠించుటలేదు. అయినను ఇట్టి సర్వలోకవిలక్షణబుద్ధి నీ కెట్లు కలిగినది? నీవు విద్వాంసుడ వైనను ఏ బుద్ధిబలముచేత బాలునివలె ఈ జగత్తులో సంచరించుచున్నావు?

ప్రాయో ధర్మార్థకామేషు వివిత్సాయాం చ మానవాః ।
హేతునైవ సమీహన్త ఆయుషో యశసః శ్రియః ॥ 27

జగత్తులో మానవులు తఱచుగ ఆయుష్యమును, యశస్సును, ఐశ్వర్యమును గోరి ధర్మార్థకామములయందును, ఆత్మతత్త్వజిజ్ఞాస యందును ప్రవృత్తులగుచున్నారు.

త్వం తు కల్పః కవిర్దక్షః సుభగోఽమృతభాషణః ।
న కర్తానేహసే కించిజ్జడోన్మత్తపిశాచవత్ ॥ 28

నీవు సమర్థుడవు, జ్ఞానివి, నిపుణుడవు, సుందరుడవు, మృదుభాషివి యైనను జడోన్మత్తపిశాచులవలె నుండి యేవిధమగుపనిని చేయుటలేదు. దేనిని గోరుటలేదు.

జనేషు దహ్యమానేషు కామలోభదవాగ్నినా ।
న తప్యసేఽగ్నినాముక్తో గంగామ్భఃస్థ ఇవ ద్విపః ॥ 29

జగత్తులోని మానవులు కామలోభము అనెడుదావానలముచే నిరంతరము దహింపబడుచున్నప్పటికిని నీవు అగ్నిసంతాపముక్తమై గంగాసలిలమునందున్న ఏనుగువలె సంతాపరహితుడవై యున్నావు.

త్వం హి నః పృచ్ఛతాం బ్రహ్మన్నాత్మన్యానన్దకారణమ్ ।
బ్రూహి స్పర్శవిహీనస్య భవతః కేవలాత్మనః ॥ 30

బ్రాహ్మణుడా! నీవు పుత్రకళత్రాది విషయభోగరహితుడవై నను హృదయమున నిట్టియానందము నెట్లనుభవించుచున్నావు? నాకు దానిని దెలిసికొనవలయుననెడికోరిక కలుగుచున్నది. దయయుంచి వివరింపుము.

శ్రీభగవానువాచ.

యదునైవం మహాభాగో బ్రహ్మణ్యేన సుమేధసా ।
పృష్టః సభాజితః ప్రాహ ప్రశ్రయావనతం ద్విజః ॥ 31

**శ్రీకృష్ణభగవానుడు పలికెను:—** ఉద్ధవా! మాపూర్వుడైన యదుమహారాజు బ్రాహ్మణహితపరాయణుడు, బుద్ధిమంతుడు. ఆయన పరమ భాగ్యవంతుడగు నాబ్రాహ్మణుని సత్కరించి అవనత శిరస్కుడై యెదుట నిలుచుండి పైవిధముగా ప్రశ్నించెను. అనంతర మాబ్రాహ్మణుడిట్లు చెప్పసాగెను.

బ్రాహ్మణ ఉవాచ.

సంతి మే గురవో రాజన్ బహవో బుద్ధ్యుపాశ్రితాః ।
యతో బుద్ధిముపాదాయ ముక్తోఽటామీహ తాన్ శృణు ॥ 32

**బ్రాహ్మణుడు పలికెను:—** రాజా! నేను నాబుద్ధితో నెందఱో గురువుల నాశ్రయించితిని. వానివలన జ్ఞానమును బొంది నేనీ

జగత్తులో ముక్తభావముతో స్వచ్ఛందముగ విహరించుచున్నాను. నీ వా గురువుల నామములను, వానినుండి గ్రహించిన జ్ఞానమును వినుము.

పృథివీవాయురాకాశమాపోఽగ్నిశ్చంద్రమా రవిః ॥
కపోతోఽజగరః సిన్ధుః పతంగో మధుకృద్గజః ॥ 33

మధుహా హరిణో మీనః పింగళా కురరోఽర్భకః ।
కుమారీ శరకృత్సర్ప ఊర్ణనాభిః సుపేశకృత్ ॥ 34

ఏతే మే గురవో రాజంశ్చతుర్వింశతిరాశ్రితాః ।
శిక్షావృత్తిభిరేతేషామన్వశిక్షమిహాత్మనః ॥ 35

(1) పృథివి (2) వాయువు (3) ఆకాశము (4) జలము (5) అగ్ని (6) చంద్రుడు (7) సూర్యుడు (8) పావురము (9) అజగరము (10) సముద్రము 11) పతంగము 12) తేనెటీగ 13) ఏనుగు 14) తేనెనుదీయు వాడు 15) హరిణము 16) చేప 17) పింగళయను వేశ్య 18) కురర పక్షి 19) బాలుడు 20) కన్య 21) బాణమును జేయువాడు 22) సర్పము 23) సాలెపురుగు 24) భ్రమర కీటకము - ఈ యిరువదినాల్గింటిని గురువులుగా భావించుచున్నాను. వీని నడవడినిబట్టి జ్ఞానమును బొంది నే నీ లోకమున సంచరించుచున్నాను.

యతో యదనుశిక్షామి యథా వా నాహుషాత్మజ ।
తత్తథా పురుషవ్యాఘ్ర నిబోధ కథయామి తే ॥ 36

వీరవరుడ వగుయయాతినందనా! నేను వీనిలో నెవరినుండి యెట్టి జ్ఞానమును బొందితినో చెప్పెదను వినుము.

భూతైరాక్రమ్యమాణోఽపి ధీరో దైవవశానుగైః ।
తద్విద్వాన్న చలేన్మార్గాదన్వశిక్షం క్షితేర్వ్రతమ్ ॥ 37

దుఃఖసహిష్ణు పగుమానవుడు దైవాధీనము లైనప్రాణులచే పీడింపబడినను దానిని దైవికముగా భావించి ధర్మమార్గమునుండి విచలితుడుకారాదు. (ప్రాణుల పాదములచే త్రొక్కబడునట్టిది, చలింపనట్టిదియునగు) భూమినుండి నే నీ క్షమాగుణము నేర్చితిని.

శశ్వత్పరార్థసర్వేహః పరార్థైకాన్తసంభవః ।
సాధుః శిక్షేత భూభృత్తో నగశిష్యః పరాత్మతామ్ ॥ 38

ఎల్లపుడు పరోపకార మొనరించు కోరికగలవాడును, ఎల్లపుడు పరహితముకొఱకే జీవించు వాడును నగు సాధువు (వృక్షములకు, తృణములకు, సెలయేళ్ళకు నిలయమగు) పర్వతమునుండి పరోపకారవృత్తిని, వృక్షమునుండి పరాధీనవృత్తిని నేర్వవలెనని తెలిసికొంటిని.

ప్రాణవృత్త్యైవ సంతుష్యేన్మునిర్నైవేన్ద్రియప్రియైః ।
జ్ఞానం యథా న నశ్యేత నావకీర్యేత వాఙ్మనః ॥ 39

జ్ఞానము నశింప కుండునట్లు, వాక్కు, మనస్సు విక్షిప్తములు కాకుండునట్లు ముని ఇంద్రియవృత్తులతోకాక ప్రాణవృత్తులతోనే సంతుష్టి నందవలెను.

(వివరణము :- ప్రాణవాయువు రూపరసాది విషయముల నపేక్షింపక జీవితమును రక్షించుట కనువగు ఆహారమును మాత్రము స్వీకరించి శరీరములో సంచరించునట్లు సాధకుడు జ్ఞానము, వాక్కు, మనస్సు విక్షిప్తము కాకుండగ జీవితమును నిర్వహించుకొనవలెను. ఇంద్రియముల కభీష్టమైనవృత్తులచే సంతుష్టిని బొందరాదు.)

విషయేష్వావిశన్ యోగీ నానాధర్మేషు సర్వతః ।
గుణదోషవ్యపేతాత్మా న విషజ్జేత వాయువత్ ॥ 40

యోగులైనవారు సుఖదుఃఖాది చింతారహితచిత్తముతో నానా గుణయుక్త విషయసమూహము ననుభవించుచున్నను వాయువువలె అనాసక్తులై యుండవలెను.

పార్థివేష్విహ దేహేషు ప్రవిష్టస్తద్గుణాశ్రయః ।
గుణైర్న యుజ్యతే యోగీ గంధైర్వాయురివాత్మదృక్ ॥ 41

వాయువు గంధముచే లిప్తముకానట్లు ఆత్మతత్త్వజ్ఞుడగు యోగి భౌతిక దేహమున ప్రవేశించి, బాల్యయౌవనాదిధర్మముల నంగీకరించినను వానియందాసక్తుడుగాడు.

అన్తర్హితశ్చ స్థిరజంగమేషు
బ్రహ్మాత్మభావేన సమన్వయేన ।
వ్యాప్త్యావ్యవచ్ఛేదమసంగమాత్మనో
మునిర్నభస్త్వం వితతస్య భావయేత్ ॥ 42

దేహాంతర్గతుడైనను ముని తన బ్రహ్మస్వరూపాత్మభావనద్వారా, ఆకాశమువలె స్థావరజంగమములయందు అధిష్ఠాతృరూపముతో ననుగమించుటచే సర్వగతమైనఆత్మను అపరిచ్ఛిన్నము, అసంగము ననిభావింపవలయును.

తేజోఽబన్నమయైర్భావై ర్మేఘాద్యైర్వాయునేరితైః ।
న స్పృశ్యతే నభస్తద్వత్ కాలసృష్టైర్గుణైః పుమాన్ ॥ 43

వాయుప్రేరితమైనమేఘాది సమూహముచే నాకాశము లిప్తముకానట్లు పురుషుడుగూడ కాలరచితము అగు తేజస్సు, జలము, అన్నమయము నగు దేహాదిసర్వపదార్థములచే లిప్తుడుగాడు.

స్వచ్ఛః ప్రకృతితః స్నిగ్ధో మాధుర్యస్తీర్థభూర్నృణామ్ ।
మునిః పునాత్యపాం మిత్రమీక్షోపస్పర్శకీర్తనైః ॥ 44

రాజా ! నిర్మలాత్ముడు, సహజస్నేహశీలి, మధురభాషియునగు ముని మానవులకు తీర్థస్వరూపుడై దర్శన స్పర్శన భగవత్కీర్తనలద్వారా వారిని జలమువలె పవిత్రులుగాజేయును.

తేజస్వీ తపసా దీప్తో దుర్ధర్షోదరభాజనః ।
సర్వభక్షోఽపి యుక్తాత్మా నాదత్తే మలమగ్నివత్ ॥ 45

తేజస్వి, తపః ప్రభావసంపన్నుడు, దుర్ధర్షుడు, అపరిగ్రహశీలుడు, ముక్తస్వభావుడు నగుముని సర్వవిధవస్తువులను భక్షించినను అగ్నివలె ఎట్టిమాలిన్యమును బొందడు

క్వచిచ్ఛన్నః క్వచిత్ స్పష్టఉపాస్యః శ్రేయ ఇచ్ఛతామ్ ।
భుంక్తే సర్వత్రదాతౄణాం దహన్ ప్రాగుత్తరాశుభమ్ ॥ 46

సాధకుడు అగ్నివలె కొన్నిచోట్ల గూఢముగను, కొన్నిచోట్ల ప్రకటముగను నుండవలెను కల్యాణకాముకు లగుజను లుపాసించుటకు దగిన రూపముతో నతడు కొన్ని చోట్ల ప్రకటమగును. దాతలయొక్క అతీతానాగత పాపరాశిని నాశనము చేయుచు అన్నిచోట్ల అన్నాదిద్రవ్యములను స్వీకరింపవలెను.

స్వమాయయా సృష్టమిదం సదసల్లక్షణం విభుః ।
ప్రవిష్ట ఈయతే తత్తత్స్వరూపోఽగ్నిరివైధసి ॥ 47

సర్వవ్యాపి యగుపరమాత్మ తన మాయచే సృష్టింపబడిన దేవతిర్యగాది వివిధశరీరములలో ప్రవేశించి కాష్ఠములలో నున్న అగ్నివలె ఆ యా స్వరూపుడై ప్రతీయమాను డగుచుండును.

విసర్గాద్యాః శ్మశానాన్తా భావా దేహస్యనాత్మనః ।
కళానామివ చంద్రస్య కాలేనావ్యక్తవర్త్మనా ॥ 48

అలక్ష్యవేగయుక్త మగుకాలప్రభావముచే చంద్రుని కళలు వృద్ధి క్షయముల బొందునట్లు పుట్టుకమొదలుకొని మరణముపరకు గలవికారము లన్నియు దేహమునకు సంబంధించినవె ఆత్మ యెట్టివికారములను బొం దదు. దీనినె నేను చంద్రునినుండి నేర్చుకొంటిని.

కాలేన హ్యోఘవేగేన భూతానాం ప్రభవాప్యయౌ ।
నిత్యావపి న దృశ్యేతే ఆత్మనోఽగ్నేర్యథార్చిషామ్ ॥ 49

అగ్నిశిఖలు ప్రతిక్షణము ఉత్పత్తివినాశముల బొందుచున్నను నగ పడనట్లె నదీప్రవాహమువలె నియతవేగశాలి యగుకాలప్రభావముచే మాన వుల దేహములుగూడ ప్రతిక్షణము ఉత్పత్తివినాశముల బొందుచున్నను అజ్ఞానమువలన నగపడవు.

గుణైర్గుణానుపాదత్తే యథాకాలం విముంచతి ।
న తేషు యుజ్యతే యోగీ గోభిర్గా ఇవ గోపతిః ॥ 50

సూర్యుడు కిరణసమూహముచే జలరాశిని ఆకర్షించును, సమయము వచ్చినపుడు కురిపించును. అట్లే యోగియు ఇంద్రియములచే విషయముల గ్రహించును. అవసరము వచ్చినపుడు అనగా యాచకులు వచ్చినపుడు వానిని దానముచేయును. కాని వానియం దాసక్తుడు కాడు.

బుధ్యతే స్వేన భేదేన వ్యక్తిస్థ ఇవ తద్గతః
లక్ష్యతే స్థూలమతిభిరాత్మా చావస్థితోఽర్కవత్ ॥ 51

స్వస్వరూపమునందున్న ఆత్మ సూర్యునివలె భిన్నరూపముగ నగ

పడదు. భిన్న దేహములందు ప్రవేశించిన ఆత్మ భిన్నోపాధులయందు ప్రతి బింబించిన సూర్యునివలె స్థూలబుద్ధు లగువారికి వేఱువేఱుగ నగపడును.

నాతిస్నేహః ప్రసంగో వా కర్తవ్యః క్వాపి కేనచిత్ ।
కుర్వన్ విందేత సంతాపం కపోతఇవ దీనధీః ॥ 52

ఎచ్చటను నెవ్వరితోడను అతిస్నేహము, అతిప్రసంగము చేయరాదు. అట్లుచేయువాడు. వివేక శూన్య మైనకపోతమువలె సంతాపగ్రస్తుడగును.

కపోతః కశ్చనారణ్యే కృతనీడో వనస్పతౌ ।
కపోత్యా భార్యయా సార్థమువాస కతిచిత్సమాః ॥ 53

రాజా ! ఒకానొక యడవిలో నొక పావుర మొకచెట్టుపై గూడును నిర్మించుకొని, దానిలోనది తనభార్యతోగలసి బహువర్షములు నివసించెను.

కపోతౌ స్నేహగుణితహృదయౌ గృహధర్మిణౌ ।
దృష్టిం దృష్ట్యాఽఙ్గమఙ్గేన బుద్ధిం బుద్ధ్యా బబన్ధతుః ॥ 54

గృహస్థ ధర్మమునం దాసక్తమైయున్న ఆ కపోత ద్వంద్వము స్నేహబద్ధ హృదయముతో నిరంతరము దృష్టితో దృష్టిని, అంగముతో నంగమును, బుద్ధితో బుద్ధిని బంధించుకొనెను.

శయ్యాసనాటనస్థానవార్తాక్రీడాశనాదికమ్ ।
మిథునీభూయ విస్రబ్ధౌ చేరతుర్వనరాజిషు ॥ 55

ఆకపోతములు రెండును వనములలో పరుండుట, కూర్చుండుట, తిరుగుట, నివసించుట, సంభాషించుట, ఆడుట, భుజించుట మున్నగు వానిని స్వేచ్ఛగా నొనర్చుచుండెను.

యం యం వాంఛతి సా రాజన్ తర్పయన్త్యనుకంపితా ।
తం తం సమానయత్ కామం కృచ్ఛ్రేణాప్యజితేన్ద్రియః॥ 56

రాజా! ఆకపోతపురము చిఱునవ్వుతో గూడిన క్రీగంటి చూపులతోను, సంభాషణాదులచేతను, ప్రేమను గలిగించు కార్యములతోను మగపావురము యొక్క కృపకు పాత్రురాలై తానేపదార్థముల గోరునో వానిని ఇంద్రియ నిగ్రహము లేని మగపావురము కష్టపడి యైనను సంపాదించి తెచ్చి పెట్టుచుండెను.

కపోతీ ప్రథమం గర్భం గృహ్ణాతీ కాల ఆగతే ।
అండాని సుషువే నీడే స్వపత్యుః సన్నిధౌ సతీ ॥ 57

అనంతరము పతివ్రత యగుకపోతి ప్రథమగర్భమును ధరించి ప్రసవకాలము సమీపించినంతనె గూటిలో తన భర్తసన్నిధియందు గ్రుడ్లు పెట్టెను.

తేషు కాలే వ్యజాయన్త రచితావయవా హరేః ।
శక్తిభిర్దుర్విభావ్యాభిః కోమలాంగతనూరుహాః ॥ 58

కాలక్రమము ననుసరించి యా యండములు శ్రీహరిఅచింత్యశక్తి ప్రభావముచే పగిలెను. వానినుండి కాళ్ళు కలిగిన పిల్లలు బయల్వెడలెను. వాని అవయవములు, రోమములు మిగుల కోమలముగ నుండెను.

ప్రజాః పుపుషతుః ప్రీతౌ దంపతీ పుత్రవత్సలౌ ।
శృణ్వన్తౌ కూజితం తాసాం నిర్వృతౌ కలభాషితైః ॥ 59

అనంతర మాకపోత దంపతులు తమ సంతానము యొక్క కూజితములను, మధుర శబ్దములను విని ఆనందించి ప్రేమతో వానిని పెంచుచుండెను.

తాసాం పతత్రైః సుస్పర్శైః కూజితైర్ముగ్ధచేష్టితైః ।
ప్రత్యుద్గమైరదీనానాం పితరౌ ముదమాపతుః ॥ 60

ఎల్లపుడు సంతోషముతోనుండు ఆపక్షిసంతానము తమ సుకుమారము లైనరెక్కలచేత తల్లిదండ్రులకు సుఖస్పర్శను కూజితము, అమాయకము లైనచేష్టలు, ఎగురుట మున్నగుపనులచే అధిక మగుహర్షమును కలుగజేసెను.

స్నేహానుబద్ధహృదయావన్యోన్యం విష్ణుమాయయా ।
విమోహితౌ దీనధియౌ శిశూన్ పుపుషతుః ప్రజాః ॥ 61

ఈవిధముగ విష్ణుమాయామోహితులు, పరస్పరాసక్తచిత్తులు నగు నాకపోతదంపతులు సంతానపోషణవ్యగ్రతచే కృపణచిత్తులై వానిని పెంచుచుండెను.

ఏకదా జగ్మతుస్తాసామన్నార్థం తౌ కుటుంబినౌ ।
పరితః కాననే తస్మిన్నర్థినౌ చేరతుశ్చిరమ్ ॥ 62

ఒకనాడు ఆకపోతద్వంద్వము తమసంతానమున కాహారము దెచ్చుటకై యడవికి వెడలెను. చాలకాలమువఱ కవి యడవిలో నాలుగువైపుల నాహారమునకై సంచరించుచుండెను.

దృష్ట్వా తాంల్లుబ్ధకః కశ్చిద్యదృచ్ఛాతో వనేచరః ।
జగృహే జాలమాతత్య చరతః స్వాలయాన్తికే ॥ 63

ఇంతలో నొకవ్యాధు డటునిటు తిరుగుచు తమ గూటికడ సంచరించుచు నాపావురముల పిల్లలను జూచి వలపన్ని వానిని పట్టుకొనెను.

కపోతశ్చ కపోతీ చ ప్రజాపోషే సదోత్సుకౌ ।
గతౌ పోషణమాదాయ స్వనీడముపజగ్మతుః ॥ 64

కపోతదంపతులు నిరంతరము సంతాన పోషణమునం దుత్సుకత గలవియై యుండెను. అందువలన అవి ఆహారమును దీసికొని తమగూటి కడకు వచ్చెను.

కపోతీ స్వాత్మజాన్ వీక్ష్య బాలకాన్ జాలసంవృతాన్ ।
తానభ్యధావత్ క్రోశన్తీ క్రోశతో భృశదుఃఖితా ॥ 65

వలలో జిక్కుకొని తన్నుజూచినంతనే దుఃఖించుచున్న తన సంతానమునుజూచి ఆడపావురము పెద్దగ నేడ్చుచు వానికడకు బరుగెత్తెను.

సా సకృత్స్నేహగుణితా దీనచిత్తాజమాయయా ।
స్వయం చాబధ్యత శిచా బద్ధాన్ పశ్యన్త్యపస్మృతిః ॥ 66

భగవానుని మాయచే దాని చిత్తము మిగుల దైన్యము కలదియయ్యెను. వలలో దగులుకొన్న పిల్లలను జూచి స్మృతిలేనిదియై యాకపోతి తానుగూడ వలలోబడెను.

కపోతశ్చాత్మజాన్ బద్ధానాత్మనోఽప్యధికాన్ ప్రియాన్ ।
భార్యాం చాత్మసమాం దీనో విలలాపాతిదుఃఖితః ॥ 67

తన ప్రాణసమానులగుపిల్లలు, ఆత్మతుల్యయగుభార్య వలలో జిక్కుకొనియుండుటను జూచి మగపావురము మిగుల దుఃఖితయై ఏడ్వసాగినది.

అహో మే పశ్యతాపాయమల్పపుణ్యస్య దుర్మతేః ।
అతృప్తస్యాకృతార్థస్య గృహాస్త్రైవర్గికో హతః ॥ 68

జీవులారా ! నేను ఐహికసుఖములయందతృప్తుడను, పారలౌకికసుఖసంపాదనమునందు విముఖుడను, అల్ప పుణ్యవంతుడను, దుర్మతిని, ఇట్టి నన్ను జూడుడు. నేడు త్రివర్గసాధనభూతమైననా గృహస్థాశ్రమము వినష్టమైనది.

అనురూపానుకూలా చ యస్య మే పతిదేవతా ।
శూన్యే గృహే మాం సంత్యజ్య పుత్రైః స్వర్యాతిసాధుభిః ॥ 69

అయ్యో! నేడు పతివ్రత, అనుకూల, అనురూప యగునా భార్య నన్ను శూన్యగృహమున వదలి సాధువు లైనపుత్రులతో గలసి స్వర్గమునకు పెడలుచున్నదికదా!

సోఽహం శూన్యే గృహే దీనో మృతదారో మృతప్రజః ।
జిజీవిషే కిమర్థం వా విధురో దుఃఖజీవితః ॥ 70

నేను దీనుడను, నాభార్య మృతిజెందినది. నా పుత్రులు మృతిజెందిరి, విరహవేదనాగ్రస్తుడను. కష్టప్రద మగు జీవితమును వహించి నే నెవరికొఱకీశూన్యగృహమున జీవించియుందును?

తాం స్తథై వావృతాంశిగ్భిర్మృత్యుగ్రస్తాన్విచేష్టతః ।
స్వయం చ కృపణః శిక్షుపశ్యన్నప్యబుధోఽపతత్ ॥ 71

అనంతరము కపోత శిశువులు వలలో దగుల్కొని మృత్యు ముఖమున నున్నట్లుకనబడుచుండెను. కాని మూర్ఖయు, కాతరచిత్తముగలదియు నగునాపావురము వివేక శూన్యయై తానుగూడ వలలో పడెను.

తం లబ్ధ్వా లుబ్ధకః క్రూరః కపోతం గృహమేధినమ్ ।
కపోతకాన్ కపోతీం చ సిద్ధార్థః ప్రయయౌ గృహమ్ ॥ 72

అనంతరము క్రూరు డగు నాబోయవాడు గృహస్థాశ్రమములో నున్న నాకపోత దంపతులను, కపోత శిశువులను బట్టుకొని సిద్ధమనోరథుడై సంతోషించుచు నింటికి వెడలెను.

ఏవం కుటుంబ్యశాన్తాత్మా ద్వంద్వారామః పతత్రివత్ ॥
పుష్ణన్ కుటుంబం కృపణః సానుబన్ధోఽవసీదతి ॥ 73

పైన చెప్పబడిన పావురమువలె నున్నవాడు, మిథునసుఖరతుడు, దీనుడు, అజితేంద్రియుడు, బహుకుటుంబీకుడు నగుపురుషుడు కుటుంబ

పోషణమునందే ఆసక్తుడైయున్నచో అనంతరము పరివారముతోగూడ క్లేశములయందు జిక్కుకొనును,

యః ప్రాప్య మానుషం లోకం ముక్తిద్వారమపావృతమ్ ।
గృహేషు ఖగవత్సక్తస్తమారూఢచ్యుతం విదుః ॥ 74

విడివడిన ముక్తి ద్వారమువలె నున్న నీ మానవదేహమును బొందియు కపోతమువలె గృహస్థధర్మమునందే ఆసక్తుడైయున్నవానిని పండితులు ఆరూఢచ్యుతు డనియందురు. (శ్రేయోమార్గమును బొంద పతితుడైనవాడు)

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే పారమహంస్యాం
సంహితాయాం వైయాసిక్యామేకాదశ
స్కంధే భగవదుద్ధవసంవాదే
సప్తమోఽధ్యాయః

ఈ విధముగ శ్రీమద్భాగవతము నందలి
ఏకాదశ స్కంధములోని యేడవ
అధ్యాయము సమాప్తము.



# ఎనిమిదవ అధ్యాయము

## అవధూతోపాఖ్యానము - అజగరమునుండి పింగళవఱకు గల తొమ్మండుగురు గురువుల కథ.

### బ్రాహ్మణ ఉవాచ

సుఖమైన్ద్రియకం రాజన్ స్వర్గే నరక ఏవ చ ।
దేహినాం యద్యథా దుఃఖం తస్మాన్నేచ్ఛేత తద్బుధః॥ 1

**బ్రాహ్మణుడు పలికెను :—** రాజా ! స్వర్గనరకములలో ప్రాణుల కయాచితముగనె దుఃఖము లభించును. అందువలన వివేకియగు వాడీవిషయమును దెలిసికొని అట్టిసుఖములకై యెట్టిప్రయత్నమును జేయ రాదు.

గ్రాసం సుమిష్టం విరసం మహాన్తం స్తోకమేవ వా ।
యదృచ్ఛయైవాపతితం గ్రసేదాజగరోఽక్రియః ॥ 2

అజగరము వలె ఉదాసీనుడై అనాయాసముగ లభించిన పదార్థము రుచిగ నున్నను, అరుచిగనున్నను, అధికముగనున్నను, అల్పముగను న్నను ఎట్లున్నను స్వీకరింపవలెను.

శయీతాహాని భూరీణి నిరాహారోఽనుపక్రమః ।
యది నోపనమేద్గ్రాసో మహాహిరివ దిష్టభుక్ ॥ 3

ఎట్టిసమయమందైన ఆహారము లభింపనిచో నది దైవేచ్ఛయే యనిభావించి ధైర్యమును వహించి అజగరమువలె నెట్టి చేష్టయు లేక నిరాహారముగ చాలకాలము నుండవలెను.

ఓజస్సహో బలయుతం బిభ్రద్దేహమకర్మకమ్ ।
శయానో వీతనిద్రశ్చ నేహేతేన్ద్రియవానపి ॥ 4

వాని శరీరమున మనోబలము, ఇంద్రియబలము, దేహబలము నున్నప్పటికిని అతడు నిశ్చేష్టునిగనే యుండవలెను. నిద్రారహితు డైనను నిద్రించువానివలె నుండవలెను. కర్మేంద్రియము లున్నను వానితో నెట్టి పనియు జేయరాదు. రాజా ! అజగరమునుండి నేనిట్టి జ్ఞానమును సంపాదించితిని.

మునిః ప్రసన్నగంభీరో దుర్విగాహ్యో దురత్యయః ।
అనంతపారో హ్యక్షోభ్యః స్తిమితోద ఇవార్ణవః ॥ 5

ముని ప్రసన్నగంభీరుడు, దుర్విగాహ్యుడు, అలంఘనీయుడు, దేశకాలాద్యపరిచ్ఛిన్నుడు, రాగాదులచే కలతచెందనివాడునునై నిశ్చలసలిలపూర్ణ మైనసముద్రమువలె నుండవలెను.

సమృద్ధకామో హీనో వా నారాయణపరో మునిః ।
నోత్సర్పేత న శుష్యేత సరిద్భిరివసాగరః ॥ 6

సముద్రము వర్షఋతువునందు నదుల న్నియు కలసినను వృద్ధిపొందదు, గ్రీష్మకాలమున తగ్గిపోదు. అట్లే భగవత్పరాయణు డగుసాధకుడు ప్రాపంచిక పదార్థములవలన సంతోషమును బొందరాదు. అవి లభింపనపుడు దుఃఖింపనురాదు.

దృష్ట్వా స్త్రియం దేవమాయాం తద్భావైరజితేన్ద్రియః ।
ప్రలోభితః పతత్యన్ధే తమస్యగ్నౌ పతంగవత్ ॥ 7

అజితేంద్రియు డగు పురుషుడు దైవమాయానిర్మిత మైనస్త్రీజనదర్శనమునందు, వారి విలాసచేష్టలయందు ప్రలోభముగలవాడై అగ్నిపై పురుగెత్తు మిడతలవలె నరకమునందు బడి కష్టముల ననుభవించును.

యోషిద్ధిరణ్యాభరణాంబరాది
ద్రవ్యేషు మాయారచితేషు మూఢః ।
ప్రలోభితాత్మా హ్యుపభోగబుద్ధ్యా
పతంగవన్నశ్యతి నష్టదృష్టిః ॥ 8

మూఢు డగుమానవుడు మాయారచితము లగుకామినీకాంచనములు, వస్త్రాభూషణములు మున్నగు నశ్వరము లైనపదార్థములయం దాసక్తుడై తన మనస్సు నంతటిని వాని ననుభవించుటయందే లగ్నముచేసి పతంగము వలె నాశనము నొందును.

స్తోకం స్తోకం గ్రసేద్గ్రాసం దేహో వర్తేత యావతా
గృహా న హింసన్నాతిష్ఠేద్వృత్తిం మాధుకరీం మునిః ॥ 9

రాజా ! సన్న్యాసి దేహ మున్నంతవఱకు గృహస్థులకెట్టి కష్టమును గలుగజేయకుండగ వారినుండి స్వల్పముగ ఆహారమును సంపాదించుకొన వలెనేగాని మాధుకరవృత్తి నవలంబింపరాదు.

(వివరణము :- కమలగంధమునం దాసక్తమైన భ్రమరము రాత్రి సమయమున ఆకమలము ముకుళించుకొనిపోగా నదిగూడ దానియందే బంధింపబడియుండును. అట్లే యతిగూడ రుచ్యము లైనపదార్థములయం దాసక్తుడై యొకేగృహస్థుని అన్నమును దినుటచేత దానినై సర్గిక మోహమునకు వశుడై నశించును.)

అణుభ్యశ్చ మహద్భ్యశ్చ శాస్త్రేభ్యః కుశలో నరః ।
సర్వతః సారమాదద్యాత్ పుష్పేభ్య ఇవ షట్పదః ॥ 10

తుమ్మెద చిన్నవియు, పెద్దవియు నగుపుష్పముల నన్నింటినుండి సారమును గ్రహించునట్లు, బుద్ధిమంతు డగుమానవుడు చిన్నవియు, పెద్దవియు నగుశాస్త్రముల నన్నింటినుండి సారమును గ్రహింపవలెను.

సాయంతనం శ్వస్తనం వా న సంగృహ్ణీత భిక్షితమ్ ।
పాణిపాత్రోదరామత్రో మక్షికేవ న సంగ్రహీ ॥　　11

ముని సాయంకాలమునకుగాని, మఱునాటికిగాని ఆహారమును గూడ బెట్టుకొనరాదు అరచేయియె భిక్షాపాత్రగా గలవాడై ఉదరము నింపుకొనుటకు గావలసిన అన్నమును ఒక్కపూటవఱకే సంపాదించుకొనవలెను. తేనెటీగవలె నధికముగ సంపాదించుకొనరాదు.

సాయంతనం శ్వస్తనం వా న సంగృహ్ణీత భిక్షుకః ।
మక్షికా ఇవ సంగృహ్ణన్ సహ తే న వినశ్యతి ॥　　12

సన్న్యాసి సాయంకాలమునకుగాని, మఱునాటికిగాని, ఆహారమును సంపాదించి కూడబెట్టుకొనరాదు. అట్లుకాక నధికముగ గూడబెట్టుకొనువాడైనచో తేనెటీగవలె నాద్రవ్యముతోగూడ నశించును.

పదాపి యువతీం భిక్షుర్నస్పృశేద్దారవీమపి ।
స్పృశన్ కరీవ బధ్యేత కరిణ్యా అంగసంగతః ॥　　13

సన్న్యాసి కఱ్ఱతో జేయబడిన స్త్రీమూర్తినిగూడ పాదముచేతనైన స్పృశింపరాదు. అట్లుచేసినచో నతడు ఆడయేనుగు అంగసంగమువలన బంధిత మైనమగయేనుగువలె విషయములచే బంధితుడగును.

నాధిగచ్ఛేత్ స్త్రియం ప్రాజ్ఞః కర్హిచిన్మృత్యుమాత్మనః ।
బలాధికైః సహన్యేత గజైరన్యైర్గజో యథా ॥　　14

బలాధికము లగునేనుగులచే మఱియొకయేనుగు హతమైనట్లు స్త్రీసంసర్గము గలపురుషుడు ఆస్త్రీలచే దీసికొనిరాబడిన ఇతరజారపురుషులచే చంపబడును. కావున వివేకి యగుమానవు డెప్పుడును మృత్యువుతో సమానమైన స్త్రీ సంసర్గమును వాంఛింపరాదు.

న దేయం నోపభోగ్యం చ లుబ్ధైర్యద్దుఃఖసంచితమ్ ।
భుంక్తే తదపి తచ్చాన్యో మధుహేవార్థవిన్మధు ॥ 15

ప్రపంచములో లోభి యైనమానవుడు అతికష్టముతో ధనమును గూడబెట్టును. కాని దాని నెవ్వరికి దానముచేయడు. తాను స్వయముగ ననుభవింపడు తేనెను దీయువాడు తేనెటీగలచే గూడబెట్టబడిన తేనెననుభవించు నట్లు లోభి వాని ధనమును లోకు లనుభవింతురు.

సుదుఃఖోపార్జితైర్విత్తైరాశాసానాం గృహాశిషః ।
మధుహేవాగ్రతో భుంక్తే యతిర్వై గృహమేధినామ్ ॥ 16

మధువును హరించువా డగువ్యాధుడు ఇతరసంచిత మైనమధువును హరించునట్లు సన్న్యాసి యగువాడు గృహస్థు లతికష్టముతో సంపాదించుకొనిన ద్రవ్యముచే సిద్ధ మైనఅన్నాదులను వారికంటె ముందుగ భుజించును.

గ్రామ్యగీతం న శృణుయాద్యతిర్వనచరః క్వచిత్ ।
శిక్షేత హరిణాద్బద్ధాన్మృగయోర్గీత మోహితాత్ ॥ 17

వనవాసి యగుసన్న్యాసి యెప్పుడును విషయసంబంధ మగుగీతముల వినరాదు. వ్యాధుని సంగీతమునకు వశయై బంధింపబడిన హరిణమునుండి అత డీజ్ఞానమును నేర్వవలెను.

నృత్యవాదిత్రగీతాని జుషన్ గ్రామ్యాణి యోషితామ్ ।
ఆసాం క్రీడనకో వశ్య ఋష్యశృంగో మృగీసుతః ॥ 18

హరిణీ గర్భమునుండి పుట్టిన ఋష్యశృంగు డనుముని విషయసంబంధము లగుస్త్రీల నృత్యవాద్యగీతములయం దాసక్తుడై వారిచేతిలో కీలుబొమ్మ యయ్యెను.

జిహ్వ్యా యాతి ప్రమాథిన్యా జనో రసవిమోహితః ।
మృత్యుమృచ్ఛత్య సద్బుద్ధిర్మీనస్తు బడిశైర్యథా ॥ 19

గాలమునందు దగుల్కొని యున్న మాంసపుముక్క పై గలలోభముచే చేప తన ప్రాణములను బోగొట్టుకొనును. అట్లే దుర్బుద్ధి యగు మానవుడు దుర్జయ మగుజిహ్వేంద్రియముచే రసవిమోహితుడై మృత్యుముఖమున బడును.

ఇంద్రియాణి జయన్త్యాశు నిరాహారా మనీషిణః ।
వర్జయిత్వా తు రసనం తన్నిరన్నస్య వర్ధతే ॥ 20

వివేకవంతు లగుపురుషులు నిరాహారులై జిహ్వను కాక మిగిలిన ఇంద్రియముల నన్నింటిని జయింతురు, కాని ఉపవాసమున్నపుడు వారి జిహ్వచాపల్యము వెనుకటికంటె మిన్నగ వృద్ధిపొందును.

తావజ్జితేన్ద్రియో న స్యాద్విజితాన్యేన్ద్రియః పుమాన్ ।
న జయేద్రసనం యావజ్జితం సర్వం జితే రసే ॥ 21

మనుష్యుడు సర్వేంద్రియములను జయించినను జిహ్వేంద్రియమును జయింపనిదే జితేంద్రియుడు కాజాలడు, ఈరసనేంద్రియమును వశము జేసికొనిన సర్వేంద్రియములు వశమగును.

పింగళా నామ వేశ్యాఽఽసీద్విదేహనగరే పురా ।
తస్యా మే శిక్షితం కించిన్నిబోధ నృపనందన ॥ 22

రాజకుమారా ! ప్రాచీనకాలమున మిథిలానగరమున పింగళ యను నొక వేశ్య యుండెను. నే నామెనుండి కొలదిగ జ్ఞానమును సంపాదించితిని. చెప్పెదను, వినుము.

సా స్వైరిణ్యేకదా కాన్తం సంకేత ఉపనేష్యతి ।
అభూత్కాలే బహిర్ద్వారి బిభ్రతీ రూపముత్తమమ్ ॥ 23

ఆ వేశ్య ఒకనాటిరాత్రి సంకేతమునకు ఉపపతిని దీసికొనిపోదలచి చక్కగా నలంకరించుకొని సాయంకాలమున వాకిటియందు నిలువబడి యుండెను.

మార్గఆగచ్ఛతో వీక్ష్య పురుషాన్ పురుషర్షభ ।
తాన్ శుల్కదాన్ విత్తవతః కాన్తాన్ మేనేఽర్థకాముకీ ॥ 24

పురుషశ్రేష్ఠా! ధనమును గోరునట్టి యా వేశ్య ఆసమయమున త్రోవన బోవు ప్రతిపురుషుని జూచి, వీడు ధనవంతుడు, అధికముగా ధనమిచ్చి నన్ననుభవించుటకే యిటు వచ్చుచున్నాడని తలంచుచుండెను.

ఆగతేష్వపయాతేషు సా సంకేతోపజీవినీ ।
అప్యన్యో విత్తవాన్ కోఽపి మాముపైష్యతి భూరిదః ॥ 25

వచ్చినవారు వెడలిపోవుచుండగ మఱియొక ధనవంతుడు వచ్చి ఎక్కువగ ధన మిచ్చి నన్ను పొందగల డనియావేశ్య భావించుచుండెను.

ఏవం దురాశయా ధ్వస్తనిద్రా ద్వార్యవలంబతీ ।
నిర్గచ్ఛన్తీ ప్రవిశతీ నిశీథం సమపద్యత ॥ 26

ఇట్టిదురాశ మనస్సులో పెచ్చుపెరిగిపోయెను. అది ద్వారమునందు నిలువబడి చాలాసేపు ఎదురుచూచెను. దాని నిద్రగూడ నశించెను. ఒకప్పుడు లోనికి పోవును, మఱియొకప్పుడు బయటకు వచ్చును. ఇట్లర్ధరాత్రము గడచెను.

తస్యా విత్తాశయా శుష్యద్వక్త్రాయా దీనచేతసః ।
నిర్వేదః పరమో జజ్ఞే చిన్తాహేతుః సుఖావహః ॥ 27

అనంతరము ధనాశచే శుష్కవదనయు, కాతరచిత్తయు నగునా పింగళ కర్థచింత యెక్కువయ్యెను. దానివలన పరిణామసుఖప్రద మగు వైరాగ్య ముత్పన్న మయ్యెను.

తస్యా నిర్విణ్ణచిత్తాయా గీతం శృణు యథా మమ ।
నిర్వేద ఆశాపాశానాం పురుషస్య యథా హ్యసిః ।  28

నిర్విణ్ణచిత్తురా లగునావేశ్య యొకగీతమును పాడెను. దానిని నీకు వినిపింతును. వైరాగ్యమే మానవుని ఆశాపాశములను ఛేదించునట్టి యేకైక సాధనము.

నహ్యంగాజాత నిర్వేదో దేహబన్ధం జిహాసతి ।
యథా విజ్ఞానరహితో మనుజో మమతాం నృప ॥  29

రాజా ! విజ్ఞానరహితు డగు మానవుడు మమతను వదలుట కిష్టపడనట్లు వైరాగ్యము కలుగని పురుషుడు దేహబంధనముల వదలుట కిష్టపడడు.

## పింగళోవాచ.

అహో మే మోహవితతిం పశ్యతా విజితాత్మనః ।
యా కాన్తాదసతః కామం కామయే యేన బాలిశా ॥  30

పింగళ పలికెను :- అహో ! ఇంద్రియముల కధీనురాలనై నే నెంతటిమోహమున బడిపోయితినో చూడుడు. వివేకశూన్యురాలనై అస్తిత్వమే లేని యీ దుష్టపురుషులనుండి విషయసుఖముల నాశించుచున్నాను. ఎంతటి దుఃఖకరవిషయము! నేను నిజముగ మూర్ఖురాలనె.

సన్తం సమీపే రమణం రతిప్రదం
విత్తప్రదం నిత్యమిమం విహాయ ।

అకామదం దుఃఖభయాధిశోక —
మోహప్రదం తుచ్ఛమహం భజేఽజ్ఞా ॥ 31

నా యెదుట రతిసుఖప్రదుడు, అధిక ధనప్రదాత, నిత్యుడు, ప్రియతముడు నగుభగవాను డెల్లపుడు నివసించుచున్నను నే నాయన సేవను విడచి కోరికల దీర్చుటలో నసమర్థులు, దుఃఖమును, భయమును, ఆధి — వ్యాధులను, శోకమోహములను గలుగజేయుటలో శ్రేష్ఠులు నగునీతుచ్ఛ పురుషులను సేవించుచున్నాను.

అహో మయాఽఽత్మా పరితాపితో వృథా
సాంకేత్య వృత్త్యాతి విగర్హ్య వార్తయా ।
స్త్రైణాన్నరాద్యార్థతృషోఽనుశోచ్యాత్
క్రీతేన విత్తంరతిమాత్మనేచ్ఛతి ॥ 32

నేను బ్రతుకుదెరువునకై మిక్కిలి నిందనీయమగు వేశ్యావృత్తిని ఆశ్రయించితిని. వ్యర్థముగ నాశరీరమునకు, మనస్సునకు క్లేశమును గలుగజేసితిని. నా యీ శరీర మమ్ముడుపోయినది. లంపటులు, లుబ్ధులు నగుమానవులు దీనిని కొనివేసిరి. నేను మిగుల మూర్ఖురాలను, కనుక నే యీశరీరముతోనె ధనమును, రతిసుఖమును గోరుచున్నాను.

యదస్థిభిర్నిర్మిత వంశ వంశ్య —
స్థూణాం త్వచా రోమనఖైః పినద్ధమ్ ।
క్షరన్నవద్వారమగారమేత —
ద్విణ్మూత్రపూర్ణం మదుపైతి కాన్యా ॥ 33

ఈ శరీర మొకగృహము. దీనిలో నెముకలతో నిర్మితము లైన వెదురుబొంగులు, స్తంభములు నున్నవి. ఇవి చర్మముచేత, రోమములచేత

గోళ్ళచేత కప్పబడి యున్నది. దీనిలో తొమ్మిది ద్వారములున్నవి. వాని నుండి యెల్లపుడు మలము బయల్వెడలుచుండును. దీనిలో సంచిత మైన సంపద యనుపేరుతో కేవలము మలమూత్రములే యున్నవి. ఈ శరీర మును నాకంటె నభిమానించువా రెవ్వరు?

విదేహానాం పురే హ్యస్మిన్నహమేకైవ మూఢధీః ।
యాన్యమిచ్ఛన్త్యసత్యస్మాదాత్మదాత్కామమచ్యుతాత్ ॥ 34

ఆత్మస్వరూపప్రదాత యగునీశ్రీహరిని పరిత్యజించి నేను అన్య మానవులనుండి భోగవస్తువులను గోరుచున్నాను. ఈ విదేహనగరమున నావంటివివేకశూన్యురా లగుస్త్రీ మఱియెవ్వతెయు లేదు,

సుహృత్ప్రేష్ఠతమో నాథ ఆత్మాచాయం శరీరిణామ్ ।
తం విక్రీయాత్మనైవాహం రమేఽనేన యథా రమా ॥ 35

ఈశ్రీహరియె జీవుల కేకైకప్రియతముడు, స్నేహితుడు, ప్రభువు, అంతర్యామి. నేను ఆత్మనివేదన మూల్యముచే ఆయననుకొని లక్ష్మీదేవి వలె ఆయనతోగూడి విహరింతును.

కియత్ ప్రియం తే వ్యభజన్ కామా యే కామదా నరాః ।
ఆద్యన్తవన్తో భార్యాయా దేవా వా కాలవిద్రుతాః ॥ 36

కాలప్రభావముచే విచలితములు, ఉత్పత్తివినాశ శీలములు నగు జగత్తులోని విషయములు కామప్రదు లగుమానవులు నీ కెట్టిసుఖమును గలిగించిరి? అట్లే దేవతలు తమభార్యల కెంతమాత్రము సుఖమును పంచిపెట్ట గలిగిరి?

నూనం మే భగవాన్ ప్రీతో విష్ణుః కేనాపి కర్మణా ।
నిర్వేదోఽయం దురాశాయా యన్మేజాతః సుఖావహః ॥ 37

నేను చేసికొనిన పుణ్యకర్మచే విష్ణుభగవానుడు నాకు ప్రసన్నుడై నాడు. అప్పటినుండియె దురాశ గలనా కిట్టివైరాగ్యము కలిగినది. తప్పక నా కీవైరాగ్యము సుఖమును గలుగజేయునది యగును.

నూనం స్వర్మన్దభాగ్యాయాః క్లేశా నిర్వేదహేతవః ।
యేనానుబన్ధం నిర్హృత్య పురుషః శమమృచ్ఛతి ॥ 38

నేను దురదృష్టవంతురాల నైనచో వైరాగ్యమును గలిగించు నా కిట్టికష్టములు గలిగెడివి కావు. మానవుడు వైరాగ్యముచేతనే గృహాది బంధనముల నన్నింటిని ఛేదించుకొని శాంతిని బొందును.

తేనోపకృతమాదాయ శిరసా గ్రామ్యసంగతాః ।
త్యక్త్వా దురాశాః శరణం వ్రజామి తమధీశ్వరమ్ ॥ 39

నే నిపుడు భగవానుని యీయుపకారమును ఆదరముతో శిరము వంచి స్వీకరించుచున్నాను. విషయభోగములయందలి దురాశను విడచి యీ జగదీశ్వరుని శరణుజొచ్చుచున్నాను.

సంతుష్టా శ్రద్ధధత్యేతద్యథాలాభేన జీవతీ ।
విహరామ్యమునైవాహమాత్మనా రమణేన వై ॥ 40

ఇపుడు అప్రయత్నముగ లభించినదానితో జీవితమును గడుపుకొనుచు సంతోషము, శ్రద్ధగలిగి, హృదయేశ్వరుడు, పరమాత్మరూపుడు నగు శ్రీహరితోనె విహరింతును.

సంసారకూపే పతితం విషయైర్ముషితేక్షణమ్ ।
గ్రస్తం కాలాహినాఽఽత్మానం కోఽన్యస్త్రాతుమధీశ్వరః ॥ 41

సంసారకూపమున బడినవాడును, రూపరసాది విషయములచే నపహృతమైనదృష్టిగలవాడును, కాల మనుసర్పముచే పట్టుకొనబడినవాడును నగుజీవుని శ్రీహరితప్ప మఱియెవ్వరు రక్షింపగలరు?

ఆత్మైవ హ్యాత్మనో గోప్తా నిర్విద్యేత యదాఖిలాత్ ।
అప్రమత్త ఇదం పశ్యేద్గ్రస్తం కాలాహినా జగత్ ॥ 42

ఈ జగత్తంతయు కాల మనుసర్పముచే గ్రసింపబడి యున్న దని తెలిసికొని వివేకవంతు డగుపురుషుడు సర్వవిషయములనుండి విరతుడై యుండవలెను. అప్పు డతడు తనను తాను రక్షించుకొనగలడు.

## బ్రాహ్మణ ఉవాచ

ఏవం వ్యవసితమతిర్దురాశాం కాన్తతర్షజామ్ ।
ఛిత్త్వోపశమమాస్థాయ శయ్యాముపవివేశ సా ॥ 43

బ్రాహ్మణుడు పలికెను: పింగళ యిట్లునిశ్చయించుకొనినదై ఉపపతిసమాగమతృష్ణవలన గలిగిన దురభిలాషను పరిత్యజించి, చిత్తశాంతిని బొంది ప్రక్కపై బరుండెను.

ఆశా హి పరమం దుఃఖం నైరాశ్యం పరమం సుఖమ్ ।
యథా సంఛిద్య కాన్తాశాం సుఖం సుష్వాప పింగళా ॥ 44

నిజముగ ఆశయే పరమదుఃఖము, నిరాశయే పరమసుఖము. కనుకనె పింగళ యను వేశ్య పురుషులపై గల ఆశను వదలి సుఖ నిద్రను బొందినది.

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే పారమహంస్యాం
సంహితాయా మేకాదశ స్కంధే
అష్టమోఽధ్యాయః

ఈ విధముగ శ్రీమద్భాగవతము నందలి పదునొకండవ స్కంధములోని యెనిమిదవ
అధ్యాయము సమాప్తము.

# తొమ్మిదవ అధ్యాయము

అవధూతోపాఖ్యానము - కురరపక్షి (లకుముకిపిట్ట) నుండి
భృంగి (ఆడతుమ్మెద) వఱకుగల ఏడుగురు
గురువుల కథ.

## బ్రాహ్మణ ఉవాచ.

పరిగ్రహో హి దుఃఖాయ యద్యత్ప్రియతమం నృణామ్ ।
అనంతం సుఖమాప్నోతి తద్విద్వాన్ యస్త్వకించనః ॥ 1

**బ్రాహ్మణుడు పలికెను :** ప్రియాతి ప్రియములైనవస్తువులయం దాసక్తి గలిగియుండుటయే మానవులకు దుఃఖకారణము. ఈ విషయమును దెలిసికొని యకించనభావముతో నున్నవాడు పరమానందమును బొందును.

సామిషం కురరం జఘ్నుర్బలినేఽన్యే నిరామిషాః ।
తదామిషం పరిత్యజ్య స సుఖం సమవిన్దత ॥ 2

ఒకపుడు నిరామిషములు, సబలములు నగు కురరపక్షులు మాంసఖండముగల మఱియొక కురరపక్షిపై దాడిచేసినవి. వెంటనే ఆకురరపక్షి మాంసపుముక్కను విడచి సుఖించెను.

న మే మానావమానౌ స్తో న చిన్తా గేహపుత్రిణామ్ ।
ఆత్మక్రీడ ఆత్మరతిర్విచరామీహ బాలవత్ ॥ 3

నాకు మానావమానములుగాని, దారా పుత్రాది చింతలుగాని లేవు. అందువలన నేను బాలునివలె ఆత్మక్రీడాశీలుడను ఆత్మ సంతుష్టడనునై సంచరింతును.

ద్వావేవచిన్తయా ముక్తౌ పరమానన్దఆప్లుతౌ ।
యో విముగ్ధో జడో బాలో యో గుణేభ్యః పరం గతః ॥ 4

ఈ జగత్తులో నిరువురే చింతారహితులుగను, పరమానందమగ్నులుగను నుందురు. వారిలో నొకడు అజ్ఞుడు, నిశ్చేష్టుడు నగు బాలుడు. మఱియొకడు గుణాతీతు డగుపురుషుడు.

క్వచిత్కుమారీ త్వాత్మానం వృణానాన్ గృహమాగతాన్ ।
స్వయం తానర్హయామాస క్వాపి యాతేషు బన్ధుషు ॥ 5

ఒకమా తొకకన్యకను వరించుటకు ఆమెయింటికి గొందరు జనులు వచ్చిరి. ఆసమయమున నామె తల్లిదండ్రు లెవ్వరును నింటిలో లేకపోయిరి. అందువలన నామె స్వయముగ వారి కతిథిసత్కారములు చేసి గౌరవించెను.

తేషామభ్యవహారార్థం శాలీన్ రహసి పార్థివ ।
అవఘ్నన్త్యాః ప్రకోష్ఠస్థాశ్చక్రుః శంఖాః స్వనం మహత్ ॥ 6

రాజా! వారికి భోజనమును పెట్టుటకై యామె లోపల ఏకాంతముగ ధాన్యమును దంప నారంభించినది. అప్పు దామె ముంజేతులయం దుండు శంఖపుగాజులు పెద్దగ మ్రోగసాగినవి.

సా తజ్జుగుప్సితం మత్వా మహతీ వ్రీడితా తతః ।
బభంజైకైకశః శంఖాన్ ద్వౌ ద్వౌ పాణ్యోరశేషయత్ ॥ 7

ధాన్యమును దంపుట దారిద్ర్యమును వెల్లడిచేయును. అతిథుల యెదుట ఇది నిందాజనక మగునని తలంచి బుద్ధిమంతురాలై నకన్యక సిగ్గుపడి ఒక్కొక్కగాజును పగులగొట్టివేసినది. ఒక్కొక్కచేతికి రెండ్రెండు గాజులనుమాత్ర మట్టిపెట్టుకొనినది.

ఉభయోరప్యభూద్ఘోషో హ్యవఘ్నన్త్యాః స్వశంఖయోః ।
తత్రాప్యేకం నిరభిదదేకస్మాన్నాభవద్ధ్వనిః ॥ 8

మరల ఆమె ధాన్యమును దంపుట మొదలిడగా నారెండురెండు గాజులుగూడ మ్రోగసాగినవి. అపుడామె యొక్కొక్క గాజును తీసివేసినది. రెండుచేతులకు నొక్కొక్క గాజుమాత్రమే యుండుటచే నెట్టి ధ్వనియు లేకపోయెను.

అన్వశిక్షమిమం తస్యా ఉపదేశమరిందమ ।
లోకాననుచరన్నేతాన్ లోకతత్త్వవివిత్సయా ॥ 9

శత్రుదమనా ! నేను జనుల ఆచారవ్యవహారములను పరిశీలించు నిమిత్తమై యిటునటు తిరుగుచు నామెయింటికి వెడలి ఆమెనుండి యీ యుపదేశమును బొందితిని.

వాసే బహూనాం కలహో భవేద్వార్తా ద్వయోరపి ।
ఏక ఏవ చరేత్తస్మాత్కుమార్యా ఇవ కంకణః 10

అనేక జనులొకేచోట నున్న కలహము, ఇరువు రున్న నానావిధ విషయ చర్చయు జరుగును. అందువలన కన్యచేతియందలి కంకణమువలె ఒంటరిగ సంచరింపవలెను.

మన ఏకత్ర సంయుంజ్యాజ్జితశ్వాసో జితాసనః ।
వైరాగ్యాభ్యాసయోగేన ధ్రియమాణమతన్ద్రితః ॥ 11

ఆసనమును, శ్వాసను జయించి, వైరాగ్యాభ్యాసముల ద్వారా మనస్సును వశముజేసికొని జాగరూకతతో దాని నొకే లక్ష్యమునం దుంచవలెను.

యస్మిన్ మనో లబ్ధపదం యదేత-
చ్ఛనైశ్శనైర్ముంచతి కర్మరేణూన్ ।

సత్త్వేన వృద్ధేన రజస్తమశ్చ
విధూయ నిర్వాణముపైత్యనిన్ధనమ్ ॥ 12

భగవంతునియందు లగ్నమైన మనస్సు గలవాడు మెల్ల మెల్లగ కర్మవాసనారజమును కడిగివేయును. సత్త్వగుణాభివృద్ధిచేత రజో గుణ తమోగుణ వృత్తులను త్యజించిన వాని మనస్సు ఇంధనరహితమైన అగ్ని వలె శాంతిని బొందును.

తదైవమాత్మన్యవరుద్ధ చిత్తో
న వేద కించిద్బహిరన్తరం వా ।
యథేషుకారో నృపతిం వ్రజన్త -
మిషౌ గతాత్మా న దదర్శ పార్శ్వే ॥ 13

బాణములను చేయువాడు బాణములను చేయుపనియందు నిమగ్నుడై తన ప్రక్కనుండి ససైన్యుడై రాజు వెడలుచున్నను వానిని గమనింపడు. అట్లే యోగియైనవాడు ఈశ్వరునియందు ఆత్మను సమర్పించునపుడు సంయతచిత్తుడై బాహ్యాభ్యంతరములయందు గల విషయములలో దేనిని గూడ గుర్తింపరాదు.

ఏకచార్యనికేతః స్యాదప్రమత్తో గుహాశయః ।
అలక్ష్యమాణ ఆచారైర్మునిరేకోఽల్పభాషణః ॥ 14

సన్న్యాసి సర్పమువలె ఒంటరిగ సంచరింపవలెను. ఒకే స్థానమున నుండరాదు. ప్రమాద పడరాదు. గుహాదులలో నుండవలెను. బాహ్యాచారముల గుర్తింపరాదు. అల్పభాషియై యుండవలెను.

గృహారంభో హి దుఃఖాయ విఫలశ్చాధ్రువాత్మనః ।
సర్పః పరకృతం వేశ్మ ప్రవిశ్య సుఖమేధతే ॥ 15

అనిత్యమైన ఈ శరీరమునకై గృహమును నిర్మించుకొనుట దుఃఖకరము, వ్యర్థము. సర్పము అన్యులచే నిర్మితమైన గృహమున ప్రవేశించి సుఖమును బొందుచున్నది గదా।

ఏకో నారాయణో దేవః పూర్వసృష్టం స్వమాయయా
సంహృత్య కాలకలయా కల్పాన్త ఇదమీశ్వరః ।
ఏక ఏవాద్వితీయోఽభూదాత్మాధారోఽఖిలాశ్రయః ॥ 16

జగదీశ్వరుడు, సర్వజనారాధ్యుడు నగు నారాయణు డొక్కడె స్వమాయచే సృష్టికాలమునం దీప్రపంచము నంతటిని సృష్టించి, ప్రళయమునందు కాలరూపుడయిన తన యంశచే దానిని సంహరించి తనలో నుంచుకొనును. అయన ఆత్మాధారుడు, అఖిలాశ్రయుడు, సజాతీయ విజాతియ ప్రధానాది భేదరహితుడునై యుండును.

కాలేనాత్మానుభావేన సామ్యం నీతాసు శక్తిషు ।
సత్త్వాదిష్వాదిపురుషః ప్రధానపురుషేశ్వరః ॥ 17
పరావరాణాం పరమ ఆస్తే కైవల్యసంజ్ఞితః ।
కేవలానుభవానన్దసందోహో నిరుపాధికః ॥ 18

ఆత్మానుభావస్వరూపమగు కాలముచే సత్త్వాదిశక్తులు సామ్యావస్థను బొందగా ప్రకృతి పురుషుల కధీశ్వరుడు, బ్రహ్మాది దేవతలకు జీవులకు నాశ్రయ యోగ్యుడు, నిరుపాధికుడు, పరమానందరూపుడు, కైవల్య సంజ్ఞకుడు నగు సనాతనపురుషు డొక్కడె విరాజిల్లుచుండును.

కేవలాత్మానుభావేన స్వమాయాం త్రిగుణాత్మికామ్ ।
సంక్షోభయన్ సృజత్యాదౌ తయా సూత్రమరిందమ॥ 19

శత్రుదమనా। ఆయనయె సృష్టి సమయమునందు మొదటిసారిగ స్వీయప్రభావరూప మగుకాలముచే త్రిగుణాత్మికయగు తనమాయను సంక్షో

భింపజేసి దానిద్వారా క్రియాశక్తిప్రాధాన్యయుక్తమగు మహత్తత్త్వమును సృష్టించెను.

తామాహుస్త్రిగుణవ్యక్తిం సృజన్తీం విశ్వతోముఖమ్ ।
యస్మిన్ ప్రోతమిదం విశ్వం యేన సంసరతే పుమాన్ ॥ 20

దేనియందీవిశ్వము గ్రథితమై యున్నదో, దేనిచేత జీవుడు సంసార దశను బొందుచున్నాడో ఆ మహత్తత్త్వమును త్రిగుణముల కార్యమని శాస్త్రకారులు చెప్పుచున్నారు. అది త్రిగుణాత్మకమగు వివిధ విశ్వమును ప్రకటించును.

( కారణభూతమగు సమష్టి రూపమునందీ విశ్వము గ్రథితమై యున్నను, ఆధ్యాత్మప్రాణరూపముచే జీవుడు సంసార దశను బొందుచున్నాడు. త్రిగుణాత్మకమగు వివిధ విశ్వమును అహంకారము ద్వారా ప్రకటించునట్టి యా మహత్తత్త్వమును త్రిగుణముల కార్యమని శాస్త్రకారులు చెప్పుచున్నారు. )

యథోర్ణనాభిర్హృదయాదూర్ణాం సంతత్య వక్త్రతః ।
తయా విహృత్య భూయస్తాం గ్రసత్యేవం మహేశ్వరః॥ 21

సాలెపురుగు హృదయమునుండి ముఖము ద్వారా దారమును వ్యాపింపజేసి ఆ దారమునందే విహరించును. మరల దానినే గ్రసించును. అట్లే పరమేశ్వరుడు తననుండి యీ విశ్వమును సృష్టించును. చివరకు దానిని తనలో లీనము చేసికొనును.

యత్ర యత్ర మనో దేహీ ధారయేత సకలం ధియా ।
స్నేహాద్ద్వేషాద్భయాద్వాపి యాతి తత్తత్స్వరూపతామ్॥22

ప్రాణి స్నేహముచేతగాని, ద్వేషముచేతగాని లేదా భయముచేత గాని ఏకాగ్రరూపముగ తన మనస్సును దేనియందు లగ్నము చేయునో ఆయా వస్తువు స్వరూపమును బొందును.

కీటః పేశస్కృతం ధ్యాయన్ కుడ్యాం తేన ప్రవేశితః ।
యాతి తత్సాత్మతాం రాజన్ పూర్వరూపమసంత్యజన్ 23

రాజా! భ్రమర మొక కీటకమును దెచ్చి తానున్న ప్రదేశమున నుంచును. ఆ కీటకము భయముతో దానినే చింతించుచు తన మొదటి శరీరమును విడువక ఆ శరీరముతోనే తద్రూపము నందును.

ఏవం గురుభ్య ఏతేభ్య ఏషా మే శిక్షితామతిః ।
స్వాత్మోపశిక్షితాం బుద్ధిం శృణు మే వదతః ప్రభో ॥ 24

రాజా! ఈ గురువు లందఱినుండి నేను పై విధముగ జ్ఞానము సంపాదించితిని. ఇపుడు నే నీ శరీరమునుండి తెలిసికొనిన విషయమును చెప్పెదను శ్రద్ధగ వినుము.

దేహో గురుర్మమ విరక్తివివేకహేతు-
ర్బిభ్రత్ స్మసత్త్వనిధనం సతతార్త్యుదర్కమ్ ।
తత్త్వాన్యనేన విమృశామి యథా తథాపి
పారక్యమిత్యవసితో విచరామ్యసంగః ॥ 25

నిరంతరపరిణామదుఃఖశీలము, ఉత్పత్తివినాశశీలము నగునీదేహము వైరాగ్యమును, వివేక జ్ఞానమును గలిగించు ననిభావించి నేను దీనిని నాగురువుగా జేసికొంటిని. అయినను దీనిని కుక్కలు నక్కలు ఆహారముగా నుపయోగించుకొనును. అందుచే నేను దీనిపై నాసక్తిని వదలితిని. తత్త్వానుసంధానమున కవసర మగునంతవఱకె దీనితో సంబంధము పెట్టుకొనుచున్నాను. ఈ శరీరము తత్త్వవిచారమునకు సహాయపడును.

జాయాత్మజార్థపశుభృత్యగృహాప్తవర్గాన్
పుష్ణాతి యత్ప్రియచికీర్షయా వితన్వన్ ।
స్వాన్తే సకృచ్ఛ్రమవరుద్ధధనః స దేహః
సృష్ట్వాస్య బీజమవసీదతి వృక్షధర్మా ॥ 26

జీవు డీశరీరమును సంతోషపెట్టుటకు కష్టపడి ధనమును కూడబెట్టి దారాపుత్రులను, సంపదను, పశువులను, భృత్యులను, గృహములను, ఆత్మీయులను వృద్ధి చేసికొని పోషించును. అయుర్దాయము పూర్తి యైనంతనే ఆ శరీరము నశించును. వృక్షమువలె మఱియొక శరీరమునకు బీజము నాటి అదిగూడ కష్టముల ననుభవించుట కేర్పాటు చేయుచున్నాడు.

జిహ్వైకతోఽముమపకర్షతి కర్హి తర్షా
శిశ్నోఽన్యతస్త్వగుదరం శ్రవణం కుతశ్చిత్ ।
ఘ్రాణోఽన్యతశ్చపలదృక్క్వ చ కర్మశక్తి-
ర్బహ్వ్యః సపత్న్య ఇవ గేహపతిం లునన్తి ॥ 27

ఏ గృహస్థునికైన నెక్కువమంది భార్య లున్నపుడు వారిలో నొక్కొక్కతె భర్తను తమ వైపునకు ఆకర్షించునట్లు జిహ్వ, దప్పిక, జననేంద్రియము, చర్మము, ఉదరము, చెవి, నాసిక, చంచలదృష్టి అను సర్వేంద్రియములు దేహాభిమాని యగు నీ పురుషుని తమతమ విషయముల వైపున కాకర్షించును.

సృష్ట్వా పురాణి వివిధాన్యజయాఽఽత్మశక్త్యా
వృక్షాన్ సరీసృపపశూన్ ఖగదంశమత్స్యాన్ ।
తైస్తైరతుష్టహృదయః పురుషం విధాయ
బ్రహ్మావలోకధిషణం ముదమాప దేవః ॥ 28

భగవానుడు తన యచింత్యశక్తి యగుమాయచే వృక్షములు, సరీసృపములు, పశువులు, పక్షులు, క్రూరములైనప్రాణులు మున్నగు జీవుల నెన్నింటినో సృష్టించెను. కాని ఆయనకు సంతోషము కలుగలేదు. అప్పుడాయన బ్రహ్మసాక్షాత్కారమును జేసికొనగలిగినట్టి బుద్ధితోగూడిన మనుష్యులను సృష్టించెను. వీరి సృష్టివలన ఆయన కానందము కలిగెను.

లబ్ధ్వా సుదుర్లభమిదం బహుసంభవాన్తే
మానుష్యమర్థదమనిత్యమపీహ ధీరః ।
తూర్ణం యతేత న పతేదనుమృత్యుయావత్ -
నిఃశ్రేయసాయ విషయః ఖలు సర్వతః స్యాత్ ॥ 29

కావున అనేక జన్మలతరువాత ఈ సంసారమునందు, అనిత్యమైనను పురుషార్థప్రదము, సుదుర్లభమునగు నీ మానవ జన్మనుబొంది నిరంతరము వెంటాడు మృత్యుముఖమున పడకముందే ధీరుడగువాడు త్వరగ పరమసుఖముకొఱకు యత్నింపవలెను. విషయసుఖములు పశ్వాదియోనుల యందును ఉండునుగదా !

ఏవం సంజాతవైరాగ్యో విజ్ఞానాలోక ఆత్మని ।
విచరామి మహీమేతాం ముక్తసంగోఽనహంకృతిః॥ 30

నేనీవిధముగ ననేక గురువులనుండి నానావిధ జ్ఞానమును బొంది విజ్ఞాన ప్రదీపయుక్తుడను, సంజాత వైరాగ్యుడను, ముక్తసంగుడను, నిరహంకారుడనునై పరమాత్మయందు మనస్సును నిలిపి యీభూమియందు విహరించుచున్నాను.

నహ్యేకస్మాద్గురోర్జ్ఞానం సుస్థిరం స్యాత్సుపుష్కలమ్ ।
బ్రహ్మైతదద్వితీయం వై గీయతే బహుధర్షిభిః ॥ 31

బ్రహ్మవస్తు వద్వితీయ మైనను ఋషులు దానిని విభిన్నరూపము లుగ వర్ణించిరి. కనుక నొకేగురువునుండి సంపాదించినజ్ఞానము ప్రచు రము, సుస్థిరము గాదు.

## శ్రీ భగవానువాచ.

ఇత్యుక్త్వా స యదుం విప్ర స్తమామన్త్ర్య గభీరధీః ।
వన్దితః స్వర్చితో రాజ్ఞా యయౌ ప్రీతో యథాగతమ్॥ 32

**శ్రీకృష్ణ భగవానుడు పలికెను :—** ఉద్ధవా ! గంభీరబుద్ధి యగు దత్తాత్రేయుడు యదురాజున కీవిధముగ నుపదేశించెను. యదు వాయున ననేకవిధముల పూజించెను. దత్తాత్రేయుడు మిగుల ప్రసన్ను డయి యథేచ్ఛముగా నేగెను.

అవధూతవచః శ్రుత్వా పూర్వేషాం నః స పూర్వజః ।
సర్వసంగవినిర్ముక్తః సమచిత్తో బభూవ హ ॥ 33

మా పూర్వులకు పూర్వుడయిన యదుమహారాజు అవధూత యగు దత్తాత్రేయుని యీ పలుకలను విని సమస్తములైన ఆసక్తులనుండి విడ వడి సమదర్శి యయ్యెను.

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే పారమహంస్యాం
సంహితాయా మేకాదశ స్కంధే
భగవదుద్ధవ సంవాదే
నవమోఽధ్యాయః

ఈ విధముగ శ్రీమద్భాగవత మహాపురాణము
నందలి యేకాదశస్కంధములోని తొమ్మిదవ
అధ్యాయము సమాప్తము.

# పదియవ అధ్యాయము

## లౌకిక పారలౌకిక భోగముల నిస్సారతను నిరూపించుట.

### శ్రీ భగవాను వాచ.

మయోదితేష్వవహితః స్వధర్మేషు మదాశ్రయః ।
వర్ణాశ్రమకులాచారమకామాత్మా సమాచరేత్ ॥ 1

**శ్రీకృష్ణ భగవానుడు పలికెను :—** ఉద్ధవా ! సాధకుడన్ని విధముల నన్ను శరణు జొచ్చి నే నుపదేశించిన పాంచరాత్రాది శాస్త్రోక్త వైష్ణవ ధర్మములను శ్రద్ధగ పాలింపవలెను. వానితోపాటు వీలున్నంతవఱకు పై ధర్మములకు విరోధము లేకుండ నిష్కామ భావముతో తన వర్ణాశ్రమ కులముల సదాచారముల ననుష్ఠింపవలెను

అన్వీక్షేత విశుద్ధాత్మా దేహినాం విషయాత్మనామ్ ।
గుణేషు తత్త్వధ్యానేన సర్వారంభవిపర్యయమ్ ॥ 2

విషయ పరాయణులగు పురుషులు విషయముల నన్నింటిని సత్యము లని నమ్మి, వానిని పొందుటకు జేయు ప్రయత్నములు విపరీత ఫలము నిచ్చునవియని తెలిసికొని విశుద్ధచిత్తుడగు పురుషుడు నిష్కామభావముతో నుండును.

సుప్తస్య విషయాలోకో ధ్యాయతో వా మనోరథః ।
నానాత్మకత్వాద్విఫలస్తథా భేదాత్మధీర్గుణైః ॥ 3

విషయచింతారతుడు, నిద్రితుడునగు వ్యక్తికి స్వప్నమున వివిధము లగు భోగ్యవస్తువులు సాక్షాత్కరించును. అవి నానాపదార్థముల నాశ్రి

యుంచుటవలన పారమార్థిక ఫల శూన్యములగును. అట్లే ఇంద్రియముల ద్వారా కలుగు భేదబుద్ధియు వ్యర్థమే.

నివృత్తం కర్మ సేవేత ప్రవృత్తం మత్పరస్త్యజేత్ ।
జిజ్ఞాసాయాం సంప్రవృత్తో నాద్రియేత్ కర్మచోదనామ్॥ 4

నన్ను శరణు జొచ్చిన పురుషుడు కామ్యకర్మలను వదలి నిత్య నైమిత్తిక కర్మల నాచరింపవలెను. అనంతరము ఆత్మవిచారమునందు ప్రవృత్తుడయి నిష్కామకర్మవిధులను గూడ నాదరింపరాదు.

యమానభీక్ష్ణం సేవేత నియమాన్ మత్పరః క్వచిత్ ।
మదభిజ్ఞం గురుం శాన్తముపాసీత మదాత్మకమ్ ॥ 5

నిరంతరము మానవుడు మద్గతచిత్తుడై అహింసాది యమ సమూహమును పాటింపవలెను. కాని శౌచాది నియమములను శక్త్యనుసారముగను, ఆత్మజ్ఞానమునకు విరోధము లేకుండగను పాలింపవలెను. జిజ్ఞాసువగు పురుషుడు నా స్వరూపము నెఱింగినవాడు, శాంతుడు నగు గురువును నా స్వరూపునిగనే భావించి సేవింపవలెను.

అమాన్యమత్సరో దక్షో నిర్మమో దృఢసౌహృదః ।
అసత్వరోఽర్థజిజ్ఞాసురనసూయురమోఘవాక్ ॥ 6

గురుసేవకు డగువాడు నిరభిమానియు, అహంకారశూన్యుడును, అసత్యరహితుడును, విషయమమతా రహితుడును, గురువుపై దృఢమైన ప్రేమగలవాడును, అవ్యగ్రుడును, తత్త్వజ్ఞానకాంక్షియును, అసూయారహితుడును, వ్యర్థసంభాషణలేనివాడును నయియుండవలెను.

జాయాపత్యగృహక్షేత్రస్వజనద్రవిణాదిషు ।
ఉదాసీనః సమం పశ్యన్ సర్వేష్వర్థమివాత్మనః ॥ 7

అంతట సమప్రయోజనదర్శియై భార్యా పుత్రిలు, గృహము, క్షేత్రము, బంధువులు, ధనము మున్నగు విషయములయం దుదాసీనుడయి యుండవలెను

విలక్షణః స్థూలసూక్ష్మాద్దేహాదాత్మేక్షితా స్వదృక్ ।
యథాగ్నిర్దారుణో దాహ్యాద్దాహకోఽన్యః ప్రకాశకః ॥ 8

దాహకము, ప్రకాశకము నగు నగ్ని దాహ్యముక ప్రకాశ యోగ్యము నగు కాష్ఠమునకంటె భిన్నమైనట్లు ద్రష్ట, ప్రకాశశీలము నగు ఆత్మవస్తువు స్థూలసూక్ష్మదేహముల రెండింటికంటెను విలక్షణము, భిన్నమునని తెలిసికొనవలెను.

నిరోధోత్పత్త్యణుబృహన్నానాత్వం తత్కృతాన్ గుణాన్ ।
అన్తఃప్రవిష్ట ఆధత్త ఏవం దేహగుణాన్ పరః ॥ 9

కాష్ఠాది పదార్థాంతర్గతమగు నగ్ని, కాష్ఠ నిర్మితమైన ఆవరణము, ప్రకాశము, అణుత్వము, మహత్త్వము మున్నగు నానావిధములగు భావములను గ్రహించునట్లు దేహమునందు ప్రవేశించిన జీవాత్మగూడ వివిధ దేహ ధర్మములను స్వీకరించియుండును.

యోఽసౌ గుణైర్విరచితో దేహోఽయం పురుషస్య హి ।
సంసారస్తన్నిబన్ధోఽయం పుంసో విద్యాఛిదాత్మనః ॥ 10

ఈశ్వరాధీనమయిన మాయచే సూక్ష్మదేహము, స్థూలదేహము సృష్టింపబడినవి. వాని యధ్యాస (భ్రమ) వలననే జీవునకు ప్రాపంచిక దశ యేర్పడినది కనుక ఆత్మజ్ఞానమే యీ ప్రాపంచిక దశను పోగొట్టగలదు

తస్మాజ్జిజ్ఞాసయాఽఽత్మానమాత్మస్థం కేవలం పరమ్ ।
సంగమ్య నిరసేదేతద్వస్తుబుద్ధిం యథాక్రమమ్ ॥ 11

అందువలన జిజ్ఞాసతో కార్యకారణ సమష్టి స్థిత శుద్ధ పరమాత్మ వస్తువును దెలిసికొని యథాక్రమముగ నీ స్థూల సూక్ష్మదేహవిషయకమగు వస్తుజ్ఞానము ను బరిత్యజింపవలెను.

ఆచార్యోఽరణిరాద్య స్స్యాద న్తేవాస్యు త్తరారణిః ।
తత్సంధానం ప్రవచనం విద్యాసన్ధిః సుఖావహః ॥ 12

ఆచార్యదేవుడు క్రింద నున్న అరణి, శిష్యుడు పైనున్న అరణి. ఉపదేశవాక్యము నడుమ నున్న మంథనకాష్ఠము. వాని సంయోగముచే నుత్పన్నమగు జ్ఞానమే అగ్నితుల్యమై అజ్ఞానమును దగ్ధముచేసి సుఖజనకమగును.

వైశారదీ సాతివిశుద్ధబుద్ధి-
ర్ధునోతి మాయాం గుణసంప్రసూతామ్ ।
గుణాంశ్చ సన్దహ్య యథాత్మమేతత్
స్వయం చ శామ్యత్యసమిద్యథాగ్నిః ॥ 13

నిపుణుడయిన గురువుచే నుపదిష్టమగు అతివిశుద్ధజ్ఞానము గుణజాతమగు మాయను నివారించి యీ విశ్వమునకు కారణస్వరూపమైన గుణసమూహమును దగ్ధముచేసి విషయాభావమునందు ఇంధనశూన్యమైన అగ్నివలె స్వయముగ నివృత్తమగును.

అథైషాం కర్మకర్తౄణాం భోక్తౄణాం సుఖదుఃఖయోః।
నానాత్వమథ నిత్యత్వం లోకకాలాగమాత్మనామ్ ॥ 14
మన్యసే సర్వభావానాం సంస్థా హ్యౌత్పత్తికీ యథా ।
తత్తదాకృతిభేదేన జాయతే భిద్యతే చ ధీః ॥ 15
ఏవమప్యంగ సర్వేషాం దేహినాం దేహయోగతః ।
కాలావయవతః సన్తి భావా జన్మాదయోఽసకృత్ ॥ 16

ఉద్ధవా ! నీవెప్పుడయిన కర్మల జేయు జీవుల నానాత్వమును, సుఖ దుఃఖముల ననుభవించు జీవుల నానాత్వమును, జగత్తును, కాలమును, భోగప్రతిపాదక శాస్త్రములను, ఆత్మలను నిత్యములని తలంచుచో; దానితో పాటు ప్రక్చందనవనితాది సర్వపదార్థముల స్థితిని నిత్యము యథార్థమునని భావించినచో ; ఘటపటాద్యాకృతి భేదముచే విషయ జ్ఞాన ముత్పన్న మగుననియు, మారుచుండుననియు భావించినచో జీవుల దేహ సంవత్సరాది కాలావయవ సంబంధముచే కలుగు జనన మరణాద్యవస్థలను గూడ తప్పక నంగీకరింపవలెను,

అత్రాపి కర్మణాం కర్తురస్వాతన్త్ర్యం చ లక్ష్యతే ।
భోక్తుశ్చ దుఃఖసుఖయోః కోన్వర్థో వివశం భజేత్ ॥ 17

ఇక్కడ గూడ కర్మలను జేయు పురుషుడు, సుఖదుఃఖముల ననుభవించుటవలన పరతంత్రుడే యైనట్లు అగపడుచున్నాడు ( ఒకవేళ యతడు స్వతంత్రుడగుచో దుఃఖఫలానుభవము నేల కోరును ? ) కావున పరాధీనవ్యక్తి కెట్టి పురుషార్థము సిద్ధింపదు.

న దేహినాం సుఖం కించిద్విద్యతే విదుషామపి ।
తథా చ దుఃఖం మూఢానాం వృథాహంకరణం పరమ్॥ 18

కర్మకుశలురయిన విద్వాంసులకుగూడ ఎల్లప్పుడు సుఖమే లభింప నట్లును, మూఢుల కెప్పుడును దుఃఖమే కలుగనట్లును మనము చూచు చుందుము. కావున అహంకరించుట తగదు.

యది ప్రాప్తిం విఘాతం చ జానన్తి సుఖదుఃఖయోః ।
తేఽప్యద్ధా న విదుర్యోగం మృత్యుర్న ప్రభవేద్యథా ॥ 19

వారు సుఖప్రాప్తికి, దుఃఖ నాశనమునకు నుపాయముల దెలిసి

కొని రవిభావించినను, మృత్యువు వారిపై నెట్టి ప్రభావమును జూపకుండు టకు దగిన ఉపాయముల నెఱుగరని భావింపవలసివచ్చును.

కో న్వర్థః సుఖయ త్యేనం కామో వా మృత్యుర న్తికే।
ఆఘాతం నీయమానస్య వధ్యస్యేవ న తుష్టిదః ॥ 20

మృత్యువు సమీపమున నున్న వాని కెట్టి భోగపదార్థములును సుఖ మును గలిగింపవు వధ్య స్థానమునకు గొనిపోవుచున్న మానవునకు స్రక్చందనాది పదార్థములు సంతుష్టిని చేకూర్పవు గదా ।

శ్రుతం చ దృష్టవద్దుష్టం స్పర్ధాసూయాత్యయవ్యయైః ।
బహ్వ న్తరాయకామత్వాత్కృషివచ్చాపి నిష్ఫలమ్ ॥ 21

స్వర్గాది సుఖములు గూడ స్పర్ధ, అసూయ, నాశము, క్షయము నను దోష సమూహాచే దూషితము లయినవి. అందువలన నవి యైహిక సుఖములవలె దుఃఖజనకములు. ముఖ్యముగ వానిని సాధించు యజ్ఞాది కర్మలు కృషికర్మలవలె అధికముగ విఘ్న యుక్తములు గావున నిష్ఫ లములే యగును

అ న్తరాయైరవిహతో యది ధర్మః స్వనుష్ఠితః ।
తేనాపి నిర్జితః స్థానం యథా గచ్ఛతి తచ్ఛృణు ॥ 22

యజ్ఞయాగాది ధర్మము లెట్టి విఘ్నములు లేకుండగ నెరవేరినచో వానిద్వారా లభించు స్వర్గాది లోకము లెట్లు నశించునో చెప్పెదను, వినుము.

ఇష్ట్వేహ దేవతా యజ్ఞైః స్వర్లోకం యాతి యాజ్ఞికః ।
భుంజీత దేవవ త్తత్ర భోగాన్ దివ్యాన్ నిజార్జితాన్ ॥ 23

యజ్ఞముల జేయు పురుషు డీలోకములో యజ్ఞముల ద్వారా దేవతల నారాధించి స్వర్గమును బొందును. అచట తాను పుణ్యకర్మలచే నార్జించిన దివ్యభోగములను దేవతలవలె ననుభవించును.

స్వపుణ్యోపచితే శుభ్రే విమాన ఉపగీయతే ।
గన్ధర్వైర్విహరన్ మధ్యే దేవీనాం హృద్యవేషధృక్ ॥ 24

మనోహరమగు వేషమును ధరించి, తాను సంపాదించిన పుణ్యముతో సర్వభోగసంపన్నుడయి, ప్రకాశించు విమానము నధిరోహించి దేవతా స్త్రీల నడుమ విహరించుచు, గంధర్వ గణములచే కీర్తింపబడుచుండును.

స్త్రీభిః కామగయానేన కింకిణీజాలమాలినా ।
క్రీడన్ న వేదాత్మపాతం సురాక్రీడేషు నిర్వృతః ॥ 25

చిరుగంటల సమూహముచే శోభించుచు, స్వేచ్ఛా విహారము చేయు విమానములో దేవతా స్త్రీలతో గలసి హృష్టచిత్తుడై కూర్చుండి నందన వనము మున్నగు విహారస్థలములలో క్రీడించుచుండును. దానిచే భోగాంతమున తప్పక పతనము సంభవించునని గూడ అత డాలోచింపడు.

తావత్ సమోదతే స్వర్గే యావత్ పుణ్యం సమాప్యతే ।
క్షీణపుణ్యః పతత్యర్వాగనిచ్ఛన్ కాలచాలితః ॥ 26

పుణ్య మున్నంతవఱకే స్వర్గములో నున్న పురుషుడు స్వర్గ సుఖముల ననుభవించును. అనంతరము పుణ్యము క్షీణించినంతనే యిష్టము లేకపోయినను కాలచాలితుడయి క్రింద పడిపోవును.

యద్యధర్మరతః సంగాదసతాం వా జితేన్ద్రియః ।
కామాత్మా కృపణో లుబ్ధః స్త్రైణో భూతవిహింసకః ॥ 27

పశూనవిధినాఽఽలభ్య ప్రేతభూతగణాన్ యజన్ ।
నరకానవశో జన్తుర్గత్వా యాత్యుల్బణం తమః ॥ 28

మానవుడు దుష్టసహవాసమున నుండి అధర్మపరాయణు డగును, ఇంద్రియములకు వశుడయి ఇష్టము వచ్చినట్లు ప్రవర్తించును. లోభ బుద్ధిచే దానధర్మముల జేయక కృపణు డగును, లంపటు డగును. ప్రాణి హింస జేయును, శాస్త్ర విరుద్ధముగ పశువులను బలి యిచ్చి భూత ప్రేత పిశాచముల నుపాసించును. అప్పు డతడు పశువులకంటెను హీనుడయి తప్పక నరకమున బడును. చివరకు ఘోరమగు నంధకారము, స్వార్థ పరమార్థ రహితము నగు అజ్ఞానముతో గూడి సంచరింపవలసి వచ్చును.

కర్మాణి దుఃఖోదర్కాణి కుర్వన్ దేహేన తైః పునః ।
దేహమాభజతే తత్ర కిం సుఖం మర్త్యధర్మిణః ॥ 29

ఈ దేహముచే జేయబడు కర్మ లన్నియు దుఃఖజనకములే. అవి మాటిమాటికి జనన మరణ పరంపరలను గలుగజేయుచుండును. ఇట్టి స్థితిలో మరణశీలుడగు జీవునకు సుఖ మెట్లు కలుగును ?

లోకానాం లోకపాలానాం మద్భయం కల్పజీవినామ్ ।
బ్రహ్మణోఽపి భయం మత్తో ద్విపరార్ధపరాయుషః ॥ 30

లోకములయొక్క, లోకపాలురయొక్క ఆయుర్దాయము గూడ ఒక కల్పము వఱకె. అందువలన వారు నన్ను జూచి భయపడుచుందురు. అంతేకాక రెండు పరార్ధముల ఆయుర్దాయము గల బ్రహ్మ గూడ నన్ను జూచి భయపడును.

గుణాః సృజంతి కర్మాణి గుణోఽనుసృజతే గుణాన్ ।
జీవస్తు గుణసంయుక్తో భుంక్తే కర్మఫలాన్యసౌ ॥ 31

ఇంద్రియము లన్నియు పుణ్యపాపాత్మక కర్మల ననుష్ఠించును. సత్త్వాదిగుణములు సర్వేంద్రియములను వాని కర్మలయందు ప్రవృత్త మగు నట్లు చేయును. అహంకారయుత జీవుడు ఇంద్రియముల ద్వారా కర్మ ఫలము నంతటిని అనుభవించును.

యావత్స్యాద్గుణవైషమ్యం తావన్నానాత్వమాత్మనః ।
నానాత్వమాత్మనో యావత్ పారతంత్ర్యం తదైవ హి॥ 32

అహంకారాది సృష్టిలో సత్త్వాది గుణములకు వైషమ్య మున్నంత వఱకు జీవునకు దేవతిర్యగాది వివిధ రూపములు కలుగును. జీవున కట్టి నానారూపము లున్నంతవఱకు కర్మాధీనత్వ ముండును.

యావదస్యాస్వతంత్రత్వం తావదీశ్వరతో భయమ్ ।
య ఏతత్సముపాసీరంస్తే ముహ్యంతి శుచార్పితాః ॥ 33

జీవుడు కర్మాధీనుడయి యున్నంతవఱకు కర్మ ఫల దాత నగు నావలన వానికి సాంసారిక భయ ముండును ఈ గుణ వైషమ్యమును, దానిచే గలుగు భోగములను, కర్మలను సేవించు జీవు లందఱు శోక మోహగ్రస్తు లగుదురు.

కాల ఆత్మాఽఽగమో లోకః స్వభావో ధర్మ ఏవ చ ।
ఇతి మాం బహుధా ప్రాహుర్గుణవ్యతికరే సతి ॥ 34

సత్త్వాది గుణములు క్షుబ్ధ మైనపుడు మానవులు నన్ను కాలము, ఆత్మ, ఆగమము, లోకము, స్వభావము, ధర్మము మున్నగు వివిధ నామములతో పిలచెదరు.

## ఉద్ధవ ఉవాచ.

గుణేషు వర్తమానోఽపి దేహజేష్వనపావృతః ।
గుణైర్న బధ్యతే దేహీ బధ్యతే వా కథం విభో ॥ 35

**ఉద్ధవుడు పలికెను :** దేవా ! జీవుడు దేహాదిగుణములలో నున్నప్పటికిని గుణాదులవలన గలుగు సుఖాదుల కేలబద్ధుడు గాడు? లేదా గుణములచే నావరింపబడనపుడు ఏల బద్ధు డగును ?

కథం వర్తేత విహరేత్ కైర్వా జ్ఞాయేత లక్షణైః।
కిం భుంజీతోత విసృజేచ్ఛయీతాసీత యాతి వా ॥ 36

బద్ధుడు లేదా ముక్తుడు నగుపురుషుడు ఎట్లుండును ? అత డెట్లు విహరించును, ఏలక్షణములతో గుర్తింపబడును? ఎట్లు భుజించును? మలము నెట్లు విసర్జించును ? ఎట్లు శయనించును? ఎట్లు కూర్చుండును: ఎట్లు నడచును?

ఏతదచ్యుత మే బ్రూహి ప్రశ్నం ప్రశ్నవిదాం వర !
నిత్యముక్తో నిత్యబద్ధ ఏక ఏవేతి మే భ్రమః ॥ 37

అచ్యుతా! ప్రశ్నమర్మము నెఱుంగువారిలో నీవు శ్రేష్ఠుడవు. నీవు నా యీప్రశ్నకు సమాధాన మిమ్ము. ఒకేయాత్మ ఏవిధముగ నిత్యబద్ధము, నిత్యముక్తము నగును? ఈవిషయమున నాకు గలభ్రమను సమాధాన మిచ్చి తొలగింపుము.

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే పారమహంస్యాం
సంహితాయా మేకాదశ స్కంధే
భగవదుద్ధవ సంవాదే
దశమోఽధ్యాయః

ఈ విధముగ శ్రీ మద్భాగవత మహాపురాణము
నందలి యేకాదశస్కంధములోని పదియవ
అధ్యాయము సమాప్తము.

# పదునొకండవ అధ్యాయము

## బద్ధ ముక్త భక్త జనుల లక్షణములు.

### శ్రీ భగవానువాచ.

బద్ధోముక్త ఇతి వ్యాఖ్యా గుణతో మే న వస్తుతః ।
గుణస్య మాయామూలత్వాన్న మే మోక్షో న బంధనమ్॥ 1

**భగవానుడు పలికెను:** మదధీనములైన సత్వాది గుణో పాధులవలననే ఆత్మ బద్ధము, ముక్తమునని చెప్పబడును వాస్తవములో నాత్మకు బంధమోక్షములు లేవు. గుణములు మాయాకార్యము లగుటవలన నాకు బంధమోక్షములు లేవు.

శోకమోహౌ సుఖం దుఃఖం దేహోపత్తిశ్చ మాయయా ।
స్వప్నో యథాఽఽత్మనః ఖ్యాతిః సంసృతిర్నతు వాస్తవీ॥ 2

స్వప్నము బుద్ధియొక్క వివర్తమైనట్లు శోక మోహ సుఖ దుఃఖ ములు, దేహమునకు సంబంధించిన జనన మరణములు మాయికగుణము లని తెలిసికొనుము. వాస్తవములో వీనికెట్టి సత్తయు లేదు.

విద్యావిద్యే మమ తనూ విద్ధ్యుద్ధవ శరీరిణామ్ ।
మోక్షబన్ధకరీ ఆద్యే మాయయా మే వినిర్మితే ॥ 3

ఉద్ధవా! విద్య, అవిద్య అను నీ రెండు పదార్థములు మదీయ రచితములు, అనాదులు, మదీయశక్తిస్వరూపములు. జీవుల బంధ మోక్ష ముల కివియే కారణములని తెలిసికొనుము.

ఏకస్యైవ మమాంశస్య జీవస్యైవ మహామతే ।
బన్ధోఽస్యావిద్యయానాదిర్విద్యయా చ తథేతరః ॥ 4

మహామతీ! అద్వితీయస్వరూపుడ నగు నా అంశభూతులు, అనాదులు నగు జీవులకు అవిద్యవలన బంధమును, విద్యవలన మోక్షమును కలుగును.

అథ బద్ధస్య ముక్తస్య వైలక్షణ్యం వదామి తే ।
విరుద్ధధర్మిణోస్తాత స్థితయోరేక ధర్మిణి ॥ 5

ఉద్ధవా! ఒకే శరీరమునందున్నవారు, విరుద్ధ ధర్మములైన సుఖదుఃఖములచే గూడినవారు నగు బద్ధ ముక్త జీవుల వైలక్షణ్యమును వర్ణింతును

సుపర్ణావేతౌ సదృశౌ సఖాయౌ
యదృచ్ఛయైతౌ కృతనీడౌ చ వృక్షే ।
ఏకస్తయోః ఖాదతి పిప్పలాన్న-
మన్యో నిరన్నోఽపి బలేన భూయాన్ ॥ 6

చిద్రూపత్వతుల్యులు, అవియోగైకమత్య హేతువులవలన సఖ్యభావాపన్నులు నగు జీవేశ్వరపక్షులు రెండును స్వేచ్ఛగ దేహవృక్షము మీదకు వచ్చి హృదయమను గూటిలో నివసించుచున్నవి. వానిలో నొకటి అనగా జీవరూప పక్షి దేహమను నశ్వత్థ వృక్షముయొక్క కర్మ ఫలము ననుభవించుచుండును. రెండవది అనగా నీశ్వరరూపపక్షి ఫలము ననుభవింపక జ్ఞానాదిశక్తిబలముచే సమధికముగ విరాజిల్లుచుండును.

ఆత్మానమన్యం చ స వేద విద్వా-
నపిప్పలాదో న తు పిప్పలాదః ।
యోఽవిద్యయా యుక్ స తు నిత్యబద్ధో
విద్యామయో యః స తు నిత్యముక్తః ॥ 7

కర్మ ఫలము ననుభవింపనివాడును, నిత్యజ్ఞానాశ్రయుడును నగు నీశ్వరుడు తన తత్త్వమును, జీవుని తత్త్వమును నెఱుగును. కర్మ ఫల భోక్తయగు జీవుడు తన స్వరూపమునుగాని, తనకంటె నతిరిక్తమయిన దాని స్వరూపమునుగాని యెఱుంగజాలడు. అవిద్యాయుతు డగు జీవుడు అనాదిబద్ధుడు ; విద్యాప్రధానుడగు నీశ్వరుడు అనాదిముక్తుడు.

దేహస్థోఽపి న దేహస్థో విద్వాన్ స్వప్నాద్యథోత్థితః ।
అదేహస్థోఽపి దేహస్థః కుమతిః స్వప్నదృగ్యథా ॥ 8

ముక్త పురుషుడు సంస్కారమువలన దేహమునందుండియు స్వప్నమునుండి లేచిన (జాగృతుడైన) పురుషునివలె దేహగతములయిన సుఖదుఃఖముల ననుభవింపడు. కాని బద్ధపురుషుడు సహజముగ దేహగత సుఖదుఃఖముల ననుభవింపని వాడయినను స్వప్నదర్శియగు పురుషునివలె దేహగతములయిన సుఖదుఃఖముల ననుభవించును.

ఇంద్రియైరింద్రియార్థేషు గుణైరపి గుణేషు చ ।
గృహ్యమాణేష్వహం కుర్యాన్న విద్వాన్ యస్త్వవిక్రియః ॥ 9

రాగద్వేషాది రహితుడు, విద్వాంసుడు నగు వ్యక్తి గుణములవలన గలిగిన నింద్రియసమూహముచే గుణజాతములగు విషయములను గ్రహించినను 'నేను గ్రహించుచున్నా'నని యహంకరింపడు.

దైవాధీనే శరీరేఽస్మిన్ గుణభావ్యేన కర్మణా ।
వర్తమానోఽబుధస్తత్ర కర్తాస్మీతి నిబధ్యతే ॥ 10

అజ్ఞానియగు మానవుడు ప్రాక్తనకర్మాధీనమైన శరీరమునందుండి

'నేను కర్త' నని యహంకరించుటచేత గుణజాతములగు కర్మలద్వారా దేహాదులలో బంధింపబడి యుండును.

ఏవం విరక్తః శయనే ఆసనాటనమజ్జనే
దర్శన స్పర్శన ఘ్రాణ భోజన శ్రవణాదిషు ।
న తథా బధ్యతే విద్వాంస్తత్ర తత్రాదయన్
గుణాన్ ॥ 11

ఉద్ధవా! వైరాగ్యయుక్తుడు, వివేకవంతుడు నగు పురుషుడు శయనము, ఉపవేశము, భ్రమణము, స్నానము, దర్శనము, స్పర్శ, ఘ్రాణము, భోజనము, శ్రవణము మున్నగు క్రియల నింద్రియములచే ననుభవింపజేయునుగాని తాను అజ్ఞానివలె బద్ధుడు గాడు.

ప్రకృతిస్థోఽప్యసంసక్తో యథాఖం సవితానలః ।
వైశారద్యేక్షయాసంగశితయా ఛిన్నసంశయః ।
ప్రతిబుద్ధ ఇవ స్వప్నాన్నానాత్వాద్వినివర్తతే ॥ 12–13

ఆకాశమంతట నిండియున్నను, సూర్యుడు జలమున ప్రతిబింబించుచున్నను, వాయు వంతట వీచుచున్నను, ఎచ్చటను లగ్నము కానట్లు విద్వాంసుడగు పురుషుడు ప్రకృతియందున్నను దానియందాసక్తుడు గాక వైరాగ్యమను అస్త్రముచేత, మిక్కిలి నిపుణమగు స్వరూపజ్ఞానముచేత సర్వసంశయములను ఛేదించి స్వప్నమునుండి మేలుకొనిన పురుషునివలె దేహాదిప్రపంచమునుండి నివృత్తుడగును.

యస్య స్యుర్వీతసంకల్పాః ప్రాణేంద్రియమనోధియామ్ ।
వృత్తయః స వినిర్ముక్తో దేహస్థోఽపి హి తద్గుణైః ॥ 14

ఏ మానవుని ప్రాణములు, ఇంద్రియములు, మనస్సు, బుద్ధి విషయ

ములు సంకల్పము లేనివై యుండునో అట్టివాడు దేహమునందున్నను దాని గుణములకు కట్టుబడియుండడు.

యస్యాత్మా హింస్యతే హింస్రైర్యేన కించిద్యదృచ్ఛయా।
అర్చ్యతే వా క్వచి త్తత్ర న వ్యతిక్రియతే బుధః ॥ 15

శరీరమును దుర్జనులు, లేదా క్రూరులు పీడించినను, మఱి యెవ్వరయిన పూజించినను అతడు కోపింపడు, సంతోషమును బొందడు. అట్టివాడు ముక్తపురుషుడుగా పరిగణింపబడును.

న స్తువీత న నిన్దేత కుర్వతః సాధ్వసాధు వా ।
వదతో గుణదోషాభ్యాం వర్జితః సమదృఙ్మునిః ॥ 16

లౌకిక వ్యవహార విముఖుడును, సమదర్శియు నగు మహాత్ముడు సత్కర్మలనుగాని అసత్కర్మలనుగాని చేయువారిని భూషింపడు ; దూషింపడు. అట్లే సద్వాక్యములనుగాని అసద్వాక్యములనుగాని పలుకువారినిగూడ స్తుతింపడు ; నిందింపడు. అట్టివాడే ముక్తపురుషుడు.

న కుర్యాన్న వదేత్కించిన్న ధ్యాయేత్సాధ్వసాధు వా।
ఆత్మారామోఽనయా వృత్త్యా విచరేజ్జడవన్మునిః ॥ 17

ముక్తపురుషుడు దేహమునకై సదసద్విషయముల వేనిని గూడ ఆచరింపడు, ఉచ్చరింపడు, ఆలోచింపడు. అంతట ఉదాసీనభావము గలిగి ఆత్మానంద స్వరూపుడై జడునివలె సంచరించుచుండును.

శబ్దబ్రహ్మణి నిష్ణాతో న నిష్ణాయాత్పరే యది ।
శ్రమ స్తస్య శ్రమఫలో హ్యధేనుమివ రక్షతః ॥ 18

శబ్దబ్రహ్మమునందు అనగా వేదవిషయమునందు పారంగతు డయినను భగవత్తత్త్వమును దెలిసికొనలేని వాడయినచో పాల నీయని ఆవును

పెంచు గొల్లవానివలె వాని శాస్త్రజ్ఞానమంతయు వ్యర్థమే యగును. అది యెట్టి పురుషార్థము నీయదు.

గాం దుగ్ధదోహామసతీం చ భార్యాం
దేహం పరాధీనమసత్ప్రజాం చ ।
విత్తం త్వతీర్థీకృతమంగ వాచం
హీనాం మయా రక్షతి దుఃఖదుఃఖీ ॥ 19

పాల నీయని ఆవు, వ్యభిచారిణి యగు స్త్రీ, పరాధీన శరీరము, దుష్ట పుత్రుడు, సత్పాత్రుడు లభించినను దానము చేయని ధనము, నా గుణములు లేని వాక్కు వ్యర్థము. ఈ వస్తువుల కాపాడువాడు కష్టములమీద కష్టముల ననుభవించును.

యస్యాం న మే పావనమంగ కర్మ
స్థిత్యుద్భవప్రాణనిరోధమస్య ।
లీలావతారేప్సిత జన్మ వా స్యా-
ద్వన్ధ్యాం గిరం తాం బిభృయాన్న ధీరః ॥ 20

అందువలన జగదుత్పత్తి స్థితి ప్రళయరూపమగు నా లోకపావనలీలా వర్ణనము లేనిదియు, లీలావతారములలో లోకప్రియములయిన నా రామ కృష్ణాద్యవతారముల స్తుతి లేనిదియు నగు వాక్కు వంధ్య యగును. బుద్ధిమంతుడగు పురుష డిట్టి వాక్కు నుచ్చరించుటగాని, శ్రవణము చేయుట గాని కూడదు.

ఏవం జిజ్ఞాసయాపోహ్య నానాత్వభ్రమమాత్మని ।
ఉపారమేత విరజం మనో మయ్యర్ప్య సర్వగే ॥ 21

ఇట్టి నిశ్చయముతో గూడిన ఆలోచనతో ఆత్మ విషయమున దేహా

ధ్యానను నివారించి సర్వగతుడ నగు నా యందు నిర్మలమగు మనస్సు వర్పించి శాంతిని బొందుము.

యద్యనీశో ధారయితుం మనో బ్రహ్మణి నిశ్చలమ్ ।
మయి సర్వాణి కర్మాణి నిరపేక్షః సమాచర ॥ 22

ఉద్ధవా ! మనస్సును బ్రహ్మమునందు స్థిరముగ నుంచలేనిచో నిత్యనైమిత్తిక కర్మల నన్నింటిని నిరపేక్షముగా నన్నుద్దేశించియే చేయుము.

శ్రద్ధాళుర్మత్కథాః శృణ్వన్ సుభద్రా లోకపావనీః ।
గాయన్ననుస్మరన్ కర్మ జన్మ చాభినయన్ ముహుః ॥ 23

సర్వలోకములను పవిత్రము జేయునట్టి నా కథలను శ్రద్ధతో వినవలెను మాటిమాటికి నా యవతారములను, లీలలను గానము చేయవలెను, స్మరింపవలెను ; అభినయింపవలెను.

మదర్థే ధర్మకామార్థానాచరన్ మదపాశ్రయః ।
లభతే నిశ్చలాం భక్తిం మయ్యుద్ధవ సనాతనే ॥ 24

ఉద్ధవా ! నన్నాశ్రయించి నాకొఱకు ధర్మకామార్థములను సేవింపవలెను. ఇట్లాచరించిన వానికి సనాతన పురుషుడనగు నాపై అనన్యమగు ప్రేమభక్తి కలుగును.

సత్సంగలబ్ధయా భక్త్యా మయి మాం స ఉపాసితా ।
స వై మే దర్శితం సద్భిరంజసా విన్దతే పదమ్ ॥ 25

అట్టి భక్తుడు సత్సంగమువలన నాయందు భక్తిగలవాడయి నన్ను ధ్యానించును. తరువాత ధ్యానయోగముచే అనాయాసముగ మహాజనులు చూపిన నా స్వరూపమును బొందును.

## ఉద్ధవ ఉవాచ

సాధుస్త్వయో త్తమశ్లోకమతః కీదృగ్విధః ప్రభో ।
భక్తిస్త్వయ్యుపయుజ్యేత కీదృశీ సద్భిరాదృతా ॥ 26

**ఉద్ధవుడు పలికెను :—** దేవా! నీ కీర్తి నెందఱో సత్పురుషులు గానము చేయుచుందురు. నీ వెట్టివారిని సాధువులని యందువు? సత్పురుష లాదరించునట్టి యెట్టి భక్తిని నీయందు చూపవలెను?

ఏతన్మే పురుషాధ్యక్ష లోకాధ్యక్ష జగత్ప్రభో ।
ప్రణతాయానురక్తాయ ప్రపన్నాయ చ కథ్యతామ్ ॥ 27

దేవా! నీవు పురుష శ్రేష్ఠుడవు, సర్వజగత్తునకు స్వామివి. ప్రణతుడను, అనురక్తుడను, శరణాగతుడను నగునాకు పై దాని నంతటిని జెప్పుము.

త్వం బ్రహ్మ పరమం వ్యోమ పురుషః ప్రకృతేః పరః ।
అవతీర్ణోఽసి భగవన్ స్వేచ్ఛోపాత్తపృథగ్వపుః ॥ 28

దేవా! నీవు ప్రకృతి కతీతుడవు, ఆకాశమువలె నిర్లిప్తుడవు, పరబ్రహ్మస్వరూపుడవు. ఐనను భక్తులకై నీయిచ్ఛననుసరించి భిన్న భిన్నములగు రూపముల ధరించి యీభూమిపై నవతరించుచున్నావు

## శ్రీ భగవానువాచ

కృపాలురకృతద్రోహ స్తితిక్షుః సర్వదేహినామ్ ।
సత్యసారోఽనవద్యాత్మా సమః సర్వోపకారకః ॥ 29

**భగవానుడు పలికెను :—** ఉద్ధవా! నా భక్తుడు కృపామూర్తి యగును. అతడే ప్రాణిమీదను విరోధమును జూపడు. కఠినాతి

కఠినము లైనకష్టములనుగూడ సంతోషముతో ననుభవించును. వాని జీవితసారము సత్యము. వాని మనస్సులో నెట్టిపాపవాసనయు నుండదు. అతడు సమదర్శి. అందఱకు మేలుచేయునట్టివా డగును.

కామైరహతధీర్దాన్తో మృదుః శుచిరకించనః ।
అనీహోమితభుక్శాంతః స్థిరో మచ్ఛరణో మునిః ॥ 30

వానిబుద్ధి కామవాసనలచే కలుషితము కాదు, అతడు సంయమి, మధురస్వభావుడు, పవిత్రుడు, అకించనుడు, లౌకికక్రియారహితుడు, మితభోజి, శాంతుడు, స్థిరుడు, మననశీలుడు నై యుండును

అప్రమత్తో గభీరాత్మా ధృతిమాన్ జిత షడ్గుణః ।
అమానీ మానదః కల్యో మైత్రః కారుణికః కవిః ॥ 31

అతడు ప్రమాదరహితుడు, గంభీరస్వభావుడు, ధైర్యవంతుడు నగును. అకలి, దప్పిక, శోకము, మోహము, జననము, మరణము నను నాలుగుణములను నతడు వశముచేసికొని యుండును. అతడు స్వయముగ నెవరినుండి యేవిధ మగుసమ్మానమును గోరడు, కాని తా నితరులను చక్కగ గౌరవించును నా విషయముల నితరులకు వివరించుటలో మిగుల నిపుణుడగును. అందఱితోను మిత్రత్వము నెఱపును. వాని హృదయము కరుణతో నిండియుండును. నా తత్త్వమును జక్కగ దెలిసికొనును.

ఆజ్ఞాయైవం గుణాన్ దోషాన్ మయాదిష్టానపి స్వకాన్ ।
ధర్మాన్ సంత్యజ్య యస్సర్వాన్ మాం భజేత స సత్తమః ॥ 32

ఉద్ధవా! నాచేత ఉపదిష్టములైన గుణదోషములను దెలిసికొని, తన సర్వధర్మములను పరిత్యజించి నన్నే సేవించువాడు సత్పురుషుడు.

జ్ఞాత్వా జ్ఞాత్వాథ యే వై మాం యావాన్యశ్చాస్మి
యాదృశః ।
భజన్త్యనన్యభావేన తే మే భక్తతమా మతాః ॥ 33

సచ్చిదానందాది గుణవిశిష్టుడును, అనంతుడును, సర్వాంతర్యామి యును నగునా స్వరూపమును తెలిసికొనిగాని, తెలిసికొనకగాని యేకాంత భావముతో నన్ను సేవించిన వా రుత్తమ భక్తులుగా కీర్తింపబడుదురు.

మల్లింగమద్భక్తజనదర్శనస్పర్శనార్చనమ్ ।
పరిచర్యా స్తుతిః ప్రహ్వగుణకర్మానుకీర్తనమ్ ॥ 34

ఉద్ధవా! నా మూర్తిని, నాభక్తులను దర్శింపవలెను, స్పృశింపవలెను. సేవింపవలెను, స్తుతింపవలెను, నమస్కరింపవలెను. నా గుణములను, నా కర్మలను కీర్తింపవలెను.

మత్కథాశ్రవణే శ్రద్ధా మదనుధ్యానముద్ధవ ।
సర్వలాభోపహరణం దాస్యేనాత్మనివేదనమ్ ॥ 35

నాకథను వినుటయందు శ్రద్ధచూపవలెను. నిరంతరము నన్ను ధ్యానించుచుండుము. లభించిన పదార్థమును నాకు సమర్పింపుము దాస్య భావముతో నాకు నాత్మనివేదనము చేయుము.

మజ్జన్మకర్మకథనం మమ పర్వానుమోదనమ్ ।
గీతతాండవవాదిత్రగోష్ఠీభిర్మద్గృహోత్సవః ॥ 36

నా జననమునుగూర్చి, నా కర్మలనుగూర్చి చర్చింపుము. నా సంబంధమైన పండుగలను ఆనందముతో జేసికొనుము. గీత, వాద్య, నృత్య గోష్ఠులద్వారా నా మందిరములలో నుత్సవముల జేయుము, చేయింపుము.

యాత్రాబలివిధానం చ సర్వవార్షికపర్వసు ।
వైదికీ తాంత్రికీ దీక్షా మదీయవ్రతధారణమ్ ॥

వార్షిక పర్వదినములయందు నా స్థానములకు యాత్రచేయు ఉత్సవమును జేయింపుము. వివిధములగు నుపహారములతో పూజింపుము. వైదికము లేదా తాంత్రికపద్ధతితో దీక్షను స్వీకరింపు వ్రతముల నాచరింపుము.

మమార్చాస్థాపనే శ్రద్ధా స్వతః సంహత్య చోద్యమః
ఉద్యానోపవనాక్రీడపురమందిరకర్మణి ॥

ఆలయములలో నా మూర్తులను ప్రతిష్ఠించుట యందు జూపుము. ఒంటరిగ పనిని చేయజాలనిచో నితరులతో గలసి చే నాకై పుష్పవాటికలను ఉద్యానవనములను, క్రీడాస్థానములను, లను, ఆలయములను నిర్మింపుము.

సమ్మార్జనోపలేపాభ్యాం సేకమండలవర్తనైః ।
గృహశుశ్రూషణం మహ్యం దాసవద్యదమాయయా

సేవకునివలె శ్రద్ధాభక్తులతో, నిష్కపటభావముతో ను అలుకుట, నీరు చల్లుట, ముగ్గువేయుట మున్నగు పనులద్వారా నా ములకు సేవచేయుము.

అమానిత్వమదంభిత్వం కృతస్యాపరికీర్తనమ్ ।
అపి దీపావలోకం మే నోపయుంజ్యాన్నివేదితమ్ ॥

అభిమానము చూపవలదు, దంభము కూడదు, నీవు చేయు లను వెల్లడింపరాదు. నాకు సమర్పించు దీపపుకాంతులలో నీపని వేర్పుకొనవలదు. అన్యదేవతలకు సమర్పించినదానిని నాకు స వలదు.

యద్యదిష్టతమం లోకే యచ్చాతిప్రియమాత్మనః ।
తత్తన్నివేదయేన్మహ్యం తదానన్త్యాయ కల్పతే ॥ 41

లోకములో నీకు నన్నింటికంటె ప్రియము, అభీష్టము నగువస్తువును నాకు సమర్పింపుము. ఇట్లు చేసినచో నావస్తువు అనంతఫల మిచ్చునట్టి దగును.

సూర్యోఽగ్నిర్బ్రాహ్మణో గావో వైష్ణవః ఖం మరుజ్జలమ్।
భూరాత్మా సర్వభూతాని భద్ర పూజాపదాని మే ॥ 42

భద్రా ! సూర్యుడు, అగ్ని, బ్రాహ్మణుడు, గోవు, వైష్ణవులు, ఆకాశము, వాయువు, జలము, పృథివి, ఆత్మ, సర్వప్రాణులు — ఇవి యన్నియు నా పూజాస్థానములు.

సూర్యే తు విద్యయా త్రయ్యా హవిషాగ్నౌ యజేత మామ్ ।
ఆతిథ్యేన తు విప్రాగ్ర్యే గోష్వఙ్గ యవసాదినా ॥ 43

ఉద్ధవా ! ఋగ్వేద యజుర్వేద సామవేద మంత్రముల ద్వారా సూర్యునియందు నన్ను పూజింపవలెను. హవనముచే అగ్నిలోను, ఆతిథ్యముచే బ్రాహ్మణశ్రేష్ఠునియందును, పచ్చగడ్డి మున్నగువానిచే గోవులందును నన్ను పూజింపుము.

వైష్ణవే బంధుసత్కృత్యా హృది ఖే ధ్యాననిష్ఠయా ।
వాయౌ ముఖ్యధియా తోయే ద్రవ్యైస్తోయపురస్కృతైః ॥ 44

ఆత్మబంధువు వలె సత్కారముద్వారా వైష్ణవునియందు, నిరంతరము ధ్యానమున మగ్నుడయియుండుటవలన హృదయాకాశమునందు, ముఖ్యప్రాణ మని తెలిసికొనుటచే వాయువునందు, జలము పుష్పము మున్నగు సామగ్రులద్వారా జలమునందు నన్నారాధింపవలెను.

స్థండిలే మంత్రహృదయైర్భోగై రాత్మానమాత్మని ।
క్షేత్రజ్ఞం సర్వభూతేషు సమత్వేన యజేత మామ్ ॥ 45

రహస్యమంత్రములద్వారా మృత్తికానిర్మిత వేదికయందు, తగిన భోగములద్వారా జీవునియందు, సమదర్శనము ద్వారా సర్వభూతముల యందు అంతర్యామిస్వరూపుడ నగు నన్నారాధింపుము.

ధిష్ణ్యేష్విత్యేషు మద్రూపం శంఖచక్రగదామ్బుజైః ।
యుక్తం చతుర్భుజం శాన్తం ధ్యాయన్నర్చేత్సమా
హితః ॥ 46

ఈ ప్రదేశము లన్నింటిలోను శంఖ చక్ర గదా పద్మములతో గూడినది, చతుర్భుజము, శాంతము నగు నా రూపమును ఏకాగ్రచిత్తముతో ధ్యానించుచు పూజింపవలెను.

ఇష్టాపూర్తేన మామేవం యో యజేత సమాహితః ।
లభతే మయి సద్భక్తిం మత్స్మృతిః సాధుసేవయా ॥ 47

ఈ విధముగ నేకాగ్రచిత్తముతో యజ్ఞయాగాదులయిన ఇష్టకర్మల ద్వారా, చెఱువులు బావులు త్రవ్వించుట మున్నగు పూర్తకర్మలద్వారా నన్ను పూజించువానికి శ్రేష్ఠభక్తి లభించును, సత్పురుషసేవవలన మద్విషయక జ్ఞానము కలుగును.

ప్రాయేణ భక్తియోగేన సత్సంగేన వినోద్ధవ ।
నోపాయో విద్యతే సమ్యక్ ప్రాయేణం హి
సతామహమ్ ॥ 48

ఉద్ధవా ! నేను సత్పురుషులకు సంమాశ్రయుడను. అందువలన సత్సంగమువలన గలిగిన భక్తియోగము తప్ప మఱి యే యుపాయము మానవుని సంసారమునుండి తరింపజేయ జాలదు.

అథైతత్పరమం గుహ్యం శృణ్వతో యదునన్దన ।
సుగోప్యమపి వక్ష్యామి త్వం మే భృత్యః సుహృత్సఖా ॥

యదునందనుడ వగు ఉద్ధవా! నీవు నాకు సేవకుడవు, సుహృదుడవు, సఖుడవు. అందువలన దాచదగినదయినను నీ కొఱకు రహస్యమగు విషయమును జెప్పెదను వినుము. 49

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే పారమహంస్యాం
సంహితాయా మేకాదశ స్కన్ధే
భగవదుద్ధవ సంవాదే
ఏకాదశోఽధ్యాయః

ఈ విధముగ శ్రీ మద్భాగవత మహాపురాణము
నందలి యేకాదశస్కంధములోని పదునొకండవ
అధ్యాయము సమాప్తము.



# పండ్రెండవ అధ్యాయము

## సత్సంగ మహిమ : కర్మ విధి :

## కర్మ త్యాగ విధి.

## శ్రీ భగవానువాచ

న రోధయతి మాం యోగో న సాంఖ్యం ధర్మఏవ చ ।
న స్వాధ్యాయ స్తపస్త్యాగో నేష్టాపూర్తం న దక్షిణా ॥ 1
వ్రతాని యజ్ఞశ్ఛన్దాంసి తీర్థాని నియమా యమాః ।
యథావరున్ధే సత్సఙ్గః సర్వసంగాపహో హి మామ్ ॥ 2

భగవానుడు పలికెను :— ఉద్ధవా! సత్సంగము లోకము లోని సర్వవిధములగు నాసక్తులను నాశనము చేయును. ఇది నన్ను వశము చేసికొనునట్లుగ యోగము, సాంఖ్యము, అహింసాది సాధారణ ధర్మానుష్ఠానములు, స్వాధ్యాయము, తపస్సు, సన్న్యాసము, యాగాది ఇష్ట కర్మలు, కూపఖననాదిపూర్త కర్మలు, దక్షిణలు, వ్రతములు, దేవపూజ, సరహస్యమగు మంత్రము, తీర్థములు, యమనియమములు—ఇవియేవియు వశము చేసికొనజాలవు.

సత్సంగేన హి దైతేయా యాతుధానా మృగాః ఖగాః ।
గన్ధర్వాప్సరసో నాగాః సిద్ధాశ్చారణగుహ్యకాః ॥ 3
విద్యాధరామనుష్యేషు వైశ్యాః శూద్రాః
స్త్రియోఽన్త్యజాః ।
రజస్తమః ప్రకృతయ స్తస్మిం స్తస్మిన్ యుగే యుగే ॥ 4
బహవో మత్పదం ప్రాప్తాస్త్వాష్ట్రకాయాధవాదయః ।

వృషపర్వా బలిర్బాణో మయశ్చాథ విభీషణః ॥ ౫
సుగ్రీవో హనుమానృక్షో గజో గృధ్రో వణిక్పథః ।
వ్యాధః కుబ్జా వ్రజే గోప్యో యజ్ఞపత్న్యస్తథాపరే ॥ ౬

ప్రతి యుగమునందును సత్సంగ ప్రభావముచే రజస్తమోగుణ యుక్తులగు దైత్యులు, రాక్షసులు, పక్షులు, మృగములు, గంధర్వులు, అప్సరసలు, నాగులు, సిద్ధులు, చారణులు, గుహ్యకులు. విద్యాధరులు, మనుష్యులలో వైశ్యులు, శూద్రులు, స్త్రీలు, అంత్యజులు, వృత్రాసురుడు, ప్రహ్లాదుడు, వృషపర్వుడు, బలి, బాణుడు, మయుడు, విభీషణుడు, సుగ్రీవుడు, హనుమంతుడు, జాంబవంతుడు, గజేంద్రుడు, జటాయువు, తులాధారుడగు వణిజుడు, ధర్మవ్యాధుడు, కుబ్జ, వ్రజగోపికలు, యజ్ఞానుష్ఠానపరులగు బ్రాహ్మణుల భార్యలు — వీరందరు నా పదమును పొందిరి.

తేనాధీతశ్రుతిగణా నోపాసితమహత్తమాః ।
అవ్రతాతప్తతపసః మత్సంగాన్మాముపాగతాః ॥ ౭

వారు వేదాధ్యయనమును, మహాపురుషసేవను, వ్రతతపోనుష్ఠానములను జేయకయె సత్సంగముచేతనే నన్ను పొందగలిగిరి

కేవలేన హి భావేన గోప్యో గావో నగా మృగాః ।
యేఽన్యే మూఢధియో నాగాః సిద్ధా మామీయురంజసా ॥ ౮

గోపికలు, వ్రజమునందలి గోవులు, యమళార్జునాది వృక్షములు, మృగములు, కాళియప్రభృతి నాగులు, బృందావనమునందలి తరులతా గుల్మాదులు, ఇతరములగు మూఢచిత్తపదార్థములు కేవలము సత్సంగము వలన లభించిన అనన్యభావముచేతనే నన్ను పొందగలిగినవి.

యం న యోగేన సాంఖ్యేన దానవ్రతతపోఽధ్వరైః ।
వ్యాఖ్యాస్వాధ్యాయసన్న్యాసైః ప్రాప్నుయాద్యత్నవానపి॥

కాని యితరులగు వ్యక్తులు యోగము, సాంఖ్యము, దానము, వ్రతము, తపస్సు, యజ్ఞము. మదీయగుణకీర్తనము, వేదాధ్యయనము; ధర్మము మున్నగువానిద్వారా అతిప్రయత్నశీలురయినను నన్ను బొందజాలరు. 9

రామేణ సార్ధం మథురాం ప్రణీతే
శ్వాఫల్కినా మయ్యనురక్తచిత్తాః ।
విగాఢభావేన న మే వియోగ-
తీవ్రాధయోఽన్యం దదృశుః సుఖాయ ॥ 10

అక్రూరుడు బలరామునితో గూడ నన్ను మథురకు దీసికొని వచ్చినపుడు గోపికల హృదయము గాఢప్రేమచే నాయందాసక్తమైయుండెను. ఆ సమయమున విరహమువలన గలిగిన తీవ్రమగు మనస్తాపముచే వారు పీడితులయిరి. నా సమాగమముతప్ప మఱి యే వస్తువు వారి కాసమయమున సుఖమును గలిగింపజాలక పోయినది.

తాస్తాః క్షపాః ప్రేష్ఠతమేన నీతా
మయైవ బృన్దావనగోచరేణ ।
క్షణార్ధవత్తాః పునరంగ తాసాం
హీనామయా కల్పసమా బభూవుః ॥ 11

ఉద్ధవా ! పూర్వము వారు బృందావనమున నున్నపుడు ప్రియతముడ నగు నాతో నెన్నియో రాత్రులను నొక్క అర్ధక్షణముగ గడిపిరి. నాతో నెడబాటు గలిగిన దశలో నా రాత్రు లన్నియు వారి కొక్కొక్క కల్పమువలె సుదీర్ఘములుగా కనబడసాగినవి.

తా నావిదన్ మయ్యనుషంగబద్ధ-
ధియః స్వమాత్మానమద స్తథేదమ్ ।
యథా సమాధౌ మునయోఽబ్ధితోయే
నద్యః ప్రవిష్టా ఇవ నామరూపే ॥ 12

సముద్రప్రవిష్టములగు నదులవలె మునులు సమాధి యోగముచే నామ రూపములను దెలిసికొనలేరు. అట్లే గోపికలు పరమప్రేమతో నాయందే అసక్తచిత్తులై సర్వము మఱచిరి.

మత్కామా రమణం జారమస్వరూపవిదోఽబలాః ।
బ్రహ్మ మాం పరమం ప్రాపుః సంగాచ్ఛతసహస్రశః ॥ 13

ఉద్ధవా! వేలకొలది గోపికలు నా వాస్తవిక స్వరూపము నెఱుగరు. వారు నన్ను భగవానునిగ గాక కేవలము ప్రియతమునిగనే తలంచు చున్నారు. అందువలన జారభావముతో నన్ను గలిసికొనవలయునని యభిలాషపడుచున్నారు. సాధనహీనులగు నా యబలలు కేవలము సంగ ప్రభావముచేతనే పరబ్రహ్మ స్వరూపుడనగు నన్ను బొందిరి

తస్మాత్త్వముద్ధవోత్సృజ్య చోదనాం ప్రతిచోదనామ్ ।
ప్రవృత్తిం చ నివృత్తిం చ శ్రోతవ్యం శ్రుతమేవ చ ॥ 14
మామేకమేవశరణమాత్మానం సర్వదేహినామ్ ।
యాహి సర్వాత్మభావేన మయా స్యా హ్యకుతోభయః ॥

ఉద్ధవా! నీవు శ్రుతిస్మృతులను విధినిషేధములను, శ్రవణయోగ్యములను, వినదగని విషయములను పరిత్యజించి సర్వప్రాణులయందు నంతర్యామిరూపముగ నున్న నన్ను శరణుజొచ్చుము. దానివలన నీ వన్ని చోట్ల నిర్భయముగ సంచరింతువు.

## ఉద్ధవ ఉవాచ.

సంశయః శృణ్వతో వాచం తవ యోగేశ్వరేశ్వర ।
న నివర్తత ఆత్మస్థో యేన భ్రామ్యతి మే మనః ॥ 16

**ఉద్ధవుడు పలికెను:** యోగేశ్వరులకుగూడ పరమేశ్వరుడ వగునోదేవా! నీ యుపదేశముల వినినను నా మనస్సులోని సందేహము దీరుటలేదు కావున నామనస్సు భ్రాంతి జెందుచున్నది.

## శ్రీ భగవానువాచ.

స ఏష జీవో వివరప్రసూతిః
ప్రాణేన ఘోషేణ గుహాం ప్రవిష్టః ।
మనోమయం సూక్ష్మముపేత్య రూపం
మాత్రాస్వరో వర్ణ ఇతి స్థవిష్ఠః ॥ 17

**భగవానుడు పలికెను:** ఉద్ధవా! షట్చక్రములయందభివ్యక్తిశీలు డగు నా పరమాత్మ నాదయుక్త మగుప్రాణముతో నాధారచక్రమున ప్రవేశించును. మణిపూర విశుద్ధ చక్రములందు మనోమయ మగు సూక్ష్మరూపమును బొందును. అనంతరము ముఖవివరమునందు హ్రస్వాది మాత్రారూపమును, ఉదాత్తాదిస్వరరూపమును, అకారాదివర్ణరూపమును ధరించి అతిస్థూలభావముతో వివిధవేదములుగ వెల్లడియగును.

యథానలః ఖేఽనిలబన్ధురూష్మా
బలేన దారుణ్యధిమథ్యమానః ।
అణుః ప్రజాతో హవిషా సమేధతే
తథైవ మే వ్యక్తిరియం హి వాణీ ॥ 18

అగ్ని ఆకాశమున సూక్ష్మరూపమున నుండును. బలముగ కాష్ఠము లను మథించినపుడు వాయువు సహాయముతో సూక్ష్మమైన విస్ఫులింగాదుల రూపమున ప్రకటమగును. ఆహుతుల నిచ్చినపుడు ప్రచండరూపమును ధరించును. అట్లే యీ వేదవాణియు సూక్ష్మస్థూల క్రమముతో నన్నే వెల్లడిచేయునని తెలిసికొనుము.

ఏవం గదిః కర్మగతిర్విసర్గో
ఘ్రాణో రసో దృక్ స్పర్శః శ్రుతిశ్చ ।
సంకల్పవిజ్ఞానమథాభిమానః
సూత్రం రజస్సత్త్వతమోవికారః ॥ 19

ఇట్లే వాక్కు, కర్మ, గతి, మలమూత్రాదివిసర్జనము, ఘ్రాణము, రసగ్రహణము, దర్శనము, స్పర్శనము, శ్రవణము, సంకల్పము, విజ్ఞానము, అభిమానము, ప్రకృతివ్యాపారము, సత్త్వరజస్తమోవికారములవలన గలిగిన అధిదైవప్రభృతి వివిధప్రపంచము మదభివ్యక్తిస్వరూపమే యని తెలిసికొనుము.

అయం హి జీవస్త్రివృదబ్జయోని-
రవ్యక్త ఏకో వయసా స ఆద్యః ।
విశ్లిష్టశక్తిర్బహుధేవ భాతి
బీజాని యోనిం ప్రతిపద్య యద్వత్ ॥ 20

బీజములు క్షేత్రమునందు బడి నానారూపములుగ బయటకు వచ్చునట్లే త్రిగుణాశ్రయుడు, సనాతనుడు, లోకకారణుడు నగునాపరమాత్మ గూడ మొదట అవ్యక్తుడుగను, ఏకస్వరూపుడుగను నుండి, సమయము వచ్చినంతనె వాగింద్రియాది శక్తివికారక్రమముతో బహురూపములుగ వెల్లడియగును.

యస్మిన్నిదం ప్రోతమశేషమోతం
పటో యథా తన్తువితానసంస్థః ।
య ఏష సంసారతరుః పురాణః
కర్మాత్మకః పుష్పఫలే ప్రసూతే ॥ 21

వస్త్రము తంతుసమూహముతో గూడి యున్నట్లు ఈ జగత్తంతయు నా పరమేశ్వరునియందు ఓతప్రోత భావముతో నున్నది. అనాదియు, ప్రవృత్తిశీలము నగుసంసార వృక్షము భోగముక్తి రూపపుష్పఫలములను ప్రసవించును.

ద్వే అస్య బీజే శతమూలస్త్రినాలః
పంచస్కంధః పంచరసప్రసూతిః ।
దశైకశాఖో ద్విసుపర్ణనీడ-
స్త్రివల్కలో ద్విఫలోఽర్కం ప్రవిష్టః ॥ 22

అదన్తి చైకం ఫలమస్య గృధ్రా
గ్రామే చరా ఏకమరణ్యవాసాః ।
హంసా య ఏకం బహురూపమిజ్యై-
ర్మాయామయం వేద స వేద వేదమ్ ॥ 23

ఈ సంసారవృక్షమునకు పాపపుణ్యములను రెండు బీజములుగలవు. అపరిమితవాసనారాశి దీనిమూలము, సత్త్వాదిగుణత్రియము కాండము, పంచభూతములు స్కంధములు, పదునొకండు ఇంద్రియములు శాఖలు, శబ్దాది విషయ పంచకము రసము, ఈ వృక్షమునందు వాతపిత్త శ్లేష్మము లను మూడు విధము లగువల్కలము (చర్మము) లున్నవి. సుఖదుఃఖము లను రెండువిధము లగుఫలము లున్నవి. జీవేశ్వరు లనురెండుపక్షులు దీని

యందు గూడుకట్టుకొని నివసించుచున్నవి. ఈ విశాలవృక్షము సూర్య మండలమువఱకు వ్యాపించి యున్నది.

గృధ్రము అనగా కాముకులైనగృహస్థులు దీని దుఃఖరూప ఫలమును, హంస అనగా వివేకు లగుసన్న్యాసులు దీని సుఖరూపఫలమును భక్షించు చుందురు. ఉద్ధవా! వాస్తవముగ నే నొక్కడనె. మాయాశక్తి ప్రభావముచేతనే నే ననేకరూపములుగ నగపడుచున్నాను. ఈ విషయమును పూజనీయు లగుగురువులవలన దెలిసికొనినవాడు వేదములయందలి యథార్థతత్త్వము నెఱిగినవా డగును.

ఏవం గురూపాసనయైకభక్త్యా
విద్యా కుఠారేణ శితేన ధీరః ।
వివృశ్చ్య జీవాశయమప్రమత్తః
సంపద్య చాత్మానమథ త్యజాస్త్రమ్ ॥ 24

ఉద్ధవా! నీవుగూడ పైనచెప్పినట్లుగ గురువును సేవించి, ఏకాంత భక్తిగలవాడవై తీక్ష్ణ మగుజ్ఞానకుఠారముచే త్రిగుణాత్మక మగులింగశరీరమును ఖండించి (పరిత్యజించి) పరమాత్మవస్తువును బొందుము. అనంతరము జ్ఞానరూపసాధనను పరిత్యజింపుము.

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే పారమహంస్యాం
సంహితాయాం మేకాదశ స్కంధే
భగవదుద్ధవ సంవాదే
ద్వాదశోఽధ్యాయః

ఈ విధముగ శ్రీ మద్భాగవత మహాపురాణము
నందలి యేకాదశస్కంధములోని పంద్రెండవ
అధ్యాయము సమాప్తము.



# పదమూడవ అధ్యాయము

## భగవానుడు హంసరూపముతో సనకాదులకు జేసిన ఉపదేశవర్ణనము.

### శ్రీ భగవానువాచ.

సత్త్వం రజస్తమ ఇతి గుణా బుద్ధేర్నచాత్మనః ।
సత్త్వే నాన్యతమౌ హన్యాత్సత్త్వం సత్త్వేన చైవ హి॥ 1

భగవానుడు పలికెను :_ ఉద్ధవా । సత్త్వరజస్తమములు మూడును బుద్ధిగుణములుగాని ఆత్మగుణములు గావు. సత్త్వవృత్తి రజస్తమోగుణవృత్తులను జయింపవలెను అనంతరము సత్త్వగుణశాంతవృత్తి ద్వారా సత్యదయాప్రభృతి సాత్త్వికవృత్తులనుగూడ జయింపవలెను.

సత్త్వాద్ధర్మో భవేద్వృద్ధాత్ పుంసో మద్భక్తిలక్షణః ।
సాత్త్వికోపాసయా సత్త్వం తతో ధర్మః ప్రవర్తతే ॥ 2

సత్త్వగుణము వృద్ధియైనపుడు జీవునకు నా భక్తి యను ధర్మ ముత్పన్న మగును. నిరంతరము సాత్త్విక పదార్థములను సేవించుట చేత సత్త్వగుణము వృద్ధి యగును. దానినుండి ధర్మము ప్రవర్తిల్లును.

ధర్మో రజస్తమో హన్యాత్సత్త్వవృద్ధిరనుత్తమః ।
ఆశు నశ్యతి తన్మూలో హ్యధర్మ ఉభయే హతే ॥ 3

సత్త్వగుణమును వృద్ధిజేయు ధర్మమే శ్రేష్ఠమైనది. అది రజస్తమోగుణములను నాశనము చేయును. ఆ రెండును నశించిన పిమ్మట వానికి మూలమగు అధర్మముగూడ శీఘ్రముగనే నశించును.

ఆగమోఽపః ప్రజా దేశః కాలః కర్మ చ జన్మ చ ।
ధ్యానం మంత్రోఽథ సంస్కారో దశైతే గుణహేతవః॥ 4

శాస్త్రము, జలము, జనులు, దేశము, కాలము, కర్మ, జన్మ, ధ్యానము, మంత్రము, సంస్కారము—అను నీ పది వస్తువులు యథా యోగ్యముగ గుణములకు కారణము లగును.

తత్తత్సాత్త్వికమేవైషాం యద్యద్వృద్ధాః ప్రచక్షతే ।
నిన్దన్తి తామసం తత్తద్రాజసం తదుపేక్షితమ్ ॥ 5

వీనిలో ప్రాచీనులయిన వ్యాసాదిమహర్షులచే ప్రశంసింపబడిన వస్తువులు సాత్త్వికములు, నిందింపబడినవి తామసములు, ఉపేక్షింపబడి నవి రాజసికములు

సాత్త్వికాన్యేవ సేవేత పుమాన్ సత్త్వవివృద్ధయే ।
తతో ధర్మస్తతో జ్ఞానం యావత్స్మృతిరపోహనమ్ ॥ 6

ఆత్మ ప్రత్యక్షము కానంతవఱకు, స్థూల సూక్ష్మ దేహములు రెండును ; వానికి కారణములగు గుణములు నశింపనంతవఱకు మాన వుడు సత్త్వగుణాభివృద్ధికై సాత్త్విక విషయములను సేవింపవలెను. సత్త్వగుణాభివృద్ధివలన ధర్మము వృద్ధియగును. ధర్మాభివృద్ధివలన పర మాత్మవిషయక జ్ఞానము వృద్ధి చెందును.

వేణుసంఘర్షజో వహ్నిర్దగ్ధ్వా శామ్యతి తద్వనమ్ ।
ఏవం గుణవ్యత్యయజో దేహః శామ్యతి తత్క్రియః ॥ 7

వేణుసంఘర్షణముచే గలిగిన అగ్ని తన కాశ్రయభూత మగు వనమును దగ్ధముచేసి స్వయముగ శాంతమైనట్లు క్రియాశీలము, గుణ వైషమ్యజాతము నగు శరీరముగూడ స్వభావమువలన గలిగిన జ్ఞానము

ద్వారా తన కాశ్రయభూతమైన గుణములను నాశనము చేసి తానుగూడ నివృత్తమగును.

## ఉద్ధవ ఉవాచ.

విదన్తి మర్త్యాః ప్రాయేణ విషయాన్ పదమాపదామ్ ।
తథాపి భుంజతే కృష్ణ తత్కథం శ్వఖరాజవత్ ॥ 8

**ఉద్ధవుడు పలికెను :—** కృష్ణా ! మానవులు తెలుసుగ విషయములు ఆపదలకు కారణములని యెఱిగియుండియు కుక్క, గాడిద, మేక మున్నగు జంతువులవలె దుఃఖముల సహించియు మరల నా విషయములనె అనుభవింతురు. దీనికి గారణ మేమి ?

## శ్రీ భగవానువాచ

అహమిత్యన్యథాబుద్ధిః ప్రమత్తస్య యథా హృది ।
ఉత్సర్పతి రజో ఘోరం తతో వైకారికం మనః ॥ 9
రజోయుక్తస్య మనసః సంకల్పః సవికల్పకః ।
తతః కామో గుణధ్యానాద్దుస్సహస్స్యాద్ధి దుర్మతేః ॥ 10

**భగవానుడు పలికెను :—** ఉద్ధవా ! వివేకహీనుడగు పురుసుని చిత్తమున మొదట దేహాత్మబుద్ధిరూపమిథ్యాజ్ఞానము కలుగును. దాని వలన దుఃఖాత్మకమగు రజోగుణము సత్త్వప్రధానమగు మనస్సు నావరించును అనంతరము రజోగుణయుక్తమగు మనస్సులో సంకల్ప వికల్పములు బయలుదేరును. దానివలన దుర్మతి యగు పురుషుడు విషయము గూర్చి ఆలోచింప నారంభించును. దానిచే దుస్సహము లగు విషయవాసనలు పుట్టును.

కరోతి కామవశగః కర్మాణ్యవిజితేన్ద్రియః ।
దుఃఖోదర్కాణి సమ్పశ్యన్ రజోవేగవిమోహితః ॥ 11

అనంతరము విషయకామ పరవశుడు, రజోవేగమోహితుడు, అజితేంద్రియుడు నగు పురుషుడు కర్మలవలన గలుగు ఫలము దుఃఖమే యని తెలిసికొనియు మరల వానినే ఆచరించును.

రజస్తమోభ్యాం యదపి విద్వాన్ విక్షిప్తధీః పునః ।
అతన్ద్రితో మనోయుంజన్ దోషదృష్టిర్న సజ్జతే ॥ 12

వివేకవంతుడగు పురుషుడు రజస్తమోగుణములచే విక్షిప్తడయినను సావధానముగ చిత్తమును నిగ్రహించి కర్మలయందు దోష మున్నదని యెఱిగి వానియందాసక్తుడు గాడు.

అప్రమత్తోఽనుయుంజీత మనో మయ్యర్పయన్ శనైః ।
అనిర్విణ్ణో యథాకాలం జితశ్వాసో జితాసనః ॥ 13

అప్రమత్తుడు, అనిర్విణ్ణుడు, శ్వాసను, ఆసనమును అదుపులో నుంచుకొనినవాడునై పురుషుడు త్రికాలములయందు నాయందు మనస్సు నర్పించి క్రమముగ నేకాగ్రత నభ్యసింపవలెను.

ఏతావాన్ యోగ ఆదిష్టో మచ్ఛిష్యైః సనకాదిభిః ।
సర్వతో మన ఆకృష్య మయ్యద్ధాఽఽవేశ్యతే యథా ॥ 14

సాధకుడు తన మనస్సును అన్నిటినుండి ఆకర్షించి సాక్షాత్తుగా నాయందే నిలుపుటను యోగమని నా శిష్యులగు సనకాది మహర్షులు వివరించి యున్నారు.

## ఉద్ధవ ఉవాచ

యదా త్వం సనకాదిభ్యో యేన రూపేణ కేశవ ।
యోగమాదిష్టవానేతద్రూపమిచ్ఛామి వేదితుమ్ ॥ 15

**ఉద్ధవుడు పలికెను :** కృష్ణా! నీ వెప్పు డేరూపముతో సకకాదులకు యోగమును బోధించితివో ఆ కాలమును, ఆ రూపమును దెలిసికొన గోరుచున్నాను.

శ్రీ భగవానువాచ.

పుత్రా హిరణ్యగర్భస్య మానసాః సనకాదయః ।
పప్రచ్ఛుః పితరం సూక్ష్మాం యోగస్యైకాన్తికీం
గతిమ్ ॥ 16

**భగవానుడు పలికెను :** ఒకప్పుడు బ్రహ్మమానసపుత్రులగు సనకాదులు తండ్రికడకు వెడలి యోగమునందలి సుసూక్ష్మము ఉత్తమమునగు స్థితిని జెప్పవలసిదిగా గోరిరి.

సనకాదయ ఊచుః

గుణేష్వావిశతే చేతో గుణాశ్చేతసి చ ప్రభో ।
కథమన్యోన్యసంత్యాగో ముముక్షోరతితితీర్షోః ॥ 17

**సనకాదులు పలికిరి :** దేవా! మానవుల చిత్తము సహజముగ విషయములలోని కాకర్షింపబడును. విషయములుగూడ వాసనా రూపమున చిత్తమున ప్రవేశించును. కనుక విషయముల నతిక్రమింప దలచిన ముముక్షువు విషయచిత్తముల పరస్పరసంబంధము నెట్లు నాశనము చేయగలడు ?

శ్రీ భగవానువాచ.

ఏవం పృష్టో మహాదేవః స్వయంభూర్భూతభావనః ।
ధ్యాయమానః ప్రశ్నబీజం నాభ్యపద్యత కర్మధీః ॥ 18

భగవానుడు పలికెను : ఉద్ధవా! బ్రహ్మ స్వయముగ కారణరహితుడు, నిఖిలభూతములకు కారణుడు, దేవతాశ్రేష్ఠుడు అయినను నిరంతరము కర్మవిక్షిప్తచిత్తు డగుటవలన బహువిధములుగా ఆలోచించియు సనకాదులడిగిన ప్రశ్నల తత్త్వమును దెలిసికొనలేకపోయెను.

స మామచిన్తయద్దేవః ప్రశ్నపారతితీర్షయా ।
తస్యాహం హంసరూపేణ సకాశమగమం తదా ॥ 19

అపుడు బ్రహ్మ పై ప్రశ్నములకు సమాధానము నెఱుంగదలచిన వాడై నన్ను స్మరించెను. అంతట నేను హంసరూపముతో ఆయనకు ప్రత్యక్షమైతిని.

దృష్ట్వా మాం త ఉపవ్రజ్య కృత్వా పాదాభివన్దనమ్ ।
బ్రహ్మాణమగ్రతః కృత్వా పప్రచ్ఛుః కో భవానితి ॥ 20

అపుడు మునులు నా హంసరూపమును దర్శించి, బ్రహ్మను ముందిడుకొని నా కడకువచ్చి, నమస్కరించి "నీవెవ్వడ"వని ప్రశ్నించిరి.

ఇత్యహం మునిభిః పృష్టస్తత్త్వజిజ్ఞాసుభిస్తదా ।
యదవోచమహం తేభ్యస్తదుద్ధవ నిబోధ మే ॥ 21

ఉద్ధవా! యోగతత్త్వమును దెలిసికొనదలచిన మును లిట్లడుగగా నేను వారికి జెప్పిన సమాధానమును నీకు వివరింతును వినుము.

వస్తునో యద్యనానాత్వ ఆత్మనః ప్రశ్న ఈదృశః ।
కథం ఘటేత వో విప్రా వక్తుర్వా మే క ఆశ్రయః ॥ 22

బ్రాహ్మణులారా! పరమార్థరూపవస్తువు నానాత్వరహితమై యున్నపుడు నన్ను మీరిట్లు ప్రశ్నించుట యెట్లు తగును? అట్లుకాక ఒక వేళ

నేను సమాధానము చెప్పదలచిన ఏజాతి గుణ క్రియాసంబంధాదుల నాశ్ర యించి చెప్పుదును?

వివరణము :- విప్రులారా! మీరు జీవజ్ఞానముతో నన్ను "నీవెవ" రని ప్రశ్నించుట సరికాదు; ఏలయన, జీవు లంద రొకటియే యగుటవలన వారిలో 'నీ వెవరను' నిర్ధారణరూపప్రశ్న పొసగదు. మఱియొక విధముగ ఆత్మ కెట్టి జాతిగుణప్రభృతి విశేషత్వము లేదు. కనుక నేను ఏవిషయము నాశ్రయించి సమాధాన మిత్తును?

పంచాత్మకేషు భూతేషు సమానేషు చ వస్తుతః ।
కో భవానితి వః ప్రశ్నో వాచారంభో హ్యనర్థకః ॥ 23

దేవమనుష్యాదిశరీరము లన్నియు పంచభూతాత్మకము లగుటవలన అభిన్నములే, పరమార్థముగగూడ నభిన్నములే. ఇట్టిస్థితిలో 'నీవెవడ' వని నిరర్థకముగా మీరు ప్రశ్నించుట కేవలము వాచారంభమే యగును.

మనసా వచసా దృష్ట్యా గృహ్యతేఽన్యైరపీన్ద్రియైః ।
అహమేవ న మత్తోఽన్యదితి బుధ్యధ్వమంజసా ॥ 24

జగత్తులో మనస్సుచేత, వాక్కుచేత, దృష్టిచేత, ఇంకను నితరము లగు నింద్రియములచేత గ్రహింపబడు విషయము లన్నియు నా స్వరూపములే. నాకంటె భిన్నములు గావు. ఈ సిద్ధాంతమును తత్త్వ విచారముద్వారా తెలిసికొనుడు.

గుణేష్వావిశతే చేతో గుణాశ్చేతసి చ ప్రజాః ।
జీవస్య దేహ ఉభయం గుణాశ్చేతో మదాత్మనః ॥ 25

పుత్రులారా! మానవుల చిత్తము విషయములయందును, విషయ ములు చిత్తమునందును ప్రవిష్టములగును. కాని యీ చిత్తవిషయములు రెండును బ్రహ్మస్వరూపు డగు జీవున కుపాధులేగాని స్వరూపములు గావు

గుణేషు చావిశచ్చిత్తమభీక్ష్ణం గుణసేవయా ।
గుణాశ్చ చిత్తప్రభవా మద్రూప ఉభయం త్యజేత్ ॥ 26

**అందువలన** మాటిమాటికి విషయములను సేవించుటవలన చిత్తము విషయాసక్త మగును. విషయములుగూడ చిత్తమునుండి జనించినవే. కనుక పురుషుడు నా స్వరూపమును బొంది చిత్తవిషయముల రెండింటిని విడువవలెను.

జాగ్రత్స్వప్నః సుషుప్తం చ గుణతో బుద్ధివృత్తయః ।
తాసాం విలక్షణో జీవః సాక్షిత్వేన వినిశ్చితః ॥ 27

జాగ్రత్స్వప్న సుషుప్తులు మూడును సత్త్వాదిగుణములవలన కలిగిన బుద్ధివృత్తులు. ఈ వృత్తులకు సాక్షిగ నుండుటవలన జీవుడు వీనికంటె విలక్షణముగ నుండును. అవి విశేషముగ నిర్ణయింపబడినవి.

యర్హి సంసృతిబన్ధోఽయమాత్మనో గుణవృత్తిదః ।
మయి తుర్యే స్థితో జహ్యాత్ త్యాగ స్తద్గుణచేతసామ్ ॥ 28

బుద్ధివృత్తులద్వారా కలుగు సంసారబంధనము జీవునకు విషయవృత్తిని గలిగించును. అందువలన తురీయచైతన్య స్వరూపుడనైన నాయందుండి యీ బుద్ధిబంధనములను పరిత్యజింపుము. అంతట విషయచిత్తముల సంబంధము విడిపోవును.

అహంకారకృతం బన్ధమాత్మనోఽర్థవిపర్యయమ్ ।
విద్వాన్నిర్విద్య సంసారచిన్తాం తుర్యే స్థితస్త్యజేత్ ॥ 29

అహంకారమువలన కలిగినబంధనమే జీవుని ఆనందాదిగుణముల నాపరించి అనర్థములకు గారణమగును. విద్వాంసుడు విషయమును దెలిసి

కొని విరక్తుడై తురీయవస్తువునం దుండి సంసారచింతను అనగా బుద్ధి జనితమగు అభిమానమును, భోగచింతను విడువవలెను.

యావన్నానార్థధీః పుంసో న నివర్తేత యుక్తిభిః ।
జాగర్త్యపి స్వపన్నజ్ఞః స్వప్నే జాగరణం యథా ॥ 30

ఆలోచనలచే యుక్తులచే) భేదజ్ఞానము నివృత్తి కానంతవఱకు జీవుడు జాగృతుడై యున్నను-అనగా విషయకర్మలయందు సావధానుడై యున్నను వాస్తవములో వాని యీ జాగరణము స్వప్నదృష్టమైన జాగరణమువలె అసత్యమైనదే యగును.

అసత్త్వాదాత్మనోఽన్యేషాం భావానాం తత్కృతా భిదా ।
గతయో హేతవశ్చాస్య మృషా స్వప్నదృశో యథా॥ 31

పరమాత్మకంటె భిన్నము లగు దేహాదిభావముల కస్తిత్వములేదు ఆ దేహాదులచే నేర్పడిన వర్ణాశ్రమాదిభేదము, స్వర్గాదిఫలములు, వానికి కారణము లైనకర్మలు స్వప్నదర్శి యగు పురుషునిచే చూడబడిన విషయ సమూహమువలె మిథ్యయేయగును.

యో జాగరే బహిరనుక్షణధర్మిణోఽర్థాన్
భుంక్తే సమస్తకరణైర్హృది తత్సదృక్షాన్ ।
స్వప్నే సుషుప్త ఉపసంహరతే స ఏకః
స్మృత్యన్వయాత్త్రిగుణవృత్తిదృగిన్ద్రియేశః ॥ 32

జాగరణకాలమునందు సర్వేంద్రియములద్వారా వెల్లడియగు క్షణికములైన బాల్యతారుణ్యాది ధర్మయుక్త దేహాది స్థూల విషయములను, స్వప్నములోని చిత్తమునందు జాగరణదృష్టములైన పదార్థములవలె వాసనామయ విషయములను అనుభవించువాడును, సర్వావస్థలయందును ప్రతి

సంధానము ననుసరించి యనుగమించుటవలన అవస్థాత్రయమునకు సాక్షియు, ఇంద్రియాధిష్ఠాతయు నగు నాపరమాత్మవస్తు వొక్కటియే సుషుప్తికాలమున నా విషయముల నన్నింటివి అజ్ఞానమున లయము జేయును

ఏవం విమృశ్య గుణతో మనసస్త్ర్యవస్థా
మన్మాయయా మయి కృతా ఇతి నిశ్చితార్థాః ।
సంఛిద్య హార్దమనుమానసదుక్తితీక్ష్ణ-
జ్ఞానాసినా భజత మాఖిల సంశయాధిమ్ ॥ 33

ఇట్లాలోచించి గుణకృతము లగు జాగరణాది మానసికావస్థలు మూడును నా యవిద్యచే నాయందే కల్పితము లైనవని నిర్ణయించుకొని మీరు అనుమానముచేత, సదుపదేశమువలన కలిగిన తీక్ష్ణమగు జ్ఞాన ఖడ్గముచే సంశయముల కన్నింటికి నాధారమగు నహంకారమును ఛేదించి హృదయ స్థితుడనైన నన్ను సేవింపుడు.

ఈక్షేత విభ్రమమిదం మనసో విలాసం
దృష్టం వినష్టమతిలోలమలాతచక్రమ్ ।
విజ్ఞానమేకమురుధేవ విభాతి మాయా
స్వప్నస్త్రిధా గుణవిసర్గకృతో వికల్పః ॥ 34

ఈ జగత్తు మనఃకల్పితము, వినశ్వరము, అలాతచక్రతుల్యము, అతిచంచలము, భ్రమ మాత్రము నని తెలిసికొనుడు. విజ్ఞాన స్వరూప మగు బ్రహ్మ మొక్కటియె నానావిధములుగ వెల్లడియగుచున్నది. కాని వాస్తవములో నానావిధములుగ లేదు. గుణపరిణామమువలన గలిగిన జాగరణాదిభేదము స్వప్నమువలె మాయావిలాస మని తెలిసికొనుడు.

దృష్టిం తతః ప్రతినివర్త్య నివృత్తతృష్ణ-
స్తూష్ణీం భవేన్నిజసుఖానుభవో నిరీహః ।
సందృశ్యతే క్వ చ యదీదమవస్తుబుద్ధ్యా
త్యక్తం భ్రమాయ న భవేత్ స్మృతిరానిపాతాత్ ॥ 35

అందువలన దృశ్యప్రపంచమునుండి దృష్టిని మరలించి, విషయ తృష్ణలేనివాడుగను, మౌనిగను, మనోవాక్కాయవ్యాపారరహితుడుగను నయి నిజసుఖానుభవశీలుడు కావలెను. ఎప్పుడయిన ఆహారాదుల సమయమున నీదేహాదిప్రపంచము కనబడినను నిది వాస్తవవస్తువుకంటె భిన్నమైనదని తెలిసికొని విడువబడినది--కావున మరల మోహమును కలిగింప జాలదు. కాని దేహపాతమువఱకు ఈసంసారరూపముతో స్మృతి ఉండును.

దేహం చ నశ్వరమవస్థితముత్థితం వా
సిద్ధో న పశ్యతి యతోఽధ్యగమత్స్వరూపమ్ ।
దైవాదపేతమథ దైవవశాదుపేతం
వాసో యథా పరికృతం మదిరామదాన్ధః ॥ 36

మదిరాపానముచేత నున్మత్తుడైన పురుషుడు తాను ధరించిన వస్త్రము శరీరమునందున్నదా లేదా యని తెలిసికొనజాలడు. అట్లే సిద్ధపురుషుడు స్వరూపమును సాక్షాత్కరింప జేసికొని ఈ నశ్వర దేహము నిలచియున్నది, కూర్చుండినది, లేదా దైవవశమున(నెచటికో వెడలినది) వచ్చినది పోయినది అను నీ విషయములపై నతడు దృష్టి నుంచడు.

దేహోఽపి దైవవశగః ఖలు కర్మ యావత్
స్వారంభకం ప్రతిసమీక్షత ఏవ సాసుః ।

తం సప్రపంచమధిరూఢ సమాధియోగః
స్వాప్నం పునర్న భజతే ప్రతిబుద్ధవస్తుః ॥ 37

దైవవశమున గతిశీలమగు నీదేహము తాను చేసిన కర్మ లున్నంత వఱకు ప్రాణముతోను, ఇంద్రియములతోను గూడి తప్పక జీవించి యుండును. కాని సమాధియోగము పొందిన పరమార్థతత్త్వజ్ఞుడగు పురుషుడు స్వప్నతుల్యమగు నీ భౌతిక దేహమున మఱల అసక్తుడుకాడు.

మయైతదుక్తం వో విప్రా గుహ్యం యత్సాంఖ్య
యోగయోః ।
జానీతమాగతం యజ్ఞం యుష్మద్ధర్మవివక్షయా ॥ 38

విప్రులారా ! సాంఖ్యయోగములలోని రహస్యము లగు విషయములను మీకు వివరించితిని. నేను స్వయముగ విష్ణుభగవానుడను, మీకు ధర్మము నుపదేశించుటకే యిచటకు వచ్చితి నని తెలిసికొనుడు.

అహం యోగస్య సాంఖ్యస్య సత్యస్యర్తస్య తేజసః।
పరాయణం ద్విజశ్రేష్ఠాః శ్రియః కీర్తేర్దమస్య చ ॥ 39

ద్విజవరులారా ! నేను సాంఖ్యము, యోగము, సత్యము, ఋతము (మధుర భాషణము), తేజస్సు, శ్రీ, కీర్తి, దమము అను వీని యన్నింటికి పరమాశ్రయుడ నయియున్నాను.

మాం భజన్తి గుణాః సర్వే నిర్గుణం నిరపేక్షకమ్ ।
సుహృదం ప్రియమాత్మానం సామ్యాసంగా
దయోఽగుణాః ॥ 40

నిత్యము, అప్రాకృతము నగు సామ్యము, అసంగము మున్నగు గుణములన్నియు నిర్గుణుడను (అనిత్యప్రాకృత గుణసంపర్కశూన్యుడను)

నిరపేక్షుడను, సర్వహితకారిని, సర్వప్రేమాస్పదుడను సర్వాంతర్యామి స్వరూపడను నగు నన్ను సేవించుచున్నవి.

ఇతి మే ఛిన్నసన్దేహా మునయః సనకాదయః ।
సభాజయిత్వా పరయా భక్త్యాగృణత సంస్తవైః ॥ 41

ఉద్ధవా! సనకాదిమునులు నా మాటలవలన సంశయ నివృత్తులై, ప్రేమలక్షణభక్తితో నన్ను పూజించిరి, దివ్యస్తోత్రములద్వారా నా మహిమను కీర్తించిరి.

తైరహం పూజితః సమ్యక్ సంస్తుతః పరమర్షిభిః ।
ప్రత్యేయాయ స్వకం ధామ పశ్యతః పరమేష్ఠినః ॥ 42

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే పారమహంస్యాం
సంహితాయాం వైయాసిక్యా
మేకాదశ స్కంధే
త్రయోదశోఽధ్యాయః

అనంతర మామహర్షులు నన్ను చక్కగ పూజించిరి, స్తుతించిరి. అప్పుడు నేను బ్రహ్మ చూచుచుండగనే నా ధామమునకు వెడలితిని.

ఈ విధముగ శ్రీ మద్భాగవత మహాపురాణము
నందలి యేకాదశస్కంధములోని పదమూడవ
అధ్యాయము సమాప్తము.

# పదునాల్గవ అధ్యాయము

భ క్తి యో గ మ హి మ.

ధ్యాన విధి వర్ణనము.

## ఉద్ధవ ఉవాచ

వదన్తి కృష్ణ శ్రేయాంసి బహూని బ్రహ్మవాదినః ।
తేషాం వికల్ప ప్రాధాన్యముతాహో ఏకముఖ్యతా ॥ 1

**ఉద్ధవుడు పలికెను :—** కృష్ణా ! బ్రహ్మవాదులగు ఋషులు వివిధము లగు శ్రేయస్సాధనములను వర్ణించుచున్నారు. వానిలో వైకల్పిక భావముతో నన్నియు ముఖ్యములా? లేక ఒక్కటియే ముఖ్యమా? దయయుంచి వివరింపుము.

భవతోదాహృతః స్వామిన్ భక్తియోగోఽనపేక్షితః ।
నిరస్యసర్వతః సంగం యేన త్వయ్యావిశేన్మనః ॥ 2

నీ వుపదేశించిన భక్తియోగముచే చిత్తము సర్వసంగ రహితమై నీయందే లగ్నమగును. ఆ నిష్కామ భక్తియోగము సర్వసమ్మతమా? లేక నీ కొక్కనికే సమ్మతమా? ఈ విషయమును వివరింపుము.

## శ్రీ భ గ వా ను వా చ

కాలేన నష్టా ప్రళయే వాణీయం వేదసంజ్ఞితా ।
మయాఽదౌ బ్రహ్మణే ప్రోక్తా ధర్మోయస్యాం
మదాత్మకం ॥ 3

**భగవానుడు పలికెను :—** ఉద్ధవా ! మదాత్మక ధర్మముతో గూడిన ఈ వేదవాణి ప్రళయ కాలప్రభావముచే నష్టముకాగా, మఱల సృష్ట్యారంభమున దీనిని బ్రహ్మ కుపదేశించితిని.

తేన ప్రోక్తా స్వ పుత్రాయ మనవే పూర్వజాయ సా ।
తతో భృగ్వాదయోఽగృహ్ణాన్ సప్తబ్రహ్మమహర్షయః॥ 4

బ్రహ్మ తన జ్యేష్ఠ పుత్రుడగు స్వాయంభువ మనువునకు దీని నుప దేశించెను. వానినుండి భృగువు, అంగిరసుడు, మరీచి, పులహుడు, అత్రి, పులస్త్యుడు, క్రతువు అను ఏడుగురు మహర్షులు గ్రహించిరి.

తేభ్యః పితృభ్యస్తత్పుత్రా దేవదానవగుహ్యకాః ।
మనుష్యాః సిద్ధగన్ధర్వాః సవిద్యాధరచారణాః ॥ 5
కిందేవాః కిన్నరా నాగా రక్షః కింపురుషాదయః ।
బహ్వ్యస్తేషాం ప్రకృతయో రజస్సత్త్వతమో భువః ॥ 6
యాభిర్భూతాని భిద్యన్తే భూతానాం పతయస్తథా ।
యథా ప్రకృతి సర్వేషాం చిత్రావాచః స్రవన్తి హి ॥ 7

భృగువు మున్నగు బ్రహ్మర్షులనుండి వారి సంతాన మగుదేవతలు, దానవులు, గుహ్యకులు, మనుష్యులు, సిద్ధులు, గంధర్వులు విద్యాధరులు, చారణులు, కిందేవులు, కిన్నరులు, నాగులు: రాక్షసులు, కింపురుషులు మున్నగువా రందఱు దానిని గ్రహించిరి. సర్వజీవుల స్వభావములు (వాసనలు) సత్త్వరజస్తమోగుణముల ననుసరించి భిన్నభిన్నములుగ నుండును. ఈ వాసనలవలన దేవాసుర మనుష్యాది భూతములు, భూతపతులు విభిన్నముగ నుందురు. వారి వాసనానుసారముగ చిత్రములగు వేదవ్యాఖ్యాన విషయములు వెలువడుచున్నవి.

ఏవం ప్రకృతివైచిత్ర్యాద్భిద్యన్తే మతయో నృణామ్ ।
పారంపర్యేణ కేషాంచిత్ పాషండమతయోఽపరే ॥ 8

ఇట్లు మానవుల స్వభావభేదము ననుసరించి వారి బుద్ధిలో గూడ భేద మేర్పడినది. కొందఱు వేదమునధ్యయనము చేయనివారై పరంపరాగత మగునుపదేశము ననుసరించి విభిన్నములగు నభిప్రాయములు గలవారగుదురు, కొంద ఱెట్టిఆలోచన లేనివారై వేదవిరుద్ధ మైనపాషండ మతము నవలంభింతురు.

మన్మాయా మోహితధియః పురుషాః పురుషర్షభ ।
శ్రేయో వద న్త్యనేకా న్తం యథా కర్మ యథా రుచి ॥ 9

ఉద్ధవా! మానవులు నామాయచే మోహితులై తమ తమ రుచి కర్మల భేదము ననుసరించి నానావిధము లగు శ్రేయస్సాధనముల వర్ణింతురు.

ధర్మమేకే యశశ్చాన్యే కామం సత్యం దమం శమమ్ ।
అన్యే వద న్తి స్వార్థం వై ఐశ్వర్యం త్యాగభోజనమ్ ।
కేచిద్యజ్ఞతపోదానం వ్రతాని నియమాన్ యమాన్ ॥ 10

వారిలో గొందఱు ధర్మమును, కొందఱు యశస్సును, కొందఱు కామమును, కొందఱు సత్యమును, దమమును, శమమును, కొందఱు ఐశ్వర్యమును, కొందఱు దాన భోగములను, కొందఱు యజ్ఞతపోదాన వ్రతయమ నియమములు మున్నగువానిని శ్రేయస్సాధనము లని చెప్పుచున్నారు

ఆద్య న్తవ న్తఏవైషాం లోకాః కర్మ వినిర్మితాః ।
దుఃఖోదర్కా స్తమో నిష్ఠాః క్షుద్రా మన్దాః
శుచార్పితాః ॥ 11

వెనుక చెప్పబడిన పురుషుల కర్మలవలన గలిగిన లోకము లనిత్యములు, దుఃఖ పరిణామకములు, మోహజనకములు, క్షుద్రములు, హీనములు, శోకయుక్తములు నగును.

మయ్యర్పితాత్మనః సభ్య నిరపేక్షస్య సర్వతః ।
మయాఽఽత్మనా సుఖం యత్తత్ కుతః స్యాద్విషయాత్మనామ్ ॥ 12

నాయందే మనస్సు నుంచి విషయ వాసనాశూన్యులైన వారు నా పరమానంద స్వరూపమును దెలిసికొందురు. దానివలన వారికి గలుగునట్టి సుఖము విషయాసక్తు లగువారి కెట్లుకలుగును?

అకించనస్య దాన్తస్య శాన్తస్య సమచేతసః ।
మయా సంతుష్టమనసః సర్వాస్సుఖమయా దిశః ॥ 13

అకించనుడు, శమదమయుక్తుడు, సమచిత్తుడు. ఆత్మపరితృప్తుడు నగు పురుషునకు సర్వజగత్తు సుఖమయరూపమున ప్రతీతమగును.

న పారమేష్ఠ్యం న మహేన్ద్రధిష్ణ్యం
న సార్వభౌమం న రసాధిపత్యం ।
న యోగసిద్ధీరపునర్భవం వా
మయ్యర్పితాత్మేచ్ఛతి మద్వినాన్యత్ ॥ 14

నాయందు మనస్సును నిలిపిన మానవుడు నన్ను దప్ప ఇతరములైన బ్రహ్మ పదవినిగాని, ఇంద్రపదవినిగాని, సార్వభౌమపదవినిగాని పాతాళ లోకాధిపత్యమునుగాని, అణిమాదియోగ సిద్ధినిగాని లేదా మోక్షపదవినిగాని కోరడు.

న తథా మే ప్రియతమ ఆత్మయోనిర్న శంకరః ।
న చ సంకర్షణో న శ్రీర్నైవాత్మా చ యథా భవాన్ ॥

నీవు నా కిష్టుడవైనట్లుగ పుత్రు డగుబ్రహ్మ, స్వరూపభూతు డగు శంకరుడు, సోదరు డగుబలరాముడు, భార్య యగులక్ష్మీదేవి, నా స్వరూపము నా కిష్టములుగావు. 15

నిరపేక్షం మునిం శాన్తం నిర్వైరం సమదర్శనమ్ ।
అనువ్రజామ్యహం నిత్యం పూయేయేత్యంఘ్రి రేణుభిః ॥ 16

నేను భక్తులపాదధూళిద్వారా బ్రహ్మాండములను పవిత్రము చేయు తలంపుతో నిస్పృహుడు, మననశీలుడు, శాంతుడు, వైరభావరహితుడు, సమదర్శియు నగుభక్తుని అనుసరింతును.

నిష్కించనా మయ్యనురక్తచేతసః
శాన్తా మహాన్తోఽఖిల జీవవత్సలాః ।
కామైరనాలబ్ధధియో జుషన్తి తే
యన్నైరపేక్ష్యం న విదుః సుఖం మమ ॥ 17

నిష్కించనులు, శాంతులు, నిరభిమానులు, భూతవత్సలురు, విషయ రాగ సంపర్కశూన్యులు నగుపురుషులు నాయం దేకాగ్రచిత్తము గలవారై నన్ను సేవింతురు. అట్టివారే నిరపేక్షు లగుజనులచే పొందదగు పరమ సుఖమును బొందుదురు. ఇతరు లెవ్వరు దానిని పొందజాలరు.

బాధ్యమానోఽపి మద్భక్తో విషయైరజితేన్ద్రియః ।
ప్రాయః ప్రగల్భయా భక్త్యా విషయైర్నాభిభూయతే ॥ 18

ఉద్ధవా! సర్వవిధముల నింద్రియముల జయింపజాలని ప్రాకృత భక్తుడు విషయములచే నాకర్షితుడైనను, నా ప్రగల్భభక్తి ప్రభావముచే సామాన్యముగ విషయములకు లొంగిపోడు.

యథాగ్నిః సుసమృద్ధార్చిః కరోత్యేధాంసి భస్మసాత్
తథా మద్విషయా భక్తిరుద్ధవైనాంసి కృత్స్నశః ॥

ఉద్ధవా! బాగుగ ప్రజ్వరిల్లు అగ్నికాష్ఠరాశిని దగులబెట్టి చేయునట్లు నాయందలి భక్తియు సర్వపాపములను సమూలముగ న జేయును.

న సాధయతి మాం యోగో న సాంఖ్యం ధర్మ ఉద్ధ
న స్వాధ్యాయస్తపస్త్యాగో యథా భక్తిర్మమోర్జిత

ఉద్ధవా! ప్రవృద్ధ మగు సాధనాత్మక భక్తి నన్ను వ కొనినంతగ యోగము, సాంఖ్యము, ధర్మము, స్వాధ్యాయము, దానము మున్నగునవి వశము చేసికొనజాలవు.

భక్త్యాహమేకయా గ్రాహ్యః శ్రద్ధయాఽఽత్మా ప్రియస్స
భక్తిః పునాతి మన్నిష్ఠా శ్వపాకానపి సంభవాత్ ॥

శ్రద్ధవలన గలిగిన అనన్యభక్తిప్రభావముచేతనే పరమా ప్రియస్వరూపుడను నగు నేను సాధువులకు లభ్యమగుచున్నాను. భావసంపన్న మగుభక్తి చండాలురనుగూడ పవిత్రము చేయును.

ధర్మః సత్యదయోపేతో విద్యా వా తపసాన్వితా ।
మద్భక్త్యాపేతమాత్మానం న సమ్యక్ప్రపునాతిహి

నాయందు భక్తిలేని వాని చిత్తమును సత్యము, దయ, తపస్సు, జ్ఞానము- ఇవియేవియు చక్కగ పవిత్రము చేయజాలవ

కథం వినా రోమహర్షం ద్రవతా చేతసా వినా ।
వినాఽఽనన్దాశ్రుకలయా శుధ్యేద్భక్త్యా వినాఽఽ

శరీరము పులకితము కానంతవఱకు, చిత్తము ద్రవించి గద్గదము కానంతవఱకు, ఆనందాశ్రువులు ప్రవహింపనంతవఱకు భక్త్యావిర్భావ మవగతము కాదు, భక్తి కలుగనిదె చిత్తము విశుద్ధము కాదు. 23

వాగ్గద్గదా ద్రవతే యస్య చిత్తం
రుదత్యభీక్ష్ణం హసతి క్వచిచ్చ ।
విలజ్జ ఉద్గాయతి నృత్యతే చ
మద్భక్తియుక్తో భువనం పునాతి ॥ 24

నాయందు భక్తి గలవాని వాక్కు గద్గదము కలదియగును. వాని చిత్తము ద్రవించును. అతడు ఒక్కొక్కపుడు మాటిమాటికి ఏడ్చును, ఒక్కొక్కపుడు నవ్వును. లజ్జారహితుడై పెద్దగ గానముచేయును. నృత్యముచేయును. ఇట్టిభక్తుడు మూడులోకములను పవిత్రము చేయును.

యథాగ్నినా హేమమలం జహాతి
ధ్మాతం పునః స్వం భజతే చ రూపమ్ ।
ఆత్మా చ కర్మానుశయం విధూయ
మద్భక్తియోగేన భజత్యథో మామ్ ॥ 25

బంగారము అగ్నిచే సంతప్తమై అంతర్మలమును విడచి స్వాభావిక మగు ప్రకాశమును పొందునట్లుగ మానవుల చిత్తముగూడ నాయందలి భక్తియోగముచేతనె కర్మవాసనలను వదలి (మహాప్రేమ కలుగుటవలన పూర్ణసేవా పద్ధతిని బొందును) నన్నే సేవించును.

యథా యథాఽఽత్మా పరిమృజ్యతేఽసౌ
మత్పుణ్యగాథాశ్రవణాభిధానైః ।
తథా తథా పశ్యతి వస్తు సూక్ష్మం
చక్షుర్యథైవాంజన సంప్రయుక్తమ్ ॥ 26

అంజనముచే నేత్రములలోని దోషము తొలగి వానికి సూక్ష్మవస్తువులను జూచునట్టి శక్తి కలుగునట్లుగ పరమ పావన మగు నా లీలలను వినుటచేత, కీర్తించుటచేత చిత్తములోని మాలిన్యము తొలగును. అనంతర మది సూక్ష్మవస్తు జ్ఞానమును అనగా నధోక్షజతత్త్వ జ్ఞానము తెలిసికొనగలుగును.

విషయాన్ ధ్యాయతశ్చిత్తం విషయేషు విషజ్జతే ।
మామనుస్మరతశ్చిత్తం మయ్యేవ ప్రవిలీయతే ॥ 27

విషయములను గూర్చి ఆలోచించువాని మనస్సు విషయములయందే లగ్నమైయుండును. కాని అనుక్షణము నన్ను గుఱించి ఆలోచించువాని మనస్సు పరమాత్మరూపుడ నగునాయందే లగ్నమై యుండును.

తస్మాదసదభిధ్యానం యథా స్వప్నమనోరథమ్ ।
హిత్వా మయి సమాధత్స్వ మనో మద్భావభావితమ్ ॥ 28

అందువలన స్వప్న మనోరథతుల్యములగు నితరము లైన అసత్సాధనముల చింతను వదలి నా భజనముచే శోధిత మైనచిత్తమును నాయందే నిలుపుము.

స్త్రీణాం స్త్రీసంగినాం సంగం త్యక్త్వా దూరత ఆత్మవాన్ ।
క్షేమే వివిక్త ఆసీనశ్చింతయేన్మామతన్ద్రితః ॥ 29

వివేకవంతుడగు పురుషుడు స్త్రీలసాంగత్యమును, వారిని ప్రేమించువారి సాంగత్యమును దూరముగ వదలి నిర్భయముగ నిర్జన స్థానమున గూర్చుండి సావధానముగ నన్ను ధ్యానించును.

న తథాస్య భవేత్క్లేశో బన్ధశ్చాన్యప్రసంగతః ।
యోషిత్సంగాద్యథా పుంసో తథా తత్సంగిసంగతః ॥ 30

ఉద్ధవా స్త్రీసాంగత్యమువలన, స్త్రీలంపటుల సాంగత్యమువలన జీవున కెన్నియోక్లేశములు, సంసారబంధనములు కలుగుచున్నవి. ఇట్టి కష్టములు, బంధనములు, మఱియేయితర విషయ ప్రసంగముల వలనను గలుగవు.

## ఉద్ధవ ఉవాచ.

యథా త్వామరవిన్దాక్ష యాదృశం వా యదాత్మకమ్ ।
ధ్యాయేన్ముముక్షురేతన్మే ధ్యానం త్వం వక్తుమర్హసి ॥ 31

**ఉద్ధవుడు పలికెను :—** పుండరీకాక్ష ! ముముక్షువు అగుపురుషులు నిన్ను ఏరూపములో, నే విధముగ, నేభావముతో ధ్యానింతురో దయ యుంచి వివరింపుము. (నేనెల్లపుడు నీపాదపద్మముల ధ్యానించుచున్నాను).

## శ్రీ భగవానువాచ

సమ ఆసన ఆసీనః సమకాయో యథాసుఖమ్ ।
హస్తావుత్సంగ ఆధాయ స్వనాసాగ్రకృతేక్షణః ॥ 32

**శ్రీ భగవానుడు పలికెను :—** హెచ్చుతగ్గులు లేని ఆసనమునందు సమమగు శరీరముగలవాడై యథాసుఖముగ గూర్చుండి చేతులను ఒడిలోనుంచుకొని, దృష్టిని నాసాగ్రమునం దుంచవలెను

ప్రాణస్య శోధయేన్మార్గం పూరకుంభకరేచకైః ।
విపర్యయేణాపి శనైరభ్యసేన్నిర్జితేన్ద్రియః ॥ 33

జితేంద్రియు డగుపురుషుడు పూరకకుంభకరేచకములచేతను, రేచక కుంభక పూరకముల చేతను ప్రాణవాయుమార్గమును శోధింపవలెను ప్రాణాయామముయొక్క అభ్యాసమును క్రమక్రమముగ పెంచవలెను.

హృద్యవిచ్ఛిన్నమోంకారం ఘంటానాదం బిసోర్ణవత్ ।
ప్రాణేనోదీర్య తత్రాథ పునః సంవేశయేత్స్వరమ్ ॥ 34

మూలాధారమునుండి తామరతూడులోని దారమువలె అవిచ్ఛిన్న భావముతో హృదయమున నున్న ఘంటానాద సదృశ మైనఓంకారమును ప్రాణవాయువుతోగూడ పైకి పండ్రెండంగుళములవఱకు దీసికొని పెదరి దానితో స్వరమును అనగా పంచదశ బిందువును కలుపవలెను.

ఏవం ప్రణవసంయుక్తం ప్రాణమేవ సమభ్యసేత్ ।
దశకృత్వస్త్రిషవణం మాసాదర్వాగ్జితానిలః ॥ 35

ఇట్లు ప్రతిదినము మూడువేళల పది పదిమారులు ఓంకారముతో గూడ ప్రాణాయామము నభ్యసించిన ఒక్కనెలలోపలనె ప్రాణవాయువు స్వాధీనమగును.

హృత్పుండరీకమన్తఃస్థమూర్ధ్వనాలమధోముఖమ్ ।
ధ్యాత్వోర్ధ్వముఖమున్నిద్రమష్టపత్రం సకర్ణికమ్ ॥ 36

కర్ణికాయాం న్యసేత్సూర్యసోమాగ్నీనుత్తరోత్తరమ్ ।
వహ్నిమధ్యే స్మరేద్రూపం మమైతద్ధ్యానమంగళమ్ ॥ 37

దేహాంతర్గతము, ఊర్ధ్వనాళవిశిష్టము, ముకుళితము, కర్ణికాయుక్తము, అష్టదళయుక్తము, వికసితము నగు హృత్పుండరీకమును ధ్యానింపవలెను. కర్ణికయందు క్రమముగ సూర్యచంద్రులను, అగ్నిని నుంచవలెను. అనంతరము ఆ అగ్నిలో ధ్యానమంగళమగు నా యీ రూపమును ధ్యానింపవలెను.

సమం ప్రశాన్తం సుముఖం దీర్ఘచారుచతుర్భుజమ్ ।
సుచారుసున్దరగ్రీవం సుకపోలం శుచిస్మితమ్ ॥ 38

సమానకర్ణవిన్యస్తస్ఫురన్మకరకుండలమ్ ।
హేమాంబరం ఘనశ్యామం శ్రీవత్సశ్రీనికేతనమ్ ॥ 39

శంఖచక్రగదాపద్మవనమాలావిభూషితమ్ ।
నూపురైర్విలసత్పాదం కౌస్తుభప్రభయా యుతమ్ ॥ 40

ద్యుమత్కిరీటకటకకటిసూత్రాంగదాయుతమ్ ।
సర్వాంగసుందరం హృద్యం ప్రసాదసుముఖేక్షణమ్ ।
సుకుమారమభిధ్యాయేత్సర్వాంగేషుమనోదధత్ ॥ 41

సమము, ప్రశాంతము, సుప్రసన్నము, దీర్ఘసుందరభుజ చతుష్టయ యుతము, సుందరగ్రీవము, సుకపోలయుక్తము, విశుద్ధహాస్యసమన్వితము కర్ణములందు సమానముగా నుంచబడిన ప్రకాశవంతములగు మకరకుండల ద్వయముగలదియు, హేమాంబరము, జలదనీలకాంతి గలదియు, శ్రీవత్సమునకు లక్ష్మికి నికేతనము, శంఖ చక్రగదాపద్మ వనమాలా విభూషితము, నూపురశోభిత పాదద్వంద్వము గలదియు, కౌస్తుభకాంతియుక్తము, కిరీట కటక కటి సూత్రాంగద యుక్తము, సర్వాంగ సుందరము, మనోహరము, హృద్యము, ప్రసాద సుముఖేక్షణము, అతికోమలము, నగు నా రూపమును ధ్యానింపుము, నీమనస్సును సర్వావయవములందు లగ్నము చేయుము.

ఇంద్రియాణీన్ద్రియార్థేభ్యో మనసాఽఽకృష్య తన్మనః ।
బుద్ధ్యా సారథినా ధీరః ప్రణయేన్మయి సర్వతః ॥ 42

బుద్ధిమంతు డగు పురుషుడు మనస్సుద్వారా ఇంద్రియములను వాని విషయములనుండి యుపసంహరించి బుద్ధి యనుసారథిద్వారా ఆచిత్తమును నా సర్వాంగములయందును లగ్నము చేయవలెను.

తత్రసర్వవ్యాపకం చిత్తమాకృష్యైకత్ర ధారయేత్ ।
నాన్యాని చిన్తయేద్భూయః సుస్మితం భావయేన్ముఖమ్॥ 43

అనంతరము సర్వవ్యాపకమగు చిత్తము నాకర్షించి యొకే అవయవమునం దుంచవలెను. మఱల ఇతరావయవములను ధ్యానింపక సుందర హాస్యయుక్త మగుముఖమండలమునే ధ్యానింపవలెను.

తత్ర లబ్ధపదం చిత్తమాకృష్య వ్యోమ్ని ధారయేత్ ।
తచ్చ త్యక్త్వా మదారోహో న కించిదపి చిన్తయేత్ ॥ 44

అనంతరము ముఖమండలమునందు సుప్రతిష్ఠిత మైన చిత్తమును దానినుండి ఆకర్షించి సర్వకారణభూత మగుఆకాశమునం దుంచవలెను. అటుపిమ్మట దానిధ్యానమునుగూడ విడచి శుద్ధ బ్రహ్మమునగు నాయందు మనస్సునుంచి యితరవస్తువును దేనినిగూడ ధ్యానింపరాదు.

ఏవం సమాహిత మతిర్మామేవాత్మానమాత్మని ।
విచష్టే మయి సర్వాత్మన్ జ్యోతిర్జ్యోతిషి సంయుతమ్ ॥ 45

ఇట్లే సమాహితచిత్తు డగుపురుషుడు. ఒకజ్యోతి యందు మఱి యొక జ్యోతినివలె బ్రహ్మస్వరూపుడ నగునన్ను జీవాత్మలోను, సర్వాత్మ స్వరూపుడ నగునాలో జీవాత్మను దర్శింపవలెను.

ధ్యానేనేత్థం సుతీవ్రేణ యుంజతో యోగినో మనః ।
సంయాస్యత్యాశు నిర్వాణం ద్రవ్యజ్ఞానక్రియాభ్రమః ॥ 46

ఇట్లు తీవ్ర ధ్యానయోగముద్వారా నాయందే తన మనస్సును సంయమము చేసినయోగియొక్క ద్రవ్యజ్ఞానక్రియాభ్రమ అనగా ఆధిభౌతికము, ఆధిదైవికము, ఆధ్యాత్మికము అను మూడువిధములుగనున్న భ్రమ వెంటనే నశించును.

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే పారమహంస్యాం
సంహితాయాం వైయాసిక్యా
మేకాదశ స్కంధే
చతుర్దశోఽధ్యాయః

ఈ విధముగ శ్రీమద్భాగవత మహాపురాణము
నందలి యేకాదశస్కంధములోని పదునాల్గవ
అధ్యాయము సమాప్తము.



# పదునైదవ అధ్యాయము

విభిన్న సిద్ధుల నామములు - వాని

లక్షణముల వివరణము.

## శ్రీ భగవానువాచ

జితేన్ద్రియస్య యుక్తస్య జితశ్వాసస్య యోగినః ।
మయి ధారయతశ్చేత ఉపతిష్ఠన్తి సిద్ధయః ॥ 1

ఉద్ధవా! జితేంద్రియుడు, జితశ్వాసుడు, స్థిరచిత్తుడు నగు యోగి నాయందు మనస్సును నిల్పును. అణిమాదిసిద్ధులు వానియంతట యవియే వానియెదుట ఉపస్థితములగును.

## ఉద్ధవ ఉవాచ

కయా ధారణయా కా స్విత్కథం వా సిద్ధిరచ్యుత ।
కతి వా సిద్ధయో బ్రూహి యోగినాం సిద్ధిదో భవాన్॥ 2

**ఉద్ధవుడు పలికెను :—** అచ్యుతా! ఎట్టి ధారణచేత, ఏవిధముగ నెట్టి సిద్ధి లభించును? అవి యెన్ని? నీవు యోగులకు సిద్ధుల నిచ్చువాడవు. అందువలన నీవు వీనిని వర్ణింపుము.

## శ్రీ భగవానువాచ.

సిద్ధయోఽష్టాదశ ప్రోక్తా ధారణా యోగపారగైః ।
తాసామష్టౌ మత్ప్రధానా దశైవ గుణహేతవః ॥ 3

**భగవానుడు పలికెను :—** ఉద్ధవా! ధారణయోగపారగాములగుయోగులు పదునెనిమిదివిధము లగు సిద్ధులను వివరించిరి. వానిలో నెని

మిది సిద్ధులు ప్రధానముగ నాయందే యున్నవి. మిగిలిన పదివిధము లగు సిద్ధులు సత్త్వగుణోత్కర్షకు హేతువులై యున్నవి.

అణిమా మహిమా మూర్తేర్లఘిమా ప్రాప్తిరిన్ద్రియైః ।
ప్రాకామ్యం శ్రుతదృష్టేషు శక్తిప్రేరణమీశితా ॥ 4

అణిమా, మహిమా, గరిమా - అను మూడు సిద్ధులు దేహమునకు సంబంధించినవి. ప్రాప్తి యను సిద్ధి ఇంద్రియాధిష్ఠాతృదేవతలకు సంబంధించినది. ప్రాకామ్య మనుసిద్ధి లౌకికపారలౌకిక పదార్థముల ఇష్టానుసార మనుభవించునట్టిది. ఈశిత మనుసిద్ధి శక్తిసమూహమునకు ప్రేరణను గలిగించునది.

గుణేష్వసంగో వశితా యత్కామస్తదవస్యతి ।
ఏతా మే సిద్ధయః సౌమ్య అష్టావౌత్పత్తికా మతాః ॥ 5

విషయములం దుండియు వానియందాసక్తి లేనిది "వశిత" యను సిద్ధి; కోరిన సుఖముల హద్దునకు జేరునది 'కామావసాయిత'మను ఎనిమిదవసిద్ధి. ఉద్ధవా! నా యీ యష్టసిద్ధులు స్వాభావికములు నిరతిశయములు నని చెప్పబడినవి.

అనూర్మిమత్త్వం దేహేఽస్మిన్ దూరశ్రవణదర్శనమ్ ।
మనోజవః కామరూపం పరకాయప్రవేశనమ్ ॥ 6

స్వచ్ఛన్దమృత్యుర్దేవానాం సహక్రీడానుదర్శనమ్ ।
యథా సంకల్పసంసిద్ధిరాజ్ఞాప్రతిహతా గతిః ॥ 7

ఈ శరీరములో ఆకలి దప్పిక మున్నగు వేగములు లేకుండుట, దూరమునం దున్న విషయముల వినుట, చూచుట, ఇష్టము వచ్చిన ప్రదేశమునకు శరీరము మనస్సుతో సమానమైన వేగముతో వెడలుట, ఇష్టము

వచ్చినరూపమును ధరించుట, పరకాయప్రవేశము చేయుట, ఇష్టము వచ్చినపుడు శరీరమును విడచుట, అప్సరసలతో జరుగు దేవతాక్రీడను దర్శించుట, సంకల్పసిద్ధి, అప్రతిహతమగు ఆదేశము అను నీ పదియును గుణజాత సిద్ధులని తెలిసికొనుము.

త్రికాలజ్ఞత్వమద్వన్ద్వం పరచిత్తాద్యభిజ్ఞతా ।
అగ్న్యర్కాంబువిషాదీనాం ప్రతిష్టంభోఽపరాజయః ॥

ఏతాశ్చోద్దేశతః ప్రోక్తా యోగధారణసిద్ధయః ।
యయా ధారణయా యా స్యాద్యథా వా స్యాన్నిబోధ మే ॥

త్రికాలజ్ఞత్వము, శీతోష్ణాదిద్వంద్వసహిష్ణుత్వము, పరచిత్తాదివిషయక జ్ఞానము, అగ్ని సూర్య జల విషాది ప్రభావ స్తంభనము, అపరాజయము— ఈ యైదును క్షుద్రసిద్ధులు. ఉద్ధవా! వెనుక చెప్పబడిన యోగధారణము వలన గలిగిన సిద్ధుల యన్నింటి నామములను, లక్షణములను జెప్పితిని. ఇప్పుడు ఏధారణద్వారా ఏవిధముగ నెట్టి సిద్ధులు కలుగునో వానిని వివరింతును, వినుము. 8, 9

భూతసూక్ష్మాత్మని మయి తన్మాత్రం ధారయేన్మనః ।
అణిమానమవాప్నోతి తన్మాత్రోపాసకో మమ ॥ 10

సూక్ష్మభూతరూపోపాధిలో నున్న నాయందు సూక్ష్మభూతాకార చిత్తమును ప్రవేశపెట్టి తన్మాత్రోపాసకుడయి నాయణిమసిద్ధిని బొందును.

మహత్తత్త్వాత్మని మయి యథాసంస్థం మనో దధత్ ।
మహిమానమవాప్నోతిభూతానాంచపృథక్పృథక్ ॥ 11

మహత్తత్త్వరూపోపాధిలో నున్న నాయందు అట్టి మహదాకృతి విశిష్ట చిత్తమును ప్రవేశపెట్టినవాడు " మహిమ " యను సిద్ధిని బొందును.

ఇట్లే ఇతరములగు ఆకాశాది భౌతికోపాధులయందు చిత్తమును ప్రవేశ పెట్టుటద్వారా వానికి దగిన విధముగనే మహిమసిద్ధి కలుగును.

పరమాణుమయే చిత్తం భూతానాం మయి రంజయన్ ।
కాలసూక్ష్మార్థతాం యోగీ లఘిమానమవాప్నుయాత్ ॥ 12

వాయువు మున్నగు నాలుగు భూతములకు సంబంధించిన పరమాణు రూపోపాధులలో నున్న నా యందు చిత్తమును లగ్నము చేసిన యోగి కాలసంబంధమగు సూక్ష్మపరమాణువుతో సమానమైన "లఘిమాన" మను సిద్ధిని బొందును.

ధారయన్ మయ్యహంతత్త్వే మనో వైకారికేఽఖిలమ్।
సర్వేంద్రియాణామాత్మత్వం ప్రాప్తిం ప్రాప్నోతి
మన్మనాః ॥ 13

వైకారి (సాత్త్వి) కాహంకారరూపోపాధిలో నున్న నాయందు ఏకాగ్రభావముతో మనస్సు నుంచినయోగి సర్వేంద్రియముల కధిష్ఠాతృ రూపమున నున్న 'ప్రాప్తి'యను సిద్ధిని బొందును.

మహత్యాత్మని యః సూత్రే ధారయేన్మయి మానసమ్ ।
ప్రాకామ్యం పారమేష్ఠ్యం మే విన్దతేఽవ్యక్తజన్మనః ॥ 14

క్రియాశక్తి ప్రధానమగు మహత్తత్త్వరూపోపాధిలో నున్న నాయందు మనస్సు నర్పించినయోగి అవ్యక్తజన్ముడ నగునాకు సంబంధించిన 'ప్రాకామ్య' మనుసిద్ధిని బొందును.

విష్ణౌ త్ర్యధీశ్వరే చిత్తం ధారయేత్కాలవిగ్రహే ।
స ఈశత్వమవాప్నోతి క్షేత్రక్షేత్రజ్ఞచోదనామ్ ॥ 15

త్రిగుణ మాయాధీశ్వరుడను కాలవిగ్రహుడను విష్ణురూపుడను నగు

నాపై మనస్సు నుంచినవాడు జీవులకు, తదుపాధులకు ప్రేరణను గలిగించు 'ఈశిత్వ' మను సిద్ధిని బొందును.

నారాయణే తురీయాఖ్యే భగవచ్ఛబ్దశబ్దితే ।
మనో మయ్యాదధద్యోగీ మద్ధర్మా వశితామియాత్ ॥ 16

భగవానుడను, తురీయాఖ్యుడను, నారాయణస్వరూపుడను నగు నాయందు మనస్సు నుంచినయోగి మదీయధర్మయుక్తుడై 'వశిత్వ' మను సిద్ధిని బొందును (వశిత్వ మనగా గుణములయం దాసక్తి లేకుండుట)

నిర్గుణే బ్రహ్మణి మయి ధారయన్ విశదం మనః ।
పరమానందమాప్నోతి యత్ర కామోఽవసీయతే ॥ 17

నిర్విశేషబ్రహ్మ స్వరూపుడ నగు నాయందు మనస్సు నుంచినవాని సర్వకామ్యములు పరిసమాప్తము లగును. దానివలన నతడు పరమానందమును బొందును.

శ్వేతద్వీపపతౌ చిత్తం శుద్ధే ధర్మమయే మయి ।
ధారయన్ శ్వేతతాం యాతి షడూర్మిరహితో నరః ॥ 18

సాత్త్విక ధర్మానుష్ఠాతను, సత్త్వాత్మకుడను శ్వేతద్వీప పతిని నగు నాయందు మనస్సును లగ్నముచేసిన మానవుడు క్షుధాతృష్ణాది షడూర్ములు లేనివాడై శుద్ధరూపమును బొందును.

మయ్యాకాశాత్మని ప్రాణే మనసా ఘోషముద్వహన్ ।
తత్రోపలబ్ధా భూతానాం హంసో వాచః శృణోత్యసౌ ॥ 19

ఆకాశాత్మక ప్రాణరూపోపాధి విశిష్టుడ నగునాయందు మనస్సుతో నాదచింతనము చేయుజీవుడు ఆకాశమునం దభివ్యక్తము లగుప్రాణుల శబ్దములను దూరమునుండియే వినును.

చక్షుస్త్వష్టరి సంయోజ్య త్వష్టారమపి చక్షుషి ।
మాం తత్ర మనసా ధ్యాయన్ విశ్వం పశ్యతి దూరతః॥ 20

సూర్యమండలమునందు నేత్రములను, నేత్రములయందు సూర్యుని సంయుక్తముచేసి, రెండింటి సంయోగముద్వారా నన్ను ధ్యానించు యోగి దూరమునుండియె సర్వవస్తువులను దర్శించును.

మనో మయి సుసంయోజ్య దేహం తదనువాయునా ।
మద్ధారణానుభావేన తత్రాత్మా యత్ర వై మనః ॥ 21

మనోదేహములను ప్రాణవాయువుతో గూడ నాతో గలిపి నన్ను ధ్యానించువాడు 'మనోజవ' మను సిద్ధిని బొందును. దీని ప్రభావముచే నతడు తలంచిన ప్రదేశమునకు క్షణములో బోగలడు.

యదా మన ఉపాదాయ యద్యద్రూపం బుభూషతి ।
తత్తద్భవేన్మనోరూపం మద్యోగబలమాశ్రియః ॥ 22

మనస్సు నుపాదానకారణముచేసి యోగి తా నేదేవతాది రూపముల ధరింపదలచునో నట్టిరూపములను తన మనస్సున కనుకూలముగ నుండు నట్లు ధరించును. అచింత్య శక్తియుక్తుడ నగు నాయందు మనస్సును లగ్నముచేసినయోగి యిట్టికార్యము చేయసమర్థుడగును

పరకాయం విశన్ సిద్ధ ఆత్మానం తత్ర భావయేత్ ।
పిండం హిత్వా విశేత్ప్రాణో వాయుభూతః
షడంఘ్రివత్ ॥ 23

పరదేహమున ప్రవేశించుట కభిలషించు యోగి తానా శరీరమందే యున్నా ననిభావించును. దానివలన పుష్పమునుండి మఱియొక పుష్పము

మీదకు వెడలు భ్రమరమువలె ప్రాణప్రధాన లింగ శరీరోపాధియుక్తమగు ఆత్మ బాహ్యావాయుమార్గముద్వారా పరశరీరములోనికి ప్రవేశించును.

పార్ష్ణ్యాపీడ్య గుదం ప్రాణం హృదురః కంఠమూర్ధసు ।
ఆరోప్య బ్రహ్మరంధ్రేణ బ్రహ్మ నీత్వోత్సృజేత్తనుమ్॥ 24

కాలిమడమచే గుదద్వారమును నిరోధించి ప్రాణోపాధి యగు ఆత్మను క్రమముగ హృదయ, వక్షఃస్థల, కంఠ, శిరోభాగములకు దీసికొని వెడలవలెను. అచటనుండి బ్రహ్మరంధ్రముద్వారా బ్రహ్మవస్తువుతో గలిపి శరీరమును విడువవలెను.

విహరిష్యన్ సురాక్రీడే మత్స్థం సత్త్వం విభావయేత్ ।
విమానే నోపతిష్ఠంతి సత్త్వవృత్తీః సురస్త్రియః ॥ 25

యోగియైనవాడు దేవవిహార స్థలములలో విహరింప నిచ్ఛగించువాడైన నాశుద్ధ సత్త్వమును భావనచేయవలెను. అట్లుచేసిన సత్త్వగుణాంశ స్వరూపు లగుదేవతాస్త్రీలు విమానములపై నధిరోహించి వానికడకు వెడలుదురు.

యథా సంకల్పయేద్బుద్ధ్యా యదా వా మత్పరః పుమాన్।
మయి సత్యే మనో యుంజంస్తథా తత్సముపాశ్నుతే॥ 26

సత్య సంకల్పమయుడ నగునాయందు మనస్సునుంచి నాపై శ్రద్ధ చూపుయోగిపుంగవుడు మనస్సుచే నేయేవిధము లగువిషయములను సంకల్పించునో నట్టివిషయమునే పొందును.

యో వై మద్భావమాపన్న ఈశితుర్వశితుః పుమాన్ ।
కుతశ్చిన్న విహన్యేత తస్య చాజ్ఞా యథా మమ ॥ 27

సర్వనియంతను, సర్వవశీకర్తను నగునన్ను ధ్యానించుటద్వారా

యోగి ఈశిత్త్వశక్తిని బొందును. వానియాజ్ఞ నాయాజ్ఞవలె అంతట అప్రతిహతముగ వ్యాపించును.

మద్భక్త్యా శుద్ధసత్త్వస్య యోగినో ధారణావిదః ।
తస్య త్రైకాలికీ బుద్ధిర్జన్మమృత్యూపబృంహితా ॥ 28

యోగి నాయందు మనస్సునుంచి నాభక్తిపరిభావముచే శుద్ధుడగును. వాని బుద్ధి జననమరణాది విషయములను గూడ దెలిసికొనగలదు. అంతే కాక భూతభవిష్యద్వర్తమాన విషయములన్నియు వానికి దెలియును.

అగ్న్యాదిభిర్నహన్యేత మునేర్యోగమయం వపుః ।
మద్యోగశ్రాన్తచిత్తస్య యాదసాముదకం యథా ॥ 29

జలముద్వారా జలములో నుండుప్రాణులు నాశనము జెందవు. అట్లే భక్తియోగసంపన్నుడు శాంతచిత్తుడు నగుమునియొక్క యోగపరిపక్వమైన శరీరము అగ్న్యాదులచే నాశనము చెందదు.

మద్విభూతీరభిధ్యాయన్ శ్రీవత్సాస్త్రవిభూషితాః ।
ధ్వజాతపత్రవ్యజనైః స భవేదపరాజితః ॥ 30

ధ్వజము, ఆతపత్రము, వ్యజనము, శ్రీవత్సము — అనువానితోను, శంఖ చక్రగదాపద్మాద్యాయుధములతోను విభూషితుడ నగునాయొక్క యవతారములను ధ్యానించు భక్తుడెల్లపుడ జేయుడై యుండును.

ఉపాసకస్య మామేవం యోగధారణయా మునేః ।
సిద్ధయః పూర్వకథితా ఉపతిష్ఠన్త్యశేషతః ॥ 31

పూర్వోక్తము లగుయోగధారణలచే నన్నుపాసించువానికి వెనుక చెప్పబడిన సిద్ధులన్నియు కలుగును.

జితేన్ద్రియస్య దాన్తస్య జితశ్వాసాత్మనో మునేః ।
మద్ధారణాం ధారయతః కా సా సిద్ధిః సుదుర్లభా ॥ 32

ఇంద్రియములను జయించినవాడు, దాంతుడు, శ్వాసను చిత్తమును జయించినవాడు, మద్ధారణాశీలుడు నగు పురుషునకు లభింపని సిద్ధియేమియు నుండదు.

అంతరాయాన్ వదన్త్యేతా యుంజతో యోగముత్తమమ్ ।
మయా సంపద్యమానస్య కాలక్షపణహేతవః ॥ 33

ఉత్తమభక్తియోగము నాచరించి నాస్వరూపభూతసంపదను బొందుట కభిలషించినవానికి వెనుక జెప్పబడిన సిద్ధులు విఘ్నకరములగును. ఈ సిద్ధులవలన వానిసమయము వ్యర్థమగును.

జన్మౌషధితపోమన్త్రైర్యావతీరిహ సిద్ధయః ।
యోగేనాప్నోతి తాః సర్వా నాన్యైర్యోగగతిం
వ్రజేత్ ॥ 34

ఇహలోకజన్మ, ఓషధి,తపస్సు, మంత్రము మున్నగుసిద్ధులన్నియు మద్ధారణా రూపయోగము ద్వారా లభించును. అన్యోపాయములచే నా సాలోక్యాదిసిద్ధులు లభింపవు

సర్వాసామపి సిద్ధీనాం హేతుః పతిరహం ప్రభుః ।
అహం యోగస్య సాంఖ్యస్య ధర్మస్య బ్రహ్మ
వాదినామ్ ॥ 35

ఉద్ధవా ! నేనే సర్వసిద్ధులకు, యోగమునకు, సాంఖ్యమునకు, నిష్కామకర్మకు, బ్రహ్మవాదులకు, కారణుడను, పాలకుడను ప్రభుస్వరూపుడను నైయున్నాను.

అహమాత్మాఽఽన్తరో బాహ్యోఽనావృతః
సర్వదేహినామ్ ।
యథా భూతాని భూతేషు బహిరన్తః స్వయం తథా ॥ 36

సకలమహాభూతములు చతుర్విధభౌతిక పదార్థముల లోపల బయట విరాజిల్లుచున్నట్లు నేనుగూడ సర్వప్రాణులలో బాహ్యరూపునిగను, అంతరాత్మరూపునిగను విరాజిల్లుచున్నాను.

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే పారమహంస్యాం
సంహితాయాం వైయాసిక్యా
మేకాదశ స్కంధే
పంచదశోఽధ్యాయః

ఈ విధముగ శ్రీమద్భాగవత మహాపురాణము
నందలి యేకాదశస్కంధములోని పదునైదవ
అధ్యాయము సమాప్తము.



# పదునాఱవ అధ్యాయము

## భగవద్విభూతి వర్ణనము

### ఉద్ధవ ఉవాచ.

త్వం బ్రహ్మ పరమం సాక్షాదనాద్యన్తమపావృతమ్ ।
సర్వేషామపి భావానాం త్రాణస్థిత్యప్యయోద్భవః ॥ 1

**ఉద్ధవుడు పలికెను :—** దేవా ! నీవు అనాదివి, అనంతుడవు, నిరావరుణడవు, సాక్షాత్పరబ్రహ్మమవు, సర్వపదార్థముల సృష్టిస్థితి సంహారములకు కారణస్వరూపుడవు

ఉచ్చావచేషు భూతేషు దుర్జ్ఞేయమకృతాత్మభిః ।
ఉపాసతే త్వాం భగవన్ యాథాతథ్యేన బ్రాహ్మణాః ॥ 2

దేవా ! వేదతాత్పర్యమును దెలిసినవారు ఉత్తమాధమ ప్రాణులయన్నింటిలో నున్నవాడవు, పుణ్యహీను లగుజనులచే దెలియబడనివాడవు నగు నీ యథార్థరూపము నారాధింతురు.

యేషు యేషు చ భూతేషు భక్త్యా త్వాం పరమర్షయః ।
ఉపాసీనాః ప్రపద్యన్తే సంసిద్ధిం తద్వదస్వ మే ॥ 3

పరమర్షులు ఏయేభూతములలో భక్తితో నిన్నుపాసింతురో దానిని నాకు వివరింపుము.

గూఢశ్చరసి భూతాత్మా భూతానాం భూతభావన ।
న త్వాం పశ్యన్తి భూతాని పశ్యన్తం మోహితాని తే ॥ 4

సర్వప్రాణులను రక్షించునట్టిదేవా ! నీవు సర్వభూతములలోను నంతర్యామి రూపమున నున్నావు. నీవు వానిలో గూఢభావముగ సంచ

రించుచున్నావు. సర్వభూతములు నీచే మోహితములగుచు సర్వమును జూచునట్టి నిన్ను చూడజాలక పోవుచున్నవి.

యాః కాశ్చ భూమౌ దివి వై రసాయాం
విభూతయో దిక్షు మహావిభూతే ।
తా మహ్యమాఖ్యాహ్యనుభావితాస్తే
నమామి తే తీర్థపదాంఘ్రిపద్మమ్ ॥ 5

అచింత్యైశ్వర్యసంపన్నుడ వగునోదేవా ! స్వర్గమర్త్యపాతాళముల యందును, దిఙ్మండలమునందును నున్న నీ విభూతులను గూర్చి నాకు వివరించి చెప్పుము. సర్వ తీర్థములకు నాశ్రయభూత మగునీ పాదపద్మములకు నమస్కరించుచున్నాను.

## శ్రీ భగవానువాచ

ఏవమేతదహం పృష్టః ప్రశ్నం ప్రశ్నవిదాం వర ।
యుయుత్సునా వినశనే సపత్నైరర్జునేన వై ॥ 6

భగవానుడు పలికెను : ప్రశ్న విదులలో శ్రేష్ఠుడవగు ఉద్ధవా ! కురుక్షేత్రమున శత్రువులతో యుద్ధముజేయ నభిలషించు అర్జునుడు న న్నీ ప్రశ్నమునే యడిగెను.

జ్ఞాత్వా జ్ఞాతివధం గర్హ్యమధర్మం రాజ్యహేతుకమ్ ।
తతో నివృత్తో హన్తాహం హతోఽయమితి లౌకికః॥ 7

'నేను బంధుజన నాశకుడను, ఈబంధువులు నాచే నశించుచున్నారు' — ఇట్టి ప్రాకృతబుద్ధి విశిష్టుడై యర్జునుడు రాజ్యమునకై జ్ఞాతివధ నిందనీయము, అధర్మజనకము నని తెలిసికొని దానినుండి నివృత్తుడయ్యెను.

స తదా పురుషవ్యాఘ్రో యుక్త్యా మే ప్రతిబోధితః ।
అభ్యభాషత మామేవం యదా త్వాం రణమూర్ధని ॥ 8

పురుషశ్రేష్ఠా! నే నాసమయమున యుక్తియుక్తము లగు నుపదేశములతో వానికి యథార్థమగు తత్త్వమును బోధించితిని. ఇపుడు నీ వడిగిన ప్రశ్నమునే అత డపుడు రణరంగమున నన్నడిగెను

అహమాత్మోద్ధవామీషాం భూతానాం సుహృదీశ్వరః ।
అహం సర్వాణి భూతాని తేషాం స్థిత్యుద్భవాప్యయః ॥ 9

ఉద్ధవా! నే నీ ప్రాణుల కన్నింటికి పరమాత్మను, హితకరుడను, ఈశ్వరుడను, సర్వవిధవ్యవహారజనకుడను, సృష్టి స్థితి సంహార కారణ స్వరూపుడను.

అహం గతిర్గతిమతాం కాలః కలయతామహమ్ ।
గుణానాం చాప్యహం సామ్యం గుణిన్యౌత్పత్తికో గుణః॥ 10

నేను గతిశీలము లగు పదార్థములలో పరమగతిని, వశము చేసికొనువారిలో కాలస్వరూపుడను, సత్త్వాది గుణములలో ప్రకృతిని, గుణవంతములగు వస్తువులలో స్వాభావికగుణస్వరూపుడను నై యున్నాను.

గుణినామప్యహం సూత్రం మహతాం చ మహానహమ్ ।
సూక్ష్మాణామప్యహం జీవో దుర్జయానామహం మనః ॥ 11

నేను గుణయుక్తము లగు వస్తువులలో సూత్రాత్ముడను, మహత్పదార్థములలో మహత్తత్త్వమును, సూక్ష్మపదార్థములలో జీవుడను, దుర్జయము లగు పదార్థములలో మనస్స్వరూపుడను,

హిరణ్యగర్భో వేదానాం మంత్రాణాం ప్రణవస్త్రివృత్ ।
అక్షరాణా మకారోఽస్మి పదాని చ్ఛందసామహమ్ ॥ 12

నేను వేదాధ్యాపకులలో హిరణ్యగర్భుడను, మంత్రములలో త్రిమాత్రలతో (అ+ఉ+మ) గూడిన ఓంకారమును. అక్షరములలో అకారమును, ఛందస్సులలో త్రిపదాగాయత్రీ స్వరూపుడను.

ఇంద్రోఽహం సర్వదేవానాం వసూనామస్మి హవ్యవాట్ ।
ఆదిత్యానామహం విష్ణూ రుద్రాణాం నీలలోహితః ॥ 13

దేవతలలో నింద్రుడను, వసువులలో నగ్ని ని, ఆదిత్యులలో విష్ణువును, రుద్రులలో నీలలోహితుడను.

బ్రహ్మర్షీణాం భృగురహం రాజర్షీణామహం మనుః ।
దేవర్షీణాం నారదోఽహం హవిర్ధాన్యస్మి ధేనుషు ॥ 14

బ్రహ్మర్షులలో భృగువును, రాజర్షులలో మనువును, దేవర్షులలో నారదుడను, ధేనువులలో కామధేనువును నేనే.

సిద్ధేశ్వరాణాం కపిలః సుపర్ణోఽహం పతత్త్రిణామ్ ।
ప్రజాపతీనాం దక్షోఽహం పితౄణామహమర్యమా ॥ 15

సిద్ధేశ్వరులలో కపిలుడను నేనే. పక్షులలో గరుడుడను, ప్రజాపతులలో దక్షుడను, పితృగణములలో నర్యముడను నేనే.

మాం విద్ధ్యుద్ధవ దైత్యానాం ప్రహ్లాదమసురేశ్వరమ్ ।
సోమం నక్షత్రౌషధీనాం ధనేశం యక్షరక్షసామ్ ॥ 16

ఉద్ధవా! నేను దైత్యులలో దైత్యరాజగు ప్రహ్లాదుడను, నక్షత్రౌషధులలో సోముడను. యక్షరాక్షసులలో కుబేరుడను నని తెలిసికొనుము.

ఐరావతం గజేన్ద్రాణాం యాదసాం వరుణం ప్రభుమ్ ।
తపతాం ద్యుమతాం సూర్యం మనుష్యాణాం చ
భూపతిమ్ ॥ 17

గజరాజులలో నైరావతమును, జలచరములలో వానికి ప్రభువగు వరుణుడను, తాపనశీలములు, దీప్తిశీలములు నగు పదార్థములలో సూర్యుడను, మనుష్యులలో భూపతిని నేనే.

ఉచ్చైఃశ్రవా స్తురంగాణాం ధాతూనామస్మి కాంచనమ్ ।
యమః సంయమతాం చాహం సర్పాణామస్మి వాసుకిః॥ 18

అశ్వములలో ఉచ్చైఃశ్రవమును, ధాతువులలో సువర్ణమును, దండించువారిలో యముడను, సర్పములలో వాసుకిని నేనే.

నాగేంద్రాణా మనన్తోఽహం మృగేన్ద్రః
శృంగిదంష్ట్రిణామ్ ।
అశ్రమాణామహం తుర్యో వర్ణానాం ప్రథమోఽనఘ॥ 19

ఉద్ధవా ! నాగేంద్రులలో అనంతుడను నేనే. కొమ్ములు, కోఱలు గలిగిన ప్రాణులలో సింహమును నేనే ఆశ్రమములలో సంన్యాసమును, వర్ణములలో బ్రాహ్మణవర్ణమును నేనే.

తీర్థానాం స్రోతసాం గంగా సముద్రః సరసామహమ్ ।
ఆయుధానాం ధనురహం త్రిపురఘ్నో ధనుష్మతామ్ ॥ 20

తీర్థములలోను, నదులలోను గంగను నేనే. జలాశయములలో సముద్రమును, అస్త్రశస్త్రములలో ధనుస్సును, ధనుర్ధారులలో త్రిపురారి యగు శంకరుడను నేనే.

ధిష్ణ్యానామస్మ్యహం మేరుర్గహనానాం హిమాలయః ।
వనస్పతీనామశ్వత్థ ఓషధీనామహం యవః ॥ 21

నివాసస్థానములలో మేరువును నేనే. దుర్గమ స్థానములలో

హిమాలయమును, వృక్షములలో నశ్వత్థమును, ఓషధులలో యవధాన్యమును నేనే.

పురోధసాం వసిష్ఠోఽహం బ్రహ్మిష్ఠానాం బృహస్పతిః ।
స్కందోఽహం సర్వసేనాన్యామగ్రణ్యాం భగవానజః॥ 22

పురోహితులలో వశిష్ఠుడను, వేదజ్ఞులలో బృహస్పతిని, సేనాపతులలో కార్తికేయుడను, సన్మార్గ ప్రవర్తకులలో బ్రహ్మను నేనే

యజ్ఞానాం బ్రహ్మయజ్ఞోఽహం వ్రతానామవిహింసనమ్ ।
వాయ్వగ్న్యర్కాంబువాగాత్మా శుచీనామప్యహం శుచిః ॥ 23

సర్వవిధము లగుయజ్ఞములలో వేదపాఠరూప యజ్ఞ స్వరూపుడను నేనే. వ్రతములలో నహింసావ్రతమును, పరిశుద్ధము చేయుపదార్థములలో వాయువు, అగ్ని, సూర్యుడు, జలము, వాక్కును నేనే.

యోగానామాత్మసంరోధో మంత్రోఽస్మి విజిగీషతామ్ ।
ఆన్వీక్షికీ కౌశలానాం వికల్పః ఖ్యాతివాదినామ్ ॥ 24

అష్టాంగయోగములలో సమాధిస్వరూపుడను నేనే విజయాభిలాషులగు పురుషులలో మంత్రస్వరూపుడను నేనే. సర్వకౌశలములలోను ఆన్వీక్షికీ విద్యాస్వరూపుడను, ఖ్యాతివాదులలో వికల్పస్వరూపుడను నేనే.

స్త్రీణాం తు శతరూపాహం పుంసాం స్వాయంభువో మనుః।
నారాయణో మునీనాం చ కుమారో బ్రహ్మచారిణామ్ ॥

స్త్రీలలో శతరూపను, పురుషులలో స్వాయంభువ మనువును, మునులలో నారాయణుడను, బ్రహ్మచారులలో సనత్కుమారుడను నేనే. 25

ధర్మాణామస్మి సంన్యాసః క్షేమాణామబహిర్మతిః ।
గుహ్యానాం సూనృతం మౌనం మిథునానామజస్త్వహమ్ ।

ధర్మములలో నే నభయప్రదానధర్మ స్వరూపుడను. అభయ స్థానములలో అంతర్నిష్ఠాస్వరూపుడను. గుహ్యావస్తువులలో ప్రియవచన స్వరూపుడను, మౌనస్వరూపుడను. మిథునములలో ప్రజాపతిని.

సంవత్సరోఽస్మ్యనిమిషామృతూనాం మధుమాధవౌ ।
మాసానాం మార్గశీర్షోఽహం నక్షత్రాణాం తథాభిజిత్ ॥ 27

అప్రమత్త పదార్థములలో (కాలములో) సంవత్సర స్వరూపుడను, ఋతువులలో వసంతఋతువును, మాసములలో మార్గశీర్షమాసమును, నక్షత్రములలో అభిజిత్తును నేనే.

అహం యుగానాం చ కృతం ధీరాణాం దేవలోఽసితః ।
ద్వైపాయనోఽస్మి వ్యాసానాం కవీనాం కావ్య ఆత్మవాన్ ॥

యుగములలో కృతయుగమును, ధీరులలో దేవలుడును, అసితుడును నేనే. వేదవిభాగ కర్తలలో ద్వైపాయనుడను. పండితులలో వివేకియగు శుక్రాచార్యుడను నేనే. 28

వాసుదేవో భగవతాం త్వం తు భాగవతేష్వహమ్ ।
కింపురుషాణాం హనుమాన్ విద్యాధ్రాణాం సుదర్శనః ॥ 29

భగవత్పదవాచ్యు లగుపురుషులలో నేను వాసుదేవుడను. భగవద్భక్తులలో నుద్ధవుడను, కింపురుషులలో హనుమంతుడను, విద్యాధరులలో సుదర్శనుడను నేనే,

రత్నానాం పద్మరాగోఽస్మి పద్మకోశః సుపేశసామ్ ।
కుశోఽస్మి దర్భజాతీనాం గవ్యమాజ్యం హవిఃష్వహమ్॥ 30

రత్నములలో పద్మరాగమును, సుందర వస్తువులలో పద్మకోశ మును, దర్భజాతీయ పదార్థములలో కుశమును, హవ్యములలో గోఘృత మును నేనే.

వ్యవసాయినామహం లక్ష్మీః కితవానాం ఛలగ్రహః ।
తితిక్షాస్మి తితిక్షూణాం సత్త్వం సత్త్వవతామహమ్ ॥ 31

వ్యాపారులలో నుండు లక్ష్మిని నేనే. కపటస్వభావు లగుపురుషు లలో ద్యూతమును, కష్టములను సహించువారిలో నుండు క్షమాగుణమును, సాత్త్వికులలో నుండు సత్త్వగుణమును నే నే.

ఓజః సహో బలవతాం కర్మాహం విద్ధి సాత్వతామ్ ।
సాత్వతాం నవమూర్తీ నామాదిమూర్తిరహం పరా ॥ 32

బలవంతులలో నుండు ఉత్సాహము, పరాక్రమము, భగవద్భక్తు లలో నుండు భక్తియుక్త మగు నిష్కామకర్మ నాస్వరూపములే. నవ సాత్వతమూర్తులలో వాసుదేవుడను నేనే. సంకర్షణుడు, ప్రద్యుమ్నుడు, అనిరుద్ధుడు, నారాయణుడు, హయగ్రీవుడు, వరాహుడు, నృసింహుడు, బ్రహ్మ- అను నీ తొమ్మిది సాత్వతమూర్తులలో మొదటిది, (శ్రేష్ఠము నగు మూర్తి అనగా వాసుదేవుడను నేనే )

విశ్వావసుః పూర్వచిత్తిర్గన్ధర్వాప్సరసామహమ్ ।
భూధరాణామహం స్థైర్యం గన్ధమాత్రమహం భువః ॥ 33

నేను గంధర్వులలో విశ్వావసుడను, అప్సరసలలో పూర్వచిత్తిని, భూధరములలో స్థైర్యమును, పృథివిలోని గంధతన్మాత్రమును నై యున్నాను.

అపాం రసశ్చ పరమస్తేజిష్ఠానాం విభావసుః ।
ప్రభా సూర్యేందుతారాణాం శబ్దోఽనాం నభసః పరః ॥

నేను జలములలో రసమును, తేజస్సుగలవారిలో సూర్యుడను, సూర్యచంద్రతారకాగణములలో ప్రభను, ఆకాశములో పరమశబ్దమును నై యున్నాను. 34

బ్రహ్మణ్యానాం బలిరహం వీరాణామహమర్జున ।
భూతానాం స్థితిరుత్పత్తిరహం వై ప్రతిసంక్రమః ॥ 35

నేను బ్రాహ్మణభక్తులలో విరోచనపుత్రు డైన బలిని, వీరులలో నర్జునుడను, ప్రాణుల ఉత్పత్తిస్థితి ప్రళయస్వరూపుడను.

గత్యుక్త్యుత్సర్గోపాదానమానందస్పర్శలక్షణమ్ ।
ఆస్వాదశ్రుత్యవఘ్రాణమహం సర్వేన్ద్రియేన్ద్రియమ్॥ 36

పాదములలో గమనశక్తిని, వాక్కులో మాట్లాడుశక్తిని, పాయువులో మలవిసర్జనశక్తిని, హస్తములలో గ్రహణశక్తిని, జననేంద్రియములో ఆనందోపభోగశక్తిని నేనే. త్వక్కులో స్పర్శశక్తిని, నేత్రములలో దర్శనశక్తిని, నాలుకలో ఆస్వాదనశక్తిని, చెవులలో శ్రవణశక్తిని, నాసికలో అఘ్రాణశక్తిని నేనే.

పృథివీ వాయురాకాశ ఆపో జ్యోతిరహం మహాన్
వికారః పురుషోఽవ్యక్తం రజస్సత్త్వం తమః పరమ్ ।
అహమేతత్ప్రసంఖ్యానం జ్ఞానం తత్త్వవినిశ్చయః ॥ 37

నేనే రూపరసగంధస్పర్శ శబ్దము లనుపంచతన్మాత్రలను, అహంకారము, మహత్తత్త్వము, పంచమహాభూతములు, ఏకాదశేంద్రియములు, పురుషుడు, ప్రకృతి, సత్త్వరజస్తమస్సులు, పరబ్రహ్మము నేనే. ఈ సర్వపదార్థపరిగణనము, జ్ఞానము, వానిఫల మైనతత్త్వనిర్ణయమును నేనే.

మయేశ్వరేణ జీవేన గుణేన గుణినా వినా ।
సర్వాత్మనాపి సర్వేణ న భావో విద్యతే క్వచిత్ ॥ 38

నేను ఈశ్వరుడను, జీవుడను, గుణమును, గుణిని, క్షేత్రజ్ఞుడను. సర్వాత్మకుడను నేనే. నేను లేనిపదార్థ మేదియు లేదు.

సంఖ్యానం పరమాణూనాం కాలేన క్రియతే మయా ।
న తథా మే విభూతీనాం సృజతోఽణ్డాని కోటిశః ॥ 39

లెక్కపెట్టుట మొదలిడినచో ఒకానొకప్పుడి పరమాణువుల నన్నింటిని లెక్కపెట్ట గలుగుదును అయినను అసంఖ్యము లగు బ్రహ్మాండములను సృష్టించు నా విభూతులను లెక్కపెట్టజాలను.

తేజః శ్రీః కీర్తిరైశ్వర్యం హ్రీస్త్యాగః సౌభగం భగః।
వీర్యం తితిక్షా విజ్ఞానం యత్ర యత్ర స మేఽంశకః ॥ 40

వస్తువులలో నుండు తేజస్సు, శ్రీ, కీర్తి, ఐశ్వర్యము, లజ్జ, త్యాగము, సౌందర్యము, సౌభాగ్యము, పరాక్రమము, తితిక్ష, విజ్ఞానము, మున్నగు శ్రేష్ఠగుణము లన్నియు నా యంశములే.

ఏతాస్తే కీర్తితాస్సర్వాః సంక్షేపేణ విభూతయః ।
మనోవికారా ఏవైతే యథా వాచాభిధీయతే ॥ 41

ఉద్ధవా! నీవడిగిన ప్రశ్నలకు సంక్షిప్తముగా విభూతులను వర్ణించి చెప్పితిని. ఇవి యన్నియు పరమార్థవస్తువులు గావు, మనోవికారమాత్రములు, వాఙ్మాత్రకథిములు, ఆకాశకుసుమాదిపదార్థ తుల్యములు. కావున నివి యభినివేశము చూపదగినవి కావు.

వాచం యచ్ఛ మనో యచ్ఛ ప్రాణాన్
యచ్ఛేంద్రియాణిచ ।

ఆత్మానమాత్మనా యచ్ఛ న భూయః
కల్పసేఽధ్వనే ॥ 42

అందువలన వాక్కును, మనస్సును, ప్రాణమును, ఇంద్రియములను, సంయమనము చేయుము. సత్త్వసంపన్న మగు బుద్ధిద్వారా బుద్ధిని సంయమనము చేయుము. దానివలన మఱల సంసార మార్గమున పడవలసిన యవసర ముండదు.

యో వై వాఙ్మనసీ సమ్యగసంయచ్ఛన్ ధియా మతిః ।
తస్యవ్రతం తపోదానం స్రవత్యామఘటాంబువత్ ॥ 43

బుద్ధిద్వారా వాఙ్మనస్సులను చక్కగ సంయమనముజేయని యతుల వ్రతములు, తపస్సు, దానము మున్నగు ననుష్ఠానము లన్నియు పచ్చి కుండలో నున్న జలమువలె వినష్టములగును.

తస్మాన్మనోవచః ప్రాణాన్ నియచ్ఛేన్మత్పరాయణః ।
మద్భక్తియుక్తయా బుద్ధ్యా తతః పరిసమాప్యతే ॥ 44

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే పారమహంస్యాం
సంహితాయాం వైయాసిక్యా మేకాదశ స్కంధే
శ్రీ భగవదుద్ధవసంవాదే మహావిభూతిర్నామ
షోడశోఽధ్యాయః

అందువలన నాభక్తుడు భక్తియుక్త మగుబుద్ధిద్వారా వాక్కును, మనస్సును, ప్రాణములను సంయమనముచేసినచో కృతకృత్యుడు కాగలడు.

ఈ విధముగ శ్రీ మద్భాగవత మహాపురాణము
నందలి యేకాదశస్కంధములోని పదునాఱవ
అధ్యాయము సమాప్తము.

# పదునేడవ అధ్యాయము

## వర్ణాశ్రమ ధర్మ నిరూపణము

### ఉద్ధవ ఉవాచ.

యస్త్వయాభిహితః పూర్వం ధర్మస్త్వద్భక్తిలక్షణః ।
వర్ణాశ్రమాచారవతాం సర్వేషాం ద్విపదామపి ॥ 1

యథానుష్ఠీయమానేన త్వయి భక్తిర్నృణాం భవేత్ ।
స్వధర్మేణారవిన్దాక్ష తన్మమాఖ్యాతుమర్హసి ॥ 2

**ఉద్ధవుడు పలికెను :—** దేవా ! నీవు ఇంతకు పూర్వము వర్ణాశ్రమాచారయుక్తులు, వర్ణాశ్రమాచారవివర్జితులు నగుమానవు లందఱికి సంబంధించిన నీ భక్తిరూపధర్మమును వివరించితివి కమలనయనా ! ఇపు డెట్టిస్వధర్మానుష్ఠానముద్వారా పైనచెప్పబడిన భక్తిలభించునో వివరించి చెప్పుము.

పురాకిల మహాబాహో ధర్మం పరమకం ప్రభో ।
యత్తేన హంసరూపేణ బ్రహ్మణేఽభ్యాత్థ మాధవ ॥ 3

మాధవా ! నీవు మొదట హంసరూపముతో నవతరించి బ్రహ్మకు నీ పరమధర్మము నుపదేశించితివి.

స ఇదానీం సుమహతా కాలేనామిత్రకర్శన ।
న ప్రాయో భవితా మర్త్యలోకే ప్రాగనుశాసితః ॥ 4

శత్రుదమనా ! చాలకాలము గడచుటచే నది యీసమయమున భూలోకమున నష్టప్రాయమైనది.

వక్తా కర్తావితా నాన్యో ధర్మస్యాచ్యుత తే భువి ।
సభాయామపి వైరించ్యాం యత్ర మూర్తిధరాః కలాః॥ 5

అచ్యుతా ! పృథివిలోను, వేదరాశి మూర్తిమంతమై విరాజిల్లు బ్రహ్మసభలోను నీ యీ ధర్మమును ప్రవచనము చేయువాడుగాని, ప్రవర్తింపజేయువాడుగాని, సంరక్షించువాడుగాని నీవుతప్ప మఱి యెవ్వరును లేరు.

కర్త్రావిత్రా ప్రవక్త్రా చ భవతా మధుసూదన ।
త్యక్తే మహీతలే దేవ వినష్టం కః ప్రవక్ష్యతి ॥ 6

మధుసూదనా ! ఈ ధర్మమునకు ప్రవర్తకుడవు, రక్షకుడవు, వక్తవు నగు నీ వీ భూమిని పరిత్యజించినంతనె లుప్తమగు నీ ధర్మమును తరువాత నెవరు వివరింతురు ?

తత్త్వం నః సర్వధర్మజ్ఞ ధర్మస్త్వద్భక్తిలక్షణః ।
యథా యస్య విధీయేత తథా వర్ణయ మే ప్రభో ॥ 7

దేవా ! సర్వధర్మమర్మజ్ఞా ! మనుష్యులలో నీ భక్తిలక్షణధర్మ మెవరి కెట్లువిహితమైయున్నదో నాకు వివరింపుము.

## శ్రీ శుక ఉవాచ

ఇత్థం స్వభృత్యముఖ్యేన పృష్టః స భగవాన్ హరిః ।
ప్రీతః క్షేమాయ మర్త్యానాం ధర్మానాహ సనాతనాన్॥ 8

**శుకుడు పలికెను :** రాజా ! భక్తుడగునుద్ధవు డిట్లుప్రశ్నించినంతనె భగవానుడగుశ్రీకృష్ణుడు మిగుల ప్రసన్నుడై ప్రాణుల హితార్థమై సనాతన మగుభాగవతధర్మముల నిట్లుపదేశించెను.

## శ్రీ భగవానువాచ

ధర్మ్య ఏష తవ ప్రశ్నో నైఃశ్రేయసకరో నృణామ్ ।
వర్ణాశ్రమాచారవతాం తముద్ధవ నిబోధ మే ॥ 9

**భగవానుడు పలికెను:—** ఉద్ధవా ! నీవడిగిన ప్రశ్న ధర్మసంగతము, వర్ణాశ్రమాచారయుక్తు లగుమానవులకు భక్తిజనకము. అందువలన దానికి సమాధానము చెప్పెదను వినుము.

ఆదౌ కృతయుగే వర్ణో నృణాం హంస ఇతి స్మృతః ।
కృతకృత్యాః ప్రజా జాత్యా తస్మాత్కృతయుగం
విదుః ॥ 10

మొదట కృతయుగమున మానవులకు 'హంస'యను వర్ణ మొక్కటియే యుండెను అపుడు మానవులు జన్మచేతనే అనన్యభక్తిపరాయణులై కృతకృత్యు లగుచుండిరి. అందువలన నాయుగమును పండితులు కృతయుగ మనిచెప్పసాగిరి.

వేదః ప్రణవ ఏవాగ్రే ధర్మోఽహం వృషరూపధృక్ ।
ఉపాసతే తపోనిష్ఠా హంసం మాం ముక్తకిల్బిషాః ॥ 11

అపుడు వేదము ప్రణవాత్మకమై (అవిభక్తముగ) ఉండెను. నేను (సత్యదయాశౌచతపస్సు లనెడు) నాలుగుపాదములతో గూడి వృషభరూపమును ధరించిన ధర్మమునై యుంటిని. యజ్ఞాదికర్మ లేవియు అపుడు లేవు. తపోనిష్ఠులై జనులు నా విశుద్ధరూపమును ( హంసరూపమును ) ధ్యానించుచుండిరి.

త్రేతాముఖే మహాభాగ ప్రాణాన్మే హృదయాత్త్రయీ ।
విద్యా ప్రాదురభూత్తస్యా అహమాసం త్రివృన్మఖః ॥ 12

మహాభాగా ! తరువాత త్రేతాయుగ ప్రారంభమున నా ప్రాణము నుండియు హృదయమునుండియు ఋగ్యజుస్సామము లనెడు మూడువేద ములు ఆవిర్భవించెను ఆ త్రయీవిద్యనుండి హౌత్ర, ఆధ్వర్యవ, ఔద్గా త్రము లనుమూడువిధము లగుయజ్ఞరూపములను ధరించితిని.

విప్రక్షత్రియవిట్ శూద్రా ముఖబాహూరుపాదజాః ।
వైరాజాత్ పురుషాజ్జాతా య ఆత్మాచారలక్షణాః ॥ 13

పిమ్మట స్వధర్మరూపలక్షణయుక్తు లగుబ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు, శూద్రులు అను నీచతుర్వర్ణములవారు విరాట్పురుషుని ముఖము నుండి, బాహువులనుండి, ఊరువులనుండి, పాదములనుండి క్రమముగ నావిర్భవించిరి :

గృహాశ్రమో జఘనతో బ్రహ్మచర్యం హృదో మమ ।
వక్షస్థలాద్వనే వాసః సన్న్యాసః శిరసి స్థితః ॥ 14

నా జఘనప్రదేశమునుండి గృహస్థాశ్రమము, హృదయమునుండి నైష్ఠిక బ్రహ్మచర్యము, వక్షఃస్థలమునుండి వానప్రస్థాశ్రమము, మస్త కమునుండి సన్న్యాసాశ్రమము పుట్టినవి

వర్ణానామాశ్రమాణాం చ జన్మభూమ్యనుసారిణీః ।
ఆసన్ ప్రకృతయో నృణాం నీచైర్నీచోత్త
మోత్తమాః ॥ 15

అందువలన వర్ణాశ్రమములయందలి మానవుల స్వభావములు గూడ ఉత్పత్తిస్థానముల ననుసరించి ఉత్తమాధమములుగ నుండును. (అనగా నుత్తమస్థానములనుండి పుట్టిన వర్ణాశ్రమముల స్వభావములు ఉత్తమ ములుగను అధమస్థానములనుండి పుట్టిన వర్ణాశ్రమముల స్వభావములు అధమముగను నుండును.)

శమో దమ స్తపః శౌచం సంతోషః క్షాంతిరార్జవమ్ ।
మద్భక్తిశ్చ దయా సత్యం బ్రహ్మప్రకృతయ స్త్విమాః॥ 16

శమము, దమము, తపస్సు, శౌచము, సంతోషము, క్షమ, సరళత్వము, నాయందలి భక్తి, దయ, సత్యము,—ఇవి యన్నియు బ్రాహ్మణుని స్వభావములని తెలిసికొనుము.

తేజో బలం ధృతిః శౌర్యం తితిక్షౌదార్యముద్యమః ।
స్థైర్యం బ్రహ్మణ్యతైశ్వర్యం క్షత్రప్రకృతయ స్త్విమాః॥ 17

తేజస్సు, బలము, శౌర్యము, ఐశ్వర్యము, ధైర్యము, ప్రభావము, సహిష్ణుత, ఔదార్యము, ఉద్యమము స్థైర్యము, బ్రాహ్మణ హితైషిత్వము (బ్రాహ్మణుని మేలుకోరుట)—ఇవియన్నియు క్షత్రియుని స్వభావములు.

ఆస్తిక్యం దాననిష్ఠా చ అదంభో బ్రహ్మసేవనమ్ ।
అతుష్టిరర్థోపచయై ర్వైశ్యప్రకృతయ స్త్విమాః ॥ 18

ఆస్తిక్యము, దానశీలత, దంభహీనత, బ్రాహ్మణసేవ, ధనసంచయముచే సంతుష్టి చెందకుండుట అనునివి వైశ్యవర్ణస్వభావములు.

శుశ్రూషణం ద్విజగవాం దేవానాం చాప్యమాయయా ।
తత్ర లబ్ధేన సంతోషః శూద్రప్రకృతయ స్త్విమాః ॥ 19

నిష్కపట భావముతో బ్రాహ్మణులను, గోవులను, దేవతలను సేవించుట, దానివలన లభించినదానితో సంతుష్టిచెందుట యనునవి శూద్ర వర్ణధర్మములు.

అశౌచమనృతం స్తేయం నాస్తిక్యం శుష్కవిగ్రహః ।
కామః క్రోధశ్చ తర్షశ్చ స్వభావోఽన్త్యేవ
సాయినామ్ ॥ 20

అశౌచము, అనత్యము, చౌర్యము, నాస్తిక్యము. వృథాకలహము, కామము, క్రోధము, విషయతృష్ణ — ఇవి అంత్యజు లగు మానవుల స్వభావములు.

అహింసా సత్యమస్తేయమకామక్రోధలోభతా ।
భూతప్రియహితేహా చ ధర్మోఽయం సార్వవర్ణికః ॥ 21

అహింస, సత్యము, అస్తేయము, అకామము, అక్రోధము, అలోభము, సర్వభూతప్రీతి, సర్వభూతహితకామన — ఇవి సర్వమానవుల ధర్మములు.

ద్వితీయం ప్రాప్యానుపూర్వ్యాజ్జన్మోపనయనం ద్విజః ।
వసన్ గురుకులే దాన్తో బ్రహ్మాధీయీత చాహూతః ॥ 22

ద్విజుడు (అనగా బ్రాహ్మణక్షత్రియ వైశ్యులు) గర్భాధానాది సంస్కార క్రమముతో నుపనయన మను ద్వితీయ జన్మను బొంది, అచార్యునిచే నామంత్రితుడయి, గురుకులమున నుండి జితేంద్రియుడయి వేదము నధ్యయనము జేయవలయును.

మేఖలాజినదండాక్షబ్రహ్మసూత్రకమండలూన్ ।
జటిలోఽధౌతదద్వాసోఽరక్తపీఠః కుశాన్ దధత్ ॥ 23

జడలను, మేఖలను, అజినమును, దండమును, అక్షమాలను, యజ్ఞోపవీతమును, కమండలమును, దర్భలను ధరింపవలెను: పండ్లను తోముకొనరాదు. వస్త్రముల నుతుకరాదు. రంగు వేసిన పీట పై గూర్చుండరాదు.

స్నానభోజనహోమేషు జపోచ్చారే చ వాగ్యతః ।
న చ్ఛిన్ద్యాన్నఖరోమాణి కక్షోపస్థగతాన్యపి ॥ 24

స్నాన, భోజన, హోమ, జపములను జేయునప్పుడును, మల మూత్రములను విడుచునప్పుడును మౌనముగ నుండవలెను. కక్షప్రదేశమునందు ఉపస్థప్రదేశమునందు నున్న రోమములను, నఖములను తీసి వేయరాదు.

రేతో నావకిరేజ్జాతు బ్రహ్మవ్రతధరః స్వయమ్ ।
అవకీర్ణేఽవగాహ్యాప్సు యతాసుస్త్రిపదాం జపేత్ ॥ 25

బ్రహ్మచారి యెప్పుడును బుద్ధిపూర్వకముగా వీర్యపాతము చేయ రాదు. స్వప్నాదులలో వీర్యము పతనము చెందినచో నీటియందు స్నానముచేసి ప్రాణాయామమును జేయవలెను. అనంతరము గాయత్రిని జపింపవలెను.

అగ్న్యర్కాచార్యగోవిప్రగురువృద్ధసురాన్ శుచిః ।
సమాహిత ఉపాసీత సంధ్యే ద్వే యతవాగ్జపన్ ॥ 26

పవిత్రుడు, ఏకాగ్రచిత్తుడు, మౌనియు నయి బ్రహ్మచారి ప్రాత స్సాయంసంధ్యలయందు సంధ్యోపాసనను, గాయత్రిని జపింపవలెను. అగ్నిని, సూర్యుని, ఆచార్యుని, గోవును, బ్రాహ్మణుని, గురువును, వృద్ధులను, దేవతలను పూజింపవలెను.

ఆచార్యం మాం విజానీయాన్నావమన్యేత కర్హిచిత్ ।
న మర్త్యబుద్ధ్యాసూయేత సర్వదేవమయో గురుః ॥ 27

ఆచార్యుని నా స్వరూపమే యని తెలిసికొనవలెను. ఎప్పుడును ఆయన నవమానపఱచరాదు. గురువు సర్వదేవస్వరూపుడగుటవలన ఆయ నను సాధారణమనుష్యునిగా భావించి, దోషదృష్టితో జూడరాదు.

సాయం ప్రాతరుపానీయ భైక్ష్యం తస్మై నివేదయేత్ ।
యచ్చాన్యదప్యనుజ్ఞాతముపయుంజీత సంయతః ॥ 2

ప్రాతస్సాయంసంధ్యలయందు భిక్షలో లభించిన అన్నాదివస్తువు
నన్నింటిని దెచ్చి గురువునకు నివేదింపవలెను. తరువాత ఆయన అను
ననుసరించి సంయమముతో నా పదార్థమును స్వీకరింపవలెను.

శుశ్రూషమాణ ఆచార్యం సదోపాసీత నీచవత్ ।
యానశయ్యాసనస్థానైర్నాతిదూరే కృతాంజలిః ॥ 2

గురుసేవారతు డగుమానవుడు ఆచార్యుడు వెడలుచున్న ఆయ
వెంట తాను నీచునివలె వెడలవలెను. నిద్రాసమయమున నప్రమత్తభా
ముతో ఆయన సమీపమున నిద్రింపవలెను. విశ్రాంతి సమయమున ద
జీగా గూర్చుండి ఆయనకు పాదసంవాహనము చేయవలెను. కూర్చు
న్నపుడు కృతాంజలియై, ఆయన ఆదేశమునకై కొలది దూరములో నుం
నిరీక్షించు చుండవలెను. ఇట్లెల్లప్పుడును గురుదేవుని ఆరాధించ
చుండవలెను.

ఏవంవృత్తో గురుకులే వసేద్భోగవివర్జితః ।
విద్యా సమాప్యతే యావద్బిభ్రద్వ్రతమఖండితమ్ ॥ 3

వేదాధ్యయనము పూర్తి యగువఱకు భోగములను విడచి, పై
చెప్పిన నియమములను పాలించుచు గురుకులమునందుండి అఖండబ్రహ్మ
చర్యవ్రతము నాచరింపవలెను.

యద్యసౌ ఛందసాం లోకమారోక్ష్యన్ బ్రహ్మవిష్టపమ్ ।
గురవే విన్యసేద్దేహం స్వాధ్యాయార్థం బృహద్వ్రతః ॥ 31

నైష్ఠికబ్రహ్మచారి మహర్లోకమునకు, అచటినుండి బ్రహ్మలోకము

నకు వెడలదలచిన వేదముల నధ్యయనముజేయుటకు తన జీవితము నంత టిని ఆచార్యుని సేవకై సమర్పింపవలెను.

అగ్నౌ గురావాత్మని చ సర్వభూతేషు మాం పరమ్ ।
అపృథగ్ధీరుపాసీత బ్రహ్మవర్చస్వ్యకల్మషః ॥ 32

అతడు బ్రహ్మతేజస్సంపన్నుడు, పాపరహితుడునై అగ్ని, గురువు, నిజాత్మలందును, సర్వభూతములయందును అభేదబుద్ధితో పరమాత్మరూపుడ నగునన్ను ఉపాసింపవలెను

స్త్రీణాం నిరీక్షణస్పర్శసంలాపక్ష్వేళనాదికమ్ ।
ప్రాణినో మిథునీభూతానగృహస్థోఽగ్రతస్త్యజేత్ ॥ 33

గృహస్థుకాక మిగిలిన ఆశ్రమములవారు స్త్రీలను జూచుట, స్పృశించుట, వారితో సంభాషించుట, పరిహసించుట మున్నగు క్రియలను విడువవలెను. మైథునరతులగు ప్రాణులను జూడరాదు.

శౌచమాచమనం స్నానం సంధ్యోపాస్తిర్మమార్చనమ్ ।
తీర్థసేవా జపోఽస్పృశ్యాభక్ష్యాసంభాష్యవర్జనమ్ ॥ 34
సర్వాశ్రమప్రయుక్తోఽయం నియమః కులనందన ।
మద్భావః సర్వభూతేషు మనోవాక్కాయసంయమః ॥ 35

ఉద్ధవా ః శౌచము, ఆచమనము, స్నానము, సంధ్యోపాసనము, విష్ణుపూజ, తీర్థసేవనము, జపము, అస్పృశ్యులను స్పృశింపకుండుట, అభక్ష్యవస్తువులను భక్షింపకుండుట, సంభాషించుటకు దగనివారితో సంభాషింపకుండనుండుట, సర్వభూతములయందు అంతర్యామిగ నేనే యున్నానని తెలిసికొనుట, మనోవాక్కాయములను అదుపులో నుంచుకొనుట— అను నీ నియమములు సర్వాశ్రయములవారికి సంబంధించినవే.

ఏవం బృహద్వ్రతధరో బ్రాహ్మణోఽగ్నిరివ జ్వలన్ ।
మద్భక్తస్తీవ్రతపసా దగ్ధకర్మాశయోఽమలః ॥ 36

ఇట్లే నైష్ఠికబ్రహ్మచారి యగు బ్రాహ్మణుడు ఈ నియమములను పాలించుటచే బ్రహ్మతేజస్సంపన్నుడయి అగ్నివలె ప్రకాశించును. తీవ్రమగు తపోబలమువలన వాని కర్మవాసన లన్నియు నాశనమగును. దాని వలన నిష్కాముడై నాయందు భక్తిగలవా డగును.

అథానంతరమావేక్ష్యన్ యథాజిజ్ఞాసితాగమః ।
గురవే దక్షిణాం దత్త్వా స్నాయాద్గుర్వనుమోదితః ॥ 37

అనంతరము గృహస్థాశ్రమమున ప్రవేశింపదలచిన బ్రహ్మచారి యథావిధిగ వేదాధ్యయనమును బూర్తిచేసి, గురువునకు దక్షిణ నిచ్చి ఆయన యనుమతిని బడసి, అభ్యంగనాదుల నాచరించి సమావర్తనము జేసికొనవలెను.

గృహం వనం నోపవిశేత్ ప్రవ్రజేద్వా ద్విజోత్తమః ।
ఆశ్రమాదాశ్రమం గచ్ఛేన్నాన్యథా మత్పరశ్చరేత్ ॥ 38

సకాముడయినచో బ్రహ్మచర్యాశ్రమమునుండి గృహస్థాశ్రమము లోనికి, నిష్కామియైనచో వానప్రస్థాశ్రమములోనికి వెడలవలెను. నిష్కామియైన బ్రాహ్మణశ్రేష్ఠుడు సన్న్యసాశ్రమమును స్వీకరింపవలెను. లేనిచో క్రమముగ నొక ఆశ్రమమునుండి మఱియొక ఆశ్రమములోనికి వెడలవలెను. నాభక్తుడైనవా డీనియమముల నుల్లంఘింపడు.

గృహార్థీ సదృశీం భార్యాముద్వహేదజుగుప్సితామ్ ।
యవీయసీంతు వయసా యాం సవర్ణామనుక్రమాత్ ॥ 39

గృహస్థాశ్రమాభిలాషి యగుబ్రాహ్మణుడు తనకు దగినది, సర్వ

లక్షణసంపన్నురాలు, కులీనురాలు నగుకన్యను వివాహము చేసికొనవలెను. ఆ కన్య తనకంటె వయస్సులో చిన్నదిగను, సవర్ణయు నై యుండవలెను. కామవశుడై యితరవర్ణములలోని కన్యలను వివాహము చేసికొనదలచిన క్రమముగ తనకంటె తక్కువ వర్ణములవారిని చేసికొనవలెను

ఇజ్యాధ్యయనదానాని సర్వేషాం చ ద్విజన్మనామ్ ।
ప్రతిగ్రహోఽధ్యాపనం చ బ్రాహ్మణస్యైవ యాజనమ్॥ 40

యజ్ఞయాగాదులను, అధ్యయనమును, దానమును జేయునధికారము బ్రాహ్మణక్షత్రియవైశ్య వర్ణములవారికి సమానరూపముగ నున్నది. ప్రతిగ్రహణము, అధ్యయనము, యజనము—అను నీ మూడువృత్తులు కేవలము బ్రాహ్మణధర్మము లై యున్నవి.

ప్రతిగ్రహం మన్యమానస్తపస్తేజో యశోనుదమ్ ।
అన్యాభ్యామేవ జీవేత శిలైర్వా దోషదృక్ తయోః ॥ 41

దానము దీసికొనుట యనువృత్తి తపస్సును, తేజస్సును, యశస్సును నాశనముచేయునని తలంచినచో అధ్యాపనయాజనములద్వారా జీవనమును నిర్వహించుకొనవలెను. ఈరెండుకర్మలుగూడ దోషజుష్టములే యని భావించినచో శిలావృత్తి (ధాన్యమును గోసినతరువాత పొలములలో క్రింద పడిన గింజలను ఏరికొనుట) ద్వారా జీవనమును గడుపుకొనవలెను.

బ్రాహ్మణస్య హి దేహోఽయం క్షుద్రకామాయ నేష్యతే ।
కృచ్ఛ్రాయ తపసే చేహ ప్రేత్యానన్తసుఖాయ చ ॥ 42

బ్రాహ్మణుని యీదేహము క్షుద్రము లైనకామోపభోగములకొఱకు గాక కఠినమగు తపస్సు చేయుటకు, పరలోకమునం దనంతసుఖముల ననుభవించుటకు నిర్మిత మైనదని తెలిసికొనుము.

శిలోంఛవృత్త్యా పరితుష్టచిత్తో
ధర్మం మహాన్తం విరజం జుషాణః ।
మయ్యర్పితాత్మా గృహ ఏవ తిష్ఠ-
న్నాతిప్రసక్తః సముపైతి శాన్తిమ్ ॥ 43

శిలావృత్తి ఉంఛవృత్తులద్వారా పరితృప్తుడై, నిష్కామభావముతో ఆతిథ్యము మున్నగు నుత్తమధర్మముల నాచరించుచు నాయందు మనస్సును లగ్నముచేసి అధికభోగపరాయణుడు గానిమానవుడు గృహస్థాశ్రమము నందే మోక్షమును బొందగలుగును.

సముద్ధరన్తి యే విప్రం సీదన్తం మత్పరాయణమ్ ।
తానుద్ధరిష్యే న చిరాదాపద్భ్యో నౌరివార్ణవాత్ ॥ 44

దారిద్ర్యాదికష్టములలో జిక్కుకొనినవాడు, నాభక్తుడు నగుబ్రాహ్మణునిగాని లేదా కష్టములలో జిక్కుకొనిన మఱియెవ్వరినైనగాని రక్షించిన మానవుని, సముద్రములో మునిగిపోవు మానవుని రక్షించు నౌకవలె నేను సమస్తము లగుఆపదలనుండి వెంటనే కాపాడుదును.

సర్వాః సముద్ధరేద్రాజా పితేవ వ్యసనాత్ప్రజాః ।
ఆత్మానమాత్మనా ధీరో యథా గజపతిర్గజాన్ ॥ 45

గజరాజు ఇతరగజములను, తనను, ధైర్యముతో రక్షించుకొనునట్లు ధీరుడగునరపతిగూడ తండ్రివలె విపత్తులనుండి సర్వప్రజను, తనను రక్షించుకొనును.

ఏవంవిధో నరపతిర్విమానేనార్కవర్చసా ।
విధూయేహాశుభం కృత్స్నమిన్ద్రేణ సహ మోదతే ॥ 46

ఇట్టిరాజు ఇహలోకమున సర్వపాపములనుండి ముక్తుడై సూర్యని

వలె ప్రకాశించు విమానము నెక్కి స్వర్గలోకమునకు వెడలి ఇంద్రునితో గూడి సుఖముల ననుభవించును.

సీదన్ విప్రో వణిగ్వృత్త్యా పణ్యైరేవాపదం తరేత్ ।
ఖడ్గేన వాఽఽపదాక్రాన్తో న శ్వవృత్త్యా కథంచన ॥ 47

నిజవృత్తిచే జీవికను నిర్వహింపజాలని దారిద్ర్యపీడితు డగు విప్రుడు వైశ్యవృత్తిని స్వీకరించి విక్రయించుటకు దగిన ద్రవ్యములను విక్రయించి దానిద్వారా విపత్తులనుండి బయటబడును. వైశ్యవృత్తిచేత గూడ ఆపదలు గలిగినచో ఖడ్గమును ధరించును అనగా క్షత్రియవృత్తిని స్వీకరించును. కాని యెప్పుడును నీచవృత్తిని స్వీకరింపరాదు.

వైశ్యవృత్త్యా తు రాజన్యో జీవేన్మృగయయాఽఽపది ।
చరేద్వా విప్రరూపేణ న శ్వవృత్త్యా కథంచన ॥ 48

క్షత్రియుడు ఆపదలయం దున్నపుడు వైశ్యవృత్తిద్వారా, వేట ద్వారా లేదా అధ్యాపనాది బ్రాహ్మణవృత్తులద్వారా జీవితమును గడుపుకొనవలెనేగాని, హీనవృత్తి ద్వారా గడుపుకొనరాదు.

శూద్రవృత్తిం భజేద్వైశ్యః శూద్రః కారుకటక్రియామ్ ।
కృచ్ఛ్రాన్ముక్తో న గర్హ్యేణ వృత్తిం లిప్సేత కర్మణా॥ 49

వైశ్యుడు విపత్కాలమున శూద్రవృత్తిని, శూద్రుడు చాప లల్లుట మున్నగు కారుజాతీయవృత్తులను స్వీకరింపవలెను. కాని అపదలనుండి ముక్తుడైనవా డెవ్వడును దూష్యము లగుకర్మలచే తన జీవితమును నిర్వహించుకొనుట కిష్టపడరాదు

వేదాధ్యాయస్వధాస్వాహా బల్యన్నాద్యైర్యథోదయమ్ ।
దేవర్షిపితృభూతాని మద్రూపాణ్యన్వహం యజేత్ ॥ 50

గృహస్థు ప్రతిదినము వేదాధ్యయనముచే ఋషులను, స్వధామంత్రములచే పితృదేవతలను, స్వాహామంత్రములచే దేవతలను, ఉపహారవస్తువులచే భూతములను, అన్నోదకాదులచే మనుష్యులను ఆరాధింపవలెను.

యదృచ్ఛయోపపన్నేన శుక్లేనోపార్జితేన వా ।
ధనేనాపీడయన్ భృత్యాన్ న్యాయేనైవాహరేత్
క్రతూన్ ॥ 51

అనాయాసముగ లభించినదానిచేత, లేదా స్వవృత్తిచే సంపాదితమైనధనముచేత భృత్యులను, ఆశ్రితు లగుపరిజలను పాలించుచు, యథాశక్తిగ యజ్ఞాదికర్మల నాచరింపవలెను.

కుటుంబేషు న సజ్జేత న ప్రమాద్యేత్ కుటుంబ్యపి ।
విపశ్చిన్నశ్వరం పశ్యేదదృష్టమపి దృష్టవత్ ॥ 52

గృహస్థు బహుకుటుంబికుడైనను దానియం దాసక్తుడైయుండరాదు. భగవత్సేవయం దెల్లపుడును సావధానుడైయుండవలెను. విద్వాంసుడగుపురుషుడు స్వర్గాదిపారలౌకికభోగములను ఐహికభోగములవలె నశ్వరము లనితెలిసికొనవలెను.

పుత్రదారాప్తబంధూనాం సంగమః పాంథసంగమః ।
అనుదేహం వియన్త్యేతే స్వప్నో నిద్రానుగో యథా ॥ 53

పుత్రులు, భార్య, ఆప్తులు, బంధువులు మున్నగువారితోడి సమా

గమము చలివేంద్రలో బాటసారులతోడి సమాగమమువలె క్షణిక మనితెలిసి కొనుము. స్వప్నదృష్ట పదార్థములు నిద్రావసానమున వినష్టము లగునట్లు పుత్రాదుల సంబంధముగూడ శరీర మున్నంతవఱకే యుండి పిమ్మట నశించును.

ఇత్థం పరిమృశన్ముక్తో గృహేష్వతిథివద్వసన్ ।
న గృహైరనుబధ్యేత నిర్మమో నిరహంకృతః ॥ 54

ఇట్లాలోచించి అనాసక్తభావముతో అతిథివలె గృహము నందుండి మమత్వమును, అహంకారమును విడచినవాడు గృహస్థధర్మబద్ధుడు గాడు.

కర్మభిర్గృహమేధీయైరిష్ట్వా మామేవ భక్తిమాన్ ।
తిష్ఠేద్వనం వోపవిశేత్ ప్రజావాన్ వా పరివ్రజేత్ ॥ 55

భక్తుడగుపురుషుడు గృహస్థోచితము లగుకర్మలద్వారా నన్నారాధించుచు గృహములో నుండవచ్చును, లేదా వనమునకు వెడలవచ్చును, లేదా పుత్రవంతుడైనచో సన్న్యాసమును స్వీకరింపవచ్చును.

యస్త్వాసక్తమతిర్గేహే పుత్రవిత్తైషణాతురః ।
స్త్రైణః కృపణధీర్మూఢో మమాహమితి బధ్యతే ॥ 56

స్త్రీవశుడు, మూఢుడు, వివేకశూన్యుడు, పుత్రవిత్తాదిసంధానరతుడు నగుగృహస్థువు గృహమునం దాసక్తుడైనచో అహంకారమమకారములచే బద్ధుడగును.

అహో మే పితరౌ వృద్ధౌ భార్యా బాలాత్మజాఽఽత్మజాః।
అనాథా మామృతే దీనాః కథం జీవన్తి దుఃఖితాః ॥ 57

వృద్ధు లగునాతల్లిదండ్రులు, చిన్నపిల్లలతో గూడిన నాభార్య, పుత్రిలు నేను లేనిచో దీనులు, అనాథులు, దుఃఖితులు నగుదురు, అనంతరము వీ రెట్లుబ్రతుకుదురు ?

ఏవం గృహాశయాక్షి ప్తహృదయో మూఢధీరయమ్ ।
అతృ ప్తస్తాననుధ్యాయన్ మృతోఽన్ధం విశతే తమః ॥ 58

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే పారమహంస్యాం
సంహితాయాం వైయాసిక్యా మేకాదశ స్కంధే
శ్రీ భగవదుద్ధవసంవాదే వర్ణాశ్రమవిభాగోనామ
సప్తదశోఽధ్యాయః

అవివేకి యగుపురుషుడు గృహస్థవాసనావిక్షిప్త చిత్తుడు, అతృప్తుడునై ఆత్మీయులనుగూర్చి ఆలోచించుచు మరణానంతరము ఘోరతమోమయ మగునరకమున బడును.

ఈ విధముగ శ్రీ మద్భాగవత మహాపురాణము
నందలి యేకాదశస్కంధములోని పదునేడవ
అధ్యాయము సమాప్తము.

# పదునెనిమిదవ అధ్యాయము

## వానప్రస్థ సన్న్యాస ధర్మములు.

### శ్రీ భగవానువాచ.

వనం వివిక్షుః పుత్రేషు భార్యాం న్యస్య సహైవ వా ।
వన ఏవ వసేచ్ఛాన్తస్తృతీయం భాగమాయుషః ॥ 1

**భగవానుడు పలికెను :—** ఉద్ధవా ! వానప్రస్థాశ్రమమున ప్రవేశింపగోరువ్యక్తి భార్యను పుత్రులరక్షణలో నుంచికాని లేదా వెంట బెట్టుకొనిగాని శాంతచిత్తుడై తనజీవితములోని మూడవభాగమును గడుపవలెను.

కందమూలఫలైర్వన్యైర్మేధ్యైర్వృత్తిం ప్రకల్పయేత్ ।
వసీత వల్కలం వాసస్తృణపర్ణాజినాని వా ॥ 2

వనజాతములు, పవిత్రములు నగుకందమూల ఫలములద్వారా జీవితమును గడుపుకొనవలెను, జింకచర్మమునుగాని, నారచీరలనుగాని, తృణమునుగాని, పత్రములనుగాని ధరింపవలెను.

కేశరోమనఖశ్మశ్రుమలాని విభృయాద్దతః ।
న ధావేదప్సు మజ్జేత త్రికాలం స్థండిలేశయః ॥ 3

కేశములను, రోమములను, నఖములను, మీసములను, శరీరమలమును తొలగింపరాదు. దంతధావనమును జేయరాదు. మూడువేళల స్నానముచేయవలెను. భూమిపై పరుండవలెను.

గ్రీష్మే తప్యేత పంచాగ్నీన్ వర్షాస్వాసారషాడ్జలే ।
ఆకంఠమగ్నః శిశిరే ఏవం వృత్తస్తపశ్చరేత్ ॥ 4

గ్రీష్మకాలమున పంచాగ్నిమధ్యలోను, వర్షాకాలమునందు బహి రంగప్రదేశమందును, శీతకాలమున జలములో కంఠమువఱకును నుం తపస్సును జేయవలెను.

అగ్నిపక్వం సమాశ్నీయాత్ కాలపక్వమథాపి వా ।
ఉలూఖలాశ్మకుట్టో వా దంతోలూఖల ఏవ వా ॥

అగ్నిపక్వములగు కందమూలాదులను, లేదా కాలపక్వము లగ ఫలాదులను భక్షింపవలెను. ధాన్యమును ఱోలులోగాని, రాతిమీదగా దంచవలెను. లేదా దంతములచే నులూఖల కార్యమునుగాని జేయవలెను.

స్వయం సంచినుయాత్సర్వమాత్మనో వృత్తికారణమ్ ।
దేశకాలబలాభిజ్ఞో నాదదీతాన్యదాఽఽహృతమ్ ॥ 6

దేశకాలబలముల నెఱింగి, తదనుసారముగ తన జీవికకు సామాన్య ముగ నుపయోగపడు సర్వవస్తువులను స్వయముగ సంపాదించుకొనవలెను. ఒకానొక సమయమున గూడబెట్టుకొనిన వస్తువులను ఇతరసమయములలో స్వీకరింపరాదు.

వన్యైశ్చరుపురోడాశైర్నిర్వపేత్కాలచోదితాన్ ।
న తు శ్రౌతేన పశునా మాం యజేత వనాశ్రమీ ॥ 7

వానప్రస్థధర్మము ననుసరించువారు వనములో బండు నీవారాది సస్యములచే సిద్ధమైన చరుపురోడాశాదులచే ఆగ్రయణాది కాలోక్తము లగు ధర్మముల నాచరింపవలెను. కాని శ్రుతివిహిత మగుపశుమాంసముచే నన్నా రాధింపరాదు.

అగ్నిహోత్రం చ దర్శశ్చ పౌర్ణమాసశ్చ పూర్వవత్ ।
చాతుర్మాస్యాని చ మునేరామ్నాతాని చ నైగమైః ॥ 8

వానప్రస్థుడు గృహస్థునివలె అగ్నిహోత్రమును, దర్శపౌర్ణమాసములను, చాతుర్మాస్యాదులను నాచరింపవలె ననివేదవిదులు నిర్ణయించిరి.

ఏవం చీర్ణేన తపసా మునిర్ధమని సంతతః ।
మాం తపోమయమారాధ్య ఋషిలోకాదుపైతి మామ్॥ 9

ఇట్లు జీవితాంతమువఱకు తపస్సుచేయుటద్వారా ముని శుష్కదేహుడగును, వాని శరీరములోని మాంసమంతయు ఎండిపోవును. వానిలోని యొక్కొక్క నరము బయట కగపడసాగును. తపోమయుడ నగున న్నిట్లారాధించి అతడు ఋషిలోకమునకు వెడలును. అనంతరము నన్ను బొంది ముక్తుడగును.

యస్త్వేతత్కృచ్ఛ్రతశ్చీర్ణం తపో నిశ్శ్రేయసం మహత్ ।
కామాయాల్పీయసే యుంజ్యాద్బాలిశః కోఽపరస్తతః॥ 10

మోక్షఫలజనకము, మహాకష్ట సంచితము నగునిట్టి యుత్తమ తపస్సును స్వర్గాదితుచ్ఛఫలములను బొందుటకు వినియోగించినచో నంతకన్న మూర్ఖత్వ మింకేమి యుండగలదు? అందువలన తపోనుష్ఠానమును నిష్కామభావముతోనే చేయవలెను.

యదాసౌ నియమేఽకల్పో జరయా జాతవేపథుః ।
ఆత్మన్యగ్నీన్ సమారోప్య మచ్చిత్తోఽగ్నిం
సమావిశేత్ ॥ 11

వానప్రస్థుడు తన యాశ్రమమునకు దగిననియమములను పాలింపజాలనప్పుడు, ముసలితనమువలన తన శరీరము కంపించుచున్నపుడు యజ్ఞాగ్నులను భావనద్వారా తన యంతఃకరణమునం దారోపించుకొని, తన మనస్సును నాయం దుంచి అగ్నిలో ప్రవేశింపవలెను.

యదా కర్మవిపాకేషు లోకేషు నిరయాత్మసు ।
విరాగో జాయతే సమ్యక్ న్యస్తాగ్నిః ప్రవ్రజేత్తతః ॥ 12

కర్మ పరిపాకలబ్ధములు దుఃఖాత్మకములు నగు లోకములన్నింటి యందు సంపూర్ణ వైరాగ్యముగలిగినచో యథావిధిగ యజ్ఞాగ్నులను పరిత్యజించి సన్న్యాసమును స్వీకరింపవలెను.

ఇష్ట్వా యథోపదేశం మాం దత్త్వా సర్వస్వమృత్విజే ।
అగ్నీన్ స్వప్రాణ ఆవేశ్య నిరపేక్షః పరివ్రజేత్ ॥ 13

యథావిధిగ యజ్ఞములద్వారా నన్నారాధించి, ఋత్విక్కులకు సర్వస్వమును దానముచేసి, ఆత్మయం దగ్నులను నారోపింపజేసికొని నిరపేక్ష చిత్తముతో సన్న్యాసమును స్వీకరింపవలెను.

విప్రస్య వై సన్న్యసతో దేవా దారాదిరూపిణః ।
విఘ్నం కుర్వన్త్యయం హ్యస్మానాక్రమ్య
సమియాత్పరమ్ ॥ 14

"ఈ సన్న్యాసధర్మము నవలంబింపబోవు మానవుడు మమ్ము తిరస్కరించి పరబ్రహ్మమును బొందదలచు చున్నా"డని భావించి దేవతలు భార్యాదులవేషములధరించి సన్న్యాసమును స్వీకరించుట కిష్టపడు బ్రాహ్మణునకువిఘ్నముల కలిగింతురు.

బిభృయాచ్చేన్మునిర్వాసః కౌపీనాచ్ఛాదనం పరమ్ ।
త్యక్తం న దండపాత్రాభ్యామన్యత్కించిదనాపది ॥ 15

సన్న్యాసి కౌపీనమును ధరింపవలెను. వస్త్రమును ధరింపదలచిననా కౌపీనము అగుపడకుండగ దానిపై నొక చిన్న వస్త్రఖండమును చుట్టుకొనవలెను. ఆశ్రమమునకు దగిన దండకమండలములను కాక మఱి

యే యితర వస్తువులను ధరింపరాదు. ఈనియమ మాపత్కాలమునకు వర్తింపదు.

దృష్టిపూతం న్యసేత్పాదం వస్త్రపూతం పిబేజ్జలమ్ ।
సత్యపూతాం వదేద్వాచం మనఃపూతం
సమాచరేత్ ॥ 16

సన్న్యాసి జాగ్రత్తగజూచి పవిత్ర ప్రదేశమున నడుగు పెట్టవలెను. వస్త్రముతో వడగట్టి నీటిని త్రాగవలెను. సత్యముచే పవిత్రమైన వాక్కును పలుకవలెను. మనఃపూత మగుకార్యము నాచరింపవలెను.

మౌనానీహానిలాయామా దండా వాగ్దేహచేతసామ్ ।
న హ్యేతే యస్య సన్త్యంగ వేణుభిర్న భవేద్యతిః ॥ 17

ఉద్ధవా! వాక్కునకు మౌనము, శరీరమునకు కామ్యకర్మత్యాగము, మనస్సునకు ప్రాణాయామము దండములు. ఈమూడువిధము లగుదండములు లేనివాడు వేణుదండమును ధరించినంతమాత్రమున సన్న్యాసి కాజాలడు.

భిక్షాం చతుర్షు వర్ణేషు విగర్హ్యాన్ వర్జయంశ్చరేత్ ।
సప్తాగారానసంక్లిప్తాంస్తుష్యేల్లబ్ధేన తావతా ॥ 18

నాలుగు వర్ణముల వారిలో అభిశప్తులు, పతితులు మున్నగువారిని వదలి నిర్దిష్టములుగాని యేడు ఇండ్లకు వెడలి భిక్షను దీసికొనవలెను. లభించిన దానితోనే సంతుష్టి జెందవలెను.

బహిర్జలాశయం గత్వా తత్రోపస్పృశ్య వాగ్యతః ।
విభజ్య పావితం శేషం భుంజీతాశేషమాహృతమ్ ॥ 19

అనంతరము గ్రామమునకు జివర గలచెఱువునకు వెడలి మౌనియై

స్నానమును ఆచమనాదులను గావించి, భిక్షాన్నమును ప్రోక్షణాదులచే పవిత్రము చేయవలెను. శాస్త్రోక్తపద్ధతి ననుసరించి విష్ణువు, బ్రహ్మ, సూర్యుడు మున్నగువారికి భాగముల నేర్పాటుచేసి మిగిలినదానిని భుజింపవలెను.

ఏకశ్చరేన్మహీమేతాం నిస్సంగః సంయతేంద్రియః ।
ఆత్మక్రీడ ఆత్మరత ఆత్మవాన్ సమదర్శనః ॥ 20

సన్న్యాసి ఆత్మక్రీడాశీలుడు, ఆత్మరతుడు, ధీరుడు, సంయతేంద్రియుడు, నిస్సంగుడు, ఏకాకియునై భూమిపై సంచరింపవలెను.

వివిక్తక్షేమశరణో మద్భావవిమలాశయః ।
ఆత్మానం చింతయేదేకమభేదేన మయా మునిః ॥ 21

నిర్జనము, నిర్భయము నగు ప్రదేశముననుండి నాయందలి భావనచే విశుద్ధచిత్తుడయి ముని నాకంటె అభిన్నమైన ఆత్మతత్త్వము నొక్కదానినే ధ్యానింపవలెను.

అన్వీక్షేతాత్మనో బంధం మోక్షం చ జ్ఞాననిష్ఠయా ।
బంధ ఇంద్రియవిక్షేపో మోక్ష ఏషాం చ సంయమః ॥ 22

ముని జ్ఞాననిష్ఠచే తన బంధ మోక్ష విషయముల గూర్చి ఆలోచింపవలెను. ఇంద్రియచాంచల్యమే బంధము. వానిని నిగ్రహించి నాయందు మనస్సు నుంచుటయే మోక్షము.

తస్మాన్నియమ్య షడ్వర్గం మద్భావేన చరేన్మునిః ।
విరక్తః క్షుద్రకామేభ్యో లబ్ధ్వాఽఽత్మని సుఖం
మహత్ ॥ 23

అందువలన సన్న్యాసి కామక్రోధాదులను వదలి, క్షుద్రము లగు విషయసుఖములనుండి విరక్తుడయి ఆత్మలో చిదానందము ననుభవించుచు, అంతట నాభావనగలిగి సంచరింపవలెను.

పురగ్రామవ్రజాన్ సార్థాన్ భిక్షార్థం ప్రవిశంశ్చరేత్ ।
పుణ్యదేశ సరిచ్ఛైలవనాశ్రమవతీం మహీమ్ ॥ 24

పవిత్రమైన దేశములు, నదులు, పర్వతములు, వర్ణాశ్రమములు గల భూమిపై సంచరించుచు భిక్షకై నగరములలోనికి, గ్రామములలోనికి, గోష్ఠములలోనికి, యాత్రికులకడకు వెడలవలెను.

వానప్రస్థాశ్రమపదేష్వభీక్ష్ణం భైక్ష్యమాచరేత్ ।
సంసిధ్యత్యాశ్వసంమోహః శుద్ధసత్త్వః శిలాన్ధసా ॥ 25

వానప్రస్థుల ఆశ్రమములనుండియే యెక్కువగా భిక్షను స్వీకరింపవలెను. శిలావృత్తివలన లభించిన అన్నమును దినుటచే చిత్తము శుద్ధమగును, మోహరహిత మగును. దానివలన వెంటనే మోక్షములభించును.

నైతద్వస్తుతయా పశ్యేద్దృశ్యమానం వినశ్యతి ।
ఆసక్తచిత్తో విరమేదిహాముత్ర చికీర్షితాత్ ॥ 26

వానప్రస్థుడు ప్రత్యక్షము లగు వస్తువు లన్నియు నశించునవియే గావున వాని యందాసక్తుడు కారాదు. అందువలన ఐహికవిషయముల యందును, పారలౌకిక విషయములయందును అనాసక్తుడయి సకామకర్మల నుండి విరతుడు కావలెను.

యదేతదాత్మని జగన్మనోవాక్ప్రాణసంహతమ్ ।
సర్వం మాయేతి తర్కేణ స్వస్థస్త్యక్త్వా న
తత్స్మరేత్ ॥ 27

మమతకాస్పదమగు నీ జగత్తు, మనోవాక్ప్రాణాది సహితమై యున్న అహంకారాత్మక శరీరము, దానివలన గలిగిన సుఖ దుఃఖాదులు — సర్వము స్వప్నతుల్యమే యను భావనతో (ఆత్మలో దీనిని మాయా మాత్రమే యని యెఱింగి), పరిత్యజించి ఆత్మనిష్ఠుడయి మరల వానిని గూర్చి ఆలోచింపరాదు.

జ్ఞాననిష్ఠో విరక్తో వా మద్భక్తో వానపేక్షకః ।
సలింగానాశ్రమాం స్త్యక్త్వా చరేదవిధిగో చరః ॥ 28

బాహ్యవిషయములయందు విరక్తుడయి మోక్షమును మాత్రము గోరి జ్ఞాననిష్ఠుడు గావలెను. లేదా మోక్షవిషయమునం దిచ్ఛలేనివాడయి నాయందు భక్తి కలిగియుండవలెను ఇట్టివాడు త్రిదండాదిచిహ్నములతో గూడిన సన్న్యాసధర్మముల నన్నింటిని విడచి. విధినిషేధముల కధీనుడు గాక తగిన విధముగ ధర్మము నాచరింపవలెను.

బుధో బాలకవత్క్రీడేత్ కుశలో జడవచ్చరేత్ ।
వదేదున్మత్తవద్విద్వాన్ గోచర్యాం నైగమశ్చరేత్ ॥ 29

అతడు వివేకియైకూడ బాలునివలె (మానావమానబుద్ధిశూన్యుడయి) క్రీడించును. నిపుణుడయికూడ జడునివలె వ్యవహరించును. విద్వాంసు డయికూడ ఉన్మత్తునివలె సంభాషించును. వేదార్థనిష్ఠ డయియుండియు నియమరహితమైన వృత్తితో మెలగును.

వేదవాదరతో నస్యాన్న పాషండీ న హైతుకః ।
శుష్కవాదవివాదేన కంచిత్ పక్షం సమాశ్రయేత్ ॥ 30

పరమహంస యగు వ్యక్తి కర్మకాండవ్యాఖ్యానాదినిష్ఠుడు, పాషం డుడు, కేవలతర్కరతుడు కారాదు. నిష్ప్రయోజనములగు వాదవివాదము లను జేయరాదు. వానిలో నేయొక్క పక్షము నవలంబింపరాదు.

నోద్విజేత జనాద్ధీరో జనం చోద్వేజయేన్నతు
అతివాదాం స్తితిక్షేత నావమన్యేత కంచన ।
దేహముద్దిశ్య పశువద్వైరం కుర్యాన్న కేనచిత్ ॥ 31

సన్న్యాసి ధీరుడయి యెవ్వరివలన కలతజెందరాదు, తా నెవ్వరిని కలతపెట్టరాదు. తన నెవ్వరయిన దూషించిన సంతోషముతో సహింపవలెను. ఎవ్వరిని అవమానింపరాదు అడ డీశరీరమునకయి ఎవ్వరితోను విరోధము పెట్టుకొనరాదు. ఇట్టి వైరము పశువులకు సంబంధించినది.

ఏకఏవ పరోహ్యాత్మా భూతేష్వాత్మన్యవస్థితః ।
యథేన్దురుదపాత్రేషు భూతాన్యేకాత్మకాని చ ॥ 32

ఒకే చంద్రుడు నీటితోనిండిన విభిన్నపాత్రలలో బహురూపములుగ ప్రతిబింబితు డయినట్లు ఒకే పరమాత్మ విభిన్నము లగు దేహములలోను, ఆత్మలోను అంతర్యామిరూపముతో బహురూపములుగ నున్నాడు. ఈ దేహము లన్నియు నొకే ఆత్మతో గూడియున్నవి.

అలబ్ధ్వా న విషీదేత కాలేకాలేఽశనం క్వచిత్ ।
లబ్ధ్వా న హృష్యేద్ధృతిమానుభయం దైవతంత్రితమ్॥ 33

ధైర్యశాలి యగు సన్న్యాసి యొకప్పుడు అన్నము లభించనిచో దుఃఖించుటగాని, వరుసగ లభించినచో సంతుష్టిని జెందుటగాని కూడదు. ఆహారము లభించుటగాని లభింపక పోవుటగాని దైవాధీనమే యని తెలిసికొని మెలగవలెను.

ఆహారార్థం సమీహేత యుక్తం తత్ప్రాణధారణమ్ ।
తత్త్వం విమృశ్యతే తేన తద్విజ్ఞాయ విముచ్యతే ॥ 34

ప్రాణరక్షణ మావశ్యకముగనుక ఆహారమును తప్పక సంపాదిం కొనవలెను. ప్రాణరక్షణచేత తత్త్వవిచారము చేయవచ్చును, దానివల ముక్తి కలుగును

యదృచ్ఛయోపపన్నాన్నమద్యాచ్ఛ్రేష్ఠముతాపరమ్ ।
తథా వాసస్తథా శయ్యాం ప్రాప్తం ప్రాప్తం
భజేన్మునిః ॥ 3

అదృష్టముచే లభించిన ఆహార, వస్త్ర, శయ్యాదులు మంచి కావచ్చును, కాకపోవచ్చును, వానిని స్వీకరింపవలసినదే.

శౌచమాచమనం స్నానం న తు చోదనయా చరేత్ ।
అన్యాంశ్చ నియమాన్ జ్ఞానీ యథాహం లీలయేశ్వరః॥ 3

నేను ఈశ్వరుడ నయి యుండియు విధినిషేధములకు లోనుగా స్వేచ్ఛగ కర్మల నాచరించుచుందును అట్లే జ్ఞాననిష్ఠు డగుపురుషుడుగూ విధి నిషేధములకు లోనుగాకుండగనే శౌచాచమనాది కర్మల నన్నింటి జేయవలెను

న హి తస్య వికల్పాఖ్యా యా చ మద్వీక్షయా హతా ।
ఆదేహాన్తాత్ క్వచిత్ ఖ్యాతి స్తతః సంపద్యతే మయా॥ 3

అప్పుడు జ్ఞాననిష్ఠు డగువానికి భేదప్రతీతి యుండదు వెనుక నున్న భేదప్రతీతి నా సాక్షాత్కారముచే నష్టమగును. కావున అప్పుడప్పుడ మరణపర్యంతము బాధితభేదము ప్రతీత మగుచుండును. దేహావసానమ నందు నాతో సమానమగు సార్ష్టియనుసంపద లభించును.

దుఃఖోదర్కేషు కామేషు జాతనిర్వేద ఆత్మవాన్ ।
అజిజ్ఞాసితమద్ధర్మో గురుం మునిముపావ్రజేత్ ॥ 3

జితేంద్రియు డగు పురుషుడు ప్రాపంచిక విషయానుభవమువలన కలుగు ఫలము దుఃఖమే యని తెలిసికొని విరక్తిచెందునుకాని నన్ను బొందు సాధనముల గూర్చి యెఱుంగడు. అప్పు డతడు ఆత్మసుఖాభిలాషియై పరబ్రహ్మనిష్ఠు డగు గురుదేవుని శరణుబొందవలెను.

తావత్పరిచ రేద్భక్తః శ్రద్ధావాననసూయకః ।
యావద్బ్రహ్మ విజానీయాన్మామేవ గురుమాదృతః ॥ 39

శ్రద్ధాయుక్తుడు, అసూయా రహితుడు, భక్తి గలవాడును నయి బ్రహ్మజ్ఞానము కలుగువఱకు నాదరముతో నా స్వరూపముగ భావించి గురుదేవుని సేవింపవలెను.

యస్త్వసంయతషడ్వర్గః ప్రచండేంద్రియసారథిః ।
జ్ఞానవైరాగ్యరహితస్త్రిదండముపజీవతి ॥ 40
సురానాత్మానమాత్మస్థం నిహ్నుతే మాంచ ధర్మహా ।
అవిపక్వకషాయోఽస్మాదముష్మాచ్చ విహీయతే ॥ 41

జ్ఞాన వైరాగ్యములు లేనివాడు, కామాదిషడ్వర్గమును జయించనివాడు, ప్రబలములగు నింద్రియములకు సారిథ యగు బుద్ధిచే పరిచాలితుడు, కేవలము పొట్టకూటికొఱకే సన్న్యాసమును స్వీకరించినవాడు, అపరిణత విషయవాసనాగ్రస్తుడు, ధర్మనాశకుడు నగు పురుషుడు దేవతలను, తన ఆత్మను, ఆత్మస్థితుడ నగు నన్ను వంచించును, చివరకు తాను గూడ ఉభయలోక భ్రష్టుడగును.

భిక్షోర్ధర్మః శమోఽహింసా తప ఈక్షా వనౌకసః ।
గృహిణో భూతరక్షేజ్యా ద్విజస్యాచార్యసేవనమ్ ॥ 42

సన్న్యాసిధర్మము శమము, అహింసః వానప్రస్థునిధర్మము తపస్సు,

ఆత్మానాత్మ వివేకజ్ఞానము ; గృహస్థుని ధర్మము భూతరక్ష, యజ్ఞము ; బ్రహ్మచారిధర్మము గురుసేవ.

బ్రహ్మచర్యం తపః శౌచం సంతోషో భూతసౌహృదమ్ ।
గృహస్థస్యాప్యృతౌ గన్తుః సర్వేషాం మదుపాసనమ్ ॥ 43

గృహస్థుడు గూడ ఋతుకాలమునందే భార్యను బొందవలెను. బ్రహ్మచర్యము, తపస్సు, శౌచము, సంతోషము, సర్వభూతదయ అనునవి వాని ప్రధానధర్మములు. అందఱు నన్నుపాసింపవలసినదియె.

ఇతి మాం యః స్వధర్మేణ భజేన్నిత్యమనన్యభాక్ ।
సర్వభూతేషు మద్భావో మద్భక్తిం విందతే దృఢామ్॥ 44

ఇట్లనన్యభావములో తన వర్ణాశ్రమధర్మము ననుసరించి నా సేవలో నిమగ్నుడై యున్నవాడు, సర్వప్రాణులలో నేనే అంతర్యామిరూపముతో నున్నానని తలంచువాడు నాయందు దృఢభక్తి గలవాడగును

భక్త్యోద్ధవానపాయిన్యా సర్వలోకమహేశ్వరమ్ ।
సర్వోత్పత్త్యప్యయం బ్రహ్మకారణం మోపయాతి సః॥ 45

ఉద్ధవా! నిరంతరము వృద్ధిబొందు నఖండమగు భక్తిచే నతడు సృష్టిస్థితిసంహార కారణుడను, సర్వలోకేశ్వరుడను జగత్కారణుడను, బ్రహ్మరూపుడను నగు నన్ను బొందును.

ఇతి స్వధర్మనిర్ణిక్తసత్త్వో నిర్జ్ఞాతమద్గతిః ।
జ్ఞానవిజ్ఞానసంపన్నో న చిరాత్సముపైతి మామ్ ॥ 46

ఇట్లాజీవుడు స్వధర్మమును పాలించుచు అంతఃకరణమును శుద్ధి చేసికొని నా యైశ్వర్యమును దెలిసికొనును. జ్ఞాన విజ్ఞాన సంపన్నుడయి త్వరలోనే నన్ను బొందగలుగును.

వర్ణాశ్రమవతాం ధర్మ ఏష ఆచారలక్షణః ।
స ఏవ మద్భక్తియుతో నిశ్శ్రేయసకరః పరః ॥ 47

నేను నీ కీవర్ణాశ్రమములవా రవలంబించు ఆచారలక్షణ ధర్మమును వివరించితిని. నాయందు భక్తి గలిగి యున్నచో నీ ధర్మము పరమమగు ముక్తి నిచ్చునట్టి దగును.

ఏతత్తేఽభిహితం సాధో భవాన్ పృచ్ఛతి యచ్చ మామ్,
యథా స్వధర్మసంయుక్తో భక్తో మాం సమియాత్పరమ్॥ 48

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే పారమహంస్యాం
సంహితాయాం వైయాసిక్యా మేకాదశ స్కంధే
శ్రీ భగవదుద్ధవసంవాదే యతిధర్మనిర్ణయోనామ
అష్టాదశోఽధ్యాయః

ఉద్ధవా! నీవు నన్నడిగినదానికి దగినట్లుగ స్వధర్మమును పాలించు భక్తుడు పరమాత్మరూపుడ నగున న్నెట్లు పొందునో యను విషయమును నీకు వివరించి చెప్పితిని.

ఈ విధముగ శ్రీ మద్భాగవత మహాపురాణము
నందలి ఏకాదశస్కంధములోని పదునెనిమిదవ
అధ్యాయము సమాప్తము.

# పందొమ్మిదవ అధ్యాయము

## భక్తి జ్ఞాన యమ నియమాది సాధనముల వర్ణనము.

## శ్రీ భగవానువాచ.

యో విద్యాశ్రుతసంపన్న ఆత్మవాన్ నానుమానికః ।
మాయామాత్రమిదం జ్ఞాత్వా జ్ఞానం చ మయి సంన్యసేత్ ॥

**భగవానుడు పలికెను:—** ఆత్మతత్త్వజ్ఞుడు, అనుభవ పర్యంత శాస్త్ర జ్ఞాన సంపన్నుడు, కేవల పరోక్షజ్ఞానము లేనివాడు నగు మానవుడు ఈ ద్వైత ప్రపంచమును, తన్నివృత్తి సాధనమును మాయా కల్పితముగా నెఱిగి తత్సాధన జ్ఞానమును త్యజించును.

జ్ఞానినస్త్వహమేవేష్టః స్వార్థో హేతుశ్చ సమ్మతః ।
స్వర్గశ్చైవాపవర్గశ్చ నాన్యోఽర్థో మదృతే ప్రియః ॥ 2

జ్ఞానుల కభీష్టఫలమును తత్సాధనమును స్వర్గాపవర్గములును నేనే. కావున నన్నుతప్ప మఱి యే యితరపదార్థమును అతడు కోరడు.

జ్ఞానవిజ్ఞానసంసిద్ధాః పదం శ్రేష్ఠం విదుర్మమ ।
జ్ఞానీ ప్రియతమోఽతో మే జ్ఞానేనాసౌ బిభర్తి మామ్॥ 3

జ్ఞాన విజ్ఞాన సంపన్నులగు పురుషులు నా చరణారవిందములనే శ్రేష్ఠములుగా భావింతురు జ్ఞానియగువాడు జ్ఞానముతో నన్ను సుఖింప జేయును. ఇట్టివాడే నాకు మిక్కిలి యిష్టుడు.

తపస్తీర్థం జపో దానం పవిత్రాణీతరాణి చ ।
నాలం కుర్వన్తి తాం సిద్ధిం యా జ్ఞానకలయా కృతా ॥ 4

తత్త్వజ్ఞానలేశమాత్రముచే కలుగు సిద్ధి తపస్తీర్థ జప దానములచేత గాని, ఇతరములగు పుణ్యకర్మలచేతగాని కలుగదు.

తస్మాద్ జ్ఞానేన సహితం జ్ఞాత్వా స్వాత్మానముద్ధవ ।
జ్ఞానవిజ్ఞానసంపన్నో భజ మాం భక్తిభావితః ॥ 5

ఉద్ధవా ! నీవు జ్ఞానముతో నీ ఆత్మ వస్తువును దెలిసికొనుము. జ్ఞానవిజ్ఞాన సంపన్నుడవై భక్తిభావముతో నన్నారాధింపుము.

జ్ఞానవిజ్ఞానయజ్ఞేన మామిష్ట్వాఽఽత్మానమాత్మని ।
సర్వయజ్ఞపతిం మాం వై సంసిద్ధిం మునయోఽగమన్ ॥ 6

పూర్వకాలమున మునులు జ్ఞానవిజ్ఞానరూప మగు యజ్ఞముద్వారా ఆత్మయందు సర్వయజ్ఞేశ్వరుడను, పరమాత్మ స్వరూపుడను నగు నన్ను పూజించి నా స్వరూపసంసిద్ధిని బొందిరి.

త్వయ్యుద్ధవాఽఽశ్రయతి యస్త్రివిధో వికారో
మాయాఽన్తరాఽఽపతతి నాద్యపవర్గయోర్యత్ ।
జన్మాదయోఽస్య యదమీ తవ తస్య కిం స్యు-
రాద్యన్తయోర్యదసతోఽస్తి తదేవ మధ్యే ॥ 7

ఉద్ధవా ! నిన్నాశ్రయించి యున్న ఆధ్యాత్మికాది త్రివిధ వికారములను మాయామాత్రము లని తెలిసికొనుము. రజ్జుసర్పన్యాయమువలె అవి ఆదియందుగాని అంతమందుగాని లేక మధ్యకాలములోనే యగపడుచున్నవి. జన్మాదివికారధర్మము గలది శరీరమేగాని ఆత్మకాదు, అందువలన వాని కధిష్ఠానస్వరూపుడ వగు నీ కెట్టి నాశమును లేదు. అసత్సర్పాదిపదార్థముల కాద్యంతములయందు రజ్జుత్వమే యథార్థము. అందువలన వికారసమూహమునకు గూడ వాస్తవములో నెట్టి సత్తయును లేదు.

### ఉద్ధవ ఉవాచ

జ్ఞానం విశుద్ధం విపులం యథైతద్
వైరాగ్యవిజ్ఞానయుతం పురాణమ్ ।
ఆఖ్యాహి విశ్వేశ్వర విశ్వమూర్తే
త్వద్భక్తియోగం చ మహద్విమృగ్యమ్ ॥ 8

**ఉద్ధవుడు పలికెను :—** దేవదేవా ! విశ్వరూపా !! విశాలము పురాతనము వైరాగ్య విజ్ఞాన యుక్తము నగు నీ విశుద్ధ జ్ఞానమును, మహాజనుల కన్వేషింపదగిన మహత్తరమగు భక్తియోగమును చక్కఁగ వివరించి చెప్పుము.

తాపత్రయేణాభిహతస్య ఘోరే
సంతప్యమానస్య భవాధ్వనీశ ।
పశ్యామి నాన్యచ్ఛరణం తవాంఘ్రి-
ద్వంద్వాతపత్రాదమృతాభివర్షాత్ ॥ 9

దేవా ! ఘోరసంసార మార్గమున త్రితాపాభిభూతులము, సంతాప గ్రస్తులము నగు మావంటి జీవులకు అమృతమును వర్షించు నీ పాద పద్మ ఛత్రముతప్ప మఱియొక ఆశయమేమి యున్నది ?

దష్టం జనం సంపతితం బిలేస్మిన్
కాలాహినా క్షుద్రసుఖోరుతర్షమ్ ।
సముద్ధరైనం కృపయాఽఽపవర్గై-
ర్వచోభిరాసించ మహానుభావ ॥ 10

మహాప్రభావా ! సంసారకూపమున బడియున్నట్టియు, కాల రూప

మనుసర్పముచే కఱవబడినట్టియు క్షుద్ర విషయసుఖతృష్ణచే గూడియున్న నావంటి జీవులను ఉద్ధరించి మోక్ష బోధకములగు నీ వాక్సుధాధారలను వర్షింపుము.

## శ్రీ భగవానువాచ

ఇత్థమేతత్ పురా రాజా భీష్మం ధర్మభృతాం వరమ్ ।
అజాతశత్రుః పప్రచ్ఛ సర్వేషాం నోఽనుశృణ్వతామ్ ॥ 11

భగవానుడు పలికెను :- ఉద్ధవా! పూర్వకాలమున యుధిష్ఠరుడు ధార్మికశిరోమణి యగు భీష్ముని మేమందరము వినుచుండగా ఇట్లే యడిగెను.

నివృత్తే భారతే యుద్ధే సుహృన్నిధన విహ్వలః ।
శ్రుత్వా ధర్మాన్ బహూన్ పశ్చాన్మోక్షధర్మాన
పృచ్ఛత ॥ 12

కురుక్షేత్రమహాయుద్ధము పూర్తియైన పిమ్మట యుధిష్ఠిరుడు జ్ఞాతి వధశోకవిహ్వలుడయి భీష్మపితామహునివలన నెన్నియో ధర్మములను వినెను. అనంతర మాయన మోక్షధర్మమును గూర్చి యడిగెను.

తానహం తేఽభిధాస్యామి దేవవ్రతముఖాచ్ఛ్రితాన్ ।
జ్ఞానవైరాగ్యవిజ్ఞానశ్రద్ధాభక్త్యుపబృంహితాన్ ॥ 13

నేను భీష్మపితామహునినుండి వినిన మోక్షధర్మములను నీకు వివరింతును. అవి జ్ఞానవిజ్ఞానములతోను, వైరాగ్యముతోను, శ్రద్ధాభక్తులతోను గూడినట్టివి.

నవైకాదశ పంచ త్రీన్ భవాన్ భూతేషు యేన వై ।
ఈక్షేతాథైకమప్యేషు తద్ జ్ఞానం మమ నిశ్చితమ్ ॥ 14

బ్రహ్మాదిస్థావర పర్యంతము గల కార్యసమూహములో ప్రకృతి పురుషులు, మహత్తత్త్వము, అహంకారము, పంచతన్మాత్రలు, ఏకాదశేంద్రియములు, పంచమహాభూతములు, గుణత్రయము—అను నీ యిరువది యెనిమిది తత్త్వములను జూపునట్టిదియు, వీనిలో గూడ నొకే పరమాత్మ తత్త్వము ననుగతరూపముగను జూపునట్టిదియునగు జ్ఞానమే నాకు సమ్మతమని తెలిసికొనుము.

ఏతదేవ హి విజ్ఞానం న తథైకేన యేన యత్ ।
స్థిత్యుత్పత్త్యప్యయాన్ పశ్యేద్భావానాం
త్రిగుణాత్మనామ్ ॥ 15

ఏకాలమున పూర్వదృష్టములగు నేక కారణానుగతములగు విభిన్న పదార్థములు కనబడవో, వానికి కారణరూపమగు నొకే బ్రహ్మవస్తువు కనబడునో అప్పుడట్టి యనుభవము విజ్ఞానశబ్దముచే వాచ్యమగును సావయవములగు భౌతికపదార్థములే సృష్టి స్థితి లయ ధర్మయుక్తములని తెలిసికొనుము.

ఆదావన్తే చ మధ్యే చ సృజ్యాత్ సృజ్యం యదన్వియాత్ ।
పునస్తత్ప్రతిసంక్రామే యచ్ఛిష్యేత తదేవ సత్ ॥ 16

సృష్టి ప్రళయములయందు కారణరూపముతోడను, స్థితికాలమున ఆశ్రయరూపముతోడను కార్యమునుండి కార్యాంతరమునకు నిరంతరము అనుగమించు వస్తువు ప్రళయాంతమునం దవశిష్టమై యుండును. అట్టి వస్తువును సత్తని తెలిసికొనుము.

శ్రుతిః ప్రత్యక్షమైతిహ్యమనుమానం చతుష్టయమ్ ।
ప్రమాణేష్వనవస్థానాద్వికల్పాత్సవిరజ్యతే ॥ 17

శ్రుతి, ప్రత్యక్షము, ఐతిహ్యము, అనుమానము అను నీ నాలుగు ప్రమాణములచే భేదము బాధితమగుటచే పురుషుడు దానినుండి విరక్తుడగును.

వివరణము :— శ్రుతి, ప్రత్యక్షము, ఐతిహ్యము, అనుమానము అను నీ నాలుగు ప్రమాణములద్వారా స్వర్గాదులు నశ్వరములని యంగీకరింపబడుటవలన నీ వస్తువు లన్నియు మిథ్యాభూతములే యనియు, సర్వానుగత మగు ఆత్మవస్తువే సత్యమయినదనియు దెలిసికొని పురుషుడు ఆత్మతత్త్వమును దర్శించి పిమ్మట వాని యన్నింటిమండి విరక్తుడగును.

కర్మణాం పరిణామిత్వాదావిరించాదమంగళమ్ ।
విపశ్చిన్నశ్వరం పశ్యేదదృష్టమపి దృష్టవత్ ॥ 18

వివేకియగువాడు స్వర్గాదిఫలముల నిచ్చు యజ్ఞాదికర్మలు నశ్వరములగుటవలన బ్రహ్మలోకపర్యంతముగల స్వర్గాదిసుఖములుగూడ నీ ప్రత్యక్షవిషయములవలె అమంగళములు, దుఃఖకరములు, నశ్వరములు నని తెలిసికొనవలెను.

భక్తియోగః పురైవోక్తః ప్రీయమాణాయ తేఽనఘ।
పునశ్చ కథయిష్యామి మద్భక్తేః కారణం పరమ్ ॥ 19

అనఘా । నీవు నాకు ప్రీతిభాజనుడ వగుటవలన పూర్వమే నీకు భక్తియోగమును గూర్చి చెప్పితిని. ఇపుడు మరల నా భక్తిని బొందుటకు గల ప్రధాన సాధనములను వర్ణింతును.

శ్రద్ధామృతకథాయాం మే శశ్వన్మదనుకీర్తనమ్ ।
పరనిష్ఠా చ పూజాయాం స్తుతిభిః స్తవనం మమ ॥ 20

(నా భక్తిని బొందదలచినవాడు) అమృతమయము లగు నా కథల

యందు శ్రద్ధ నుంచవలెను. నిరంతరము నా గుణములను, లీలలను, నామములను సంకీర్తన చేయవలెను. నా పూజయందు నిష్ఠను గలిగి యుండవలెను. స్తోత్రములచే నన్ను స్తుతింపవలెను.

ఆదరః పరిచర్యాయాం సర్వాంగై రభివందనమ్ ।
మద్భక్తపూజాభ్యధికా సర్వభూతేషు మన్మతిః ॥ 21

నా సేవయందు ప్రేమను జూపవలెను, నాకు సాష్టాంగప్రణామము జేయవలెను. నా భక్తులను మిన్నగ పూజింపవలెను. సర్వప్రాణుల లోను నన్నే జూడవలెను.

మదర్థేష్వంగచేష్టా చ వచసా మద్గుణేరణమ్ ।
మయ్యర్పణం చ మనసః సర్వకామవివర్జనమ్ ॥ 22

ఈ శరీరముతో జేయు కార్యములను నన్నుద్దేశించియే చేయవలెను, వాక్కుతో నా గుణములనే కీర్తింపవలెను తన మనస్సును గూడ నాయందే అర్పింపవలెను. సర్వకామములను పరిత్యజింపవలెను

మదర్థేఽర్థపరిత్యాగో భోగస్య చ సుఖస్య చ ।
ఇష్టం దత్తం హుతం జప్తం మదర్థం యద్వ్రతం తపః ॥ 23

నాకై ధనమును, భోగములను, సుఖములను పరిత్యజింపవలెను. యజ్ఞ, దాన హోమ, జప, వ్రత, తపస్సులను నాకొఱకే చేయవలెను.

ఏవం ధర్మైర్మనుష్యాణాముద్ధవాత్మనివేదినామ్ ।
మయి సంజాయతే భక్తిః కోఽన్యోఽర్థోఽస్యావశిష్యతే॥ 24

ఉద్ధవా ! ఈ ధర్మములను పాలించువాడును, ఆత్మనివేదన చేయు

వాడును నగు మానవుని హృదయమున నా ప్రేమమయ భక్తి యుద యించును. అట్టివానికి ఇక లభింపదగిన వస్తు వేదియు నుండదు.

యదాఽఽత్మన్యర్పితం చిత్తం శాన్తం సత్త్వోప
బృంహితమ్ ।
ధర్మం జ్ఞానం సవైరాగ్యమైశ్వర్యం చాభిపద్యతే ॥ 25

సత్త్వగుణ సంపన్నము, శాంతము నగు చిత్తమును పరమాత్మ రూపుడనగు నా కర్పించి నపుడు మానవుడు ధర్మజ్ఞాన వైరాగ్యయుక్తమగు నైశ్వర్యమును బొందును.

యదర్పితం తద్వికల్పే ఇంద్రియైః పరిధావతి ।
రజస్వలం చాసన్నిష్ఠం చిత్తం విద్ధి విపర్యయమ్ ॥ 26

దేహగేహాది విషయములయందు లగ్నమై ఇంద్రియముల వెంట పరుగిడు మనస్సు రజోగుణయుక్తమై అసద్వస్తువునందు లగ్నమగును. దానివలన నది అధర్మమునకు, అజ్ఞానమునకు, మోహమునకు నిలయ మగును.

ధర్మో మద్భక్తికృత్ ప్రోక్తో జ్ఞానం చైకాత్మ్యదర్శనమ్ ।
గుణేష్వసంగో వైరాగ్యమైశ్వర్యం చాణిమాదయః ॥ 27

ఉద్ధవా ! నాయందు భక్తిని కలిగించునదే ధర్మము అంతట నొకే పరమాత్మను దర్శింపజేయునదే జ్ఞానము. విషయములయందనాస క్తియే వైరాగ్యము. అణిమాదిసిద్ధులే ఐశ్వర్యము.

## ఉద్ధవ ఉవాచ.

యమః కతివిధః ప్రోక్తో నియమో వాఽరికర్శన ।
కః శమః కో దమః కృష్ణ కా తితిక్షా ధృతిః ప్రభో॥ 28

ఉద్ధవుడు పలికెను :- యమనియమము లెన్నివిధములు? శమ మనగానేమి? దమ మనగా నేమి? తితిక్ష,ధృతి యనగా నేమి ?

కిం దానం కిం తపః శౌర్యం కిం సత్యమృతముచ్యతే ।
కస్త్యాగః కిం ధనం చేష్టం కో యజ్ఞః కా చ దక్షిణా ॥ 29

దానము, తపస్సు, శౌర్యము, సత్యము, ఋతము, త్యాగము, ఇష్టము, ధనము, యజ్ఞము, దక్షిణ యనగా నేమి ?

పుంసః కింస్విద్బలం శ్రీమాన్ దయా లాభశ్చ కేశవ ।
కా విద్యా హ్రీః పరా కా శ్రీః కిం సుఖం
దుఃఖమేవ చ ॥ 30

కేశవా! పురుషుని బలమెట్టిది? దయ యనగా నేమి? లాభ మనగా నెట్టిది? ఉత్తమ విద్య, లజ్జ, శ్రీ, సుఖదుఃఖము లనగా నేమి?

కః పండితః కశ్చమూర్ఖః కః పన్థా ఉత్పథశ్చ కః ।
కః స్వర్గో నరకః కః స్విత్ కో బంధురుత కిం
గృహమ్ ॥ 31

క ఆఢ్యః కో దరిద్రో వా కృపణః కః క ఈశ్వరః ।
ఏతాన్ ప్రశ్నాన్ మమ బ్రూహి విపరీతాంశ్చ
సత్పతే ॥ 32

పండితుని లక్షణము లెవ్వి? మూర్ఖుడనగా నెట్టివాడు? సన్మార్గ దుర్మార్గ లక్షణము లెవ్వి ? స్వర్గ నరకము లెట్టివి? బంధువు లనగా నెట్టివారు? గృహ మనగా నేమి? ధనవంతుడని, నిర్ధనుడని యెవరి నందురు? కృపణు డనగా నెట్టివాడు! ఈశ్వరు డనియెవరి నందురు? దేవా! నా యీ

ప్రశ్నలకు సమాధాన మిమ్ము. దీనితోపాటు వీనికి వ్యతిరేకము లగు భావములను గూర్చియు వివరింపుము.

### శ్రీ భ గ వా ను వా చ.

అహింసా సత్యమస్తేయమసంగో హ్రీరసంచయః ।
ఆస్తిక్యం బ్రహ్మచర్యం చ మౌనం స్థైర్యం క్షమాభయమ్।
శౌచం జపస్తపో హోమః శ్రద్ధాఽఽతిథ్యం మదర్చనమ్ ।
తీర్థాటనం పరార్థేహా తుష్టిరాచార్యసేవనమ్ ॥ 34
ఏతే యమాః స నియమా ఉభయోర్ద్వాదశ స్మృతాః ।
పుంసాముపాసితాస్తాత యథాకామం దుహన్తి హి ॥ 35

భగవానుడు పలికెను :_ ఉద్ధవా! అహింస, సత్యము అస్తేయము, అసంగము, హ్రీ, అసంచయము, ఆస్తిక్యము, బ్రహ్మచర్యము, మౌనము, స్థైర్యము, క్షమ, అభయము - అను నీ పండ్రెండును యమలు. బాహ్యశౌచము, అభ్యంతరశౌచము, జపము, తపము, హోమము, శ్రద్ధ, ఆతిథ్యము, మదర్చనము, తీర్థాటనము, పరహిత చేష్ట, సంతుష్టి గురుసేవ -అను నీ పండ్రెండును నియమము లని చెప్పబడును. ఉద్ధవా! వీని ననుష్ఠించుటవలన ఉపాసకులు తమ ఇచ్ఛానుసారము భోగమోక్షములను, అభ్యుదయమును బొందుదురు.

శమో మన్నిష్ఠతా బుద్ధేర్దమ ఇంద్రియసంయమః ।
తితిక్షా దుఃఖసంమర్షో జిహ్వోపస్థజయో ధృతిః ॥ 36

బుద్ధిని నాయందు లగ్నముచేయుటయే 'శమము' ఇంద్రియములను నిగ్రహించుటయే 'దమము', దుఃఖములను సహించుటయే 'తితిక్ష', జిహ్వను, జననేంద్రియమును జయించుటయె ధైర్యము,

దండన్యాసః పరం దానం కామత్యాగ స్తపః స్మృతమ్ ।
స్వభావవిజయః శౌర్యం సత్యం చ సమదర్శనమ్ ॥ 37

ఎవ్వరికిని ద్రోహము చేయకుండుట 'దానము'. కోరికలను త్యాగము చేయుటయే 'తపస్సు'. వాసనలను నిరోధించుటయే శౌర్యము. బ్రహ్మవిషయక మగువిచారమే సత్యము.

ఋతం చ సూనృతా వాణీ కవిభిః పరికీర్తితా ।
కర్మస్వసంగమః శౌచం త్యాగః సంన్యాస ఉచ్యతే॥ 38

ఇట్లే సత్యము, ప్రియము నగువాక్కునే మహాత్ములు 'ఋత'మని చెప్పిరి. కర్మలయందనాసక్తుడయి యుండుటయే శౌచము. కోరికలను త్యజించుటయే నిజమగు 'సన్న్యాసము'

ధర్మం ఇష్టం ధనం నౄణాం యజ్ఞోఽహం భగవత్తమః।
దక్షిణా జ్ఞానసందేశః ప్రాణాయామః పరం బలమ్ ॥ 39

'ధర్మమే' మానవుల కభీష్ట మగు'ధనము', నేనే 'యజ్ఞమును'. జ్ఞానము నుపదేశించుటయే 'దక్షిణ'. ప్రాణాయామమే శ్రేష్ఠమగు 'బలము'.

భగో మ ఐశ్వరో భావో లాభో మద్భక్తిరుత్తమః ।
విద్యాఽఽత్మని భిదాబాధో జుగుప్సా హ్రీరకర్మసు ॥ 40

నా యైశ్వర్యమె 'భగము'. నా శ్రేష్ఠభక్తియె యుత్తమ 'లాభము'. ఆత్మయందు ప్రతీయమాన మగు భేదమును తొలగించునదియె నిజమగు 'విద్య'. అకర్మలయందు హేయత్వమును దర్శించుటయె లజ్జ (హ్రీ).

శ్రీర్గుణా నైరపేక్ష్యాద్యాః సుఖం దుఃఖసుఖాత్యయః ।
దుఃఖం కామసుఖాపేక్షా పండితో బంధమోక్షవిత్ ॥ 41

నిరపేక్షతాది గుణములే 'శ్రీ'. సుఖదుఃఖముల నతిక్రమించుటయె 'సుఖము'. విషయభోగములను గోరుటయె 'దుఃఖము'. బంధమోక్షముల తత్త్వము నెఱుంగువాడె 'పండితుడు'.

మూర్ఖో దేహాద్యహం బుద్ధిః పన్థా మన్నిగమః స్మృతః ।
ఉత్పథశ్చిత్తవిక్షేపః స్వర్గః సత్త్వగుణోదయః ॥ 42

శరీరాదులయందు నేను నాది యను భావమును గలిగియుండువాడె 'మూర్ఖుడు', ప్రపంచమునుండి మరలించి నన్ను బొందించునదియె సత్పథము. చిత్తవిక్షేపము లేదా ప్రవృత్తిమార్గమే కుపథము. సత్త్వగుణాభివృద్ధియె 'స్వర్గము'.

నరకస్తమ ఉన్నాహో బంధుర్గురురహం సఖే ।
గృహం శరీరం మానుష్యం గుణాఢ్యో హ్యాఢ్య
ఉచ్యతే ॥ 43

తమోగుణాభివృద్ధియె 'నరకము' జగద్గురువు నగునేనే'బంధువు'ను. ఈ మానవశరీరమే 'గృహము'. గుణవంతు డగు పురుషుడె ధనవంతుడు,

దరిద్రో యస్త్వసంతుష్టః కృపణో యోఽజితేంద్రియః ।
గుణేష్వసక్తధీరీశో గుణసంగో విపర్యయః ॥ 44

సంతుష్టి లేనివాడే 'దరిద్రుడు'. జితేంద్రియుడు కానివాడే 'కృపణుడు'. విషయములయం దాసక్తుడు కానివాడె 'స్వతంత్రుడు'. దీనికి విపరీతముగ విషయములం దాసక్తుడయినవాడె 'అస్వతంత్రుడు'.

ఏత ఉద్ధవ తే ప్రశ్నాః సర్వే సాధు నిరూపితాః ।
కిం వర్ణితేన బహునా లక్షణం గుణదోషయోః ।
గుణదోషదృశిర్దోషో గుణస్తూభయవర్జితః ॥ 45

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే పారమహంస్యాం
సంహితాయాం వైయాసిక్యా మేకాదశ స్కంధే
శ్రీ భగవదుద్ధవ సంవాదే యతిధర్మనిర్ణయోనామ
ఏకోనవింశోఽధ్యాయః

ఉద్ధవా! నీ వడిగిన ప్రశ్నల కన్నింటికిని సమాధానముల జెప్పితిని. గుణదోషముల లక్షణముల నెంత యని వర్ణింతును? గుణ దోషములగూర్చి యాలోచించుటయె దోషమనియు, తద్విపరీత భావమునే గుణమనియు దెలిసికొనుము.

ఇది శ్రీ మద్భాగవత మహాపురాణము నందలి
ఏకాదశస్కంధములోని పందొమ్మిదవ
అధ్యాయము సమాప్తము.

# ఇరువదియవ అధ్యాయము

## జ్ఞాన కర్మ భక్తి యోగములు.

### ఉద్ధవ ఉవాచ.

విధిశ్చ ప్రతిషేధశ్చ నిగమో హీశ్వరస్య తే ।
అవేక్షతేఽరవిందాక్ష గుణం దోషం చ కర్మణామ్ ॥ 1

**ఉద్ధవుడు పలికెను :—** కమలనయనా! సర్వశక్తిమంతుడవగు నీ ఆదేశములే విధినిషేధరూపములగు వేదములు. ఇవి కర్మల గుణదోషములను—పాపపుణ్యములను ప్రతిపాదించుచున్నవి.

వర్ణాశ్రమవికల్పం చ ప్రతిలోమానులోమజమ్ ।
ద్రవ్యదేశవయఃకాలాన్ స్వర్గం నరకమేవ చ ॥ 2

ఆ వేదశాస్త్రములె వర్ణాశ్రమ భేదములను, ప్రతిలోమజానులోమజములగు గుణదోషములను, ద్రవ్యదేశ వయస్సులను, కాలగతమగు యోగ్యతను, అయోగ్యతను, స్వర్గనరకములను వివరించును.

గుణదోషభిదాదృష్టిమంతరేణ వచస్తవ ।
నిశ్శ్రేయసం కథం నౄణాం నిషేధవిధిలక్షణమ్ ॥ 3

గుణదోషభేదదృష్టి లేకుండగ విధినిషేధాత్మకమగు వాక్కు ఉండజాలదు. విధి నిషేధవాక్కు లేకుండగ మానవులకు ముక్తి కలుగుట అసంభవము.

పితృదేవమనుష్యాణాం వేదశ్చక్షుస్తవేశ్వర ।
శ్రేయస్త్వనుపలబ్ధేఽర్థే సాధ్యసాధనయోరపి ॥ 4

దేవా! అనుభవాతీతమగు మోక్షమును, స్వర్గాది విషయములను,

సాధ్యసాధనజ్ఞానమును వెల్లడిచేయు నీ వాక్కే వేదము. అది పితృదేవతలకు, మనుష్యులకు పరమప్రమాణముగా నున్నది.

గుణదోషభిదాదృష్టిర్నిగమాత్తే న హి స్వతః ।
నిగమేనాపవాదశ్చ భిదాయా ఇతి హ భ్రమః ॥ 5

నీ వాక్కయిన వేదమునుండి గుణదోషములకు భేద దృష్టి ప్రవర్తిత మైనది. అది స్వతస్సిద్ధము గాదు. వేదము భేదమును గూడ తొలగించును. అనువాక్యశ్రవణమున నాకు సంశయము కలుగుచున్నది. కావున దానిని తొలగింపుము.

### శ్రీ భగవానువాచ.

యోగాస్త్రయో మయా ప్రోక్తా నృణాం
శ్రేయోవిధిత్సయా ।
జ్ఞానం కర్మచ భక్తిశ్చ నోపాయో ఽన్యోఽస్తి
కుత్రచిత్ ॥ 6

**భగవానుడు పలికెను :-** ఉద్ధవా ; మానవులకు శ్రేయస్సును చేకూర్చదలచి నేను జ్ఞాన కర్మ భక్తు లను మూడు యోగములను నిర్దేశించితిని. ఇంతకంటె మించిన యుపాయ మింకొకటి యేదియును లేదు.

నిర్విణ్ణానాం జ్ఞానయోగో న్యాసినామిహ కర్మసు ।
తేష్వనిర్విణ్ణచిత్తానాం కర్మయోగస్తు కామినామ్ ॥ 7

వీనిలో కర్మలనుండి, కర్మఫలములనుండి విరక్తి చెందినవారు, వానివి త్యజించినవారు జ్ఞానయోగమున కధికారులు. కర్మలనుండి కర్మ

ఫలములనుండి విరక్తి చెందనివారు, వానియందు దుఃఖబుద్ధిని కలిగి యుండనివారు నగు సకామవ్యక్తులు కర్మయోగమున కధికారులు.

యదృచ్ఛయా మత్కథాదౌ జాతశ్రద్ధస్తు యః పుమాన్ ।
న నిర్విణ్ణో నాతిసక్తో భక్తియోగోఽస్య సిద్ధిదః ॥ 8

అదృష్టమువలన నా కథలయందు ఆదరము కలిగియున్నవాడు, విషయములయందు వైరాగ్యము లేదా అమితమగు నాసక్తి లేనివాడు నగు పురుషునకు భక్తియోగము సిద్ధిప్రదమగును.

తావత్కర్మాణి కుర్వీత న నిర్విద్యేత యావతా ।
మత్కథాశ్రవణాదౌ వా శ్రద్ధా యావన్న జాయతే॥ 9

కర్మవిషయములయందు దుఃఖజ్ఞానము, లేదా నా కథాశ్రవణము నందు శ్రద్ధ కలుగగనంతవఱకు మానవుడు నిత్యనైమిత్తికకర్మల నాచరించుచు నుండవలెను.

స్వధర్మస్థో యజన్ యజ్ఞైరనాశీః కామ ఉద్ధవ ।
న యాతి స్వర్గనరకౌ యద్యన్యన్న సమాచరేత్ ॥ 10

ఉద్ధవా ! స్వధర్మాచరణశీలుడు, అఫలకామియు నగు పురుషుడు యజ్ఞముద్వారా దేవతల నారాధించి నిషిద్ధకర్మలను, కామ్యకర్మలను నాచరింపనిచో వానికి స్వర్గముగాని నరకముగాని లభింపదు.

అస్మిన్ లోకే వర్తమానః స్వధర్మస్థోఽనఘః శుచిః ।
జ్ఞానం విశుద్ధమాప్నోతి మద్భక్తిం వా యదృచ్ఛయా॥ 11

నిషిద్ధకర్మత్యాగియు, శుద్ధచిత్తుడు, స్వధర్మపరాయణుడు నగు వ్యక్తి

నీ లోకమున నున్నను కేవలము జ్ఞానము లేదా అదృష్టమువలన నా భక్తిని బొందును

స్వర్గిణోఽప్యేతమిచ్ఛంతి లోకం నిరయిణస్తథా ।
సాధకం జ్ఞానభక్తిభ్యాముభయం తదసాధకమ్ ॥ 12

స్వర్గనరకవాసు లగు జీవులు జ్ఞానమును, భక్తిని సాధించుట కయోగ్యు లగుటవలన జ్ఞానభక్తి సాధక మగు మనుష్యజన్మనే యెల్లపుడు కోరుకొనుచుందురు.

న నరః స్వర్గతిం కాంక్షేన్నారకీం వా విచక్షణః ।
నేమం లోకం చ కాంక్షేత దేహావేశాత్ ప్రమాద్యతి॥ 13

దేహాభిమానము ప్రమాదమును గలిగించునది కనుక బుద్ధిమంతు డగు పురుషుడు స్వర్గనరకములనుగాని, మానవజన్మనుగాని కోరడు.

ఏతద్విద్వాన్ పురా మృత్యోరభవాయ ఘటేత సః ।
అప్రమత్త ఇదం జ్ఞాత్వా మర్త్యమప్యర్థసిద్ధిదమ్ ॥ 14

ఈ మానవదేహము జ్ఞానభక్తిరూపమగు పురుషార్థము నిచ్చునదయినను, అది వినాశస్వభావము గలది యని తెలిసికొని పురుషు డప్రమత్తభావముతో మృత్యువు సమీపించుటకు పూర్వమే ముక్తికై ప్రయత్నము చేయవలెను.

ఛిద్యమానం యమైరేతైః కృతనీడం వనస్పతిమ్ ।
ఖగః స్వకేతముత్సృజ్య క్షేమం యాతి హ్యలంపటః॥ 15

తాను నివసించుగూడు గలిగినవృక్షము యమునివంటి నిర్దయు లగు మానవులచే ఛేదింపబడుట చూచి అనాసక్తమగుపక్షి ఆ చెట్టును వదలి లేచిపోవును.

అహోరాత్రైశ్ఛిద్యమానం బుద్ధ్వాఽఽయుర్భయవేపథుః।
ముక్తసంగః పరం బుద్ధ్వా నిరీహ ఉపశామ్యతి ॥　　16

రేయింబవళ్ళు ఆయువును క్షీణింపచేయుచున్న వవితెలిసికొని పురుషుడు భయకంపితుడగును. ముక్తసంగుడయి పరబ్రహ్మమును దెలిసికొనును. నిష్కాముడయి శాంతిని బొందును,

నృదేహమాద్యం సులభం సుదుర్లభం
ప్లవం సుకల్పం గురుకర్ణధారమ్ ।
మయానుకూలేన నభస్వతేరితం
పుమాన్ భవాబ్ధిం న తరేత్ స ఆత్మహా ॥　　17

ఈ మానవదేహము సర్వఫలములకు మూలమైనది, మిగుల దుర్లభమయినను సులభముగ లబ్ధమైనది. పటుతరమైనది. ఈ సంసార సాగరమును దాటుట కిది సుదృఢమైన నౌక శరణుజొచ్చుటచేతనే గురుదేవుడు కర్ణధారుడయి దీనిని నడిపించును. స్మరణమాత్రముచేతనే అనుకూలవాయు రూపమున నేను దీనిని లక్ష్యమువైపునకు దీసికొని పోవుదును. ఇంతటి చక్కని యేర్పాటున్నను ఈ శరీరముద్వారా సంసార సాగరమును దాట జాలని మానవుడు తన చేతులతో తన యాత్మను నాశనము చేసికొనుచున్నాడు. అనగా నధఃపతన మగుచున్నా డనియర్థము.

యదాఽఽరంభేషు నిర్విణ్ణో విరక్తః సంయతేన్ద్రియః ।
అభ్యాసేనాత్మనో యోగీ ధారయేదచలం మనః ॥　　18

దుఃఖదర్శనమువలన ఆరబ్ధకర్మలచే నుద్విగ్నుడయి ఫల విరక్తుడగు యోగి జితేంద్రియుడయి ఆత్మవిషయక మగువృత్తిప్రవాహము ననుసరించి నిశ్చలభావముతో మనస్సును ధరించును.

ధార్యమాణం మనో యర్హి భ్రామ్యదాశ్వనవస్థితమ్ ।
అతంద్రితోఽనురోధేన మార్గేణాత్మవశం నయేత్ ॥ 19

ప్రయత్నపూర్వకముగ నిగ్రహింపబడినను మనస్సు ఇటునటు సంచరించు స్వభావము గలదియై లక్ష్యవస్తువునందు స్థిరముగ నుండదు. అపుడు సావధానుడయి అనురోధ ( అనుకూల ) మగు మార్గముద్వారా దానిని స్వాధీనము చేసికొనవలెను.

మనోగతిం న విసృజేజ్జితప్రాణో జితేంద్రియః ।
సత్త్వసంపన్నయా బుద్ధ్యా మన ఆత్మవశం నయేత్ ॥ 20

మనోగతిని ఉపేక్షింపరాదు. కాని జితేంద్రియుడు, జితప్రాణుడునయి సత్త్వసంపన్న మగు బుద్ధిద్వారా దానిని ఆత్మవశము చేసికొనవలెను

ఏష వై పరమో యోగో మనసః సంగ్రహః స్మృతః ।
హృదయజ్ఞత్వమన్విచ్ఛన్ దమ్యస్యేవార్వతో
ముహుః ॥ 21

అశ్వారోహకుడగు మానవుడు దుర్దాంతము దమనయోగ్యము నగు అశ్వమును తన మనోభావమును గుర్తెఱుంగునట్లు చేయుటకు ప్రయత్నించును. తన యిష్టానుసారము దానిని నడుపగోరును. అపుడు దాని పగ్గములను పట్టుకొనియుండునుగాని పూర్తిగ విడువడు. మంచి మాటలతో దానిని స్వాధీనము చేసికొనును. అట్లే అనువృత్తి మార్గముచే మనస్సును వశము చేసికొనుటయే ఉత్తమమగు యోగము.

సాంఖ్యేన సర్వభావానాం ప్రతిలోమానులోమతః ।
భవాప్యయావనుధ్యాయేన్మనో యావత్ ప్రసీదతి ॥ 22

మనస్సు నిశ్చలత్వమును బొందువఱకు పురుషుడు తత్త్వజ్ఞానము ద్వారా మహత్తత్త్వమునుండి స్థూలదేహమువఱకు గల సర్వపదార్థముల అనులోమక్రమసృష్టిని, ప్రతిలోమక్రమ ప్రళయమును గూర్చి ఆలోచింప వలెను.

నిర్విణ్ణస్య విరక్తస్య పురుషస్యోక్తవేదినః ।
మనస్త్యజతి దౌరాత్మ్యం చింతితస్యానుచింతయా ॥ 23

నిర్వేదవైరాగ్యయుక్తమగుపురుషుని చిత్తము గురూపదిష్టములగు విషయములను గూర్చి మాటిమాటికి నాలోచించుచు దేహాభిమానమును త్యజించును.

యమాదిభిర్యోగపథై రాన్వీక్షిక్యా చ విద్యయా ।
మమార్చోపాసనాభిర్వా నాన్యైర్యోగ్యం స్మరేన్మనః ॥ 24

యమాదియోగమార్గములచేత, వస్తుతత్త్వమును పరిశీలనము చేయు తర్కవిద్యచేత, నా ప్రతిమను అర్చించుట ధ్యానించుట మున్నగువానిచేత, మనస్సు పరమాత్మవస్తువును బొందునుగాని ఇతరములగు నుపాయములచేత బొందదు.

యది కుర్యాత్ప్రమాదేన యోగీ కర్మ విగర్హితమ్ ।
యోగేనైవ దహేదంహో నాన్యత్తత్ర కదాచన ॥ 25

యోగియైనవా డెప్పుడయిన ప్రమాదవశమున నిందింపదగిన కర్మల నాచరించినచో వానివలన కలుగుపాపమును యోగముద్వారా పోగొట్టుకొన వలెనుగాని కృచ్ఛ్రచాంద్రాయణాదు లగు నితర ప్రాయశ్చిత్తముల చేసి కొనరాదు.

స్వే స్వేఽధికారే యా నిష్ఠా సగుణః పరికీర్తితః ।
కర్మణాం జాత్యశుద్ధానామనేన నియమః కృతః ।
గుణదోషవిధానేన సంగానాం త్యాజనేచ్ఛయా ॥ 26

తన యధికారవిషయముల యందుండుఏకాగ్రతయే గుణ మను పేరుతో పిలువబడుచున్నది. ఈ గుణదోషవిధానమువలన గలిగిన సాంగత్యమును పరిహరింపవలెను. ఏలయన, కర్మలు సహజముగనే అశుద్ధములు, అనర్థములకు మూలములు. కావున వీలున్నంతవరకు ప్రవృత్తిని సంకోచపఱచవలెను.

జాతశ్రద్ధో మత్కథాసు నిర్విణ్ణః సర్వకర్మసు ।
వేదదుఃఖాత్మకాన్ కామాన్ పరిత్యాగేఽప్యనీశ్వరః ॥ 27
తతో భజేత మాం ప్రీతః శ్రద్ధాలుర్దృఢనిశ్చయః ।
జోషమాణశ్చ తాన్ కామాన్ దుఃఖోదర్కాంశ్చ
గర్హయన్ ॥ 28

నా లీలాకథలయందు శ్రద్ధాయుక్తుడు, కర్మలయందు ఉద్విగ్నుడు నగు పురుషుడు విషయవాసనాసమూహమును దుఃఖాత్మక మని తెలిసికొనవలెను. దానిని విడచుట కశక్తుడయినచో "నాయందలి భక్తిచేతనే సర్వవిషయములయందు సిద్ధికలుగు"నను దృఢనిశ్చయము కలిగి దుఃఖపరిణామక మగు విషయముల ననుభవించుచు వానియందు ప్రీతిలేనివాడై యుండవలెను. కాని ప్రీతితో నన్నారాధించు చుండవలెను.

ప్రోక్తేన భక్తియోగేన భజతో మాఽసకృన్మునేః ।
కామా హృదయ్యా నశ్యన్తి సర్వేమయిహృదిస్థితే ॥ 29

వెనుక చెప్పబడిన భక్తి యోగముచే నిరంతరము నన్నారాధించు

వాని హృదయమున నే నెల్లప్పుడు నివసింతును. దానివలన వాని హృదయములో నుండు విషయవాసన లన్నియు వినష్టము లగును

భిద్యతే హృదయగ్రంథిశ్ఛిద్యంతే సర్వసంశయాః ।
క్షీయంతే చాస్యకర్మాణి మయి దృష్టేఽఖిలాత్మని॥ 30

సర్వాంతర్యామిని, పరమాత్మరూపుడను నగు నన్ను సాక్షాత్కరింప జేసికొనిన జీవుని యహంకారము నష్టమగును, సర్వసంశయములు భిన్నము లగును, కర్మరాశియు క్షయమగును.

తస్మాన్మద్భక్తియుక్తస్య యోగినో వై మదాత్మకః ।
న జ్ఞానం న చ వైరాగ్యం ప్రాయః శ్రేయో
భవేదిహ ॥ 31

అందువలన మద్గతచిత్తుడు, మద్భక్తియుక్తుడు నగు యోగికి జ్ఞానముగాని వైరాగ్యముగాని యీ లోకములో శ్రేయస్సును గలుగజేయు సాధనములు కావు.

యత్కర్మభిర్యత్తపసా జ్ఞానవైరాగ్యతశ్చయత్ ।
యోగేన దానధర్మేణ శ్రేయోభిరితరైరపి ॥ 32
సర్వం మద్భక్తియోగేన మద్భక్తో లభతేంజసా ।
స్వర్గాపవర్గం మద్ధామ కథంచిద్యది వాంఛతి ॥ 33

కర్మ, తపస్సు, జ్ఞానము, వైరాగ్యము, యోగాభ్యాసము, దానము, ధర్మము, తీర్థయాత్రలు, వ్రతములు మున్నగు నితరసాధనములచే లభించు దానిని నా భక్తుడు భక్తియోగముచేతనే అనాయాసముగ బొందును వాని కెట్టికోరికయు నుండదు. ఒకవేళ అత డెప్పుడయిన కోరుకొనినచో వానికి స్వర్గము, మోక్షము చివరకు నాధామమైన వైకుంఠముగూడ లభించును.

న కించిత్సాధవో ధీరా భక్తా హ్యేకాంతినో మమ ।
వాంఛన్త్యపి మయా దత్తం కైవల్యమపునర్భవమ్ ॥ 34

నాయందు ప్రీతిగలవారు, ధీరులు, సాధువులు నగు భక్తులు నాచే నీయబడిన ఆత్యంతిక మోక్షమును గూడ స్వీకరింపరు

నైరపేక్ష్యం పరం ప్రాహుః నిశ్శ్రేయసమనల్పకమ్ ।
తస్మాన్నిరాశిషో భక్తిర్నిరపేక్షస్య మే భవేత్ ॥ 35

నిరపేక్షతయె సర్వోత్కృష్టము, అత్యధికము నగు నిశ్శ్రేయస మని చెప్పబడుచున్నది అందువలన నిరపేక్షుడు నిష్కాముడు నగు వ్యక్తి నా భక్తిని పొందగలడు.

న మయ్యేకాంతభక్తానాం గుణదోషోద్భవా గుణాః ।
సాధూనాం సమచిత్తానాం బుద్ధేః పరముపేయుషామ్ ॥ 36

రాగాదిరహితులు, అంతట సమబుద్ధిగలవారు, నాయందు ఏకాంత మయిన భక్తిగలవారు, మాయాతీతమయిన భగవద్వస్తువును బొందినవారు నగు భక్తులకు విధినిషేధములవలన గలుగు పుణ్యపాపములతో నెట్టి సంబంధము నుండదు.

ఏవమేతాన్ మయాఽఽదిష్టాననుతిష్ఠంతి మే పథః ।
క్షేమం విందంతి మత్స్థానం యద్బ్రహ్మ
పరమం విదుః ॥ 37

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే పారమహంస్యాం
సంహితాయాం వైయాసిక్యాం ఏకాదశస్కంధే
శ్రీభగవదుద్ధవసంవాదే జ్ఞానకర్మభక్తియోగో
నామ వింశతితమోఽధ్యాయః

నేను చెప్పిన ఈ జ్ఞానకర్మభక్తిమార్గముల నాశ్రయించినవారు కాలమాయాదిరహిత మగు నా వైకుంఠధామమును బొందగలరు. అట్టివారే పరబ్రహ్మతత్త్వము నెఱింగినవా రని చెప్పబడుచున్నారు.

ఇట్లు శ్రీమద్భాగవత మహాపురాణములోని ఏకాదశ
స్కంధము నందలి ఇరువదియవ అధ్యాయము
సమాప్తము.



# ఇరువదియొకటవ అధ్యాయము

## గుణదోషవ్యవస్థ స్వరూపము – రహస్యము

### శ్రీ భగవానువాచ

యఏతాన్ మత్పథో హిత్వా భక్తిజ్ఞానక్రియాత్మకాన్ ।
క్షుద్రాన్ కామాంశ్చలైః ప్రాణైర్జుషన్తః సంసరంతి తే॥ 1

**భగవానుడు పలికెను :—** నేను చెప్పిన మీ భక్తి జ్ఞాన కర్మాత్మక మగు మార్గమును విడచి చంచలము లగు నింద్రియములచే తుచ్ఛము లగు విషయసుఖముల ననుభవించువారు సర్వగుణదోషములకు నిలయులై నానావిధము లగు యోనులలో దిరుగగలరు.

స్వే స్వేఽధికారే యా నిష్ఠా సగుణః పరికీర్తితః ।
విపర్యయస్తు దోషస్స్యాదుభయోరేష నిశ్చయః ॥ 2

తమ తమ యధికారమునం దుండుట గుణము, పరాధికారమునం దుండుట దోషము. ఇదియె గుణదోషస్వరూపనిరూపణము.

శుద్ధ్యశుద్ధీ విధీయేతే సమానేష్వపి వస్తుషు ।
ద్రవ్యస్య విచికిత్సార్థం గుణదోషౌ శుభాశుభౌ ।
ధర్మార్థం వ్యవహారార్థం యాత్రార్థమితి చానఘ ॥ 3

అనఘా। ఉద్ధవా। ఇది యోగ్యమా, కాదా యను సందేహముచే ద్రవ్యవిశేషముయొక్క స్వాభావికప్రవృత్తిని ప్రతిబంధించుటకై, సమానములయిన వస్తువులయందు గూడ ధర్మార్థమై శుద్ధి, అశుద్ధి వ్యవహారార్థమై గుణదోషములు, దేహరక్షణార్థమయి శుభాశుభములు విధింపబడుచున్నవి.

దర్శితో౽యం మయాచారో ధర్మముద్వహతాం
ధురమ్ ॥ 4

ధర్మరూప మగు భారమును వహించు మానవులకు మన్వాదుల రూపములను ధరించి నే నీ యాచారమును జూపించితిని.

భూమ్యంబ్వగ్న్యనిలాకాశా భూతానాం పంచ ధాతవః ।
ఆబ్రహ్మస్థావరాదీనాం శారీరా ఆత్మసంయుతాః ॥ 5

భూమి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము — అను నీ పంచ భూతములు బ్రహ్మనుండి స్థావరములవరకు గల సర్వప్రాణుల శరీరములకు మూలకారణములై యున్నవి. అవి యన్నియు పరమాత్మవస్తువుతో గూడ సంబంధము గలిగియున్నవి.

వేదేన నామరూపాణి విషమాని సమేష్వపి ।
ధాతుషూద్ధవ కల్ప్యన్త ఏతేషాం స్వార్థసిద్ధయే ॥ 6

ఉద్ధవా! ఈ ప్రాణుల దేహములు సమానము లయినప్పటికిని వారి ధర్మాదిపురుషార్థముల సిద్ధికై వేదము విభిన్నము లగు నామ రూపములను గల్పించినది.

దేశకాలాదిభావానాం వస్తూనాం మమ సత్తమ ।
గుణదోషౌ విధీయేతే నియమార్థం హి కర్మణామ్ ॥ 7

సాధుశ్రేష్ఠా! కర్మలను నియమించుటకే నేను దేశకాలాదిపదార్థములకు, ధ్యానాదివస్తువులకు గుణదోషములను విధించితిని.

అకృష్ణసారో దేశానామబ్రహ్మణ్యో౽శుచిర్భవేత్ ।
కృష్ణసారో౽ప్యసౌవీరకీకటాసంస్కృతేరిణమ్ ॥ 8

దేశములలో కృష్ణసారము లేనిది, బ్రాహ్మణ భక్తుడులేనిది యగు దేశ మపవిత్రమైనది. కృష్ణసారమృగము కలదయినను సౌవీరదేశము తప్ప ఇతరదేశములు, కీకటదేశము సంస్కార రహితములు, మరు భూములుగలవి యగు దేశములు గూడ నపవిత్రములే యగును.

కర్మణ్యో గుణవాన్ కాలో ద్రవ్యతః స్వత ఏవ వా ।
యతో నివర్తతే కర్మ స దోషోఽకర్మకః స్మృతః ॥ 9

ద్రవ్యముతోను, స్వయముగను, కర్మమును చేయుటకు వీలైన కాలము పవిత్రమయినది. కర్మచేయుటకు సామగ్రి లభించని కాలము, ఆగంతుకము లగుదోషములవలన లేదా స్వాభావికము లగు దోషములవలన కర్మనుగూడ చేయుటకు వీలుగాని సమయము అపవిత్రమయినది.

ద్రవ్యస్య శుద్ధ్యశుద్ధీ చ ద్రవ్యేణ వచనేన చ ।
సంస్కారేణాథ కాలేన మహత్త్వాల్పతయాథవా ॥ 10

పదార్థముల శుచిత్వాశుచిత్వములు ద్రవ్య, వచన, సంస్కార, కాలములవలన; మహత్త్వము లేదా అల్పత్వములవలన గూడ నుండును. (ఎట్లనగా, వస్త్రాదిపదార్థములు జలాదులచే పవిత్రములు మూత్రాదులచే నపవిత్రములు నగును. ఏది పవిత్రము, ఏది కాదు అను సందేహము కలిగినపుడు బ్రాహ్మణుని వాక్కు పవిత్రము, వేరువిధమైనది అపవిత్రము. ప్రోక్షణాదులచే పుష్పములు పవిత్రములు, ఘ్రాణాదులచే నపవిత్రములు. భూశాహాదికాలములయందు నూతన జలాశయములు పవిత్రములు, మిగిలినవి అపవిత్రములు. అంత్యజులు స్పృశించిన పెద్ద పెద్ద సరోవరములలోని నదులలోని నీరు పవిత్రము, చిన్నచిన్న గుంటలలోని నీరు అపవిత్రము).

శక్త్యాశక్త్యాథవా బుద్ధ్యా సమృద్ధ్యా చ యదాత్మనే ।
అఘం కుర్వంతి హి యథా దేశావస్థానుసారతః ॥ 11

సామర్థ్యాసామర్థ్యముల ననుసరించి, బుద్ధి ననుసరించి, సమృద్ధి ననుసరించి జీవులు పాపములు చేయుచున్నారు. అట్లు చేయుట దేశకాల పరిస్థితులవలననే యని యెఱుంగవలెను. (సామర్థ్యా సామర్థ్యముల ననుసరించి—సమర్థు డగు వ్యక్తి పక్షమున సూర్యగ్రహణ సూతకాదుల యందలి అన్నాదు లపవిత్రములు, అసమర్థు డగు పురుషుని పక్షమున పవిత్రములు. బుద్ధి ననుసరించి—పుత్రజననాదుల యందలి దశరాత్రుల బాహ్యజ్ఞానముచే శుద్ధి, తదంతర్గత మగు జ్ఞానముచే నశుద్ధి, సమృద్ధిననుసరించి—జీర్ణ మలినవస్త్రాదులు సమర్థు డగు వాని పక్షమున అశుద్ధములు. దరిద్రుడగు వాని పక్షమున శుద్ధములు ఇట్టి ద్రవ్యముల యొక్క అశుద్ధి ద్వారా జీవుడు చేయుపాపములు దేశకాలావస్థా భేదమువలననే యని తెలిసికొనవలెను).

ధాన్యదార్వస్థితంతూనాం రసతైజసచర్మణామ్ ।
కాలవాయ్వగ్నిమృత్తోయైః పార్థివానాం
యుతాయుతైః ॥ 12

ధాన్యము, కఱ్ఱ, ఏనుగు దంతములు మున్నగు ఎముకలు, తైల ఘృతాది రసద్రవ్యములు; బంగారము మున్నగు తైజస పదార్థములు, చర్మము, మృద్వికారము లగు ఘటాది పదార్థములు, కాలము, వాయువు, అగ్ని, మృత్తిక, జలము ననువాని సంయోగముచేత పవిత్రములగును.

అమేధ్యలిప్తం యద్యేన గంధం లేపం వ్యపోహతి ।
భజతే ప్రకృతిం తస్య తచ్ఛౌచం తావదిష్యతే ॥ 13

ఒక వస్తువునకు అపవిత్ర మైనపదార్థ మేదియైన అంటుకొనినచో చెక్కుటవలన లేదా మృత్తికాదులను రుద్దుటవలన ఆ పదార్థమునకు గంధము, లేపము నుండదు. పూర్వరూపములోనికి వచ్చినపు డావస్తువు పవిత్రమైనదనియే భావింపవలెను ?

స్నానదానతపోఽవస్థా వీర్యసంస్కారకర్మభిః ।
మత్స్మృత్యా చాత్మనః శౌచం శుద్ధః కర్మా
చరేద్ద్విజః ॥ 14

స్నానము, దానము, తపస్సు, వయస్సు, శక్తి, ఉపనయనము మున్నగు సంస్కారములచేత, సంధ్యోపాసనాది కర్మలచేత నా స్మరణము చేత కర్త శుద్ధుడగును. ఈ సర్వకర్మలచే శుద్ధుడయి ద్విజుడు కర్మలను చేయవలెను.

మంత్రస్య చ పరిజ్ఞానం కర్మశుద్ధిర్మదర్పణమ్ ।
ధర్మస్సంపద్యతే షడ్భిరధర్మస్తు విపర్యయః ॥ 15

సద్గురు ముఖమున పరిజ్ఞాతమగు మంత్రము పవిత్రమగును నాకు సమర్పించుటవలన కర్మ శుద్ధి యగును. ఈ విధముగ దేశ కాల ద్రవ్యములు, కర్త, మంత్రము, కర్మ అను నీ యాఱును పవిత్రమగుటవలన ధర్మము సంపన్నమగును, అపవిత్ర మగుటవలన అధర్మ మేర్పడును

క్వచిద్గుణోఽపి దోషస్స్యాద్దోషోఽపి విధినా గుణః ।
గుణదోషార్థనియమస్తద్భిదామేవ బాధతే ॥ 16

కొన్నిచోట్ల గుణముగూడ దోషమగును, దోషముగూడ విధి వశమున గుణ మగును. ఒకే విషయమునందలి గుణదోషముల యీ నియమము గుణదోషముల భేదమునకు బాధకమగుచున్నది. (దీనివలన గుణ దోషభేదము కల్పితమని తెలియుచున్నది).

సమానకర్మాచరణం పతితానాం న పాతకమ్ ।
ఔత్పత్తికో గుణ స్సంగో న శయానః పతత్యధః ॥ 17

సురాపానాదిసమానకర్మల నాచరించుటవలన పతితులు కానివ్యక్తులు గూడ పతితులగుదురు. కాని మొదటనే పతితుడయిన వ్యక్తికి మరల పతన మనునది కలుగదు, కనుక పతితుని పక్షమున సురాపానము దోషము గాదు. అట్లే ఋతుకాలమున భార్యాగమనాదులు గృహస్థుల పక్షమున దోషము కాదు, పైగా గుణమే యగును. మొదటనే క్రింద పడుండియున్నవాడు ఇక పడుట యెక్కడ?

యతో యతో నివర్తేత విముచ్యేత తత స్తతః ।
ఏష ధర్మో నృణాం క్షేమః శోకమోహభయాపహః ॥ 18

ఏ యేవిషయములనుండి మానవుడు నివృత్తుడగునో ఆ యావిషయ బంధనములనుండి యతడు ముక్తుడగును. నివృత్తి లక్షణ ధర్మమే జీవులకు పరమసుఖమును గలిగించునట్టిది, శోకమోహభయములను నాశనము చేయునట్టిది యగును.

విషయేషు గుణాధ్యాసాత్ పుంసః సంగ స్తతో భవేత్ ।
సంగా త్తత్ర భవేత్కామః కామాదేవ కలిర్నృణామ్ ॥ 19

విషయచింతనము జీవులను మొదట విషయాసక్తులనుగా జేయును. ఆసక్తివలన కామము, కామమువలన కలహము కలుగును.

కలేర్దుర్విషహః క్రోధ స్తమ స్తమనువర్తతే ।
తమసా గ్రస్యతే పుంస శ్చేతనా వ్యాపినీ ద్రుతమ్ ॥ 20

కలహమువలన దుస్సహ మగు క్రోధము కలుగును. క్రోధము ననుసరించి మోహ ముండును ఈ మోహమె త్వరగా మానవుని కార్యాకార్యములను నిర్ణయించు వ్యాపకమైనచేతనాశక్తిని గ్రసించును.

తయా విరహితస్సాధో జంతుః శూన్యాయ కల్పతే ।
తతోఽస్య స్వార్థవిభ్రంశో మూర్ఛితస్య మృతస్య చ ॥ 21

ఉద్ధవా ! కార్యాకార్యజ్ఞానశూన్యు డగు జీవుడు అసత్తుల్యుడగును, అపుడు చేతనారహితుడు, మృతునివలె నున్నవాడు నగు నా వ్యక్తి (స్వార్థమునుండి పురుషార్థమునుండి) భ్రష్టుడగును.

విషయాభినివేశేన నాత్మానం వేద నాపరమ్ ।
వృక్షజీవికయా జీవన్ వ్యర్థం భస్త్రేవ యః శ్వసన్ ॥ 22

చేతనాశూన్యు డగు వ్యక్తి విషయములయందు మిక్కిలి అభినివేశము కలవాడగుటవలన తన్ను పరమాత్మను గుర్తింపజాలడు. వృక్షమువలె ప్రాణధారణోపయోగము లగువిషయములను గ్రహించును. కొలిమితిత్తివలె ఉచ్ఛ్వాసనిశ్వాసములను ఊరక విడచుచుండును. అతడు మృతునివలె, మూర్ఛితునివలె నుండును.

ఫలశ్రుతిరియం నృణాం న శ్రేయో రోచనం పరమ్ ।
శ్రేయో వివక్షయా ప్రోక్తం యథా భైషజ్య
రోచనమ్ ॥ 23

కర్మవలన గలుగు స్వర్గాదిఫలములు జీవునకు పరమపురుషార్థమును గలిగించునవి కావు. తండ్రి లడ్డు మున్నగు మధురపదార్థముల నిచ్చెదనని ఓదార్పుమాటలతో కుమారునకు ఔషధసేవనమునందు రుచిని గలిగించును. అట్లే వేదశాస్త్రములు మోక్షరూప మగు పరమశ్రేయస్సును గూర్చి చెప్పుటలో గల యుద్దేశ్యము జీవులకు కర్మలయందు రుచిని కలిగించుటకే.

ఉత్పత్త్యైవ హి కామేషు ప్రాణేషు స్వజనేషు చ ।
ఆసక్తమనసో మర్త్యా ఆత్మనోఽనర్థహేతుషు ॥ 24

మానవులు సహజముగనే తమ కనర్థముల గలిగించు పశువులు మున్నగువానియందు, ఆయుష్యము, ఇంద్రియములు, బలము, వీర్యము మున్నగువానియందు పుత్రాదులయందు ఆసక్తులై యుందురు.

నతానవిదుషః స్వార్థం భ్రామ్యతో వృజినాధ్వని ।
కథం యుంజ్యాత్పునస్తేషు తాంస్తమో విశతో బుధః॥ 25

అందువలన పరమసుఖమును దెలిసికొననివాడు, కామమార్గమున సంచరించు స్వభావము గలవాడు, తామస యోనులలో ప్రవేశించు స్వభావము గలవాడు, వేదవాక్యమును నమ్మనివాడునగు జీవుని వేదశాస్త్రములు మరల కామవిషయములయందేల ప్రవృత్తునిగా జేయును?

ఏవం వ్యవసితం కేచిదవిజ్ఞాయ కుబుద్ధయః ।
ఫలశ్రుతిం కుసుమితాం న వేదజ్ఞా వదంతి హి ॥ 26

దుర్బుద్ధులగు ( కర్మవాదులగు ) గొందఱు వ్యక్తులు వేదముల యందలి యీ యభిప్రాయములను దెలిసికొనజాలక అవాంతరఫలముల నిచ్చు రమణీయము లగు శ్రుతివాక్యములె పరమఫల మనిచెప్పుదురు, కాని వేదజ్ఞు లట్లు చెప్పలేదు.

కామినః కృపణా లుబ్ధాః పుష్పేషు ఫలబుద్ధయః ।
అగ్నిముగ్ధా ధూమతాంతాః స్వంలోకం న విదంతి తే॥ 27

అట్టి కుబుద్ధు లగుకర్మవాదులు కాముకులు, దీనులు, లుబ్ధులు. అందువలన అవాంతరఫలమును పరమఫల మనియెఱిగి అగ్నిసాధ్యము లగు కర్మలయందభినివేశముగలవా రగుదురు. దానివలన వివేకశూన్యులు, చివరకు ధూమమార్గావలంబులు నై ఆత్మతత్త్వమును దెలిసికొనజాలరు.

న తే మామంగ జానంతి హృదిస్థం య ఇదం యతః ।
ఉక్థశస్త్రా హ్యసుతృపో యథా నీహారచక్షుషః ॥ 28

ఉద్ధవా ! అంధకారావృతలోచను లగువ్యక్తులు సమీపమున నున్న వస్తువునుగూడ దెలిసికొనజాలరు. అట్లే పశుహింసాసాధన మగుకర్మయె శస్త్రముగా గలవారు, ప్రాణతర్పణపరాయణులు నగు కర్మవాదులు ఈ పరిదృశ్యమాన మగుజగత్తునకు కారణభూతుడను, హృదయములో నున్నట్టియు, అంతర్యామిని నగునన్ను దెలిసికొనజాలరు.

తే మే మతమవిజ్ఞాయ పరోక్షం విషయాత్మకాః ।
హింసాయాం యది రాగస్స్యాద్యజ్ఞ ఏవ న చోదనా ॥ 29
హింసావిహారా హ్యాలబ్ధైః పశుభిః స్వసుఖేచ్ఛయా ।
యజంతే దేవతా యజ్ఞైః పితృభూతపతీన్ ఖలాః ॥ 30

మాంసభక్షణార్థమై హింసయందు ప్రవృత్తి కలిగినచో యజ్ఞమునందే హింసచేయవలెను. ఇది పరిసంఖ్యావిధియే గాని సంధ్యావందనాదులవలె అపూర్వవిధి గాదు. హింసాపరాయణు లగు కర్మవాదులు నా పరోక్షాభిప్రాయమును దెలిసికొనజాలక స్వర్గాది సుఖములను పొందవలె ననెడికోరికతో యజ్ఞమునకై వధించిన పశుమాంసముచే దేవతలను, పితృదేవతలను, భూతములను ఆరాధించుచున్నారు.

స్వప్నోపమమముం లోకమసంతం శ్రవణప్రియమ్ ।
ఆశిషో హృది సంకల్ప్య త్యజంత్యర్థాన్ యథా
వణిక్ ॥ 31

అట్టి మందబుద్ధు లగువ్యక్తులు స్వప్నతుల్యము, నశ్వరము, కేవలము శ్రవణప్రియము నగుపరలోకమును, ఇహలోకములోని రాజ్యాదు

లను సుఖప్రదము లనిభావించి, (దుస్తరము లగు సముద్రాదులను తరించి ఎక్కువగా ధనమును సంపాదింపవలెననెడి కోరికతో వెనుక సంపాదించిన ధనమును వ్యయముచేసి నష్టపడిన) వ్యాపారివలె యజ్ఞాదులయందు ఎక్కువగా ధనమును వ్యయముచేసి రెండువిధముల నష్టపడుదురు.

రజస్సత్త్వతమో నిష్ఠా రజస్సత్త్వతమో జుషః ।
ఉపాసత ఇంద్రముఖ్యాన్ దేవాదీన్ న యథైవ
మామ్ ॥ 32

రజస్సత్త్వ తమోనిష్ఠ లగువారు రజస్సత్త్వతమో గుణములు గల ఇంద్రాదిదేవతలను వలె నన్నారాధించుటలేదు

వివరణము :- ఇంద్రాదిదేవతలు నాయంశ స్వరూపులేయైనను నాకంటె వేఱను భావముతో వారి నారాధించుచున్నారు. అట్టి యుపాసనచే నన్నుపాసించుట సరియైనదికాదు.

ఇష్ట్వేహ దేవతా యజ్ఞైర్గత్వా రంస్యామహే దివి ।
తస్యాంత ఇహ భూయాస్మ మహాశాలా మహాకులాః ॥ 33
ఏకం పుష్పితయా వాచా వ్యాక్షిప్తమనసాం నృణామ్ ।
మానినాంచాతిలుబ్ధానాం మద్వార్తాపి న రోచతే ॥ 34

మేము ఈలోకమున యజ్ఞములచే దేవతలనారాధించి స్వర్గ లోకములను పొంది అచట విహరింతుము. స్వర్గభోగములు క్షయమైనంతనె మరల భూమియందు కులీన వంశములోను, మహాభవనములలోను జన్మింతు మని వారు తలంతురు. (పుష్పములవలె) మనోహర మైననిట్టి వేదవాక్యముచే విక్షిప్తచిత్తులు. అతిలుబ్ధులు, అభిమానులునై, మానవులు నా కథాప్రసంగములయందు ఆసక్తి గలిగియుండరు.

వేదా బ్రహ్మాత్మవిషయాస్త్రికాండవిషయా ఇమే ।
పరోక్షవాదా ఋషయః పరోక్షం మమ చ ప్రియమ్ ॥ 35

వేదములలో మూడు కాండలు గలవు- 1. కర్మకాండ 2. ఉపాసనా కాండ 3. జ్ఞానకాండ. ఈ మూడింటిద్వారా బ్రహ్మమే ఆత్మయను విషయము ప్రతిపాదితమైనది. సర్వమంత్రములు, మంత్రద్రష్ట లగు ఋషులు ఈ విషయమును ప్రత్యక్షముగ గాక పరోక్షముగ జెప్పిరి. నాకు గూడ నిట్లు గుప్తరూపముగ జెప్పుటయె అభీష్టమైయున్నది. అంతఃకరణశుద్ధులగువ్యక్తులే దీని కధికారులు,వారే పరోక్ష వాదమును బాగుగ నెఱుంగ గలరు.

శబ్దబ్రహ్మ సుదుర్బోధం ప్రాణేంద్రియమనోమయమ్ ।
అనంతపారం గంభీరం దుర్విగాహ్యం సముద్రవత్ ॥ 36

శబ్దబ్రహ్మము వేదమే అది స్వరూపముగ గాని, అర్థముగ గాని తెలియరానిది; ప్రాణమయము, ఇంద్రియమయము, మనోమయమునైనది. అనంతము, అపారము, గంభీరము నగుసముద్రమువలె దుర్విగాహ్యమైనది.

మయోపబృంహితం భూమ్నా బ్రహ్మణానంతశక్తినా ।
భూతేషు ఘోషరూపేణ బిసేషూర్ణేవ లక్ష్యతే ॥ 37

సర్వవ్యాపకుడను, అనంతశక్తిమంతుడను, అపచ్ఛిన్నుడను, అంతర్యామిని నగునాచే నుపబృంహితమైన ఆ శబ్దబ్రహ్మము తామరతూడులోని దారమువలె ప్రాణులయందు నాదరూపముతో లక్షితమగుచున్నది.

యథోర్ణనాభిర్హృదయాదూర్ణాముద్వమతే ముఖాత్ ।
ఆకాశాద్ఘోషవాన్ ప్రాణో మనసా స్పర్శరూపిణా ॥ 38

ఛందోమయోఽమృతమయః సహస్రపదవీం ప్రభుః ।
ఓంకారాద్వ్యంజితస్పర్శస్వరోష్మాంతఃస్థభూషితామ్ ॥ 39
విచిత్రభాషావితతాం ఛందోభిశ్చతురుత్తరైః ।
అనంతపారాం బృహతీం సృజత్యాక్షిపతే స్వయమ్ ॥ 40

సాలెపురుగు హృదయమునుండి ముఖమునుండి దారములను వెలువరచునట్లు ఛందోమయుడు, అమృతమయుడు, నాదరూప మగు నుపాదానముతో గూడినవాడు నగుహిరణ్యగర్భ భగవానుడు స్పర్శాదివర్ణరూపమగు మనస్సుతో హృదయాకాశమునుండి ఓంకారవ్యంజితము లగుస్పర్శస్వరోష్మాంతస్థలములచే విభూషితమైనట్టియు, విచిత్రములగు వైదిక లౌకిక భాషాదులచే విస్తృతమైనట్టియు, ఉత్తరోత్తరము నాలుగు నాలుగు అక్షరములచే వృద్ధిబొందు ఛందస్సులచే నుపలక్షిత మైనట్టియు, శబ్దములవలన అర్థములవలన సమాప్తి చెందనట్టిదియు, బహుమార్గములు గలిగినట్టియు, వైఖరీ ప్రధానమైనట్టి అనంతము అపారమునగు శ్రుతిని స్వయముగ సృజించుచున్నాడు, ఉపసంహరించుచున్నాడు.

గాయత్ర్యుష్ణిగనుష్టుప్చ బృహతీ పంక్తిరేవ చ ।
త్రిష్టుబ్జగత్యతిఛందో హ్యత్యష్ట్యతిజగద్విరాట్ ॥ 41

(నాలుగు నాలుగు అక్షరము లధికముగా గలఛందస్సులలో గొన్ని యీ (క్రిందివి) గాయత్రి, ఉష్ణిక్, అనుష్టుప్, బృహతి, పంక్తి, త్రిష్టుప్పు జగతి, అతిచ్ఛందము, అత్యష్టి, అతజగతి, అతివిరాట్—అను నీఛందస్సు, లన్నియు వైఖరి యను వేదములలోనివె.

కిం విధత్తే కిమాచష్టే కిమనూద్య వికల్పయేత్ ।
ఇత్యస్యాహృదయం లోకే నాన్యో మద్వేద కశ్చన ॥ 42

కర్మకాండమున విధి వాక్యములచే నేది విహిత మైనది, ఉపాసనా కాండలో మంత్రవాక్యముచే నేది ప్రకాశిత మైనది, జ్ఞానకాండమున నిషే

ధార్థమగు నేవస్తువు చెప్పబడినది — అను నీ విధ మగువేదవాక్యముల పకృతతాత్పర్యము నాకుదప్ప మరియెవ్వరికిని దెలియదు

మాం విధత్తేఽభిధత్తే మాం వికల్ప్యాపోహ్యతేత్వహం
ఏతావాన్ సర్వవేదార్థః శబ్ద ఆస్థాయ మాం భిదామ్ ।
మాయామాత్రమనూద్యాంతే ప్రతిషిధ్య ప్రసీదతి ॥ 43

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే పారమహంస్యాం
సంహితాయాం వైయాసిక్యాం ఏకాదశస్కంధే
శ్రీభగవదుద్ధవసంవాదే ఏకవింశోఽధ్యాయః

వేదములు కర్మకాండమున నన్నే విధించుచున్నవి, ఉపాసనాకాండమున ఉపాస్యదేవతా రూపమున నన్నే వర్ణించుచున్నవి, జ్ఞానకాండమున ఆకాశాదిరూపముతో నాయందే అన్యవస్తువుల నారోపించి వానిని నిషేధించు చున్నవి. సర్వశ్రుతులు నన్నాశ్రయించి నాయందు భేదము నారోపించుచున్నవి, మాయామాత్రుడని చెప్పి దాని ననువదించు చున్నవి. చివర కన్నింటిని నిషేధించి నాయందే శాంతిని బొందుచున్నవి, అధిష్ఠాన రూపముతో నేనే మిగులుచున్నాను

ఇట్లు శ్రీమద్భాగవత మహాపురాణములోని ఏకాదశ
స్కంధము నందలి ఇరువదియొకటవ అధ్యాయము

సమాప్తము.

# ఇరువదిరెండవ అధ్యాయము

## తత్త్వ సంఖ్య - పురుష ప్రకృతి వివేకము

### ఉద్ధవ ఉవాచ.

కతి తత్త్వాని విశ్వేశ సంఖ్యాతాన్యృషిభిః ప్రభో ।
నవైకాదశ పంచత్రీణ్యాత్థ త్వమిహ శుశ్రుమ ॥ 1

ఉద్ధవుడు పలికెను:— దేవా! విశ్వేశ్వర! ఋషులు తత్త్వము లెన్ని యనిచెప్పిరి? నీవు (19వ అధ్యాయములో) తొమ్మిది, పదునొకండు, ఐదు, మూడు (అనగా మొత్తము గలసి యిరువది యెనిమిది) తత్త్వము లనిచెప్పితివి. ఈ విషయమును మేము వింటిమి.

కేచిత్ షడ్వింశతిం ప్రాహురపరే పంచవింశతిమ్ ।
సప్తైకే నవ షట్ కేచిచ్చత్వార్యేకాదశాపరే ॥ 2

కాని కొందఱు తత్త్వములను ఇరువదియారనియు, గొందఱు ఇరువదియైదనియు, మఱికొందఱు ఏడనియు, ఇంకకొందఱు తొమ్మిదనియు, మఱికొందఱు ఆఱనియు గొందఱు నాలుగనియు, కొందఱు పదునొకండనియుచెప్పుచున్నారు.

కేచిత్ సప్తదశ ప్రాహుః షోడశైకే త్రయోదశ ।
ఏతావత్త్వం హి సంఖ్యానామృషయో యద్వివక్షయా
గాయంతి పృథగాయుష్మన్నిదం నోవక్తుమర్హసి ॥ 3

ఈ విధముగ గొందఱు ఋషులు వానిని పదునేడనియు, మఱికొందఱు పదునారనియు, ఇంక కొందఱు పదమూడనియు చెప్పు

చున్నారు. కృష్ణా! ఇంతమంది ఋషు లేయభిప్రాయముతో నింత తేడాగా చెప్పుచున్నారు. ఈ విషయమును మాకు చెప్పవలసినది.

## శ్రీ భగవానువాచ.

యుక్తంచ సంతి సర్వత్ర భాషంతే బ్రాహ్మణా యథా।
మాయాం మదీయముద్గృహ్య వదతాం కిం ను
దుర్ఘటమ్ ॥ 4

భగవానుడు పలికెను:- సర్వతత్త్వములు అన్నింటిలో నంతర్భూతము లగుటవలన వేదజ్ఞులగు బ్రాహ్మణు లీవిషయమున జెప్పిన దంతయు సత్యమే. వా రందఱు నా మాయాశక్తి నాశ్రయించి తత్త్వముల వర్ణించిరి. వారుచెప్పినదేదియు అసంభవము గాదు.

నైతదేవం యథాఽఽత్థత్వం యదహం వచ్మి తత్తథా।
ఏకం వివదతాం హేతుం శక్తయో మే దురత్యయాః ॥ 5

నీ వే యేతత్త్వముల గూర్చి యేవిధముగ జెప్పుచున్నావో నే నా యాతత్త్వములను గూర్చి అట్లుకా దని చెప్పుచున్నాను. ఈ విధముగ వాదించు మానవుల వివాదవిషయమునకు మూలభూతమైనవి దురత్యయములగు నా శక్తులే కారణము.

యాసాం వ్యతికరాదాసీద్వికల్పో వదతాం పదమ్ ।
ప్రాప్తే శమదమేఽప్యేతి వాదస్తమను శామ్యతి ॥ 6

నా యీ సత్వాదిశక్తుల క్షోభమువలననె వాదించు వారివివాదవిషయమున భేద మేర్పడినది. శమదమములను బొందినపిమ్మట ఆ వికల్ప

ములు గూడ లయమగును. వికల్పములు నాశనమైనంతనె వివాదములు గూడ నుపశమించును.

పరస్పరానుప్రవేశాత్తత్త్వానాం పురుషర్షభ ।
పౌర్వాపర్యప్రసంఖ్యానం యథా వక్తుర్వివక్షితమ్ ॥ 7

పురుషశ్రేష్ఠుడవగు ఉద్ధవా! తత్త్వములు ఒకదానిలో నొకటి అనుప్రవిష్టములై యున్నవి. అందువలన వక్తల వివక్షానుసారముగ కార్యకారణభావముతో నవి పరిగణింపబడును.

ఏకస్మిన్నపి దృశ్యన్తే ప్రవిష్టానీతరాణి చ ।
పూర్వస్మిన్ వా పరస్మిన్ వా తత్త్వే తత్త్వాని సర్వశః ॥ 8

ఈ జగత్తులో వెనుకజరిగిన కారణతత్త్వమునందు ఇతరకార్యతత్త్వములయందు కారణతత్త్వములు అనుగతరూపమున ప్రవిష్టము లయినట్లు కనబడును.

పౌర్వాపర్యమతోఽమీషాం ప్రసంఖ్యానమభీప్సతామ్ ।
యథా వివిక్తం యద్వక్త్రం గృహ్ణీమో యుక్తి
సంభవాత్ ॥ 9

అందువలన తత్త్వముల కార్యకారణభావమును లేదా న్యూనాధిక భావమును, వాని సంఖ్యను వర్ణించు వక్తలలో నెవ రేయుద్దేశ్యముతో నెట్టి సంస్థాపనమున ప్రవృత్తులైయున్నారో యుక్తిసంభవమువలన నేను దానినంతటిని స్వీకరించుచున్నాను.

అనాద్యవిద్యాయుక్తస్య పురుషస్యాత్మవేదనమ్ ।
స్వతో న సంభవాదన్యస్తత్త్వజ్ఞో జ్ఞానదో భవేత్ ॥ 10

జీవు డనాదికాలమునుండి అవిద్యాగ్రస్తు డై యున్నాడు. అందు వలన నతడు తన్ను తాను తెలిసికొనలేకున్నాడు. వానికి ఆత్మజ్ఞానమును బోధించుటకు మఱియొక సర్వజ్ఞుడగువ్యక్తి అనగా భగవంతుడే అవసర మైయున్నాడు.

పురుషేశ్వరయోరత్ర న వైలక్షణ్యమణ్వపి ।
తదన్యకల్పనాపార్థా జ్ఞానం చ ప్రకృతేర్గుణః ॥ 11

జీవేశ్వరుల యిరువురికి చిద్రూపత్వమున, నెట్టి భేదము లేదు. కనుక వారిలో భేదమును గల్పించుట వ్యర్థము. ఈదృష్టితో జ్ఞానము గూడ సత్త్వగుణవృత్తివలన ప్రకృతికంటె భిన్నము కాదు

ప్రకృతిర్గుణసామ్యం వై ప్రకృతేర్నాత్మనో గుణాః ।
సత్త్వం రజస్తమ ఇతి స్థిత్యుత్పత్త్యంతహేతవః ॥ 12

సత్త్వాదిగుణముల సామ్యావస్థయె ప్రకృతి. ఈప్రకృతికి సంబంధించిన సత్త్వరజస్తమములు సృష్టి స్థితిలయములకు హేతువులు. ఈ గుణత్రయము ప్రకృతికి సంబంధించినదే కాని ఆత్మకు సంబంధించినది కాదు.

సత్త్వం జ్ఞానం రజః కర్మ తమోఽజ్ఞానమిహోచ్యతే
గుణవ్యతికరః కాలః స్వభావః సూత్రమేవ చ॥ 13

ఈప్రసంగమున సత్త్వగుణమే జ్ఞానమనియు, రజోగుణమే కర్మయనియు, తమోగుణమే అజ్ఞాన మనియు చెప్పబడినది. గుణముల యందు క్షోభమును గలుగజేయు నీశ్వరుడే కాలము, సూత్రము అనగా మహత్తత్త్వమె స్వభావ మనియు చెప్పబడినది.

పురుషః ప్రకృతిర్వ్యక్తమహంకారో నభో౽నిలః
జ్యోతిరాపః క్షితిరితి తత్త్వాన్యుక్తాని మే నవ ॥ 14

పురుషుడే, ప్రకృతి, మహత్తు, అహంకారము, ఆకాశము, వాయువు తేజస్సు, జలము, పృథివి—అను ఈతొమ్మిది తత్త్వముల గూర్చి నేను వర్ణించితిని.

శ్రోత్రం త్వగ్దర్శనం ఘ్రాణో జిహ్వేతి జ్ఞానశక్తయః ।
వాక్పాణ్యుపస్థపాయ్వంఘ్రిః కర్మాణ్యాం
గోభయం మనః ॥ 15

ఉద్ధవా! శ్రోత్రము, చర్మము, చక్షువులు, నాసిక, నాలుక అనునీ యైదును జ్ఞానేంద్రియములు. వాక్కు, పాణి, పాయువు, ఉపస్థ, పాదములు అను నీయైదును కర్మేంద్రియములు. ఉభయాత్మకమగు మనస్సు పదునొకండవ తత్త్వము.

శబ్దః స్పర్శో రసో గంధో రూపం చేత్యర్థజాతయః ।
గత్యుక్త్యుత్సర్గశిల్పాని కర్మాయతనసిద్ధయః ॥ 16

శబ్దస్పర్శరూపరసగంధము లనునైదును జ్ఞానేంద్రియములకు విషయములు. వీని పరిణామమువలన ఆకాశాది పంచమహాభూతములు సృష్టియైనవి. గతి, ఉక్తి, ఉత్సర్గము, శిల్పము—అనునవి కర్మేంద్రియములకు ఫలములే గాని తత్త్వములలోనివి కావు.

సర్గాదౌ ప్రకృతిర్హ్యస్య కార్యకారణరూపిణీ ।
సత్త్వాదిభిర్గుణైర్ధత్తే పురుషో౽వ్యక్త ఈక్షతే ॥ 17

కార్యకారణరూపిణి యగుప్రకృతి, యీజగత్సృష్టి ప్రారంభ సమయమున సత్త్వాది గుణములద్వారా జగదుత్పత్తి స్థితిసంహారములకు

సంబంధించిన అవస్థలను ధరించి సృష్టికార్యమును నిర్వహించుచున్నది. అవ్యక్త పురుషుడు కేవలము సాక్షిరూపమున నుండి దానిని పర్యవేక్షించుచున్నాడు

వ్యక్తాదయో వికుర్వాణా ధాతవః పురుషేక్షయా ।
లబ్ధవీర్యాః సృజంత్యండం సంహతాః ప్రకృతేర్బలాత్ ॥ 18

పురుషుని యీక్షణముచేత ప్రకృతినుండి యుత్పన్నములైన మహత్తత్త్వాదిధాతువు లన్నియు పరస్పరము కలసి ప్రకృతి నాశ్రయించి బ్రహ్మాండమును సృజించును.

సప్తైవ ధాతవ ఇతి తత్రార్థాః పంచ ఖాదయః ।
జ్ఞానమాత్మోభయాధార స్తతో దేహేంద్రియాసవః ॥ 19

ఏడు తత్త్వము లనువారి దృష్టిలో—ఆకాశాదిపంచమహాభూతములు, జీవుడు, అయిరువురకు నాశ్రయు డైనపరమాత్మ యనునవి తత్త్వములు. దేహము, ఇంద్రియములు, ప్రాణము—అను నివియన్నియు నీ సప్తతత్త్వములనుండియే ప్రాదుర్భూతములైనవి.

షడిత్యత్రాపి భూతాని పంచ షష్ఠః పరః పుమాన్ ।
తైర్యుక్త ఆత్మసంభూతైః సృష్ట్వేదం సముపావిశత్ ॥ 20

ఆరుతత్త్వము లనిచెప్పువారి దృష్టిలో పంచమహాభూతములు, ఆఱవవాడు పరమపురుషు డగుపరమాత్మ. ఆపరమాత్మ తననుండి పుట్టిన మహాభూతములద్వారా పరిదృశ్యమాన మగుజగత్తును సృష్టించి స్వయముగ తాను దానిలో ప్రవేశించుచున్నాడు.

చత్వార్యేవేతి తత్రాపి తేజ ఆపోఽన్నమాత్మనః ।
జాతాని తైరిదం జాతం జన్మావయవినః ఖలు ॥ 21

చతుర్విధతత్త్వము లనువారి దృష్టిలో—భూమి, జలము, తేజస్సు ఆత్మ అను నాలుగు తత్త్వములనుండి కార్యసృష్టి యైనది. దానినుండి జగత్తు ఉత్పత్తియైనది.

సంఖ్యానే సప్తదశకే భూతమాత్రేన్ద్రియాణి చ ।
పంచ పంచైకమనసా ఆత్మా సప్తదశః స్మృతః ॥ 22

పదునే డనిచెప్పువారి దృష్టిలో పంచమహాభూతములు, పంచ తన్మాత్రలు, వాక్కు మున్నగు పంచేంద్రియములు, మనస్సు, ఆత్మ అను నీపదునేడు పదార్థములు మాత్రము తత్త్వము లనిచెప్పబడినవి.

తద్వత్ షోడశసంఖ్యానే ఆత్మైవ మన ఉచ్యతే ।
భూతేంద్రియాణి పంచైవ మన ఆత్మా త్రయోదశ ॥ 23

పదునాఱు తత్త్వము లనిచెప్పువారి లెక్క పదునేడుతత్త్వము లనిచెప్పువారివలనే యున్నది. వీరిదృష్టిలో మనస్సు ఆత్మ భిన్నము కాదు. అనగా మనస్సు ఆత్మలోనిదే. పదమూడు తత్త్వము లని చెప్పువారు పంచమహాభూతములు, పంచేంద్రియములు, మనస్సు, జీవాత్మ, పరమాత్మ అనియీవిధముగ లెక్కించుచున్నారు.

ఏకాదశత్వ ఆత్మాసౌ మహాభూతేంద్రియాణి చ ।
అష్టౌ ప్రకృతయశ్చైవ పురుషశ్చ నవేత్యథ ॥ 24

పదునొకండు తత్త్వములనువారు పంచమహాభూతములు, పంచేంద్రియములు, ఆత్మ అనియు, తొమ్మిది తత్త్వముల నువారు అష్టప్రకృతులు, పురుషుడు అనియు చెప్పుచున్నారు.

ఇతి నానాప్రసంఖ్యానం తత్త్వానామృషిభిః కృతమ్ ।
సర్వం న్యాయ్యం యుక్తిమత్త్వాద్విదుషాం
కిమశోభనమ్ ॥ 25

ఋషు లిట్లు తత్త్వములను నానావిధములుగ లెక్కించుచున్నారు. వారి లెక్కలు యుక్తియుక్తములగుటచే వారుచెప్పినదంతయు సత్యమే. పండితులు చెప్పినదియు నసత్యము కాదు.

## ఉద్ధవ ఉవాచ

ప్రకృతిః పురుషశ్చోభౌ యద్యప్యాత్మవిలక్షణౌ ।
అన్యోన్యాపాశ్రయాత్ కృష్ణ దృశ్యతే న భిదా తయోః ।
ప్రకృతౌ లక్ష్యతే హ్యాత్మా ప్రకృతిశ్చ తథాత్మని ॥ 26

**ఉద్ధవుడు పలికెను:** కృష్ణా! ప్రకృతిపురుషులిరువురు సహజముగ విలక్షణులైనను ఇరువురు కలసియుండుటచే భేదము కనబడదు. కాని ప్రకృతికార్యమగు దేహమునందు ఆత్మ, ఆత్మయందు ప్రకృతి లక్షితములగును.

ఏవం మే పుండరీకాక్ష మహాంతం సంశయం హృది ।
ఛేత్తుమర్హసి సర్వజ్ఞ వచోభిర్నయనైపుణైః ॥ 27

పుండరీకాక్ష! సర్వజ్ఞా! యుక్తినిపుణములగు వాక్కులతో నా హృదయములో నున్న సందేహములను దొలగింపుము.

త్వత్తో జ్ఞానం హి జీవానాం ప్రమోషస్తేఽత్ర శక్తితః ।
త్వమేవ హ్యాత్మమాయాయా గతిం వేత్థ న చాపరః ॥ 28

నీ యనుగ్రహమువలననే జీవులకు జ్ఞానము కలుగుచున్నది. నీ మాయాశక్తివలననె వారి జ్ఞానము నాశనమగుచున్నది నీ మాయాశక్తి స్వరూపమును నీవే యెఱుంగుదువుకాని యితరు లెఱుగజాలరు.

## శ్రీ భగవాను వాచ

ప్రకృతిః పురుషశ్చేతి వికల్పః పురుషర్షభ ।
ఏష వైకారికః సర్గో గుణవ్యతికరాత్మకః ॥ 29

**భగవానుడు పలికెను:** పురుషశ్రేష్ఠుడవగు ఉద్ధవా। ప్రకృతి పురుషులలో మిగుల భేదమున్నది. గుణక్షోభమువలన గలిగిన దేహాది సంఘాతము వికారయుక్త మని తెలిసికొనుము.

మమాంగ మాయా గుణమయ్యనేకధా
వికల్పబుద్ధీశ్చ గుణైర్విధత్తే ।
వైకారికస్త్రివిధోఽధ్యాత్మమేక-
మథాధిదైవమధిభూతమన్యత్ ॥ 30

ఉద్ధవా। గుణమయ మగు నామాయ సత్త్వాదిగుణములద్వారా వివిధము లగుభేదములను, భేదబుద్ధిని సృష్టించుచున్నది పై భేదము వివిధము లగువికారములతోగూడి యున్నను అధ్యాత్మము, అధిభూతము, అధిదైవము ననుభేదత్రయము కలిగియున్నది.

దృగ్రూపమార్కం వపురత్ర రంధ్రే
పరస్పరం సిధ్యతి యః స్వతః ఖే ।
ఆత్మా యదేషామపరో య ఆద్యః
స్వయానుభూత్యాఖిలసిద్ధసిద్ధిః ॥ 31

నేత్రేంద్రియము అధ్యాత్మము, దాని విషయరూప మధిభూతము, నేత్రగోళమునం దున్నసూర్యదేవతాంశ మధిదైవము. ఈమూడును పరస్పరాశ్రయముచే సిద్ధమగుచున్నవి. కాని ఆకాశమునం దున్న

సూర్యదేవుడు స్వయముగ సిద్ధవస్తు వై యున్నాడు. స్వపరప్రకాశమునం దాయన కితరాపేక్ష లేదు, ఇట్లే ఆత్మకూడ పైనచెప్పబడిన మూడు భేదములకు మూలకారణ మైయున్నది. అందువలన ఏకరూపము, అభిన్నము నగు నా యాత్మ వీనికంటె భిన్నరూపమున స్వప్రకాశముద్వారా నిఖిల ప్రకాశకవస్తువులకుగూడ ప్రకాశక మైయున్నది.

ఏవం త్వగాది శ్రవణాది చక్షుః
జిహ్వాది నాసాది చ చిత్తయుక్తమ్ ॥ 32

నేత్రమున కున్నట్లు త్వక్కు, శ్రోత్రము, జిహ్వా, నాసిక, చిత్తము మున్నగువానికిగూడ మూడే భేదములు గలవు

వివరణము ; త్వక్కు, స్పర్శవాయువులు, శ్రోత్రము, శబ్దము దిక్కు; జిహ్వా, రసము వరణుడు; నాసిక, గంధము, అశ్వినీకుమారులు; చిత్తము, ఆలోచనావిషయము, వాసుదేవుడు; మనస్సు, మనోవిషయము చంద్రుడు ; బుద్ధి, బోద్ధవ్యము, బ్రహ్మ; అహంకారము, అహంకార విషయము, రుద్రుడు—ఇవిక్రమముగ అధ్యాత్మము, అధిభూతము, అధి దైవమునగును.

యోఽసౌ గుణక్షోభకృతో వికారః
ప్రధానమూలాన్మహతః ప్రసూతః ।
అహం త్రివృన్మోహవికల్పహేతుః
వైకారికస్తామస ఐంద్రియశ్చ ॥ 33

గుణక్షోభకరు డగుపరమేశ్వరుని లేదా కాలమును నిమిత్తముగా జేసికొని ప్రధానమూలక మగుమహత్తత్త్వమునుండి పుట్టిన వికారాత్మక మగునహంకారము — వైకారికము, తామసము, ఐంద్రియము ననునీ మూడు విధము లగుమోహమయవికారములకు కారణ మైయున్నది.

ఆత్మాపరిజ్ఞానమయో వివాదో
హ్యస్తీతి నాస్తీతి భిదార్థనిష్ఠః ।
వ్యర్థోఽపి నైవోపరమేత పుంసాం
మత్తః పరావృత్తధియాం స్వలోకాత్ ॥ 34

అఖండజ్ఞానస్వరూప మగునాత్మ ఉన్నదా లేదా యను భేదజ్ఞాన మూలక మగు వివాదము వ్యర్థమైనను స్వరూపభూతుడనగు నానుండి బహిర్ముఖులగు పురుషులలో గలుగునీ వివాద మెప్పుడును నివృత్తము గాదు.

ఉద్ధవ ఉవాచ.

త్వత్తః పరావృత్తధియః స్వకృతైః కర్మభిః ప్రభో ।
ఉచ్చావచాన్ యథా దేహాన్ గృహ్ణంతి విసృజంతి చ ॥
తన్మమాఖ్యాహి గోవింద దుర్విభావ్యమనాత్మభిః ।
న హ్యేతత్ప్రాయశో లోకే విద్వాంసస్సంతి
వంచితాః ॥ 35–36

**ఉద్ధవుడు పలికెను:** దేవా ! నీనుండి నివృత్తమైనబుద్ధిగల మానవులు స్వకృతము లగుకర్మల ననుసరించి ఉచ్చనీచము లగునానా విధము లగుదేహములను ధరింతురు, త్యజింతురు. గోవిందా ! అల్పబుద్ధులగు మానవులకు దెలియరాని యా తత్త్వమును నాకు వివరింపుము. జగత్తులోని ప్రాణులన్నియు నీ మాయామోహితములే. అందువలన నీతత్త్వమును దెలిసికొనువా రెవ్వరును ఈలోకమున లేరు.

## శ్రీ భగవానువాచ

మనః కర్మమయం నృణామింద్రియైః పంచభిర్యుతమ్ ।
లోకాల్లోకం ప్రయాత్యన్య ఆత్మా తదనువర్తతే ॥

**భగవానుడు పలికెను:** పంచేంద్రియములతోగూడిన వుల కర్మమయమగు మనస్సు లోక (దేహ)మునుండి మఱియొక (దేహ)మునకు పయనించును. ఆత్మ దేహభిన్న మైనను అహంకా ద్వారా ఆమనస్సు ననుగమించును.

ధ్యాయన్ మనోఽను విషయాన్ దృష్టాన్
వానుశ్రుతానథ
ఉద్యత్సీదత్కర్మతంత్రం స్మృతిస్తదను శామ్యతి ॥

కర్మాధీన మగుమనస్సు దృష్టములైన కర్మజనితములైన కృతములైన విషయములను చింతించుచు చింతితవిషయసమూహమున పుట్టి మరల దానియందే లీనమగును. పిమ్మట దాని స్మృతి నశించు

విషయాభినివేశేన నాత్మానం యత్స్మరేత్పునః ।
జంతోర్వై కస్యచిద్ధేతోర్మృత్యురత్యంత
విస్మృతిః ॥

కర్మఫలానురూప మగుప్రస్తుతదేహము తరువాత లభించు ? గతము లగుసుఖదుఃఖములయం దత్యంతాభినివేశమువలన పూర్వా? విస్మృతి కలుగును. అదియే జీవులకు మృత్యువు.

జన్మ త్వాత్మతయా పుంసః సర్వభావేన భూరిద ।
విషయస్వీకృతిం ప్రాహుర్యథా స్వప్నమనోరథః ॥

అధికదానశీలుడ వగు ఉద్ధవా! స్వప్నమనోరథము లభిమాన మాత్రము లైనట్లు అభిన్నరూప మగుదేహమునందలి యభిమానమె జీవుని జన్మయని చెప్పబడినది.

స్వాప్నం మనోరథం చేత్థం ప్రాక్తనం న స్మరత్యసౌ ।
తత్ర పూర్వమివాత్మానమపూర్వం చానుపశ్యతి ॥ 41

(ప్రస్తుతదేహమునం దున్న జీవుడు వెనుకటి స్థూలదేహమును స్మరింపడు) ప్రస్తుతము స్వప్నాభిభూతుడు లేదా మనోరథస్థుడు నగు జీవుడుగూడ పూర్వానుభూత మగుస్వప్నమును లేదా మనోరథమును స్మరింపడు కాని ప్రస్తుతదేహమునం దున్నపూర్వసిద్ధమగు ఆత్మను గూడ సద్యోజాతమువలె అనుభవించును.

ఇంద్రియాయనసృష్ట్యేదం త్రైవిధ్యం భాతి వస్తుని ।
బహిరంతర్భిదాహేతుర్జనోఽసజ్జనకృద్యథా ॥ 42

జీవుడు స్వప్నమున వివిధము లగునసద్దేహములను సృష్టించుచు, దర్శించుచు బహురూపములుగ వెల్లడియగునట్లు మనస్సుయొక్క దేహాంతరాభినివేశమువలన సృష్టినిబంధన మగుఆత్మయందుగూడ ఉత్తమమధ్యమాధమము లగుత్రివిధభావములు అసద్రూపముగ వెల్లడియగును. ఈ ఆత్మయె బాహ్యాభ్యంతరభేదమునకు గారణ మగును.

నిత్యదా హ్యంగ భూతాని భవంతి న భవంతి చ ।
కాలేనాలక్ష్యవేగేన సూక్ష్మత్వాత్తన్న దృశ్యతే ॥ 43

ఉద్ధవా! అలక్ష్యవేగము గలకాలప్రభావముచేత ప్రతిక్షణము శరీరములు పుట్టుచున్నవి, గిట్టుచున్నవి. కాలగతి మిక్కిలి సూక్ష్మ మైనద గుటవలన అవివేకు లగుమానవులు దానిని గమనింపలేరు.

యథార్చిషాం స్రోతసాం చ ఫలానాం వా వనస్పతేః ।
తథైవ సర్వభూతానాం వయోఽవస్థాదయః కృతాః ॥ 44

(కాలపరిణామాదులచే) అగ్నిజ్యోతిస్సులకు; (పరివాహముచే) స్రోతస్సునకు; (పర్వతాదిరూపములచే) వృక్షఫలములకు విశేషావస్థ లుండును, అట్లే వయోవస్థాదులచే సర్వదేహములకు పరివర్తనము కలుగును,

సోఽయం దీపోఽర్చిషాం యద్వత్స్రోతసాం తదిదం జలమ్ ।
సోఽయం పుమానితి నృణాం మృషా
గీర్ధీర్మృషాయుషామ్ ॥ 45

అయినను జ్వాలకు హేతువు నా యీ దీపమనియు, స్రోతస్సునకు హేతువు అ యా జలమనియు, జ్ఞానము కలుగునట్లే అవివేకు లగు వ్యక్తులకు ఆతడే యీ పురుషుడు అను మిథ్యాబుద్ధియు మిథ్యావాక్కులును గలుగును.

మా స్వస్య కర్మబీజేన జాయతే సోఽప్యయం పుమాన్ ।
మ్రియతే వామరో భ్రాన్త్యా యథాగ్నిర్దారు
సంయుతః ॥ 46

జీవాత్మ తనకర్మకు హేతువులై జననమరణముల బొందడు కాని కల్పాంతమువఱకుండు మహాభూతరూపమగు అగ్ని కాష్ఠసంయోగ వియోగములచేత ఉత్పత్తినాశముల బొందునట్లు జీవుడుగూడ అజుడు, అమరుడునైనను భ్రాంతివలన పుట్టుక చావు కలవానివలె లక్షితుడగును.

నిషేకగర్భజన్మాని బాల్యకౌమారయౌవనమ్ ।
వయోమధ్యం జరా మృత్యురిత్యవస్థాస్తనోర్నవ ॥ 47

నిషేకము, గర్భము, జననము, బాల్యము, కౌమారము, యౌవనము, ప్రౌఢత్వము, వార్ధక్యము, మరణము అను నీతొమ్మిదియు శరీరావస్థలు.

ఏతా మనోరథమయీర్హ్యాన్యస్యోచ్చావచాస్తనూః ।
గుణసంగాదుపాదత్తే క్వచిత్కశ్చిజ్జహాతి చ ॥ 48

జీవుడు స్వాభావిక మగునవివేకమువలన (కర్మ) మనోవికార జనితములు ఉత్కృష్టాపకృష్టములు నగుశారీరికావస్థలను తనవిగా భావించుకొని అభిమానపడును. ఒకప్పుడు పరమేశ్వరానుగృహీతు డగుజీవుడు వివేకబలమువలన ఆ యభిమానమును విడచును

ఆత్మనః పితృపుత్రాభ్యామనుమేయో భవాప్యయౌ ।
న భవాప్యయవస్తూనామభిజ్ఞో ద్వయలక్షణః ॥ 49

పుత్రిజననమువలన తండ్రి, తండ్రిమరణమువలన పుత్రుడు స్వస్వదేహములకే జననమరణములు జరుగుచున్న వనిభావింపవలెను. కాని దేహముత్పత్తివినాశశీల మని యెఱిగిన జీవుడు ఆరెండు ధర్మములు లేనివాడై యుండును.

తరోర్బీజవిపాకాభ్యాం యో విద్వాన్ జన్మసంయమౌ ।
తరోర్విలక్షణో ద్రష్టా ఏకం ద్రష్టా తనోః పృథక్ ॥ 50

బీజమునుండి చెట్టుయొక్క ఉత్పత్తిని, ఫలించినపిమ్మట దాని నాశనమును దర్శించి ద్రష్టయగు పురుషుడు ఇవి చెట్టుకంటె భిన్నమైన వని తెలిసికొనును. అట్లే శరీరముయొక్క జననమరణముల జూచు పురుషుడు వానిని దేహముకంటె భిన్నము లనియెఱుంగును.

ప్రకృతేరేవమాత్మానమవివిచ్యాబుధః పుమాన్ ।
తత్త్వేన స్పర్శసంమూఢః సంసారం ప్రతిపద్యతే ॥ 51

స్వరూపము నెఱుగనిపురుషుడు ఆత్మ ప్రకృతికంటె భిన్నమైన దనితెలిసికొనక విషయములయం దాసక్తుడై దేహాభిమానమువలన సంసార దశను బొందును.

సత్త్వసంగాదృషీన్ దేవాన్ రజసాసురమానుషాన్ ।
తమసా భూతతిర్యక్త్వం భ్రామితో యాతి కర్మభిః ॥ 52

కర్మఫలము ననుసరించి జీవుడు సత్త్వగుణాధిక్యమువలన ఋషిత్వదేవత్వములను, రజోగుణప్రాబల్యమువలన అసురత్వమనుష్యత్వములను, తమోగుణాధిక్యమువలన భూతపశుపక్షిజన్మలను బొందును.

నృత్యతో గాయతః పశ్యన్ యథైవానుకరోతి తాన్ ।
ఏవం బుద్ధిగుణాన్ పశ్యన్ననీహోఽప్యను కార్యతే ॥ 53

నర్తకుని,గాయకుని అనుకరించు వ్యక్తివలె జీవాత్మ నిష్క్రియుడై బుద్ధిగుణముల ననుసరించుచుండును.

యథాంభసా ప్రచలతా తరవోఽపి చలా ఇవ ।
చక్షుషా భ్రామ్యమాణేన దృశ్యతే భ్రమతీవ భూః ॥ 54

యథా మనోరథధియో విషయానుభవో మృషా ।
స్వప్నదృష్టాశ్చ దాశార్హ తథా సంసార ఆత్మనః ॥ 55

కదలుచున్న నీటిచేత దానియందు ప్రతిబింబించిన చెట్లుగూడ చలించుచున్నట్లగపడును. అట్లే, నేత్రములు తిరుగుచున్నచో భూమిగూడ తిరుగుచున్నట్లె అగపడును. ఉద్ధవా ! మనోరథబుద్ధులు, స్వప్నబుద్ధులు మిథ్యయైనట్లు జీవుని విషయభోగములు, సంసారము మిథ్యయే యనితెలిసికొనుము.

అర్థే హ్యావిద్యమానేఽపి సంసృతిర్న నివర్తతే ।
ధ్యాయతో విషయానస్య స్వప్నేఽనర్థాగమో
యథా ॥ 56

విషయములను ధ్యానించువ్యక్తి స్వప్నమునందు నానావిధము లగు విషయముల ననుభవించును. అట్లే ఆత్మకు సంసారసంబంధము మిథ్య యైనను విషయధ్యానమువలన సుఖదుఃఖనివృత్తి కలుగదు.

తస్మాదుద్ధవ మా భుంక్ష్వ విషయానసదింద్రియైః ।
ఆత్మాగ్రహణనిర్భాతం పశ్య వైకల్పికం భ్రమమ్ ॥ 57

ఉద్ధవా ! అందువలన దుష్టము లగునింద్రియములద్వారా విషయములను సేవింపవలదు. స్వప్నరూపముయొక్క అజ్ఞానమువలన వికల్పము కలుగుచున్నది. దానివలన భ్రమకలుగుచున్నదని తెలిసికొనుము.

క్షిప్తోఽవమానితోఽసద్భిః ప్రలబ్ధోఽసూయితోఽథవా ।
తాడితః సన్నిబద్ధో వా వృత్త్యా వా పరిహాపితః ॥ 58
నిష్ఠ్యూతో మూత్రితో వాఽజ్ఞైర్బహుధైవ ప్రకంపితః।
శ్రేయస్కామః కృచ్ఛ్రగత ఆత్మనాఽఽత్మాన
ముద్ధరేత్ ॥ 59

దుర్జనులచే వెడలగొట్టబడినను, అవమానితుడైనను, పరిహసితుడైనను లేదా దోషారోపదూషితుడైనను, కొట్టబడినవాడైనను, బంధితుడైనను, జీవికనుండి వంచితుడైనను, పైనఉమ్మివేసినను, మూత్రము విడచినను, ఇట్లెన్నియో విధముల పరమేశ్వరనిష్ఠనుండి విచలితుడైనను, నానాకష్టముల ననుభవించినను శ్రేయస్కాము డగువ్యక్తి స్వబుద్ధితో భగవానుని శరణుజొచ్చి తన్ను తాను రక్షించుకొనవలెను.

## ఉద్ధవ ఉవాచ

యథైవమనుబుధ్యేయం వదనో వదతాం వర ॥ 60

**ఉద్ధవుడు పలికెను:—** వక్తలలో శ్రేష్ఠుడవగు కృష్ణా! నీ యీ యుపదేశముల నన్నింటిని చక్కగ దెలిసికొనదగునట్లుగ నా కుపదేశింపుము.

సుదుస్సహామిమం మన్యే ఆత్మన్యసదతిక్రమమ్ ।
విదుషామపి విశ్వాత్మన్ ప్రకృతిర్హి బలీయసీ ।
ఋతే త్వద్ధర్మనిరతాన్ శాంతాంస్తే చరణాలయాన్ ॥ 61

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే పారమహంస్యాం
సంహితాయాం వైయాసిక్యాం ఏకాదశస్కంధే
శ్రీభగవదుద్ధవసంవాదే ద్వావింశోఽధ్యాయః ॥

దేవా! విశ్వాత్మా! ప్రకృతి (స్వభావము) బలీయమైనదగుట వలన తద్ధర్మనిరతులు అనగా శ్రవణకీర్తనాదులయందు నిరతులు, నీ చరణముల నాశ్రయించినవారు, శాంతులు నగుభక్తులే కాక పండితులుగూడ నిదియే విధముగ అవమానముల సహించుట మిక్కిలి కష్ట మనితలంచుచున్నాను.

ఇట్లు శ్రీమద్భాగవతమహాపురాణములోని ఏకాదశ
స్కంధము నందలి యిరువదిరెండవ అధ్యాయము
సమాప్తము.

# ఇరువదిమూడవ అధ్యాయము

సహనశీలి యగుబ్రాహ్మణుని కథ.

## శ్రీ బాదరాయణిరువాచ.

స ఏవమాశంసిత ఉద్ధవేన
భాగవతముఖ్యేన దాశార్హముఖ్యః ।
స భాజయన్ భృత్యవచో ముకుంద-
స్తమాబభాషే శ్రవణీయవీర్యః ॥ 1

**శుకుడు పలికెను:** యాదవశ్రేష్ఠుడు, పుణ్యశ్లోకుడు నగు శ్రీకృష్ణుని భక్తప్రవరుడగు ఉద్ధవు డిట్లుప్రార్థింపగా, వాని ప్రశ్నను ప్రశంసించుచు, ఆయన యిట్లు పలికెను.

## శ్రీ భగవానువాచ

బార్హస్పత్య స నాస్త్యత్ర సాధుర్వై దుర్జనేరితైః ।
దురుక్తైర్భిన్నమాత్మానం యః సమాధాతుమీశ్వరః ॥ 2

**భగవానుడు పలికెను:** బృహస్పతికి శిష్యుడవగు నుద్ధవా! దుర్జనుల దుష్టవాక్కులను వినుటవలన కలతజెందిన మనస్సును శాంత పఱచుకొను సాధుపురుష డెవ్వడును ఈలోకమున లేడనియే చెప్ప వచ్చును.

న తథా తప్యతే విద్ధః పుమాన్ బాణైస్తు మర్మగైః ।
యథా తుదంతి మర్మస్థా హ్యసతాం పరుషేషవః ॥ 3

అసాధువుల పరుషవాక్కు లనెడుబాణములు మర్మభేదకములై పురుషుని బాధించునట్లు మర్మభేదము లగుబాణములు బాధింపవు.

కథయంతి మహత్పుణ్యమితిహాసమిహోద్ధవ ।
తమహం వర్ణయిష్యామి నిబోధ సుసమాహితః ॥ 4

ఉద్ధవా ! ఈవిషయమున పెద్దలు మహాపుణ్యజనక మగునొక్క యితిహాసము నుడువుదురు, దానిని జెప్పెదను, శ్రద్ధగా వినుము.

కేనచిద్భిక్షుణాగీతం పరిభూతేన దుర్జనైః ।
స్మరతా ధృతియుక్తేన విపాకం నిజకర్మణామ్ ॥ 5

ఒకానొక భిక్షుకుడు దుర్జనులచే నవమానితుడై ధైర్యమును వహించి, అది తన పూర్వకర్మఫల మనిభావించి, ఇట్లుగానము చేసెను

అవంతిషు ద్విజః కశ్చిదాసీదాఢ్యతమః శ్రియా ।
వార్తావృత్తిః కదర్యస్తు కామీ లుబ్ధోఽతికోపనః ॥ 6

మాలవదేశమున ఐశ్వర్యవంతుడు, కృషివాణిజ్యాదివ్యాపారశీలుడు, కాముకుడు, లుబ్ధుడు, అతికోపస్వభావుడు, కదర్యుడు (దారాపుత్రాదులను బాధించు స్వభావము గలవాడు) నగు ఒకానొక విప్రుడుండెను.

జ్ఞాతయోఽతిథయస్తస్య వాఙ్మాత్రేణాపి నార్చితాః ।
శూన్యావసథ ఆత్మాపి కాలే కామైరనర్చితః ॥ 7

అత డెప్పుడును జ్ఞాతులను, అతిథులను వాక్కులతోగూడ తృప్తి పఱచలేదు. అతడు ధర్మకర్మహీన మైనగృహమున నివసించును, స్వదేహమునకుగూడ అభిలషితము లగుపదార్థములద్వారా ఎప్పుడును దృప్తిని గలుగజేయలేదు.

దుశ్శీలస్య కదర్యస్య ద్రుహ్యంతే పుత్రబాంధవాః ।
దారా దుహితరో భృత్యా విషణ్ణా నాచరన్ ప్రియమ్ ॥ 8

పుత్రులు, బంధువులు దుశ్శీలుడు, కదర్యుడు నగువానికి ద్రోహము చేయుచున్నారు. భార్య, కూతుండ్రు, సేవకులు దుఃఖితులై వాని కెప్పుడును ప్రియమును కలుగజేసెడివారుకారు.

తస్యైవం యక్షవిత్తస్య చ్యుతస్యోభయలోకతః ।
ధర్మకామవిహీనస్య చుక్రుధుః పంచభాగినః ॥ 9

ఇట్లు యక్షునివలె ధనరక్షణశీలుడు, ధర్మకామవిహీనుడు, ఉభయలోకభ్రష్టుడు నగునా విప్రునిపై పంచయజ్ఞభాగు లగుదేవతలు క్రుద్ధులైరి.

తదవధ్యానవిస్రస్తపుణ్యస్కంధస్య భూరిద ।
అర్థోఽప్యగచ్ఛన్నిధనం బహ్వాయాసపరిశ్రమః ॥ 10

అధికదానశీలుడ వగునుద్ధవా ! ఇట్లే దేవతలను ఆదరింపకపోవుట వలన వాని పుణ్యభాగము క్షీణ మయ్యెను బహుపరిశ్రమవలన ప్రయత్నములవలన లభించిన అర్థముగూడ నష్టమైనది.

జ్ఞాతయో జగృహుః కించిత్ కించిద్దస్యవ ఉద్ధవ ।
దైవతః కాలతః కించిత్ బ్రహ్మబంధోర్నృపార్థివాత్ ॥ 11

ఉద్ధవా ! ఆ బ్రాహ్మణాధముని ధనములో గొంతభాగమును వాని జ్ఞాతులు హరించిరి, కొంతభాగమును దొంగలు హరించిరి. కొంతభాగము దైవవశమువలన, కొంతభాగము కాలవశమువలన నష్టమైనది. కొంత భాగము రాజులచేత, దస్యులచేత అపహృతమైనది.

స ఏవం ద్రవిణే నష్టే ధర్మకామవివర్జితః ।
ఉపేక్షితశ్చ స్వజనైశ్చింతామాపదురత్యయామ్ ॥ 12

ఇట్లు సమస్తధనము నష్టము కాగా ధర్మకామవర్జితు డగునా

విప్రుడు స్వజనముచే నుపేక్షితుడై దుస్తరమగు విచారమున నిమగ్నుడయ్యెను.

తస్యైవం ధ్యాయతో దీర్ఘం నష్టరాయ స్తపస్వినః ।
ఖిద్యతో బాష్పకంఠస్య నిర్వేదః సుమహానభూత్ ॥ 13

ధననాశనముచే సంతప్తుడు, దీర్ఘచింతామగ్నుడు, క్లిష్టుడు, బాష్పకంఠుడు, ఖేదపరాయణుడు నగునా బ్రాహ్మణునకు గొప్ప వైరాగ్యము కలిగెను.

స చాహేదమహో కష్టం వృథాఽఽత్మా మేఽనుతాపితః ।
న ధర్మాయ న కామాయ యస్యార్థాయాస ఈదృశః॥ 14

ఆ బ్రాహ్మణు డిట్లు తలంచెను—'ఆహా! ఎంతయో కష్టపడి సంపాదించిన ధనము ధర్మమునకు కామోపభోగమునకు గాక వ్యర్థముగ వ్యయమైనది గదా! ఈ శరీరమును వ్యర్థముగ కష్టముల పాల్జేసితిని. ఈకష్ట మెంతదుస్సహమైనది!

ప్రాయేణార్థాః కదర్యాణాం న సుఖాయ కదాచన ।
ఇహ చాత్మోపతాపాయ మృతస్య నరకాయ చ ॥ 15

తలచుగ కృపణుల సంపదలు ఎప్పుడును సుఖప్రదములు గావు, అంతేకాక యీ సంపదలు ఇహలోకమున కష్టములకు, పరలోకమున నరకమునకు గారణములగును.

యశో యశస్వినాం శుద్ధం శ్లాఘ్యా యే గుణినాం గుణాః ।
లోభః స్వల్పోఽపి తాన్ హంతి శ్విత్రో
రూపమివేప్సితమ్ ॥ 16

అల్పమైనను శ్వేతకుష్ఠము సుందరి రూపమును నాశనము చేయునట్లు, లోభగుణ మల్పమైనను అది కీర్తివంతుల నిర్మల మైనకీర్తిని, గుణవంతుల సద్గుణములను నాశనము చేయును

అర్థస్య సాధనే సిద్ధే ఉత్కర్షే రక్షణే వ్యయే ।
నాశోపభోగ ఆయాసస్త్రాసశ్చింతా భ్రమో నృణామ్ ॥ 17

ధనమును సంపాదించుటయందును, సంపాదించిన దానిని వృద్ధిపఱచుటయందును, రక్షించుటయందును, వ్యయముచేయుటయందును, నాశనమునందును, అనుభవించుటయందును, మానవులకు పరిశ్రమ, భయము, చింత, భ్రమ యెదురగుచుండును.

స్తేయం హింసానృతం దంభః కామః క్రోధః స్మయో మదః ।
భేదో వైరమవిశ్వాసః సంస్పర్ధా వ్యసనాని చ ॥ 18
ఏతే పంచదశానర్థా హ్యర్థమూలా మతా నృణామ్ ।
తస్మాదనర్థమర్థాఖ్యం శ్రేయోఽర్థీ దూరతస్త్యజేత్ ॥ 19

చౌర్యము, హింస అసత్యము, దంభము, కామము, క్రోధము, విస్మయము, గర్వము, భేదబుద్ధి, వైరము, అవిశ్వాసము, స్పర్థ, స్త్రీ, జూదము, మద్యము (వ్యసనములు) అనునీ పదునైదువిధము లగుననర్థములు మానవులకు ధనమువలన గలుగుచుండును. అందువలన కల్యాణకాముకుడగువ్యక్తి అర్థరూపము లగునీ యనర్థములను దూరముగనె విడువవలెను.

భిద్యంతే భ్రాతరో దారాః పితరః సుహృదస్తథా ।
ఏకాస్నిగ్ధాః కాకిణినా సద్యః సర్వేఽరయః కృతాః ॥ 20

అత్యల్పపరిమాణము గలఅర్థమువలన సోదరులు, భార్యలు, తల్లి

దండ్రులు, బంధువులు, మిత్రులు వెంటనే శత్రువు' లగుదురు. దానితో పాటు శత్రుత్వ మేర్పడును.

అర్థేనాల్పీయసా హ్యేతే సంరబ్ధా దీప్తమన్యవః ।
త్యజన్త్యాశు స్పృధో ఘ్నంతి సహసోత్సృజ్య
సౌహృదమ్ ॥ 21

వీ రతిసామాన్య మగుఅర్థమువలన క్షుబ్ధులు, క్రుద్ధులు నై శీఘ్రముగ సోదరులు మున్నగువారిని త్యజింతురు. అనంతరము స్పర్థతో సౌహార్దమును వదలి చివరకు వారిని సంహరింతురు,

లబ్ధ్వా జన్మామరప్రార్థ్యం మానుష్యం
తద్ద్విజాగ్ర్యతామ్ ।
తదనాదృత్య యే స్వార్థం ఘ్నంతి యాంత్యశుభాం
గతిమ్ ॥ 22

దేవతలచే ప్రార్థింప దగుమానవజన్మను, అందులో బ్రాహ్మణత్వమును బొందియు దానిని ఆదరింపక ఆత్మహితమును నాశనముచేసికొను వారు అశుభగతిని బొందుదురు.

స్వర్గాపవర్గయోర్ద్వారం ప్రాప్య లోకమిమం పుమాన్ ।
ద్రవిణే కోఽనుషజ్యేత మర్త్యోఽనర్థస్య ధామని ॥ 23

స్వర్గమోక్షములకు ద్వార మగుమానవదేహమును బొంది, అనర్థముల కాశ్రయ మగునర్థమునందు మరణధర్మశీలు డగునేవ్యక్తి అసక్తు డగును?

దేవర్షిపితృభూతాని జ్ఞాతీన్ బంధూంశ్చ భాగినః ।
అసంవిభజ్య చాత్మానం యక్షవిత్తః పతత్యధః ॥ 24

యక్షునివలె ధనరక్షకు డగువ్యక్తి దేవతలను, ఋషులను, పితరులను, ప్రాణులను, జ్ఞాతులను, బంధువులను, దాయభాగులను వారి భాగములవారి కిచ్చి సంతుష్టిపరచక, తా ననుభవింపక యున్న అధఃపతితు డగును

వ్యర్థయార్థేహయా విత్తం ప్రమత్తస్య వయో బలమ్ ।
కుశలా యేన సిధ్యంతి జరఠః కిం ను సాధయే ॥ 25

వివేకవంతు లగుపురుషులు అర్థాదులచే సిద్ధిని బొందుచున్నారు. వ్యర్థ మగుధనార్జనవ్యాపారముచే ప్రమత్తుడనై నేను నా ధనమును, వయస్సును, బలమును బోగొట్టుకొంటిని ఇప్పుడు వార్ధక్యమున నింకేమి సాధింపగలను?

కస్మాత్సంక్లిశ్యతే విద్వాన్ వ్యర్థయార్థేహయాసకృత్ ।
కస్యచిన్మాయయా నూనం లోకోఽయం
సువిమోహితః ॥ 26

ఏకారణమువలన విద్వాంసుడు వ్యర్థ మగుఅర్థోపార్జనవ్యాపారముచే పీడితుడగుచున్నాడు? ఒకానొకవ్యక్తి మాయచే నీలోకము మోహిత మగుచున్నదనుట నిశ్చయము.

కిం ధనైర్ధనదైర్వా కిం కామైర్వా కామదైరుత ।
మృత్యునా గ్రస్యమానస్య కర్మభిర్వోత జన్మదైః ॥ 27

మృత్యువుచే కబళితు డగుజీవునకు ధనమువలన, ధనము నిచ్చువస్తువులవలన, భోగవాసనలవలన, భోగములను గలిగించువస్తువులవలన నేమిలాభము కలుగును? జన్మము నిచ్చుకర్మ లేమిచేయగలవు?

నూనం మే భగవాంస్తుష్టః సర్వదేవమయో హరిః ।
యేన నీతో దశామేతాం నిర్వేదశ్చాత్మనః ప్లవః ॥ 28

ఎవరి కృపవలన నాకీ ధనహీనదశ సంప్రాప్తమైనదో, ఎవరివలన నాకు సంసారసముద్రమును దాటుటకు దగిన నౌకాస్వరూప మగు వైరాగ్యము సంభవించినదో అట్టి సర్వదేవమయు డగుశ్రీహరి నాకు ప్రసన్నుడైనాడు, ఇది నిశ్చయము.

సోఽహం కాలావశేషేణ శోషయిష్యేఽఙ్గమాత్మనః ।
అప్రమత్తోఽఖిలస్వార్థే యది స్యాత్సిద్ధ ఆత్మని ॥ 29

ఆయుస్సు ఇంకను మిగిలియున్నచో నేను ధర్మాదిసాధనములయం దప్రమత్తుడనై ఆత్మసంతుష్టుడనై తపస్సుచే శరీరమును శుష్కింపజేసి కొందును.

తత్ర మామనుమోదేరన్ దేవాస్త్రిభువనేశ్వరాః ।
ముహూర్తేన బ్రహ్మలోకం ఖట్వాంగః
సమసాధయత్ ॥ 30

ఈవిషయమున త్రిలోకాధిపతు లగుదేవతలు నాపై అనుగ్రహము చూపుదురుగాక। వారి దయవలన ఖట్వాంగరాజు క్షణకాలములోనె బ్రహ్మ (వైకుంఠ) లోకమును బొందినాడు. (అట్లే నేనుగూడ ఈస్వల్పకాలములోనె సిద్ధిబొందగలను).

## శ్రీ భగవానువాచ

ఇత్యభిప్రేత్య మనసా హ్యావంత్యో ద్విజసత్తమః ।
ఉన్ముచ్య హృదయగ్రంథీన్ శాంతో భిక్షురభూన్మునిః ॥ 1

భగవానుడు పలికెను: అవంతిదేశస్థుడగు నా బ్రాహ్మణోత్తముడు మనస్సులో నిట్లునిశ్చయించుకొని హృదయగ్రంథులైన అహంకారమమకారములను వదలి శాంతుడు, మౌని, సన్యాసియు నయ్యెను.

స చచార మహీమేతాం సంయతాత్మేంద్రియానిలః ।
భిక్షార్థం నగరగ్రామా న సంగోఽలక్షితోఽవిశత్ ॥ 32

ఆ సన్యాసి మనస్సును, ఇంద్రియములను, ప్రాణములను నిగ్రహించి యీ భూమిపై సంచరించుచుండెను, ఆసక్తిశూన్యుడై దీనభావముతో భిక్షార్థమై ప్రతినగరమునకు, ప్రతిగ్రామమునకు వెడలెను

తం వై ప్రవయసం భిక్షుమవధూతమసజ్జనాః ।
దృష్ట్వా పర్యభవన్ భద్ర బహ్వీభిః పరిభూతిభిః ॥ 33

ఉద్ధవా! అసత్పురుషులు వృద్ధుడు, మలినుడు నగు నాభిక్షుకుని జూచి వివిధము లగుతిరస్కారములతో వాని నవమానింపసాగిరి.

కేచిత్త్రివేణుం జగృహురేకే పాత్రం కమండలుమ్ ।
పీఠంచైకేఽక్షసూత్రం చ కంథాం చీరాణీ కేచన ।
ప్రదాయ చ పునస్తాని దర్శితాన్యాదదుర్మునేః ॥ 34

కొందఱు వాని త్రిదండమును, కొందఱు వాని భిక్షాపాత్రమును, కొందఱు కమండలమును, కొంద ఱాసనమును, కొందఱు జపమాలను కొందఱు బొంతను వస్త్రఖండమును హరించిరి కొంద ఱావస్తువుల నిచ్చి, కొంద ఱావస్తువుల జూపుచు మఱల వానినుండి లాగికొనుచుండిరి.

అన్నం చ భైక్ష్యసంపన్నం భుంజానస్య సరిత్తటే ।
మూత్రయంతి చ పాపిష్ఠాః ష్ఠీవంత్యస్య చ మూర్ధని ॥ 35

భిక్షయందు లభించిన అన్నమును ఆయన నదీతీరమున భుజించు చుండగ పాపిష్ఠులు వాని యన్నమున మూత్రమును విడచిరి, శిరస్సున నుమ్మివేసిరి.

యతవాచం వాచయంతి తాడయంతి న వక్తి చేత్ ।
తర్జయంత్యపరే వాగ్భిః స్తేనోఽయమితి వాదినః ।
బధ్నంతి రజ్జ్వా తం కేచిద్బధ్యతాం బధ్యతామితి ॥ 36

మౌని యగు నా సన్న్యాసిని వివిధములగు విషయముల జెప్పుమని యడుగుదురు, అత డట్లు చెప్పనిచో వానిని గఱ్ఱలతో గొట్టుచుండిరి, 'ఇతడు దొంగ'యని కొందఱు బెదరింపసాగిరి. 'బంధింపుడు, బంధింపు' డని పలుకుచు గొందఱు వానిని త్రాటితో గట్టివేయుచుండిరి.

క్షిపంత్యేకేఽవజానంత ఏష ధర్మధ్వజః శఠః ।
క్షీణవిత్త ఇమాం వృత్తిమగ్రహీత్ స్వజనోజ్ఝితః ॥ 37

కొందఱిట్లవమానించుచు 'ఇతడు ధర్మధ్వజుడు (త్రిదండచిహ్నము లచే జీవించువాడు), లోకవంచకుడు, ధనమంతయు నశించిపోవుటవలన బంధువులు వీనిని విడచిపెట్టిరి. అప్పటినుండి యిత డీభిక్షుక వృత్తిని స్వీకరించినా'డని నిందింపసాగిరి.

అహో ఏష మహాసారో ధృతిమాన్ గిరిరాడివ ।
మౌనేన సాధయత్యర్థం బకవద్దృఢ నిశ్చయః ॥ 38

ఆహా ! ఇత డతి బలవంతుడు, మహాపర్వతమువలె గొప్ప ధైర్యశాలి. కొంగవలె స్వకార్యసాధనమునందు కృతనిశ్చయుడై మౌన భావముతో దన పనిని సాధించుకొనుచున్నాడు,

ఇత్యేకే విహసంత్యేనమేకే దుర్వాతయంతి చ ।
తం బబంధుర్నిరురుధుర్యథా క్రీడనకం ద్విజమ్ ॥ 39

అని యిట్లు పలికి కొందఱు పరిహసింపసాగిరి, కొందఱు వానిపై అపానవాయువును విడువసాగిరి, కొందఱు చిలుకలు, గోరువంకలు మున్నగు పెంపుడు పక్షులవలె వానిని గొలుసులతో కారాగారాదులయందు బంధించుచుండిరి,

ఏవం స భౌతికం దుఃఖం దైవికం దైహికం చ యత్ ।
భోక్తవ్యమాత్మనో దిష్టం ప్రాప్తం ప్రాప్తమబుధ్యత ॥ 40

ఈవిధముగ నా సన్న్యాసి భౌతికము(దుర్జనాదికృతము), దైహికము (జ్వరాదినిమిత్తము) దైవికము (శీతోష్ణాదులవలన గలిగినది) నగుకష్టములు దైవనిర్దిష్టములు అపరిహార్యములు కనుకయవి యవశ్యము అనుభవింపదగిననే యని నిశ్చయించుకొనెను.

పరిభూత ఇమాం గాథామగాయత నరాధమైః ।
పాతయద్భిః స్వధర్మస్థో ధృతిమాస్థాయ సాత్త్వికీమ్॥ 41

దుర్జనులు వానిని స్వధర్మచ్యుతునిగా జేయుటకు నానావిధములుగ నవమానించిరి. అయినను అతడు సాత్త్విక మగుధైర్యము నవలంబించి స్వధర్మమునం దుండి యీ క్రిందిగాథను గీర్తించెను.

ద్విజ ఉవాచ.

నాయం జనో మే సుఖదుఃఖహేతు-
ర్న దేవతాత్మా గ్రహకర్మకాలాః ।

మనః పరం కారణమామనంతి
సంసారచక్రం పరివర్తయేద్యత్ ॥ 42

**బ్రాహ్మణుడు పలికెను:** ఈజనముగాని, దేవతలుగాని, ఆత్మగాని, గ్రహములుగాని, కర్మలుగాని, కాలముగాని యేవియు నా సుఖ దుఃఖములకు గారణములు గావు, ఈసంసారచక్రమును ద్రిప్పు మనస్సే సుఖదుఃఖములకు గారణ మనిపెద్దలు చెప్పుచున్నారు

మనో గుణాన్ వై సృజతే బలీయః
తతశ్చ కర్మాణి విలక్షణాని ।
శుక్లాని కృష్ణాన్యథ లోహితాని
తేభ్యః సవర్ణాః సృతయో భవంతి ॥ 43

బలవంత మగుమనస్సే గుణములను సృష్టించుచున్నది. ఆగుణములనుండి శుక్లములు (సాత్త్వికములు), కృష్ణములు (తామసములు), లోహితములు (రాజసములు) విలక్షణములు నగుకర్మలు పుట్టుచున్నవి. ఆకర్మలవలన సవర్ణములు అనగా తయా కర్మానురూపము లగు దేవతిర్యఙ్మానవాదిగతులు కలుగుచున్నవి,

అనీహ ఆత్మా మనసా సమీహతా
హిరణ్మయో మత్సఖ ఉద్విచష్టే ।
మనః స్వలింగం పరిగృహ్య కామాన్
జుషన్ నిబద్ధో గుణసంగతోఽసౌ ॥ 44

హిరణ్మయుడు (జ్ఞానశక్తిమయుడు), జీవనియంతయు నగుపరమాత్మ సమీహత (క్రియాశీలక)మగు మనస్సుతోగూడ నున్నవాడైనను,

స్వీయముగ నిష్క్రియభావముతో సాక్షిరూపముగ దర్శించుచుండును. జీవాత్మ సంసారద్యోతక మగుమనస్సును ఆత్మరూపముతో గ్రహించి మనస్సునకు సంబంధించిన క్రియలతో గూడినవాడై భోగములను సేవించుచు సంసారాసక్తుడగును.

దానం స్వధర్మో నియమో యమశ్చ
శ్రుతం చ కర్మాణి చ సద్వ్రతాని ।
సర్వే మనోనిగ్రహలక్షణాంతాః
పరో హి యోగో మనసః సమాధిః ॥ 45

దానము, స్వధర్మము, నియమము, యమము (అహింసాదులు), శ్రుతము (శాస్త్రశ్రవణము), సద్వ్రతములు, సత్కర్మలు—ఇవియన్నియు మనోనిగ్రహోపాయములు, మనోనిగ్రహమె పరమయోగము.

సమాహితం యస్య మనః ప్రశాంతం
దానాదిభిః కిం వద తస్య కృత్యమ్ ।
అసంయతం యస్య మనో వినశ్యత్
దానాదిభిశ్చేదపరం కిమేభిః ॥ 46

సమాహితము, (వశీభూతము) ప్రశాంతము నగుమనస్సుగల వానికి దానాదులవలన ప్రయోజనమేమిటి? అలసత్యమునకు వశమై నియమితముగాని మనస్సుగలవానికి దానాదులవలన ప్రయోజనమేమి?

మనోవశేఽన్యే హ్యభవన్ స్మ దేవా
మనశ్చ నాన్యస్య వశం సమేతి ।

ఘీష్మో హి దేవః సహసః సహీయాన్
యుంజ్యాద్వశే తం స హి దేవదేవః ॥ 47

సర్వేంద్రియములు మనస్సునకు వశమైయున్నవి. మనస్సు ఏయింద్రియమునకు వశమై యుండలేదు మనస్సు బలవంతునికంటెను మిక్కిలి బలవంతమైనది. యోగులకుగూడ భయంకరమైనది. దీనిని వశముచేసికొనువాడే దేవదేవుడు, ఇంద్రియజేతయునగును.

తం దుర్జయం శత్రుమసహ్యవేగం
అరుంతుదం తన్న విజిత్య కేచిత్ ।
కుర్వంత్యసద్విగ్రహమత్ర మర్త్యైః
మిత్రాణ్యుదాసీనరిపూన్ విమూఢాః ॥ 48

సహించుటకు వీలుగాని రాగాదివేగములతో గూడినదియు, శరీరమునేకాక హృదయాదిమర్మస్థానములనుగూడ బాధించునదియు, జయించుటకు శక్యముకానిదియు నగునా మనోరూపశత్రువును జయింపక కొందఱు మానవులు ఇతరులతో వ్యర్థముగ కలహించుచున్నారు ఆకలహమునందు కొందఱిని శత్రువులనియు, కొందఱిని మిత్రులనియు, కొందఱిని ఉదాసీనులనియు వివేచనచేయుదురు అట్టివారు మిక్కిలి మూర్ఖులు.

దేహం మనోమాత్రమిమం గృహీత్వా
మమాహమిత్యంధధియో మనుష్యాః ।
ఏషోఽహమన్యోఽయమితి భ్రమేణ
దురంతపారే తమసి భ్రమంతి ॥ 49

మానవులు వివేకశూన్యులై మనఃకల్పితమగు నీ దేహమును నేను, నాది యని భావించుచున్నారు. దానివలన ఇది యితరము నను భ్రమలో పడి దుస్తర మగుసంసారసాగరమున సంచరించుచున్నారు.

జనస్తు హేతుః సుఖదుఃఖయోశ్చేత్
కిమాత్మనశ్చాత్ర హి భౌమయోస్తత్ ।
జిహ్వాం క్వచిత్ సందశతి స్వదద్భిః
తద్వేదనాయాం కతమాయ కుప్యేత్ ॥ 50

మానవుడె సుఖదుఃఖములకు గారణమైనచో వానితో నాత్మ కెట్టి సంబంధ ముండును? కర్తృత్వభోక్తృత్వములు భౌతికము లగుస్థూల సూక్ష్మదేహములకు సంబంధించినవి ఎప్పుడైన భోజనాదులయందు తన దంతములతో నాలుకను కొఱికికొనినచో, దానివలన బాధకలిగినపుడు మానవు డెవరిపై గోపించును?

దుఃఖస్య హేతుర్యది దేవతాస్తు
కిమాత్మనస్తత్ర వికారయోస్తత్ ।
యదంగమంగేన నిహన్యతే క్వచిత్
క్రుధ్యేత కస్మై పురుషః స్వదేహే ॥ 51

దేవతలె దుఃఖమునకు గారణమైనచో నీ దుఃఖమువలన నాత్మ కెట్టి నష్టము కలుగును? కర్తృత్వభోక్తృత్వములు ఇంద్రియాభిమాను లగుదేవతలకు సంబంధించినవి. ఈ దేవతలు సర్వశరీరములలోను నొకే విధముగ నుందురు. ఒక శరీరములో నున్నదేవతలె మఱియొక శరీర ములోగూడ నుందురు ఇట్టి స్థితిలో తన శరీరమునందలి యొక యవ యవమువలన మఱియొక యవయవమునకు దెబ్బ తగిలినచో నెవరిపై కోపించును?

ఆత్మా యది స్యాత్ సుఖదుఃఖహేతుః
కిమన్యతస్తత్ర నిజస్వభావః ।

నహ్యాత్మనోఽన్యద్యది తన్మృషా స్యాత్
క్రుధ్యేత కస్మాన్న సుఖం న దుఃఖమ్ ॥ 52

ఆత్మయె సుఖదుఃఖములకు హేతువైనచో నిచట ఇతరమైనదానిని నిందింపనేల ? ఇది ఆత్మస్వభావము. ఆత్మకంటె అన్యమైన దేదియు లేదు. ఒకవేళ యున్నచో నది మిథ్యయే యగును. సుఖముగాని దుఃఖము గాని లేనప్పుడు క్రోధమునకు హేతు వేమి యుండును ?

గ్రహా నిమిత్తం సుఖదుఃఖయోశ్చేత్
కిమాత్మనోఽజస్య జనస్య తే వై ।
గ్రహైర్గ్రహస్యైవ వదంతి పీడాం
క్రుధ్యేత కస్మై పురుషస్తతోఽన్యః ॥ 53

గ్రహములు సుఖదుఃఖములకు గారణ మనినచో జన్మరహిత మైన ఆత్మ కేమి హాని యుండును ? వాని ప్రభావము జననమరణశీల మగుశరీరముపై నుండును. దైవజ్ఞులు ఆకాశమునం దుండుగ్రహములవలన శరీరమునం దుండుగ్రహములకు బాధకలుగుచున్న దనిచెప్పుచున్నారు. అందువలన దేహగ్రహములకంటె భిన్నుడైన పురుషునిపై గోపము చూప నేల?

కర్మాస్తు హేతుః సుఖదుఃఖయోశ్చేత్
కిమాత్మనస్తద్ధి జడాజడత్వే ।
దేహస్త్వచిత్ పురుషోఽయం సుపర్ణః
క్రుధ్యేత కస్మై నహి కర్మమూలమ్ ॥ 54

కర్మలె సుఖదుఃఖములకు హేతువు లనినచో దానివలన నాత్మ కెట్టి ప్రయోజన ముండును ? ఏలయన, జడత్వాజడత్వము లను నుభయధర్మ

విశిష్టము లైనపదార్థములయందె కర్మ సంభవమగును. కాని దేహము జడము, ఈపురుషుడు సుహర్ణుడు అనగా శుద్ధజ్ఞానస్వరూపుడు. అందువలన సుఖదుఃఖములకు మూలభూత మగుకర్మయే లేనపుడు ఎవరిపై గోపింప వలెను.

కాలస్తు హేతుః సుఖదుఃఖయోశ్చేత్
కిమాత్మనస్తత్ర తదాత్మకోఽసౌ ।
నాగ్నేర్హి తాపో న హిమస్య తత్ స్యాత్
క్రుధ్యేత కస్మై న పరస్య ద్వంద్వమ్ ॥ 55

సుఖదుఃఖములకు కాలము హేతువైన ఆత్మపై దాని ప్రభావ మేల యుండును? ఏలయన, ఈ యాత్మ కాలాత్మకమే కదా! అగ్నికి తాపము, మంచునకు శైత్యము నుండదు ఈ పురుషునకు సుఖదుఃఖాదికములు లేవు, కావున నెవరిపై గోపమును జూపవలెను ?

న కేనచిత్ క్వాపి కథంచనాస్య
ద్వంద్వోపరాగః పరతః పరస్య ।
యథాహమః సంసృతిరూపిణః స్యా-
దేవం ప్రబుద్ధో న బిభేతి భూతైః ॥ 56

సంసారసూచక మగుఅహంకారమునకు సుఖ దుఃఖ సంబంధ మున్నట్లు ప్రకృతికంటె అతీతమైన ఆత్మకెప్పుడును దేనితోను సుఖ దుఃఖాదిసంబంధ ముండదు, ఈ విషయమును దెలిసికొనిన మానవుడు భూతములకు భయపడడు.

ఏతాం స ఆస్థాయ పరాత్మనిష్ఠా-
మధ్యాసితాం పూర్వతమైర్మహర్షిభిః ।

అహం తరిష్యామి దురంతపారం
తమో ముకుందాంఘ్రి నిషేవయైవ ॥ 57

అందువలన నేను ప్రాచీనులైన మహర్షులచే సేవిత మగు నీ పర మాత్మజ్ఞానమును బొంది శ్రీకృష్ణపాదపద్మసేవతోడనే దుస్తరము తమ స్స్వరూపము నగునీ సంసారమును దరింపగలను.

శ్రీ భగవానువాచ

నిర్విద్య నష్టద్రవిణో గతక్లమః
ప్రవ్రజ్య గాం పర్యటమాన ఇత్థమ్ ।
నిరాకృతోఽసద్భిరపి స్వధర్మా-
దకంపితోఽమూం మునిరాహ గాథామ్ ॥ 58

భగవానుడు పలికెను:— నష్టమైన ధనము గలవాడు, ఖేద రహితుడు నగు నా ముని వైరాగ్యయుక్తుడయి సన్యసించి భూమియంతట దిరుగుచు, దుర్జనులచే నిట్లు తిరస్కృతుడైనను స్వధర్మమునుండి చలిం పక పూర్వోక్తగాథను గీర్తించెను.

సుఖదుఃఖప్రదో నాన్యః పురుషస్యాత్మవిభ్రమః ।
మిత్రోదాసీనరిపవః సంసారస్తమసః కృతః ॥ 59

జీవునకు సుఖదుఃఖముల గలుగజేయువా రెవ్వరును లేరు. ఇది వాని చిత్తవిభ్రమమె. మిత్రోదాసీనశత్రురూప మగు నీ సంసారము అజ్ఞానకల్పితము.

తస్మాత్సర్వాత్మనా తాత నిగృహాణ మనో ధియా ।
మయ్యావేశితయా యుక్త ఏతావాన్
యోగసంగ్రహః ॥ 60

ఉద్ధవా! నాయందు బుద్ధి నుంచి సంపూర్ణముగ మనస్సును నిగ్రహించుకొనుము. ఇదియె యోగసార మనితెలిసికొనుము.

ఏతాం స ఆస్థాయ పరాత్మనిష్ఠా...

గీయ ఏతాం భిక్షుణా తాం బ్రహ్మనిష్ఠాం సమాహితః ।
ధారయన్ శ్రావయన్ శృణ్వన్ ద్వంద్వైర్నైవాభి
భూయతే ॥ 61

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే పారమహంస్యాం
సంహితాయాం వైయాసిక్యాం ఏకాదశస్కంధే
శ్రీభగవదుద్ధవసంవాదే భిక్షుగీతా నామ
త్రయోవింశోఽధ్యాయః ॥

భిక్షుకునిచే గానము చేయబడిన సీబ్రహ్మ జ్ఞాన తత్త్వమును సమాహితచిత్తుడై మానవుడు ధరించినను, (పఠించినను) వినిపించినను, వినినను సుఖదుఃఖాదులకు వశుడు గాడు.

ఇట్లు శ్రీమద్భాగవత మహాపురాణములోని ఏకాదశ
స్కంధములోని యిరువదిమూడవ అధ్యాయము
సమాప్తము.



# ఇరువదినాలుగవ అధ్యాయము

## సాంఖ్య యోగము

### శ్రీ భగవానువాచ.

అథ తే సంప్రవక్ష్యామి సాంఖ్యం పూర్వైర్వి
యద్విజ్ఞాయ పుమాన్ సద్యో జహ్యాద్వైకల్పి
భ

భగవానుడు పలికెను :— ఉద్ధవా! ప్ర
ఋషులచేత నిశ్చయింపబడిన (చెప్పబడిన) సాంఖ్యయోగ
దను, దానిని వినిన మానవుడు వెంటనే భేదమూలక మగ
లను విడచిపెట్టును.

ఆసీద్ జ్ఞానమథో హ్యర్థ ఏకమేవావికల్పితమ్
యదా వివేకనిపుణా ఆదౌ కృతయుగేఽయుగే

ప్రళయమునందును, కృతయుగమునందును, ఏకా
వివేకనిపుణు లగుపురుషు లుందురు. అప్పుడే సమగ్రజ్ఞా
జ్ఞేయవిషయము వికల్పశూన్యమై ఒకేరూపమున నుండును.
బ్రహ్మ మొక్కటే యుండును

తన్మాయాఫలరూపేణ కేవలం నిర్వికల్పితమ్ ।
వాఙ్మనోఽగోచరం సత్యం ద్విధా సమభవద్బృ

పిమ్మట వాక్కునకు మనస్సునకు అగోచరము,
అనగా భేదరహితము, ఏకము, సత్యము నగునా బ్రహ్మము
రూపములతో (మాయావిలాసరూపముతో) రెండువిధము లైన

తయోరేకతరో హ్యర్థః ప్రకృతిః సోభయాత్మికా ।
జ్ఞానం త్వన్యతమో భావః పురుషః సోఽభిధీయతే ॥ 4

ఆ రెండుఅంశలలోను ప్రకృతి యొకయంశము, ఆ ప్రకృతి కార్య కారణరూపిణియై రెండు విధములుగ నున్నది. మఱియొక అంశము జ్ఞానము. అదియే పురుషనామముతో నభిహితమై యున్నది.

తమో రజః సత్త్వమితి ప్రకృతేరభవన్ గుణాః ।
మయా ప్రక్షోభ్యమాణాయాః పురుషానుమతేన చ ॥ 5

పిమ్మట పరమేశ్వరుడ నగునేను ప్రకృతికి క్షోభను గలుగజేయగా దానినుండి 'సత్త్వము, రజస్సు, తమస్సు' అను మూడుగుణము లభివ్యక్తములైనవి.

తేభ్యః సమభవద్ సూత్రం మహాన్ సూత్రేణ సంయుతః ।
తతో వికుర్వతో జాతో యోఽహంకారో
విమోహనః ॥ 6

ఈగుణత్రయమునుండి క్రియాశక్తి సంపన్న మగు సూత్రము, ఆ సూత్రముతోగూడ జ్ఞానశక్తిప్రధాన మగుమహత్తత్త్వము ప్రకటమైనవి అనంతరము మహత్తత్త్వమునుండి జీవులకు భ్రమ గొల్పు అహంకార ముద్భవించినది.

వైకారికస్తైజసశ్చ తామసశ్చేత్యహం త్రివృత్ ।
తన్మాత్రేంద్రియమనసాం కారణం చిదచిన్మయః ॥ 7

ఈయహంకారము వైకారికము, తైజసము, తామసము ననిమూడు విధములుగను, చిదచిన్మయముగను నున్నది. అదియె తన్మాత్రలకును, ఇంద్రియములకును, మనస్సునకును గారణ మైయున్నది.

అర్థస్తన్మాత్రికాజ్జజ్ఞే తామసాదిన్ద్రియాణి చ ।
తైజసాద్దేవతా ఆసన్నేకాదశ చ వైకృతాత్ ॥ 8

శబ్దము మున్నగుపంచన్మాత్రలకు గారణస్వరూప మగుతామసాహంకారమునుండి పంచమహాభూతములు, తైజసము అనగా రాజసాహంకారమునుండి పదియింద్రియములు, వైకారికము అనగా సాత్త్వికాహంకారము నుండి ఏకాదశేంద్రియాధిష్ఠానదేవతలు, మనస్సు కలిగినవి.

మయా సంచోదితా భావాః సర్వే సంహత్యకారిణః ।
అండముత్పాదయామాసుర్మమాయతనముత్తమమ్ ॥ 9

నా ప్రేరణచే వెనుక చెప్పబడినపదార్థము లన్నియు, సమ్మిశ్రితభావముతో క్రియాశీలములై, ఉత్తమమగు నా నివాసస్థానరూపమైన బ్రహ్మాండమును సృష్టించినవి.

తస్మిన్నహం సమభవమండే సలిలసంస్థితౌ ।
మమ నాభ్యామభూత్పద్మం విశ్వాఖ్యం తత్ర
చాత్మభూః ॥ 10

జలమునం దున్నఆ యండమున నారాయణస్వరూపుడనగు నేను వెల్లడియైతిని. నా నాభినుండి విశ్వమనునొకపద్మ ముత్పన్న మైనది. దానియందు చతుర్ముఖుడైనబ్రహ్మ ఆవిర్భవించెను.

సోఽసృజత్తపసా యుక్తో రజసా మదనుగ్రహాత్ ।
లోకాన్ సపాలాన్ విశ్వాత్మా భూర్భువః
స్వరితి త్రిధా ॥ 11

విశ్వాత్మ డగునా బ్రహ్మ రజోగుణయుక్తుడై నా యనుగ్రహము

వలన తపస్సుచేసి, దాని ప్రభావముచే లోకపాలకులతోగూడ భూర్భువ స్వర్లోకములను సృష్టించెను.

దేవానామోక ఆసీత్ స్వర్భూతానాం చ భువః పదమ్ ।
మర్త్యాదీనాం చ భూర్లోకః సిద్ధానాం త్రితయాత్ పరమ్ ॥ 12

స్వర్గలోకము దేవతలకు, భువర్లోకము భూతగణములకు, భూలోకము మనుష్యులకు వాసస్థానమైనది. ఈ మూడులోకములకంటె పరమైన మహర్లోకాదులు సిద్ధుల కాశ్రయము లైనవి.

అధోఽసురాణాం నాగానాం భూమేరోకోఽసృజత్ప్రభుః ।
త్రిలోక్యాం గతయస్సర్వాః కర్మణాం త్రిగుణాత్మనామ్ ॥ 13

(ప్రభువు) సృష్టికార్యసమర్థు డగుబ్రహ్మ భూమికి క్రింద అసురులకు నాగులకు నావాసస్థానరూపముగ అతలాదిలోకములను సృజించెను. త్రిగుణాత్మకము లగుకర్మల ననుసరించి జీవులకు మూడులోకములయందు వివిధములగు గతులుండును.

యోగస్య తపసశ్చైవ న్యాసస్య గతయోఽమలాః ।
మహర్జనస్తపస్సత్యం భక్తియోగస్య మద్గతిః ॥ 14

యోగతపస్సన్న్యాసముల తారతమ్యము ననుసరించి మహర్లోకము, జనలోకము, తపోలోకము, సత్యలోకము ననుఉత్తమగతుల బొందును. భక్తియోగముచే నా పరమధామమను బొందును.

మయా కాలాత్మనా ధాత్రా కర్మయుక్తమిదం జగత్ ।
గుణప్రవాహ ఏతస్మిన్నున్మజ్జతి నిమజ్జతి ॥ 15

కాలాత్మకుడను, పరమేశ్వరుడను నగునాచే నీ జగత్తు కర్మయుక్త మైయున్నది సత్వాదిగుణ ప్రవాహవిశిష్ట మగునీ సంసారమున జీవు డొకమాఱు మునుగుచున్నాడు, మఱియొక మారు లేచుచున్నాడు, అనగా నొకప్పు డధోగతిని మఱియొకప్పు డుత్తమగతిని బొందుచున్నాడు

అణుర్బృహత్కృశః స్థూలో యో యో భావః ప్రసిధ్యతి ।
సర్వోఽప్యుభయసంయుక్తః ప్రకృత్యా పురుషేణ చ ॥ 16

జగత్తులోని చిన్నవి, పెద్దవి, స్థూలము, సూక్ష్మము నగుపదార్థము లన్నియు ప్రకృతిపురుష లిరువురినుండి బయల్వెడలినవియె.

యస్తు యస్యాదిరంతశ్చ స వై మధ్యం చ తస్య సన్ ।
వికారో వ్యవహారార్థో యథా తైజసపార్థివాః ॥ 17

ఏపదార్థ మేకార్యమునకు కారణము, లయస్థానము నైయున్నదో, ఆపదార్థమె అకార్యమునకు వర్తమానస్వరూప మైయున్నది. తైజసపార్థివము లైనపదార్థములు అనగా కటకకుండలాదులు, ఘటశరావాదులు కేవలము వ్యావహారిక పదార్థములైనట్లు వైకారికపదార్థము లన్నియు వ్యావహారికములె. కాని కారణపదార్థ మొక్కటియె సత్యమైనది.

యదుపాదాయ పూర్వస్తు భావో వికురుతేఽపరమ్ ।
ఆదిరంతో యదా యస్య తత్సత్యమభిధీయతే ॥ 18

ఉపాదానకారణరూపముగ గ్రహింపబడి, మహత్తత్త్వమున్నగు అహంకారాదిభావపదార్థముల నన్నింటిని సృష్టించు వస్తువె సత్యమైనది. ఎప్పు డేపదార్థము వేనికి ఆద్యంత మని గ్రహింపబడినదో, అప్పు డాపదార్థము సత్య మైనదని చెప్పబడినది. (అ మృత్తికయే సత్యమను శ్రుతి వాక్యములో నెట్టివి రోధములేదు).

ప్రకృతిర్యస్యోపాదానమాధారః పురుషః పరః ।
సతోఽభివ్యంజకః కాలో బ్రహ్మతత్త్రితయంత్వహమ్ ॥ 19

ఈ జగత్కార్యమున కుపాదాన మగుప్రకృతి, ప్రకృతికధిష్ఠాత యగుపురుషుడు, గుణక్షోభముద్వారా అభివ్యంజక మగుకాలము-ఈ మూడు పదార్థములు బ్రహ్మస్వరూపుడ నగునేనే. నాకంటె భిన్న మైనదేదియు లేదు.

సర్గం ప్రవర్తతే తావత్ పౌర్వాపర్యేణ నిత్యశః ।
మహాన్ గుణవిసర్గార్థః స్థిత్యంతో యావదీక్షణమ్ ॥ 20

పరమేశ్వరుని యీక్షణశక్తి యున్నంతవఱకు గుణప్రవాహముచే వివిధభావాపన్ను లగుజీవుల భోగముకొఱకు పితృపుత్రాది రూపముతో నీ సృష్టిచక్రము నిరంతరము ప్రవర్తిత మగుచున్నది.

విరాణ్మయాఽఽసాద్యమానో లోకకల్పవికల్పకః ।
పంచత్వాయ విశేషాయ కల్పతే భువనైః సహ ॥ 21

కాలాత్మకుడ నగునాచే పరివ్యాప్తమై లోకముల సృష్టిస్థితి ప్రళయములకు ఆధారస్వరూప మైన బ్రహ్మాండము లోకము లన్నింటితోపాటు వినాశరూప మగువిభాగమునకు యోగ్యమైనదగును

అన్నే ప్రలీయతే మర్త్యమన్నం ధానాసు లీయతే ।
ధానా భూమౌ ప్రలీయంతే భూమిర్గంధే ప్రలీయతే ॥ 22

ప్రళయకాలమున మానవశరీరములు అన్నమునందును, అన్నము బీజములయందును, బీజములు భూమియందును, భూమి గంధతన్మాత్రలోను లీనమగును,

అప్సు ప్రలీయతే గంధ ఆపశ్చ స్వగుణే రసే ।
లీయతే జ్యోతిషి రసో జ్యోతీ రూపే ప్రలీయతే ॥ 23

గంధము జలములోను, జలము తన గుణ మగురసములోను, రసము తేజస్సులోను, తేజస్సు రూపములోను లీనమగును.

రూపం వాయౌ స చ స్పర్శే లీయతే సోఽపి చాంబరే ।
అంబరం శబ్ద తన్మాత్రే ఇంద్రియాణి స్వయోనిషు ॥ 24

రూపము వాయువునందును, వాయువు స్పర్శమునందును, స్పర్శము ఆకాశమునందును, ఆకాశము శబ్దతన్మాత్రము నందును లీనమగును. ఇంద్రియములు తమకు గారణ మగు దేవతలయందును లీనమగును.

యోనిర్వైకారికే సౌమ్య లీయతే మనసీశ్వరే ।
శబ్దో భూతాదిమప్యేతి భూతాదిర్మహతి ప్రభుః ॥ 25

సౌమ్యుడా! దేవతలు నియామక మగుమనస్సులోను, మనస్సు అహంకారమునందును, శబ్దము పంచభూతములకు గారణ మగుతామసాహంకారమునందును, సర్వజగత్తునకు మోహమును కలుగజేయుటయందు సమర్థ మైనత్రివిధాహంకారములు మహత్తత్త్వమున లీనమగును.

స లీయతే మహాన్ స్వేషు గుణేషు గుణవత్తమః ।
తేఽవ్యక్తే సంప్రలీయంతే తత్కాలే
లీయతేఽవ్యయే ॥ 26

జ్ఞానక్రియాశక్తిప్రధాన మగుమహత్తత్త్వము తనకు గారణము లగుగుణములలో లీనమగును, గుణములవ్యక్త ప్రకృతియందును, ప్రకృతి తనకు ప్రేరకము, నాశరహితము నగుకాలమునందు లీనమగును.

కాలో మాయామయే జీవే జీవ ఆత్మని మయ్యజే ।
ఆత్మా కేవల ఆత్మస్థో వికల్పాపాయలక్షణః ॥ 27

కాలము మాయామయు డగుజీవునియందును, జీవుడు అజుడను ఆత్మస్వరూపుడను నగునాయందును లయమగును. ప్రపంచముయొక్క సృష్టిస్థితి నాశములకు గారణుడను, నిరుపాధికుడను నగునేను మఱియెచ్చటను లయముగాను, స్వస్వరూపమునందె యుందును.

ఏవమన్వీక్షమాణస్య కథం వైకల్పికో భ్రమః ।
మనసో హృది తిష్ఠేత వ్యోమ్నీవార్కోదయే తమః ॥ 28

సూర్యోదయముకాగా అంధకార ముండజాలదు, అట్లే సాంఖ్య యోగమును గూర్చియాలోచించు వానిమనస్సునకు వైకల్పిక (ప్రాపంచిక) భ్రమ యెట్లు కలుగును? ఒకవేళ కలిగినచో నదియెక్కువ కాలము హృదయమున నెట్లుండును?

ఏష సాంఖ్యవిధిః ప్రోక్తః సంశయగ్రంథిభేదనః ।
ప్రతిలోమానులోమాభ్యాం పరావరదృశా మయా ॥ 29

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే పారమహంస్యాం
సంహితాయాం వైయాసిక్యా మేకాదశ స్కంధే
శ్రీ భగవదుద్ధవ సంవాదే సాంఖ్యయోగనామ
చతుర్వింశోఽధ్యాయః

ఉద్ధవా! సర్వకార్య కారణ తత్త్వ దర్శి నగునేను సృష్టి ప్రళయ క్రమముతో సంశయగ్రంథ భేదక మగు నీ సాంఖ్య విధినిగూర్చి చెప్పితిని.

ఇది శ్రీ మద్భాగవత మహాపురాణము నందలి
ఏకాదశ స్కంధములోని ఇరువదినాలుగవ
అధ్యాయము సమాప్తము.

# ఇరువదియైదవ అధ్యాయము

## త్రిగుణ వృత్తుల నిరూపణము

## శ్రీ భగవానువాచ.

గుణానామసంమిశ్రాణాం పుమాన్ యేన యథా భవేత్ ।
తన్మే పురుషవర్యేదముపధారయ శంసతః ॥ 1

భగవానుడు పలికెను: పురుషశ్రేష్ఠుడవగు ఉద్ధవా! అసంమిశ్రము అనగా విభక్తమగు గుణములలో నేగుణములద్వారా పురుషుడేరూపమున నుండునో వానినిగూర్చి చెప్పుదును, వినుము.

శమో దమ స్తితిక్షేక్షా తపస్సత్యం దయా స్మృతిః ।
తుష్టిస్త్యాగోఽస్పృహా శ్రద్ధా హ్రీర్దయాదిస్స్వనిర్వృతిః ॥ 2

శమము, (మనో నిగ్రహము), దమము (ఇంద్రియ నిగ్రహము) తితిక్ష (ఓర్పు) ఈక్ష (వివేకము), తపస్సు. సత్యము, దయ, స్మృతి, సంతోషము, త్యాగము, వైరాగ్యము, శ్రద్ధ, లజ్జ, దయాది సద్గుణములు, ఆత్మరతి మున్నగునవి సత్త్వగుణవృత్తులు

కామ ఈహా మద స్తృష్ణా స్తంభ ఆశీర్భిదా సుఖమ్ ।
మదోత్సాహో యశః ప్రీతిర్హాస్యం వీర్యం బలోద్యమః ॥ 3

కామము, ప్రయత్నము, మదము, తృష్ణ, గర్వము, దేవతలనుండి ధనము మున్నగువానిని యాచించుట, భేదబుద్ధి, సుఖము, మదోత్సాహము (మదముచేత యుద్ధాదులయందభినివేశము గలుగుట), కీర్తియందభిలాష, పరిహాసము, పరాక్రమము, హఠపూర్వక ప్రయత్నము మున్నగునవి రజోగుణవృత్తులు.

క్రోధో లోభో౽నృతం హింసా యాచ్ఞా దంభః
క్లమః కలిః ।
శోకమోహౌ విషాదార్తీ నిద్రాశా భీరనుద్యమః ॥ 4

క్రోధము, లోభము, అసత్యభాషణము, హింస, యాచన, దంభము (పాషండము), శ్రమ, కలహము శోకము, విషాదము, ఆర్తి, (దుఃఖ దైన్యములు), నిద్ర, ఆశ, భయము, జాడ్యము (అకర్మణ్యత) మున్నగు నవి తమోగుణవృత్తులు.

సత్త్వస్య రజసశ్చైతాస్తమసశ్చానుపూర్వశః ।
వృత్తయో వర్ణితప్రాయాః సన్నిపాతమథో శృణు ॥ 5

ఇంతవఱకును భిన్నభిన్నముగ నున్న సత్త్వరజస్తమో గుణముల వృత్తులను వివరించితిని ఇక యిప్పుడు కలసియున్న గుణవృత్తులను గూర్చి చెప్పెదను వినుము.

సన్నిపాతస్త్వహమితి మమేత్యుద్ధవ యా మతిః ।
వ్యవహారః సన్నిపాతో మనోమాత్రేంద్రియాసుభిః ॥ 6

ఉద్ధవా ! జీవుల 'నేను, నాది' యనుబుద్ధి సమ్మిశ్రణము లైన త్రిగుణములకు సంబంధించినది. మనస్సువలన, శబ్దాది విషయములవలన, ఇంద్రియములవలన, ప్రాణములవలన పైనచెప్పబడినవృత్తులు బయల్వెడలును. ఇవి యన్నియు సాత్త్వికరాజసతామసములె.

ధర్మే చార్థే చ కామే చ యదాసౌ పరినిష్ఠితః ।
గుణానాం సన్నికర్షో౽యం శ్రద్ధారతిధనావహః ॥ 7

పురుషుడు ధర్మార్థకామవిషయములందు ఆసక్తుడగునపుడు వానికి

శ్రద్ధను, రతిని, ధనమును గలిగించునది ఈ మూడుగుణములయొక్క మిశ్రవృత్తియే యనితెలిసికొనుము.

ప్రవృత్తిలక్షణే నిష్ఠా పుమాన్ యర్హి గృహాశ్రమే ।
స్వధర్మే చానుతిష్ఠేత గుణానాం సమితిర్హి సా ॥ 8

ప్రవృత్తిలక్షణము లైనకామ్యకర్మాదుల యందు పురుషున కాసక్తి కలిగినపుడు అతడు గృహస్థాశ్రమమున నిమగ్నుడగును, పిమ్మట స్వధర్మములయందు అనగా నిత్యనైమిత్తికముల యందు రతుడగును. ఇది గూడ గుణత్రయసమ్మిశ్రణమే యని యెఱుంగుము.

పురుషం సత్త్వసంయుక్తమనుమీయాచ్ఛమాదిభిః ।
కామాదిభిరజోయుక్తం క్రోధాద్యైస్తమసాయుతమ్ ॥ 9

శమదమాది లక్షణములతో పురుషుని సత్వగుణయుక్తునిగను కామాదిలక్షణములతో రజోగుణ యుక్తునిగను, క్రోధ లోభాది లక్షణములతో తమోగుణయుక్తునిగను గుర్తింపవలెను.

యదా భజతి మాం భక్త్యా నిరపేక్షః స్వకర్మభిః ।
తం సత్వప్రకృతిం విద్యాత్పురుషస్త్రియమేవ హి ॥ 10

ఫలాదులను గోరక భక్తితో స్వకర్మలచే నన్నే సేవించు పురుషుని గాని స్త్రీనిగాని సత్త్వప్రకృతి గలవారనితెలిసికొనుము

యదా ఆశిష ఆశాస్య మాం భజేత స్వకర్మభిః ।
తం రజఃప్రకృతిం విద్యాద్హింసామాశాస్యతామసమ్ ॥ 11

విషయముల నపేక్షించి స్వకర్మలతో నన్ను సేవించు మానవుని రజోగుణ పకృతి గలవాడనియు; హింసను సంకల్పించి నన్నారాధించు వానిని తమోగుణప్రకృతి గలవాడనియు నెఱుంగవలెను.

సత్త్వం రజస్తమ ఇతి గుణాజీవస్య నైవ మే ।
చిత్తజా యైస్తు భూతానాం సజ్జమానో నిబధ్యతే ॥ 12

సత్త్వరజస్తమస్సు లనునీ మూడును జీవుని మానసికగుణములే గాని నావిమాత్రము కాదు, ఈగుణములద్వారా జీవుడు దేహదైహికాది పదార్థములయం దాసక్తుడై సంసారపాశమున బద్ధుడగును.

యదేతరౌ జయేత్సత్త్వం భాస్వరం విశదం శివమ్ ।
తదా సుఖేన యుజ్యేత ధర్మజ్ఞానాదిభిః పుమాన్ ॥ 13

ప్రకాశకము, స్వచ్ఛము, శాంతము నగుసత్త్వగుణము రజోగుణ తమోగుణములను జయించినపుడు పురుషుడు సుఖధర్మజ్ఞానాదులతో గూడియుండును.

యదా జయేత్తమస్సత్త్వం రజస్సంగం భిదా చలమ్ ।
తదా దుఃఖేన యుజ్యేత కర్మణా యశసా శ్రియా ॥ 14

సంగహేతువు, భేదహేతువు, ప్రవృత్తిస్వభావము గలరజోగుణము తమస్సత్త్వములను జయించినపుడు మానవుడు దుఃఖముతోను, కర్మ, యశస్సు, శ్రీ మున్నగుగుణములతోను గూడియుండును.

యదా జయేద్రజస్సత్త్వం తమోమూఢం లయం జడమ్ ।
యుజ్యేత శోకమోహాభ్యాం నిద్రయా హింసయాఽఽ-
శయా ॥ 15

మూఢము (వివేకమును నాశనమును చేయునది) లయము (ఆవరణము కలది), జడము (ప్రయత్నము లేనిది) అగు తమోగుణము

సత్త్వరజోగుణములను జయించినపుడు మానవుడు శోకము, మోహము, నిద్ర, హింస, ఆశ మున్నగుగుణములతోగూడి యుండును.

యదా చిత్తం ప్రసీదేత ఇంద్రియాణాం చ నిర్వృతిః ।
దేహేఽభయం మనోఽసంగం తత్సత్త్వం విద్ధి
మత్పదమ్ ॥ 16

చిత్తము నిర్మలము, ఇంద్రియములు ప్రశాంతము, దేహము భయశూన్యము, మనస్సు విషయసాంగత్యరహితము అగునపుడు నన్ను బొందుట కధిష్ఠానభూత మైనసత్త్వ ముద్రిక్తమైన దని తెలిసికొనవలెను

వికుర్వన్ క్రియయా చాధీరనిర్వృత్తిశ్చ చేతసామ్ ।
గాత్రాస్వాస్థ్యం మనో భ్రాంతం రజ ఏతైర్నిశామయ॥ 17

కర్మలచే వికృతుడు, విక్షిప్తచిత్తుడు నగుపురుషుని బుద్ధీంద్రియము లసంతుష్టిని, కర్మేంద్రియములు వికారమును, మనస్సు చాంచల్యమును బొందును. అప్పుడీసర్వకారణములచే రజోగుణ ముద్రిక్త మైనదని తెలిసికొనుము

సీదచ్చిత్తం విలీయేత చేతసో గ్రహణేఽక్షమమ్ ।
మనో నష్టం తమోగ్లాని స్తమ స్తదుపధారయ ॥ 18

చిత్తము కలతచెంది - చిదాకారగ్రహణమున అసమర్థ మైనదై లీనమగును. సంకల్పాత్మక మగుమనస్సుగూడ లీనప్రాయ మగును. అజ్ఞానము విషాదము వృద్ధి యగును. అపుడు తమోగుణ ముద్రిక్త మైనదని తెలిసికొనుము

ఏధమానే గుణే సత్త్వే దేవానాం బలమేధతే ।
అసురాణాం చ రజసి తమస్యుద్ధవ రక్షసామ్ ॥ 19

ఉద్ధవా! సత్త్వగుణము వృద్ధియైనపుడు దేవతలకు, రజోగుణము వృద్ధి యైనపుడు అసురులకు, తమోగుణము వృద్ధియైనపుడు రాక్షసులకు బలము పెరుగును.

సత్త్వాజ్జాగరణం విద్యాద్రజసా స్వప్నమాదిశేత్ ।
ప్రస్వాపం తమసా జంతో స్తురీయం త్రిషు సంతతమ్ ॥ 20

సత్త్వగుణ ముద్రిక్త మైనపుడు జీవులకు జాగరణము, రజోగుణ ముద్రిక్త మైనపుడు స్వప్నము, తమోగుణ ముద్రిక్త మైనపుడు సుషుప్తి కలుగును. తురీయావస్థ పైనచెప్పబడిన మూడ వస్థలలో ఆత్మతత్త్వరూపమున నుండును.

ఉపర్యుపరి గచ్ఛంతి సత్త్వేన బ్రాహ్మణా జనాః ।
తమసాధోఽధ ఆముఖ్యాద్రజసాంతరచారిణః ॥ 21

వేదాభ్యాసతత్పరు లగు బ్రాహ్మణులు సత్త్వగుణముచే పైకి బ్రహ్మ లోకమువఱకు వెడలుదురు. తమోగుణయుక్తు లగువ్యక్తులు స్థావర పర్యంతము అధోగతిని బొందుదురు. రజోగుణయుక్తు లగువ్యక్తులు మానవలోకమును బొందుదురు.

సత్త్వే ప్రలీనాః స్వర్యాంతి నరలోకం రజోలయాః ।
తమోలయాస్తు నిరయం యాంతి మామేవ నిర్గుణాః ॥ 22

సత్త్వగుణము వృద్ధియైనపుడు మరణించినవారు స్వర్గలోకమునకు, రజోగుణము వృద్ధిబొందిన సమయమున మరణించినవారు నరలోకము నకు, తమోగుణము వృద్ధియైనపుడు మరణించినవారు నరకమునకును బోవుదురు. నిర్గుణులైనవ్యక్తులు జీవితకాలమందే నన్ను బొందుదురు.

మదర్పణం నిష్ఫలం వా సాత్త్వికం నిజకర్మతత్ ।
రాజసం ఫలసంకల్పః హింసాప్రాయాది తామసమ్ ॥ 23

నాకు ప్రీతి గలిగించు నుద్దేశ్యముతో చేయబడిన కర్మలు లేదా ఫలరహితముగ ననుష్ఠింపబడిన నిత్యనైమిత్తికాది స్వకర్మలు సాత్త్వికములు. ఫలసంకల్పయుక్తము లగుకర్మలు రాజసములు, హింసాదియుక్తములు లేదా దంభమాత్సర్యాదికృతములు నగు కర్మలు తామసములు.

కైవల్యం సాత్త్వికం జ్ఞానం రజోవైకల్పికం చ యత్ ।
ప్రాకృతం తామసం జ్ఞానం మన్నిష్ఠం నిర్గుణం
స్మృతమ్ ॥ 24

కైవల్యజ్ఞానము అనగా దేహాదివ్యతిరిక్త మగుఆత్మవిషయకమగుజ్ఞానము సాత్త్వికము, వైకల్పిక మగుజ్ఞానము అనగా దేహాది విషయకజ్ఞానము రాజసము, ప్రాకృతజ్ఞానము, తామసము, పరమేశ్వర నిష్ఠ నగుజ్ఞానము నిర్గుణమని చెప్పబడినది.

వనంతు సాత్త్వికో వాసో గ్రామో రాజస ఉచ్యతే ।
తామసం ద్యూతసదనం మన్నికేతం తు నిర్గుణమ్ ॥ 25

వనవాసము సాత్త్వికము, గ్రామవాసము రాజసము, జూదమాడు గృహములలో నుండుట తామసము. నా నికేతనమున నుండుట నిర్గుణము నని చెప్పబడుచున్నది.

సాత్త్వికః కారకోఽసంగీ రాగాంధో రాజసః స్మృతః ।
తామసః స్మృతివిభ్రష్టో నిర్గుణో మదపాశ్రయః ॥ 26

అనాసక్తభావముతో కర్మ నాచరించువాడు సాత్త్వికుడు, రాగాంధుడై కర్మచేయువాడు రాజసికుడు, స్మృతిభ్రష్టుడై అనగా పూర్వాపరవిచారరహితుడై కర్మచేయువాడు తామసికుడు. కేవలము నన్నాశ్రయించి కర్మలు చేయువాడు నిర్గుణుడు నని చెప్పబడినది.

సాత్త్వికక్యాధ్యాత్మికీ శ్రద్ధా కర్మశ్రద్ధా తు రాజసీ ।
తామస్యధర్మే యా శ్రద్ధా మత్సేవాయాం
తు నిర్గుణా ॥ 27

ఆధ్యాత్మికము శాస్త్రోక్తము నగుశ్రద్ధ సాత్త్వికము, కర్మకాండము నందలి శ్రద్ధ రాజసము, అధర్మమునందలి శ్రద్ధ తామసము, నన్ను సేవించుటలో గలశ్రద్ధ నిర్గుణము నని చెప్పబడినది.

పథ్యం పూతమనాయస్తమాహార్యం సాత్త్వికం స్మృతమ్ ।
రాజసంచేంద్రియప్రేష్ఠం తామసం చార్తిదాశుచి ॥ 28

హితకరము, శుద్ధము, అనాయాసలబ్ధము నగునాహారము సాత్త్వికము ; ఇంద్రియములకు సుఖమును గలిగించు వగరు, పులుపు, ఉప్పు గలిగినవస్తువులు రాజసికములు ; దైన్యకరములు అపవిత్రములు నగు పదార్థములు తామసములు. నాకు నివేదించినవి నిర్గుణములు నని చెప్పబడినవి.

సాత్త్వికం సుఖమాత్మోత్థం విషయోత్థం తు రాజసమ్ ।
తామసం మోహదైన్యోత్థం నిర్గుణం మదపాశ్రయమ్ ॥ 29

ఆత్మానుభవమువలన గలిగిన సుఖము సాత్త్వికము, విషయ భోగమువలన గలిగినసుఖము రాజసము, మోహదైన్యములవలన గలిగిన సుఖము తామసము, నన్ను కీర్తించుటవలన గలిగినసుఖము నిర్గుణము.

ద్రవ్యం దేశః ఫలం కాలో జ్ఞానం కర్మ చ కారకః ।
శ్రద్ధావస్థాఽఽకృతిర్నిష్ఠా త్రైగుణ్యాః సర్వ ఏవ హి ॥ 30

ద్రవ్యము, దేశము, ఫలము, కాలము, జ్ఞానము కర్మ, కర్త,

శ్రద్ధ, అవస్థ, ఆకృతి, నిష్ఠ—మున్నగుభావము లన్నియు త్రిగుణాత్మక ములే.

సర్వే గుణమయా భావాః పురుషావ్యక్తధిష్ఠితాః ।
దృష్టం శ్రుతమనుధ్యాతం బుద్ధ్యా వా పురుషర్షభ ॥ 31

పురుషశ్రేష్ఠా ! చూడబడినవి, వినబడినవి, ఆలోచింపబడినవి, ప్రకృతిపురుషాధిష్ఠతములు నగుభావము లన్నియు త్రిగుణమయములే యని తెలిసికొనవలెను.

ఏతాః సంసృతయః పుంసో గుణకర్మనిబంధనాః ।
యేన మే నిర్జితాః సౌమ్య గుణా జీవేన చిత్తజాః ।
భక్తియోగేన మన్నిష్ఠో మద్భావాయ ప్రపద్యతే ॥ 32

సౌమ్యుడా ! పురుషునకు సంసారభావములు గుణకర్మలవలన గలుగును. చిత్తజము లగునీ గుణములను జయించినవాడు భక్తి యోగముచే నాయందు నిష్ఠగలవాడై మోక్షమును బొందగలడు.

తస్మాద్దేహమిమం లబ్ధ్వా జ్ఞానవిజ్ఞానసంభవమ్ ।
గుణసంగం వినిర్ధూయ మాం భజంతు విచక్షణాః ॥ 33

అందువలన విచక్షణు లగుపురుషులు జ్ఞానవిజ్ఞానసంభవ మగువ దేహమును బొంది, గుణములయం దాసక్తిని వదలి, నన్ను సేవింప వలెను.

నిస్సంగో మాం భజేద్విద్వానప్రమత్తో జితేంద్రియః ।
రజస్తమశ్చాభిజయేత్ సత్త్వసంసేవయా మునిః ॥ 34

వివేకి యగువ్యక్తి అప్రమత్తుడు, జితేంద్రియుడు, విషయాసక్తి

శూన్యుడు నై నన్ను సేవింపవలెను. సాత్త్వికద్రవ్యములను సేవించుట ద్వారా రజస్తమోగుణములను జయింపవలెను.

సత్త్వం చాభిజయేద్యుక్తో నైరపేక్ష్యేణ శాంతధీః ।
సంపద్యతే గుణైర్ముక్తో జీవో జీవం విహాయ మామ్ ॥ 35

అనంతరము శాంతచిత్తు డగువ్యక్తి ఉపశమాత్మక మగుసత్త్వ గుణముతో గూడినవాడై మిశ్రమసత్త్వగుణమును జయింపవలెను. తరువాత గుణత్రయవిముక్తుడై లింగదేహమునువదలి నన్ను బొందును.

జీవో జీవవినిర్ముక్తో గుణైశ్చాశయసంభవైః ।
మయైవ బ్రహ్మణా పూర్ణో న బహిర్నాంతరశ్చరేత్ ॥ 36

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే పారమహంస్యాం
సంహితాయాం వైయాసిక్యాం ఏకాదశస్కంధే
త్రిగుణవృత్తినిరూపణం నామ
పంచవింశోఽధ్యాయః ॥

ఇట్లు, లింగశరీరమునుండి, చిత్తజాతము లగుగుణములనుండి ముక్తుడై జీవుడు బ్రహ్మరూపుడ నగునా యనుభూతిచే పరితృప్తుడై బయట విషయభోగము తోడను, లోపల నా విషయచింతనతోడను సంచరింపడు.

ఇట్లు శ్రీమద్భాగవతమహాపురాణములోని ఏకాదశ
స్కంధములోని యిరువదియైదవ అధ్యాయము
సమాప్తము.

# ఇరువదియాఱవ అధ్యాయము

## పురూరవుని వైరాగ్యోక్తి

## ( ఐల గీతము )

### శ్రీ భగవానువాచ

మల్లక్షణమిమం కాయం లబ్ధ్వా మద్ధర్మ ఆస్థితః ।
ఆనందం పరమాత్మానమాత్మస్థం సముపైతి మామ్ ॥ 1

భగవానుడు పలికెను :— ఉద్ధవా! నా లక్షణమును తెలిసికొనుటకు సాధనభూతమైననీ మానవదేహమును బొంది నా భక్తి ధర్మమున నున్నవాడు ఆత్మస్థితుడను, పరమానందరూపుడను, పరమాత్మను నగునన్ను బొందును.

గుణమయ్యా జీవయోన్యా విముక్తో జ్ఞాననిష్ఠయా ।
గుణేషు మాయామాత్రేషు దృశ్యమానేష్వవస్తుతః ।
వర్తమానోఽపి న పుమాన్ యుజ్యతేఽవస్తుభిర్గుణైః॥ 2

జ్ఞాననిష్ఠద్వారా గుణమయ మగుజీవోపాధినుండి విముక్తుడైన పురుషుడు విషయము లన్నియు అవాస్తవములు మాయామాత్రములు నని తెలిసికొని విషయములయం దున్నను మిథ్యాభూతములు గుణమయములు నగువిషయములయం దాసక్తుడు గాడు.

సంగం న కుర్యాదసతాం శిశ్నోదరతృపాం క్వచిత్ ।
తస్యానుగస్తమస్యంధే పతత్యంధానుగాంధవత్ ॥ 3

విషయ భోగములయందు, ఉదరపోషణమునందు ఆసక్తులైన

అ సత్పురుషులతో నెప్పుడును సహవాసము చేయరాదు. ఏలయన, ఆ యసత్పురుషుని అనుగమించువాడు అంధుని అనుసరించు మఱియొక అంధునివలె ఘోర మగునంధకారమున పతితుడగును.

ఐలః సమ్రాడిమాం గాథామగాయత బృహచ్ఛ్రవాః ।
ఉర్వశీ విరహాన్ముహ్యాన్ నిర్విణ్ణః శోకసంయమే ॥ 4

మహాయశస్వియు, ఇలానందనుడు నగుపురూరవ చక్రవర్తి మొదట ఊర్వశీవిరహమువలన మిగుల దుఃఖించెను, పిమ్మట శోకము తొలగగా విరాగియై యీ గాథను గానముచేసెను.

త్యక్త్వాఽఽత్మానం వ్రజంతీం తాం నగ్న
ఉన్మత్తవన్నృపః ।
విలపన్నన్వగాజ్జాయే ఘోరే తిష్ఠేతి విక్లవః ॥ 5

పురూరవుడు దిగంబరుడై ఉన్మత్తునివలె తన్ను విడచి వెడలు ఊర్వశివెంట వికలుడై పరుగిడుచు ,,దేవీ! నిష్ఠురహృదయా! నిలువుము, పరుగిడవల దని దుఃఖింపసాగెను.

కామానతృప్తోఽనుజుషన్ క్షుల్లకాన్ వర్షయామినీః ।
న వేద యాంతీర్నాయాంతీరుర్వశ్యాకృష్టచేతనః ॥ 6

ఊర్వశి తన చిత్తమును హరింపగా పురూరవుడు నిరంతరము తుచ్ఛము లగువిషయముల ననుభవించుచున్నను పరితృప్తుడు కాజాలక పోయెను. ఇట్లెన్నియో సంవత్సరము లతడు రాత్రుల రాకపోకలను గమనింపలేకపోయెను.

## ఐల ఉవాచ

అహో మే మోహవిస్తారః కామకర్మలచేతసః ।
దేవ్యా గృహీతకంఠస్య నాయుఃఖండా ఇమే స్మృతాః ॥ 7

**పురూరవుడు పలికెను:** కామముచే దూషితమైన మనస్సు గలనా యీమోహంత విస్తరింతినది? ఏలయన, ఊర్వశిచే నాలింగనము చేసికొనబడిన (అనగా మహామోహముగల) నేను అహోరాత్రరూప మైనదా అయుర్దాయమును గుర్తింపలేకపోయితిని.

నాహం వేదాభినిర్ముక్తః సూర్యోవాభ్యుదితో౽ముయా ।
ముషితో వర్షపూగానాం బతాహాని గతాన్యుత ॥ 8

ఈ యూర్వశిచే వంచితుడనై నేను సూర్యుని ఉదయాస్తమయము లను గుర్తింపలేకపోయితిని. అయ్యో! ఇట్లు ఎన్నిదినములు, ఎన్ని సంవత్సరములు గడచిపోయినవియో కదా!

అహో మే ఆత్మసమ్మోహో యేనాత్మా
యోషితాం కృతః ।
క్రీడామృగశ్చక్రవర్తీ నరదేవశిఖామణిః ॥ 9

ఆహా! నా మనోమోహ మెంతటిది! దానివలన రాజశ్రేష్ఠుడను, చక్రవర్తిని అగునేను స్త్రీల చేతిలో క్రీడామృగము నైతినిగదా!

సపరిచ్ఛదమాత్మానం హిత్వా తృణమివేశ్వరమ్ ।
యాంతీం స్త్రియం చాన్వగమం నగ్నఉన్మత్తవ
ద్రుదన్ ॥ 10

రాజ్యాదులతో గూడిన నా యీచక్రవర్తిత్వమును గడ్డిపోచవలె వదలి ఉన్మత్తునివలె దిగంబరుడనై యేడ్చుచు, వెడలిపోవుచున్న ఆ యూర్వశి వెంటబడితిని

కుతస్తస్యానుభావః స్యాత్తేజ ఈశత్వమేవ వా ।
యోఽన్వగచ్ఛం స్త్రియం యాంతీం ఖరవత్
పాదతాడితః ॥ 11

పాదతాడిత మైనగాడిదవలె నేను వెడలిపోవుచున్న అయూర్వశి వెంటబడితిని. అట్టినాలో మాహాత్మ్యముగాని, తేజస్సుగాని, సర్వజన నియంతృత్వముగాని యెట్లుండును ?

కిం విద్యయా కిం తపసా కిం త్యాగేన శ్రుతేన వా ।
కిం వివిక్తేన మౌనేన స్త్రీభిర్యస్య మనో హృతమ్ ॥ 12

స్త్రీ యపహరించిన మనస్సుగలవాని విద్య, తపస్సు, సన్న్యాసము, అధ్యయనము, ఏకాంతవాసము లేదా వికాసము — సర్వము వ్యర్థమే.

స్వార్థస్యాకోవిదం ధిఙ్మాం మూర్ఖం పండితమానినమ్ ।
యోఽహమీశ్వరతాం ప్రాప్య స్త్రీభిర్గోఖరవజ్జితః ॥ 13

సర్వజన నియంతృత్వమును బొందియు నేను గోవువలె, గాడిదవలె స్త్రీకి వశుడనైతిని. శ్రేయస్సును దెలిసికొననివాడను, పండితుడనని యహంకరించువాడను నగునా వంటి మూర్ఖు డెవడున్నాడు ?

సేవతో వర్షపూగాన్ మే ఉర్వశ్యా అధరాసవమ్ ।
న తృప్యత్యాత్మభూః కామో వహ్నిరాహుతి
భిర్యథా ॥ 14

ఆహుతిచే నగ్ని శమింపక యింకను ఎక్కువగ వృద్ధిపొందునట్లు బహువత్సరములు ఊర్వశి యధరామృతమును పానముచేసినను నా కామము తృప్తిపొందలేదు. పైగా నది మిక్కిలిగ వృద్ధిపొందినది.

పుంశ్చల్యాపహృతం చిత్తం కోఽన్వన్యో మోచితుం ప్రభుః।
ఆత్మారామేశ్వరమృతే భగవంతమధోక్షజమ్ ॥ 15

కులట యగు స్త్రీచే నపహృత మగు చిత్తమును మరల్చుటకు లేదా విముక్తము చేయుటకు ఆత్మారాములకు నారాధ్యుడైన అధోక్షజ భగవానుడు కాక ఇతరు డెవడు సమర్థు డగును

బోధితస్యాపి దేవ్యా మే సూక్తవాక్యేన దుర్మతేః ।
మనోగతో మహామోహో నాపయాత్యజితాత్మనః ॥ 16

ఊర్వశి యుక్తియుక్తము లగు వాక్కులతో నా కెంతగనో బోధ చేసినప్పటికిని, అజితేంద్రియుడను, దుర్మతిని నగునా మనోగతమగు మోహ మేమాత్రమును దొలగలేదు.

కిమేతయా నోఽపకృతం రజ్జ్వా వా సర్పచేతసః ।
ద్రష్టుః స్వరూపావిదుషో యోఽహం
యదజితేంద్రియః ॥ 17

ఊర్వశి నాకేమి యపకారము చేసినది? ఏ వ్యక్తియైన భ్రాంతివలన రజ్జువును సర్పముగా భావించి భయపడినచో నది రజ్జుదోషము గాదు అట్లే నేనుగూడ అజితేంద్రియుడ నగుటవలన స్వయముగ దోషినైతిని.

క్వాయం మలీమసః కాయో దౌర్గంధ్యాద్యాత్మకోఽశుచిః।
క్వ గుణాః సౌమనస్యాద్యా హ్యధ్యాసోఽవిద్యయా
కృతః ॥ 18

అతిదుర్గంధవిశిష్టము, అశుచియుక్తము, అతిమలినము నగు నీ స్త్రీ శరీర మెచ్చట? సౌకుమార్యము, సౌందర్యము, సౌగంధ్యము నగు పుష్ప గుణము లెక్కడ? కనుక ఇది యంతయు అజ్ఞానకృత మగునారోపమే. (అనగా నేను అజ్ఞానమువలన అట్టి యూర్వశి దేహముపై ఆ విధమగు గుణముల నారోపించితిని),

పిత్రోః కింస్వం ను భార్యాయాః స్వామినోఽగ్నేః
శ్వగృధ్రయోః ।
కిమాత్మనః కిం సుహృదామితి యో నావసీయతే ॥ 19

ఈ శరీరము తల్లిదండ్రులకు సంబంధించినదియా లేక భార్య సంపదయా? ఇది యజమాని కొన్న వస్తువా? అగ్ని కింధనమా? లేదా కుక్కలకు గ్రద్దలకు ఆహారమా? ఇది తనదియా లేక మిత్రులకు సంబంధించినదియా? ఎంతగ నాలోచించినను దీని నెవ్వరు నిర్ణయింపలేక పోవుచున్నారు.

తస్మిన్ కలేవరేఽమేధ్యే తుచ్ఛనిష్ఠే విషజ్జతే ।
అహో సుభద్రం సునసం సుస్మితం చ
ముఖం స్త్రియాః ॥ 20

మలమూత్రవిశిష్టము, అపవిత్రము నగు నీ స్త్రీదేహముపై జనులు మోహమును జూపుచుందురు. 'ఆహా! ఈ స్త్రీ ముఖ మెంత సుందరమైనది, నాసిక యెంత చక్కగ నున్నది, ఈమె చిరునవ్వు ఎంత మనోహరముగ నున్నది' యని వర్ణించుచుందురు.

త్వఙ్మాంసరుధిరస్నాయుమేదోమజ్జాస్థిసంహతౌ ।
విణ్మూత్రపూయే రమతాం కృమీణాం కియదంతరమ్॥ 21

చర్మము, మాంసము, రక్తము, స్నాయువు, మేదస్సు, మజ్జ, ఎముకలు, మలము, మూత్రము, చీము— అనువానితో గూడిన శరీరమునందు రమించువారికి, ఆ మలమూత్రములయందుండు క్రిములకు తేడా యేమి యున్నది ?

అథాపి నోపసజ్జేత స్త్రీషు స్త్రైణేషు చార్థవిత్ ।
విషయేంద్రియసంయోగాన్మనః క్షుభ్యతి నాన్యథా ॥ 22

అందువలన వివేకవంతు డగుమానవుడు స్త్రీలతోను, స్త్రీలంపటులతోను నెప్పుడును సహవాసము చేయరాదు. విషయేంద్రియసంయోగమువలన మనస్సు చంచలమగునుగాని ఇతరమైనవానిచేత గాదు.

అదృష్టాదశ్రుతాద్భావాన్న భావ ఉపజాయతే ।
అసంప్రయుంజతః ప్రాణాన్ శామ్యతి స్తిమితం మనః॥ 23

కనబడని, వినబడని పదార్థములవలన మన స్సెప్పుడు కలత చెందదు. అందువలన నింద్రియములను నిగ్రహించుకొనిన వానిమనస్సు నిశ్చలమై శాంతమగును.

తస్మాత్సంగో న కర్తవ్యః స్త్రీషు స్త్రైణేషు చేంద్రియైః ।
విదుషాం చాప్యవిస్రబ్ధః షడ్వర్గః కిము మాదృశామ్ ॥ 24

అందువలన నింద్రియములద్వారా స్త్రీలతోను, స్త్రీలంపటులతోడను, సహవాసము చేయరాదు జ్ఞానులకే పంచజ్ఞానేంద్రియములు, మనస్సు అనుషడ్వర్గముపై విశ్వాసము లేదు, ఇక నావంటివారి విషయము చెప్పనేల ?

## శ్రీ భగవానువాచ

ఏవం ప్రగాయన్ నృపదేవదేవః
స ఉర్వశీలోకమథో విహాయ ।

ఆత్మానమాత్మన్యవగమ్య మాం వై
ఉపారమత్ జ్ఞానవిధూతమోహః ॥ 25

భగవానుడు పలికెను: రాజశ్రేష్ఠు డగు పురూరవుడు ఈ విధముగ జెప్పి యూర్వశీలోకమును విడచెను. పిమ్మట యతడు మనస్సులో పరమాత్ముడ నగు నన్ను దెలిసికొనెను. అజ్ఞానమువలన వాని మోహమంతయు దొలగెను, మనస్సు శాంతిని బొందెను.

తతో దుస్సంగముత్సృజ్య సత్సు సజ్జేత బుద్ధిమాన్ ।
సంత ఏవాస్య ఛిందంతి మనోవ్యాసంగముక్తిభిః ॥ 26

అందువలన బుద్ధిమంతు డగు వ్యక్తి దుష్టసాంగత్యమును వదలి సత్సాంగత్యమునునం దాసక్తుడు కావలెను. సత్పురుషులు తమ సదుపదేశములచే జీవుల మనోవ్యాసంగమును అనగా మనస్సునకు విరుద్ధ మగు నాసక్తిని నాశనము చేయుదురు.

సంతోఽనపేక్షా మచ్చిత్తాః ప్రశాంతాః సమదర్శినః ।
నిర్మమా నిరహంకారా నిర్ద్వంద్వా నిష్పరిగ్రహాః ॥ 27

సత్పురుషులు నిష్కాములు, నాయందు మనస్సుగలవారు, ప్రశాంతులు, సమదర్శులు, మమత్వబుద్ధిరహితులు, అహంకారశూన్యులు, అపరిగ్రహులు అనగా నెట్టివస్తువును స్వీకరింపనివారు.

తేషు నిత్యం మహాభాగ మహాభాగేషు మత్కథాః ।
సంభవంతి హితా నృణాం జుషతాం
ప్రపునంత్యఘమ్ ॥ 28

మహాభాగుడ వగు నుద్ధవా! ఆట్టి మహాత్ము లెప్పుడును నా కథ

లను కీర్తించుచుందురు. అకథలు శ్రద్ధతో వినినమానవుల పాపముల నన్నింటిని నాశనముచేయును.

తా యే శృణ్వంతి గాయంతి హ్యనుమోదంతి చాదృతాః।
మత్పరాః శ్రద్ధధానాశ్చ భక్తిం విందంతి తే మయి ॥ 29

ఆదరముగను, శ్రద్ధగను, నా లీలలను వినిన కీర్తించిన అనుమోదించిన మానవులు నాయందాసక్తిగలవారై నా భక్తిని బొందుదురు.

భక్తిం లబ్ధవతః సాధోః కిమన్యదవశిష్యతే ।
మయ్యనంతగుణే బ్రహ్మణ్యానందానుభవాత్మని ॥ 30

అనంతగుణములకు నిలయుడను, చిదానందమయుడను, పరబ్రహ్మస్వరూపుడను నగునాయందు భక్తిగలిగి యున్నవానికి ఇంక పొందదగిన వస్తు వేదియు లోకములో లేదు.

యథోపశ్రయమాణస్య భగవంతం విభావసుమ్ ।
శీతం భయం తమోఽప్యేతి సాధూన్ సంసేవతస్తథా॥ 31

అగ్నిదేవు నాశ్రయించిన శైత్యము, భయము, అంధకారము నాశన మగునట్లు సత్పురుషుల నాశ్రయించిన జీవునకు కర్మజడత్వము, సంసారభయము, సంసారమూలక మగునజ్ఞానము నాశనమగును,

నిమజ్జ్యోన్మజ్జతాం ఘోరే భవాబ్ధౌ పరమాయనమ్ ।
సంతో బ్రహ్మవిదః శాంతా నౌర్దృఢేవాప్సు
మజ్జతామ్ ॥ 32

నీటియందు మునిగిన వ్యక్తులు దృఢ మగునౌక నాశ్రయించినట్లు భయంకర మగునీ సంసారసముద్రమున మునుగుచు తేలుచు నున్నమానవులు శాంతచిత్తులు, బ్రహ్మవేత్తలు నగుసత్పురుషుల నాశ్రయింపవలెను.

అన్నం హి ప్రాణినాం ప్రాణ ఆర్తానాం శరణం త్వహమ్ ।
ధర్మో విత్తం నృణాం ప్రేత్య సంతోఽర్వాగ్బి
భ్యతోఽ రణమ్ ॥ 33

అన్నము ప్రాణులకు జీవనము. ఆర్తులకు రక్షకుడను నేను ధర్మము పరలోకమున మానవులకు ధనము. అట్లే సత్పురుషులు సంసారమున బడి భయపడువ్యక్తులకు పరమరక్షకులు.

సంతో దిశంతి చక్షూంషి బహిరర్కః సముత్థితః ।
దేవతా బాంధవాః సంతః సంత ఆత్మాహమేవ చ ॥ 34

చక్కగా నుదయించి సూర్యుడు జగత్తును జూచుటకు మానవుల నేత్రములకు వెలుగును గలుగజేసినట్లు సత్పురుషులు భగవానుని దర్శించుటకు జీవులకు జ్ఞానచక్షువుల నిత్తురు. అట్టి సత్పురుషులే జీవులకు దేవతలు, బంధువులు, ఆత్మయు నై యున్నారు. స్వయముగ నేనే సత్పురుషుని రూపమున నున్నాను.

వైతసేన స్తతోఽప్యేవమూర్వశ్యా లోకనిస్పృహః ।
ముక్తసంగో మహీమేతామాత్మారామశ్చచార హ॥ 35

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే పారమహంస్యాం
సంహితాయాం వైయాసిక్యా మేకాదశ స్కంధే
శ్రీ భగవదుద్ధవ సంవాదే ఐలగీతంనామ
షడ్వింశోఽధ్యాయః

ఈవిధముగ పురూరవుడు ఊర్వశీ సందర్శనేచ్ఛ లేనివాడై గత్యమువలన ముక్తసంగుడై, ఆత్మారాముడై ఈభూమియందు రించెను.

ఇది శ్రీ మద్భాగవత మహాపురాణము నందలి
ఏకాదశ స్కంధములోని ఇరువదియారవ
అధ్యాయము సమాప్తము.

# ఇరువదియేడవ అధ్యాయము

## క్రియాయోగ వర్ణనము

### ఉ ద్ధ వ ఉ వా చ

క్రియాయోగం సమాచక్ష్వ భవదారాధనం ప్రభో ।
యస్మాత్త్వాం యే యథార్చంతి సాత్వతాః సాత్వతర్షభ॥ 1

**ఉద్ధవుడు పలికెను:** భక్తజనాశ్రయా! దేవా! ఏభక్తులు ఏయదిష్ఠానమువలన ఏవిధముగ నిన్నర్చింతురో, నీ యారాధనరూపమైననా క్రియాయోగమును వివరింపుము.

ఏతద్వదంతి మునయో ముహుర్నిశ్శ్రేయసం నృణామ్ ।
నారదో భగవాన్ వ్యాస ఆచార్యోఽంగిరసస్సుతః ॥ 2

నారదుడు, వ్యాసభగవానుడు, దేవతలకాచార్యు డగుబృహస్పతి మున్నగు మహర్షులు నీ యర్చనమే మానవులకు నిశ్శ్రేయసమును గలిగించునట్టి దనిమాటిమాటికి జెప్పుచున్నారు.

నిస్సృతం తే ముఖాంభోజాద్యదాహ భగవానజః ।
పుత్రేభ్యో భృగుముఖ్యేభ్యో దేవ్యై చ భగవాన్ భవః॥ 3

ఈక్రియాయోగము మొదట నీ ముఖారవిందమునుండి వెలువడినది. నీనుండి గ్రహించి, దానిని బ్రహ్మదేవుడు తన కుమారు లగు భృగువు మున్నగు మహర్షులకు బోధించెను. పిమ్మట భగవాను డగు శంకరుడు తన భార్యయగుపార్వతికి బోధించెను.

ఏతద్వై సర్వవర్ణానా మాశ్రమాణాం చ సమ్మతమ్ ।
శ్రేయసాముత్తమం మన్యే స్త్రీశూద్రాణాం చ మానద॥ 4

మానదా। నీ యీ యుపాసనయె సర్వవర్ణములవారికి, సర్వాశ్రమములలో నున్నవారికి, స్త్రీశూద్రులకు సర్వశ్రేష్ఠ మగుశ్రేయస్సాధన మని తలంచుచున్నాను.

ఏతత్కమలపత్రాక్ష కర్మబంధవిమోచనమ్ ।
భక్తాయ చానురక్తాయ బ్రూహి విశ్వేశ్వరేశ్వర ॥ 5

కమలనయనా ! విశ్వేశ్వరేశ్వరా ! నీ భక్తులము, అనురక్తులము నగుమాకీకర్మబంధమునుండి విముక్తిని బొందు నుపాయమును జెప్పుము.

## శ్రీ భగవానువాచ.

న హ్యంతోఽనంతపారస్య కర్మకాండస్య చోద్ధవ ।
సంక్షిప్తం వర్ణయిష్యామి యథావదనుపూర్వశః ॥ 6

భగవానుడు పలికెను:- ఉద్ధవా ! అనంతపార మైనకర్మకాండకు అంతము లేదు. అందువలన పూర్వాపరక్రమముతో యథావిధిగ సంక్షిప్తముగ వర్ణింతును.

వైదికస్తాంత్రికో మిశ్ర ఇతి మే త్రివిధో మఖః ।
త్రయాణామీప్సితేనైవ విధినా మాం సమర్చయేత్ ॥ 7

నా పూజ వైదికము, తాంత్రికము, మిశ్రము ననిమూడు విధములు. ఈ మూడువిధములలో పురుషుడు తన కభీష్ట మగువిధి ననుసరించి నన్నర్చింపవలెను.

యదా స్వనిగమేనోక్తం ద్విజత్వం ప్రాప్య పూరుషః ।
యథా యజేత మాం భక్త్యా శ్రద్ధయా తన్నిబోధ మే॥ 8

త్రైవర్ణికు డగుపురుషుడు మొదట తన యధికారము ననుసరించి శాస్త్రోక్తవిధిగ తగిన కాలమున ఉపనయనసంస్కారమును బొంది, శ్రద్ధాభక్తులతో నన్నర్చింపవలెను. ఈవిధానమును జెప్పెదను శ్రద్ధగ వినుము.

అర్చాయాం స్థండిలేఽగ్నౌ వా సూర్యే వాప్సు
హృది ద్విజః ।
ద్రవ్యేణ భక్తియుక్తోఽర్చేత్ స్వగురుం
మామమాయయా ॥ 9

ద్విజుడు భక్తి యుక్తుడై ప్రతిమాదులయందు, భూమియందు, అగ్నియందు, సూర్యునియందు, జలమునందు లేదా తనహృదయము నందు విధ్యుక్త మైనఉపచారములద్వారా కాపట్యమును విడచి తన కిష్ట దేవస్వరూపుడ నగునన్ను పూజింపవలెను.

పూర్వం స్నానం ప్రకుర్వీత ధౌతదంతోఽంగశుద్ధయే ।
ఉభయైరపి చ స్నానం మంత్రైర్మృద్గ్రహణాదినా ॥ 10

పురుషుడు దంతధావనము చేసి, దేహశుద్ధికై స్నానము చేయ వలెను. పిమ్మట వైదిక తాంత్రిక మంత్రములద్వారా (దేహమునందు) మృత్తికాదిలేపనములతో స్నానము చేయవలెను.

సంధ్యోపాస్త్యాదికర్మాణి వేదేనాచోదితాని మే ।
పూజాం తైః కల్పయేత్సమ్యక్సంకల్పః కర్మపావనీమ్ ॥ 11

తమకు విహితము లైనవేదోక్తకర్మల నాచరించి మానవులు పర మేశ్వరునియందు భక్తికలిగి కర్మపాశములను దెగ్రించు నాపూజ నను ష్ఠింపవలెను.

శైలీ దారుమయీ లౌహీ లేప్యా లేఖ్యా చ సైకతీ।
మనోమయీ మణిమయీ ప్రతిమాఽష్టవిధా స్మృతా॥ 12

శిలామయము, దారుమయము (కొయ్యతో చేయబడినది), లోహమయము (సువర్ణాది ధాతువులచే చేయబడినది), లేప్యము (మృత్తిక చందనము మున్నగువానిచే నిర్మితమైనది), లేఖ్యము (చిత్రమయము), ఇసుకచే నిర్మితము, మనోమయము, మణిమయము ననినా ప్రతిమ యెనిమిది విధములుగా శాస్త్రములయందు జెప్పబడినది.

చలాచలేతి ద్వివిధా ప్రతిష్ఠా జీవమందిరమ్ ।
ఉద్వాసావాహనే న స్తః స్థిరాయాముద్ధవార్చనే ॥ 13

ఉద్ధవా ! చలము, అచలము నను భేదముతో నుండుప్రతిమయె భగవానుడ నగునాకు మందిరమైయున్నది. అచలప్రతిమను పూజించునపుడు ప్రతిదినము దానికి ఆవాహనవిసర్జనము లుండవు

అస్థిరాయాం వికల్పస్స్యాత్ స్థండిలే తు భవేద్ద్వయమ్ ।
స్నపనం త్వవిలేప్యాయామన్యత్ర పరిమార్జనమ్ ॥ 14

అస్థిరప్రతిమయందు గొన్నిచోట్ల ఆవాహన విసర్జనము లుండును. కొన్నిచోట్ల యుండవు స్థండిలమునందు రెండును నుండును మృత్తికామయము, చిత్రమయముగాని యితరప్రతిమను నీటిచే స్నానము చేయింపవలెను. కాని పైనచెప్పబడిన రెండుప్రతిమలను కేవలము తుడువవలెను.

ద్రవ్యైః ప్రసిద్ధైర్మద్యాగః ప్రతిమాదిష్వమాయినః।
భక్తస్య చ యథాలబ్ధైః హృది భావేన చైవ హి ॥ 15

ప్రసిద్ధపదార్థములచే ప్రతిమాదులయందు నా పూజ జరుపబడును. నిష్కాము డైనభక్తుడు అనాయాసముగ లభించిన పదార్థములతోను, భావనామాత్రముగను నన్ను బూజించును.

స్నానాలంకరణం ప్రేష్ఠమర్చాయామేవ తూద్ధవ ।
స్థండిలే తత్త్వవిన్యాసో వహ్నావాజ్యాప్లుతం హవిః ॥ 16

ఉద్ధవా ! ప్రతిమాదులకు స్నానాలంకరణముల నర్పించుట నాకు మిగుల యిష్టము. మృత్తికాదివేకలయందు పూజ చేయదలచిన ఆ యా మంత్రములద్వారా అంగప్రధానదేవతలను యథాస్థానమున బూజింపవలెను. అగ్నిని ఘృతసిక్తము లైనతిలలతోను, చరుప్రభృతి ద్రవ్యములతోను బూజింపవలెను.

సూర్యే చాభ్యర్హణం ప్రేష్ఠం సలిలే సలిలాదిభిః ।
శ్రద్ధయోపాహృతం ప్రేష్ఠం భక్తేన మమ వార్యపి ॥ 17

సూర్యునకు అర్ఘ్యాదిదానము ప్రియము, జలమునందు తర్పణాదులచే నన్నుపాసింపవలెను, భక్తుడు శ్రద్ధతో సమర్పించిన జలము కూడ నాకు ప్రియమే యగును.

భూర్యప్యభక్తోపహృతం న మే తోషాయ కల్పతే ।
గంధో ధూపః సుమనసో దీపోఽన్నాద్యం చ కిం పునః ॥ 18

భక్తుడు గానివా డెన్నిపదార్థముల సమర్పించినను నాకు సంతుష్టి కలుగదు. ఎక్కువ చెప్పనేల, భక్తుడు శ్రద్ధతో సమర్పించిన గంధ, ధూప, పుష్ప దీప నైవేద్యములకే మిక్కిలి తృప్తిచెందుచున్నాను.

శుచి సంభృతసంభారః ప్రాగ్దర్భైః కల్పితాసనః ।
ఆసీనః ప్రాగుదగ్వార్చేదర్చాయామథ సమ్ముఖః ॥ 19

పురుషుడు శుచియై పూజాసామగ్రిని సంగ్రహించి తూర్పు దిక్కున కొన లుండునట్లుగ దర్భాసనమును బరచి, తూర్పు దిక్కు ముఖము కలవాడై గాని ఉత్తరదిక్కు ముఖముగలవాడై గాని స్థిరప్రతిమ కెదురుగ గూర్చుండి పూజింపవలెను.

కృతన్యాసః కృతన్యాసాం మదర్చాం
పాణినాఽఽమృజేత్
కలశం ప్రోక్షణీయం చ యథావదుపసాధయేత్ ॥ 20

(మొదట గురువునకు నమస్కరించి, ఆయన ఆదేశమును బొంది) అంగన్యాసకరన్యాసముల జేసి, పిమ్మట విగ్రహమునందు మంత్రన్యాసము చేయవలెను. చేతిలో ప్రతిమ పైనున్న నిర్మాల్యమును దొలగింపవలెను, ప్రోక్షణార్థమై జలపూర్ణకుంభమును యథావిధిగ చందన పుష్పాదులచే సంస్కరింపవలెను.

తదద్భిర్దేవయజనం ద్రవ్యాణ్యాత్మానమేవ చ ।
ప్రోక్ష్య పాత్రాణి త్రీణ్యద్భిస్తైస్తైర్ద్రవ్యైశ్చ
సాధయేత్ ॥ 21

ప్రోక్షణపాత్రములోని జలముతో పూజాస్థానమును, పూజాద్రవ్యమును, తన దేహమును ప్రోక్షించి పాద్యాదులకై జలపూర్ణము లగు మూడుకలశములను గంధపుష్పాదులచే నలంకరింపవలెను.

పాద్యార్ఘ్యాచమనీయార్థం త్రీణి పాత్రాణి దైశికః ।
హృదా శీర్ష్ణాథ శిఖయా గాయత్ర్యా
చాభిమంత్రయేత్ ॥ 22

పూజకుడు పాద్యము, ఆచమనీయము, అర్ఘ్యము అనువాని

నిమిత్తము స్థాపింపబడిన మూడు పాత్రలను క్రమముగ హృదయమంత్రముతోను, శిరోమంత్రముతోను, శిఖామంత్రముతోను, గాయత్రీమంత్రముతోను సంస్కరింపవలెను.

పిండే వాయ్వగ్నిసంశుద్ధే హృత్పద్మస్థాం పరాం మమ ।
అణ్వీం జీవకలాం ధ్యాయేన్నాదాంతే సిద్ధభావితామ్ ॥ 23

అనంతరము దేహమును కాష్ఠగతమైనవాయువుచే శోధించి, ఆధారగత మగునగ్నిచే దగ్ధముచేసి, లలాటస్థిత మగుచంద్రమండలములోని అమృతప్లావనముద్వారా మరల అమృతమయముగా జేసి నాదాంతమున (అనగా ఓంకారములోని అకార-ఉకార-మకార-బిందు-నాదము లను నైదంశముల చివర) సిద్ధభావితము, హృదయకమలస్థము, సూక్ష్మాకారము, శ్రేష్ఠము నగునా జీవకళను అనగా శ్రీనారాయణమూర్తిని ధ్యానింపవలెను.

తయాఽఽత్మభూతయా పిండే వ్యాప్తే సంపూజ్య తన్మయః ।
ఆవాహ్యార్చాదిషు స్థాప్య న్యస్తాంగం మాం పరిపూజయేత్ ॥ 24

ఆత్మరూపముచే చింతితమైనమూర్తిద్వారా దేహము వ్యాప్తము కాగా, దానిని మానసికోపచారములచే పూజించి, తన్మయభావముతో ప్రతిమాదులయందు నన్నావాహనచేసి స్థాపింపవలెను. పిమ్మట మంత్రములచే అంగన్యాసముచేసి నన్ను పూజింపవలెను.

పాద్యోపస్పర్శార్హణాదీనుపచారాన్ ప్రకల్పయేత్ ।
ధర్మాదిభిశ్చ నవభిః కల్పయిత్వాఽఽసనం మమ ॥ 25

పద్మమష్టదళం తత్ర కర్ణికా కేసరోజ్జ్వలమ్ ।
ఉభాభ్యాం వేదతంత్రాభ్యాం మహ్యాం
తూభయసిద్ధయే ॥ 26

ధర్మజ్ఞానములతోను, నవవిధశక్తులతోను నా కాసనమును గల్పించి దానియందు కర్ణికచేత, కేసరములచేత సముజ్జ్వల మగునష్టదళపద్మమును గల్పింపవలెను. భోగమోక్షసిద్ధికై వేదోక్తములు తంత్రోక్తములు నగు ద్వివిధమంత్రములద్వారా పాద్యము, అర్ఘ్యము, ఆచమనీయము మున్నగు నుపచారముల నర్పింపవలెను.

సుదర్శనం పాంచజన్యం గదాసీషుధనుర్హలాన్ ।
ముసలం కౌస్తుభం మాలాం శ్రీవత్సం
చానుపూజయేత్ ॥ 27

నన్ను పూజించిన పిమ్మట సుదర్శనమును, పాంచజన్యమును, గదను, ఖడ్గమును, బాణమును, ధనుస్సును, హలమును, ముసలమును, కౌస్తుభమాలను, శ్రీవత్సమును పూజింపవలెను.

నందం సునందం గరుడం ప్రచండం చండమేవ చ ।
మహాబలం బలంచైవ కుముదం కుముదేక్షణమ్ ॥ 28

పిమ్మట ఎనిమిదిదిక్కులయందు నందుడు, సునందుడు, ప్రచండుడు, చండుడు, మహాబలుడు, బలుడు, కుముదుడు, కుముదేక్షణుడు—అను నెనిమిదిమంది పార్షదులను, ఎదుట గురుడుని పూజింపవలెను.

దుర్గాం వినాయకం వ్యాసం విష్వక్సేనం గురూన్ సురాన్ ।
స్వే స్వే స్థానే త్వభిముఖాన్ పూజయేత్
ప్రోక్షణాదిభిః ॥ 29

నాలుగు కోణములయందు దుర్గను, వినాయకుని, వ్యాసుని, విష్వక్సేనుని ; ఎడమవైపున గురువులను, తూర్పుమున్నగు దిక్కుల యందు ఇంద్రాదిలోకపాలురను నుంచి ప్రోక్షణాదులచే పూజింపవలెను. వీ రందఱు తమ తమ స్థానములయం దుండి యిష్టదేవత కభిముఖముగా నున్నా రనిభావింపవలెను.

చందనోశీరకర్పూరకుంకుమాగరువాసితైః ।
సలిలైః స్నాపయేన్మంత్రైర్నిత్యదా విభవే సతి ॥ 30

స్వర్ణఘర్మానువాకేన మహాపురుషవిద్యయా ।
పౌరుషేణాపి సూక్తేన సామభీ రాజనాదిభిః ॥ 31

సంపద యున్న ప్రతిదినము సువర్ణఘర్మాదిమంత్రములను ‹జితతే పుండరీకాక్ష' మొదలగు మంత్రములను, 'సహస్రశీర్షాపురుషః' మొదలగు పురుషసూక్తమంత్రములను, ‹ఇంద్రం నరో నేమధితా హవంత'మున్నగు మంత్రోక్తరాజనాదిసామములను పఠించుచుచందనము, వట్టివేరు, కర్పూరము, కుంకుమము, అగరు మున్నగుద్రవ్యములచే సువాసిత మైనజలముతో స్నానము చేయింపవలెను,

వస్త్రోపవీతాభరణపత్రస్రగ్గంధలేపనైః ।
అలంకుర్వీత సప్రేమ మద్భక్తో మాం యథోచితమ్ ॥ 32

నా భక్తుడు నన్ను వస్త్రము, ఉపవీతము, ఆభరణము, పత్రరచన తులసీమాల, పుష్పమాల, గంధము, అనులేపనము అనువానిద్వారా ప్రేమతో దగినవిధముగ నలంకరింపవలెను,

పాద్యమాచమనీయం చ గంధం సుమనసోఽక్షతాన్ ।
ధూపదీపోపహార్యాణి దద్యాన్మే శ్రద్ధయార్చకః ॥ 33

అర్చకుడు శ్రద్ధతో పాద్యము, ఆచమనీయము, గంధము, పుష్పము, అక్షతలు, ధూపము, దీపము మున్నగు నుపకరణాదులను నా కర్పింపవలెను,

గుడపాయససర్పింషి శష్కుల్యాపూపమోదకాన్ ।
సంయావదధిసూపాంశ్చ నైవేద్యం సతి కల్పయేత్ ॥ 34

వీలైనచో బెల్లము, పాయసము, నేతితో వండినపదార్థములు, చక్కిలములు, అపూపములు, ఉండ్రాళ్ళు, యవాన్నము, పెరుగు, పప్పు మున్నగు ద్రవ్యములను నాకు నివేదింపవలెను.

అభ్యంగోన్మర్దనాదర్శదంతధావాభిషేచనమ్ ।
అన్నాద్యగీతనృత్యాని పర్వాణి స్యురుతాన్వహమ్ ॥ 35

పర్వదినములయందు లేదా వీలున్న ప్రతిదినము భగవద్విగ్రహమునకు అభ్యంగనమును, ఉన్మర్దనమును, అద్దమును, దంతకాష్ఠమును, అభిషేకద్రవ్యమును, అన్నవ్యంజనాదిభక్ష్యద్రవ్యములను అర్పించి నృత్యగీతాదుల సల్పవలెను,

విధినా విహితే కుండే మేఖలాగర్తవేదిభిః ।
అగ్నిమాధాయ పరితః సమూహేత్ పాణినోదితమ్ ॥ 36

వేదోక్తమగువిధి ననుసరించి నిర్మితములైనమేఖలాగర్తవేదికలచే సుశోభిత మగుకుండమున అగ్నిని ప్రజ్వరిల్లజేసి చేతితో దాని నొకచోట ప్రోగుచేయవలెను,

పరిస్తీర్యాథ పర్యుక్షేదన్వాధాయ యథావిధి ।
ప్రోక్షణ్యాఽఽసాద్య ద్రవ్యాణి ప్రోక్ష్యాగ్నౌ
భావయేత మామ్ ॥ 37

అనంతరము దర్భలను పరచి, యథావిధిగ సమిధల నుంచుట

యనుఅన్వాధానకర్మను జేసి, హోమమున కుపయోగపడు ద్రవ్యములను అగ్ని కుత్తరదిక్కున నుంచి, ప్రోక్షణపాత్రమునం దున్నజలముచే వానిని ప్రోక్షించి, అగ్నియందు నన్ను ధ్యానింపవలెను.

తప్తజాంబూనదప్రఖ్యం శంఖచక్రగదాంబుజైః ।
లసచ్చతుర్భుజం శాంతం పద్మకింజల్కవాససమ్ ॥ 38

స్ఫురత్కిరీటకటకకటిసూత్రవరాంగదమ్ ।
శ్రీవత్సవక్షసంభ్రాజత్కౌస్తుభం వనమాలినమ్ ॥ 39

ధ్యాయన్నభ్యర్చ్య దారూణి హవిషాభిఘృతాని చ ।
ప్రాస్యాజ్యభాగావాఘారౌ దత్త్వా చాజ్యప్లుతం
హవిః ॥ 40

జుహుయాన్మూలమంత్రేణ షోడశర్చావదానతః ।
ధర్మాదిభ్యో యథాన్యాయం మంత్రైః స్విష్టకృతం
బుధః ॥ 41

తరువాత అగ్నియందు తప్తకాంచనవర్ణము, శంఖచక్రగదాపద్మలచే విరాజిల్లు చతుర్భుజయుక్తము, ప్రశాంతము, పద్మకేసరములవలె పచ్చనైన వస్త్రముచే శోభితము, ప్రకాశించు కిరీటకటకకటిసూత్రనూపుర సమన్వితము, శ్రీవత్సవక్షము, చక్కగ తేజరిల్లు కౌస్తుభమణిచే విరాజితము, వనమాలావిభూషితము నగు నా రూపమును ధ్యానించి పూజింపవలెను. పిమ్మట ఘృతసిక్తము లైనసమిధలను అగ్నియం దాహుతినీయవలెను. ఆఘారము, ఆజ్యభాగము నను రెండు రెం డాహుతులతో హవనము జేయవలెను. అనంతరము ఇంకను ఘృతసిక్తము లైన హవి

స్సుల నీయవలెను. అటుపిమ్మట 'ఓం నమో నారాయణాయ' యను అష్టాక్షరమంత్రముతోను, పురుషసూక్తమునందలి పదునారుమంత్రముల తోను హవనము చేయవలెను. బుద్ధిమంతు డగుపురుషుడు ధర్మాదిదేవత లకు యథావిధిగ స్వాహాన్తమంత్రములచే స్విష్టకృతమును హోమము చేయవలెను.

అభ్యర్చ్యాథ నమస్కృత్య పార్షదేభ్యో బలిం హరేత్ ।
మూలమంత్రం జపేద్బ్రహ్మ స్మరన్నారాయణా
త్మకమ్ ॥ 42

తరువాత అగ్నియందున్న భగవానుని పూజించి నమస్కరించి, నందాదులైన పార్షదులకు బలుల నీయవలెను. నారాయణస్వరూప మగు పరబ్రహ్మమును స్మరించి, యథాశక్తిగ మూలమంత్రమును జపింపవలెను.

దత్త్వాఽఽచమనముచ్ఛేషం విష్వక్సేనాయ కల్పయేత్ ।
ముఖవాసం సురభిమత్ తాంబూలాద్య
మథార్హయేత్ ॥ 43

తరువాత ఆచమనీయము నిచ్చి మిగిలిన నైవేద్యభాగమును విష్వ క్సేనున కర్పింపవలెను. సుగంధయుక్త మగు తాంబూలాదిముఖవాసమును, పుష్పాంజలిని సమర్పించి పూజింపవలెను.

ఉపగాయన్ గృణన్ నృత్యన్ కర్మాణ్యభినయన్మమ ।
మత్కథాః శ్రావయన్ శృణ్వన్ ముహూర్తం
క్షణికో భవేత్ ॥ 44

అనంతరము నా కథలను గానము చేయుచు, కీర్తించుచు, అన్యులకు వినిపించుచు, తాను స్వయముగా వినుచు, నా కర్మల నభినయించుచు,

నృత్యము చేయుచు, క్షణకాలము ఉత్సవమగ్నుడు కావలెను.

స్తవైరుచ్చావచైః స్తోత్రైః పౌరాణైః ప్రాకృతైరపి ।
స్తుత్వా ప్రసీద భగవన్నితి వందేత దండవత్ ॥ 45

ప్రాచీనులచేత, ప్రాకృతులచేత (తనచే) చేయబడిన ఉత్కృష్టాపకృష్టము లగుస్తోత్రములచే నన్ను స్తుతించి దేవా! ప్రసన్నుడవుక' మ్మని ప్రార్థించి సాష్టాంగ దండప్రణామము చేయవలెను.

శిరో మత్పాదయోః కృత్వా బాహుభ్యాం చ పరస్పరమ్।
ప్రపన్నం పాహి మామీశ భీతం మృత్యు
గ్రహార్ణవాత్ ॥ 46

నా పాదయుగళమునందు శిరము నుంచి దక్షిణవామ బాహువులచే నా దక్షిణ వామపాదములను స్పృశించి 'దేవా! భీతుడను, శరణాగతుడను నగు నన్ను మృత్యుగ్రహరూపమగు సంసారసముద్రమునుండి యుద్ధరింపు' మని పలికి నమస్కరింపవలెను

ఇతి శేషాం మయా దత్తాం శిరస్యాధాయ సాదరమ్ ।
ఉద్వాసయేచ్చేదుద్వాస్యం జ్యోతిర్జ్యోతిషి తత్పునః ॥ 47

ఇట్టి ప్రార్థనద్వారా నా నిర్మాల్యమును ఆదరముతో శిరస్సున ధరింపవలెను. విసర్జన చేయదలచిచో ప్రతిమయందు విన్యస్తమైనజ్యోతిని మరల తన హృదయస్థజ్యోతియందు లీనము చేయవలెను.

అర్చాదిషు యదా యత్ర శ్రద్ధా మాం తత్ర చార్చయేత్ ।
సర్వభూతేష్వాత్మని చ సర్వాత్మాహమవస్థితః ॥ 48

ప్రతిమాదులయం దెప్పు డెచట శ్రద్ధ కలుగునో అప్పు డాప్రతిమ

యందు నన్ను పూజింపవలెను. ఏలయన, నేను సర్వాంతర్యామి రూపముతో సర్వభూతములయందు, నా హృదయమునందు ఎల్లపుడు నున్నాను.

ఏవం క్రియాయోగపథైః పుమాన్ వైదికతాంత్రికైః ।
అర్చన్నుభయతస్సిద్ధిం మత్తో విందత్యభీప్సితామ్ ॥ 49

పురుష డిట్లు వైదికతాంత్రిక క్రియా యోగములద్వారా నన్ను పూజించి, నానుండి ఇహలోక పరలోకములయం దభిలషిత మైనసిద్ధిని బొందును.

మదర్చాం సంప్రతిష్ఠాప్య మందిరం కారయేద్దృఢమ్ ।
పుష్పోద్యానాని రమ్యాణి పూజాయాత్రోత్స
వాశ్రితాన్ ॥ 50

(శక్తి యున్నచో భక్తుడు) దృఢ మగుమందిరమును నిర్మించి దానియందు నా ప్రతిమను ప్రతిష్ఠింపవలెను. సుందరము లగుపుష్పోద్యానములను నెలకొల్పవలెను. పూజాయాత్రోత్సవాదులను జరుపవలెను.

పూజాదీనాం ప్రవాహార్థం మహాపర్వస్వథాన్వహమ్ ।
క్షేత్రాపణపురగ్రామాన్ దత్త్వా మత్సార్ష్టితా
మియాత్ ॥ 51

మహాపర్వములయందు, ప్రతిదినము పూజాదులను నిర్వహించుటకు భూమిని, అంగళ్ళను, పురములను, గ్రామాదులను దానము చేసి నాతో సమాన మైనఐశ్వర్యమును బొందును.

ప్రతిష్ఠయా సార్వభౌమం సద్మనా భువనత్రియమ్ ।
పూజాదినా బ్రహ్మలోకం త్రిభిర్మత్సామ్యతా
మియాత్ ॥ 52

విగ్రహప్రతిష్ఠచేత సార్వభౌమ పదవిని, మందిర నిర్మాణముచేత త్రిలోకాధిపత్యమును, పూజాదులచే బ్రహ్మలోకమును, మూడింటిచే నాతో సమానత్వమును బొందును

మామేవ నైరపేక్ష్యేణ భక్తియోగేన విందతి ।
భక్తియోగం స లభతే ఏవం యః పూజయేత
మామ్ ॥ 53

నిష్కామ భక్తియోగముచే నన్నర్చించువాడు నన్నే పొందును. వెనుక చెప్పినవిధితో నన్ను పూజించువాడు భక్తియోగమును బొందును.

యః స్వదత్తాం పరైర్దత్తాం హరేత సురవిప్రయోః ।
వృత్తిం స జాయతే విడ్భుగ్వర్షాణామయుతాయుతమ్ ॥ 54

స్వదత్తము లేదా పరదత్తము నగు దేవతావృత్తిని, బ్రాహ్మణ వృత్తిని హరించువాడు కోట్లకొలది సంవత్సరముల వఱకు మలమును భక్షించు క్రిమియై జన్మించును.

కర్తుశ్చ సారథేర్హేతోరనుమోదితురేవ చ ।
కర్మణాం భాగినః ప్రేత్య భూయో భూయసి
తత్ఫలమ్ ॥ 55

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే పారమహంస్యాం
సంహితాయాం ఏకాదశస్కంధే భగవదుద్ధవ
సంవాదే క్రియాయోగవర్ణనం నామ
సప్తవింశోఽధ్యాయః ॥

అపహరించువానికి గలుగు ఫలము, వానికి సహాయము చేయువానికి, వానిని ప్రేరేపించువానికి, ఆమోదించువానికి మరణానంతరము లభించును ఈ కార్యములయందు వారి భాగ మధికముగ నున్న ఫలము గూడ అధికముగనే యుండును.

ఇట్లు శ్రీమద్భాగవతమహాపురాణములోని ఏకాదశ
స్కంధములోని యిరువదియేడవ అధ్యాయము
సమాప్తము.



# ఇరువది యొనిమిదవ అధ్యాయము

## పరమార్థ నిరూపణము

### శ్రీ భగవానువాచ

పరస్వభావకర్మాణి న ప్రశంసేన్న గర్హయేత్ ।
విశ్వమేకాత్మకం పశ్యన్ ప్రకృత్యా పురుషేణ చ ॥ 1

భగవానుడు పలికెను :- ప్రకృతిపురుషులతోపాటు ఏకాత్మక మైనవిశ్వమును జూచుచు అనగా అంతర్యామి యగు పరమాత్మచే నియంత్రిత మైనదని తెలిసికొని ఇతరుల శాంతఘోరాదు లైనస్వభావములను కర్మలను నిందించుటగాని పొగడుటగాని చేయరాదు.

పరస్వభావకర్మాణి యః ప్రశంసతి నిందతి ।
స ఆశు భ్రశ్యతే స్వార్థాదసత్యభినివేశతః ॥ 2

ఇతరుల స్వభావములను కర్మలను నెవడు ప్రశంసించునో నిందించునో అత దసత్యమునం దభినివేశము గలవాడగుటవలన (అనగా దేహగృహాదులయం దాసక్తిగలవా డగుటవలన) శీఘ్రముగనె స్వార్థమునుండి (పరమాత్మాభినివేశ మనుస్వార్థమునుండి) భ్రష్టు డగును.

తైజసే నిద్రయాఽఽపన్నే పిండస్థో నష్టచేతనః ।
మాయాం ప్రాప్నోతి మృత్యుం వా తద్వన్నానార్థదృక్ పుమాన్ ॥ 3

తైజసములు (రాజసాహంకార కార్యము లైన ఇంద్రియములు ) నిద్రను బొందగా శరీరస్థుడగు జీవుడు మాయను (మనస్సుచే స్వప్నరూపమగు మాయను, తరువాత మనస్సు లయముకాగా) నష్టచేతనుడై మృత్యు

వును (మృత్యువుతో సమాన మగుసుషుప్త్యవస్థను) బొందును. అట్లే ద్వైతాభినివేశి యగు పురుషుడుగూడ విక్షేపమును లయమును బొందును.

కిం భద్రం కిమభద్రం వా ద్వైతస్యావస్తునః కియత్ ।
వాచోదితం తదనృతం మనసా ధ్యాతమేవ చ ॥ 4

అవస్తువై నద్వైతమునందు ఏది మంచిది ఏది చెడ్డది లేదా ఎంత మంచిది ఎంత చెడ్డది యను ప్రశ్నయే యుండదు కాని వాక్కులచే జెప్పబడిన మనస్సుచే చింతిత మైనవస్తువు లన్నియు మిథ్యాభూతములే యని తెలిసికొనవలెను.

ఛాయా ప్రత్యాహ్వయాభాసా హ్యసంతోఽప్యర్థకారిణః ।
ఏవం దేహాదయో భావా యచ్ఛంత్యామృత్యుతో
భయమ్ ॥ 5

ఛాయ, ప్రతిధ్వని, శుక్తి మున్నగు వానియందలి రజతాదుల అభ్యాసము మిథ్యయైగూడ భయమోహాద్యర్థకారక మగును. అట్లే దేహము మున్నగు ద్వైతవస్తువు లన్నియు మిథ్య యైనప్పటికిని మరణసమయ వఱకు లేదా ముక్తివఱకు జీవునకు సంసారభయమును కలుగజేయును.

ఆత్మైవ తదిదం విశ్వం సృజ్యతే సృజతి ప్రభుః ।
త్రాయతే త్రాతి విశ్వాత్మా హ్రియతే హరతీశ్వరః ॥ 6

ప్రభువు, విశ్వాత్ముడు, ఈశ్వరుడు నగు పరమాత్మ ఈ విశ్వమును ఆత్మగనే అనగా ఆత్మ కభిన్నరూపముగనే సృష్టించుచున్నాడు, స్వయముగ సృష్టియగుచున్నాడు. రక్షించుచున్నాడు, రక్షింపబడుచున్నాడు. హరించుచున్నాడు, హరింపబడుచున్నాడు.

తస్మాన్నహ్యాత్మనోఽన్యస్మాదన్యోభావో నిరూపితః
నిరూపితేయం త్రివిధా నిర్మూలా భాతిరాత్మని ।
ఇదం గుణమయం విద్ధి త్రివిధం మాయయా కృతమ్ ॥ 7

ఈసృష్టి యైనపదార్థము లన్నియు స్వతంత్రములు గావు అనగా పరమేశ్వరునికంటె అతిరిక్తము లైనవి కావు. కనుక ఆత్మయందు (జీవాత్మయందు) నిరూపితమైన ఆధ్యాత్మికాదిరూపజ్ఞానము భ్రాంతిరూపమైనది. ఏలయన, ఆధ్యాత్మికాది త్రిగుణమయత్వము మాయాకల్పిత మైనదని తెలిసికొనుము.

ఏతద్విద్వాన్ మదుదితం జ్ఞానవిజ్ఞాననైపుణమ్ ।
న నిందతి న చ స్తౌతి లోకే చరతి సూర్యవత్ ॥ 8

నే నుపదేశించిన ఈజ్ఞానవిజ్ఞానయుక్త మగువాక్యమును దెలిసికొనినవాడు లోకమున సూర్యునివలె సమభావాపన్నుడై మెలగును. అత డెవ్వరిని నిందింపడు స్తుతింపడు.

ప్రత్యక్షేణానుమానేన నిగమేనాత్మసంవిదా ।
ఆద్యంతవదసజ్జ్ఞాత్వా నిస్సంగో విచరేదిహ ॥ 9

ప్రత్యక్షానుమానములద్వారా, ఆత్మానుభూతిద్వారా, శాస్త్రముద్వారా ఈ జగత్తు ఉత్పత్తి వినాశశీలమైనది, మిథ్యయైనది యనితెలిసికొని నిస్సంగుడయి ప్రపంచమున సంచరింపవలెను.

ఉద్ధవ ఉవాచ

నైవాత్మనో న దేహస్య సంసృతిర్ద్రష్టృదృశ్యయోః ।
అనాత్మస్వదృశోరీశ కస్య స్యాదుపలభ్యతే ॥ 10

**ఉద్ధవుడు పలికెను:—** దేవా! ఆత్మ స్వతస్సిద్ధ జ్ఞాన సంపన్న మగుచేతనము, దేహము, జడము. అందువలన ఆత్మదేహ ముల రెండింటికి సుఖదుఃఖాద్యనుభవ ముండదు. అట్టి సమయమున నీ సుఖదుఃఖాద్యనుభవము ఎవనికి కనిపించును (లభించును).

ఆత్మావ్యయోఽగుణః శుద్ధః స్వయంజ్యోతిరనావృత, ।
అగ్నివద్దారువదచిద్దేహః కస్యేహ సంసృతిః ॥ 11

ఆత్మ నాశనము లేనిది, రాగాదిశూన్య మైనది, శుద్ధమైనది (పాప పుణ్యాది రహితమైనది), అగ్నివలె స్వప్రకాశమైనది, ఆవరణశూన్యమైనది, కాని దేహము కాష్ఠమువలె అచేతనమైనది, కనుక ఈ రెండింటిలో దేనికి సుఖదుఃఖాద్యనుభవ ముండును ?

## శ్రీ భగవానువాచ.

యావద్దేహేంద్రియప్రాణై రాత్మనః సంనికర్షణమ్ ।
సంసారః ఫలవాంస్తావదపార్థోఽప్యవివేకినః ॥ 12

**భగవానుడు పలికెను:—** దేహేంద్రియ ప్రాణములతో ఆత్మకు సంబంధ మున్నంతవఱకు అవివేకు లగుపురుషులకు మిథ్యాభూత మగుప్రపంచముగూడ సత్యముగనే స్ఫురించును.

అర్థే హ్యవిద్యమానేఽపి సంసృతిర్న నివర్తతే ॥
ధ్యాయతో విషయానస్య స్వప్నేఽనర్థాగమో యథా॥ 13

స్వప్నమున మిథ్యాభూత మగు వ్యాఘ్రి సర్పాది దర్శనమువలన గలిగినభయాదులవలె విషయచింతయందు వ్యాకులమైన ఆత్మ (జీవుని)

పక్షమున సంసారము మిథ్య యైనను అవివేకమువలన నది సత్యముగనే స్ఫురించును.

యథా హ్యప్రతిబుద్ధస్య ప్రస్వాపో బహ్వనర్థభృత్ ।
స ఏవ ప్రతిబుద్ధస్య న వై మోహాయ కల్పతే ॥ 14

స్వప్నము నిద్రించువానికి ఎన్నియో అనర్థములను గలుగజేయును, కాని మేలుకొనినవాని కది యెట్టిమోహమును గలుగజేయజాలదు.

శోకహర్ష భయక్రోధలోభమోహస్పృహాదయ ।
అహంకారస్య దృశ్యంతే జన్మమృత్యూశ్చ నాత్మనః ॥ 15

శోకము, హర్షము, భయము, క్రోధము, లోభము, మోహము, స్పృహ, జననము, మరణము—అనున వన్నియు అహంకారకార్యములు అనగా దేహాభిమానకార్యములేకాని ఆత్మకు సంబంధించినవి కావు.

దేహేంద్రియప్రాణమనోఽభిమానో
జీవోఽన్తరాత్మా గుణకర్మమూర్తిః ।
సూత్రం మహానిత్యురుధేవ గీతః
సంసార ఆధావతి కాలతంత్రః ॥ 16

దేహమును. ఇంద్రియములను, మనస్సును, అభిమానించువాడును, అంతరాత్మయు, గుణకర్మమూర్తియు, "సూత్రము, మహత్తత్త్వము"నని చెప్పబడువాడును నగుజీవుడు కాలమున (పరమేశ్వరున) కధీనుడయి అజ్ఞానమువలన సంసారమునం దంతట పరుగిడుచుండును.

అమూలమేతద్బహురూపరూపితం
మనోవచః ప్రాణ శరీరకర్మ ।

జ్ఞానాసినోపాసనయా శితేన—
చ్ఛిత్త్వా మునిర్గాం విచరత్యతృష్ణః ॥ 17

ఈ యహంకార బంధనస్వరూప మగుసంసారము వాస్తవముగ మూలము లేని దయ్యును, అజ్ఞానము వలన నది గారడివానివలె బహు రూపములుగ వెల్లడియై మనోవాక్ప్రాణ శరీరకర్మలుగ పరిణతమగును. ముని యీ యహంకారమును గురూపాసనచే లభించిన తీక్ష్ణమైనజ్ఞాన ఖడ్గముచే ఛే ంచి వాసనాశూన్య మగుహృదయముతో భూమియందు సంచరించును.

జ్ఞానం వివేకో నిగమ స్తపశ్చ
ప్రత్యక్షమైతిహ్యమథానుమానమ్ ।
ఆద్యంతయోరస్య యదేవ కేవలం
కాలశ్చ హేతుశ్చ తదేవ మధ్యే ॥ 18

ఆత్మానాత్మవివేకమె జ్ఞానము. వేదము, తపస్సు (స్వధర్మము), ప్రత్యక్షము (స్వానుభవము), ఐతిహ్యము (ఉపదేశము). కాలము, హేతువు, అనుమానము ననునీ ప్రమాణములద్వారా జగత్తుయొక్క ఆద్యంతములయందు ఏది కలదో నడిమియందుగూడ నదియే కల దని తెలిసికొనవలెను.

యథా హిరణ్యం స్వకృతం పురస్తాత్
పశ్చాచ్చ సర్వస్య హిరణ్మయస్య ।
తదేవ మధ్యే వ్యవహార్యమాణం
నానాపదేశైరహమస్య తద్వత్ ॥ 19

కుండలాది రూపముగ నిర్మితమైనసువర్ణము ఆకటక కుండలాద్య

త్పత్తికి పూర్వమునందుగాని, నాశన మైనతరువాతగాని ఆ సువర్ణమే యుండును. నడుమ మాత్ర మది కటకకుండలాది నామములతో వ్యవహృత మగును, వాస్తవములో నది సువర్ణమే. అట్లే విశ్వమునకు గారణభూతుడను నేనే. నాకంటె భిన్నముగ విశ్వములేదు.

విజ్ఞానమేతత్ త్రియవస్థమంగ
గుణత్రయం కారణకార్యకర్తృ ।
సమన్వయేన వ్యతిరేకతశ్చ
యేనైవ తుర్యేణ తదేవ సత్యమ్ ॥ 20

జాగ్రత్స్వప్న సుషుప్తు లనుమూడవస్థలతో గూడిన మనస్సు, అవస్థాత్రయమునకు కారణభూత మైనసత్త్వరజస్తమ మను గుణత్రయము, అధ్యాత్మాధి భూతాధిదైవములకు, త్రిగుణములకు కార్యభూత మైనత్రివిధ జగత్తు-అను నీ పదార్థమంతయు నేతురీయ చైతన్యము యొక్క అన్వయ వ్యతిరేకముద్వారా సిద్ధమైనదో, ఆసమాధి సాక్షి యగుపరబ్రహ్మమే సత్యమైనది.

న యత్పురస్తాదుత యన్న పశ్చా-
న్మధ్యే చ తన్న వ్యపదేశమాత్రమ్ ।
భూతం ప్రసిద్ధం చ పరేణ యద్యత్
తదేక తత్ స్యాదితి మే మనీషా ॥ 21

సృష్టికి పూర్వమందు లేనిది ప్రళయమునకు పిమ్మటగూడ నుండదు. స్థితికాలమునందును వేఱుగ నుండదు. కేవలము నామమాత్రముగ నుండును. ఏ పదార్థము దేనినుండి పుట్టుచున్నదో, దేనిచే ప్రకాశిత మగుచున్నదో అదియే దాని పరమార్థసత్యమని నా దృఢనిశ్చయము.

అవిద్యమానోఽప్యవభాసతే యో
వైకారికో రాజససర్గ ఏషః ।
బ్రహ్మ స్వయం జ్యోతిరతో విభాతి
బ్రహ్మేంద్రియార్థాత్మ వికారచిత్రమ్ ॥ 22

ఈవికారమయ మగుపదార్థ మంతయు లేకపోయినను ఉన్నట్లుగ నగపడును. ఇది రాజససృష్టి. ఇది స్వయంప్రకాశక మగుబ్రహ్మమే కనుక ఇంద్రియములు, పంచతన్మాత్రలు, మనస్సు, పంచమహాభూతములు—అనువానిచే చిత్రిత మైననీ విశ్వమంతయు బ్రహ్మమే.

ఏవం స్ఫుటం బ్రహ్మవివేకహేతుభిః
పరాపవాదేన విశారదేన ।
ఛిత్త్వాఽఽత్మసందేహముపారమేత
స్వానందతుష్టోఽఖిలకాముకేభ్యః ॥ 23

ఇట్లే వేదము, తపస్సు, ప్రత్యక్షము, ఉపదేశము, అనుమానము మున్నగు సుస్పష్టమైన బ్రహ్మజ్ఞాన కారణములచేత, నిపుణుడగు గురువుచేత దేహాద్యనాత్మభావమును బోగొట్టుకొని ఆత్మానందముచే పరితుష్టుడై కామపరతంత్రము లగునింద్రియ విషయములనుండి యుపరతుడు గావలెను.

నాత్మా వపుః పార్థివమింద్రియాణి
దేవా హ్యసుర్వాయుజలం హుతాశః ।
మనోఽన్నమాత్రం ధిషణా చ సత్త్వ
మహంకృతిః ఖం క్షితిరర్థసామ్యమ్ ॥ 24

భౌతిక మైనశరీరము ఆత్మకాదు. ఇంద్రియములు, వాని కధిష్ఠాత లైనదేవతలు, ప్రాణములు, మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము — అనునవికూడ శరీరమువలె అన్నము నాశ్రయించి యుండుటవలన నవి అన్నవికారములే కాని ఆత్మ కాదు. వాయువు, జలము, తేజస్సు, ఆకాశము, భూమి యనుపంచభూతములు, శబ్దాదివిషయపంచకము ప్రకృతి యనున వన్నియు భౌతికములే కాని ఆత్మ స్వరూపములు కావు.

సమాహితైః కః కరణైర్గుణాత్మభి-
ర్గుణో భవేన్మత్సువివిక్తధామ్నః ।
విక్షిప్యమాణైరుత కిం ను దూషణం
ఘనైరుపేతైర్విగతే రవేః కిమ్ ॥ 25

చక్కఁగ నా స్వరూపమును దెలిసికొనినవానికి వాని త్రిగుణమయము లగునింద్రియములు నిశ్చలములైనను, విక్షిప్తములైనను ఎట్టి గుణముగాని దోషముగాని యుండదు మేఘము లాకాశము నావరించినను లేకపోయినను సూర్యున కెట్టి వృద్ధి క్షయములును గలుగవు.

యథా నభో వాయ్వనలాంబుభూగుణై-
ర్గతాగతైర్వర్తుగుణైర్న సజ్జతే ।
తథాక్షరం సత్త్వరజస్తమోమలై-
రహంమతేః సంసృతిహేతుభిః పరమ్ ॥ 26

ఆకాశము వాయువు, అగ్ని, జలము, పృథివి యనువానియొక్క గుణములచేత, గతాగతము లైనశీతోష్ణాదులచేత యుక్తము కానట్లు; అహంకారమునకంటె పర మైనపరమాత్మ ప్రపంచమునకు గారణరూపములైన సత్త్వాదిగుణములచే మలినము గాడు.

తథాపి సంగః పరివర్జనీయో
గుణేషు మాయా రచితేషు తావత్ ।
మద్భక్తియోగేన దృఢేన యావ-
ద్రజో నిరస్యేత మనఃకషాయః ॥ 27

అయినను దృఢ మగునా భక్తియోగముచేత విషయాది గుణము నుండి మనస్సు తొలగనంతవఱకు మాయారచితము లైనవిషయములయం దాసక్తిని పూర్తిగ విడువవలెను.

యథాఽఽమయోఽసాధు చికిత్సితో నృణాం
పునః పునః సంతుదతి ప్రరోహన్ ।
ఏవం మనోఽపక్వకషాయకర్మ
కుయోగినం విధ్యతి సర్వసంగమ్ ॥ 28

బాగుగ చికిత్స చేయనిచో మానవుల రోగములు పూర్తిగ నాశనముగాక మాటిమాటికి వద్ధిచెంది బాధను గలిగించును. అట్లే మనోగతము లైనవాసనలు, తన్మూలకము లగుకర్మలు సంపూర్ణముగ నశింపనిచో తాదృశపుత్రకళత్రాదులయం దాసక్తమైనమనస్సు అల్పజ్ఞానము గల మానవుని స్వార్థమునుండి భ్రష్టునిగా జేయును.

కుయోగినో యే విహితాంతరాయై-
ర్మనుష్యభూతైస్త్రిదశోపసృష్టైః ।
తే ప్రాక్తనాభ్యాసబలేన భూయో
యుంజంతి యోగం న తు కర్మతంత్రమ్ ॥ 29

కుయోగులు దేవతాప్రేరితములైన, బంధు శిష్యాది రూపములను ధరించిన విఘ్నములచే యోగభ్రష్టులై కూడ జన్మాంతరసంస్కారబలముచే మఱల యోగపరిశీలనమునందె ఆసక్తి గలవా రగుదురు. కర్మాదులయం దాసక్తి వారి కుండదు.

కరోతి కర్మ క్రియతే చ జంతుః
కేనాప్యసౌ చోదిత ఆనిపాతాత్ ।
న తత్ర విద్వాన్ ప్రకృతౌ స్థితోఽపి
నివృత్తతృష్ణః స్వసుఖానుభూత్యా ॥ 30

జీవులు సంస్కారములచే ప్రేరితులై పుట్టుక మొదలుకొని చావు వఱకును కర్మలను చేయుచునేయుందురు. ఆ కర్మలచే హర్ష విషాదాది వికారములను బొందుదురు. కాని విద్వాంసుడు దేహమునం దుండియు స్వానుభవానందముచే పరితృప్తుడయి నిరహంకారమువలన సంసారమును బొందడు.

తిష్ఠంతమాసీనముత వ్రజంతం
శయానముక్షంతమదంతమన్నమ్ ।
స్వభావమన్యత్కిమపీహమాన-
మాత్మానమాత్మస్థమతిర్న వేద ॥ 31

ఆత్మస్థమైనమతి గలవ్యక్తి, తన దేహము ఉండుట, కూర్చుండుట, పరుండుట, నడచుట, మూత్రమును విసర్జించుట, అన్నమును భక్షించుట, ఇతరము లగుస్వాభావికకర్మల నొనర్చుట యనువానిని గుర్తింపడు.

యది స్మ పశ్యత్యసదింద్రియార్థం
నానానుమానేన విరుద్ధమన్యత్ ।
న మన్యతే వస్తుతయా మనీషీ
స్వాప్నం యథోత్థాయ తిరోదధానమ్ ॥ 32

స్వప్నమునుండి మేలుకొనిన పురుషుడు స్వప్నదృష్టములు, మేలుకొనిన పిమ్మట తిరోహితములు నగువిషయములను సత్యములని భావింపనట్లు వివేకముగలవ్యక్తి అసదింద్రియ విషయములను దర్శించినను ఆత్మవ్యతిరిక్తము లగు పదార్థములను సత్యము లనియంగీకరింపడు.

పూర్వం గృహీతం గుణకర్మచిత్ర-
మజ్ఞానమాత్మన్యవివిక్తమంగ ।
నివర్తతే తత్ పునరీక్షయైవ
న గృహ్యతే నాపి విసృజ్య ఆత్మా ॥ 33

ఉద్ధవా! బద్ధావస్థయందు గుణకర్మలచే చిత్రిత మగుఅజ్ఞానము ఆత్మచే నవిచారితము గృహీతము నై యున్నది. ఆయజ్ఞానము మఱల జ్ఞానముచేత దొలగిపోవును ఆత్మ యేవిషయముచేతగూడ నెప్పుడును గృహీతముగాని పరిత్యక్తముగాని కాదు.

యథా హి భానోరుదయో నృచక్షుషాం
తమో నిహన్యాన్న తు సద్విధత్తే ।
ఏవం సమీక్షా నిపుణా సతీ మే
హన్యాత్తమిస్రం పురుషస్య బుద్ధేః ॥ 34

సూర్యుని ఉదయము మానవ నేత్రములయందలి యంధకారమును నాశనము చేయునుగాని ఎట్టివస్తువును ఉత్పత్తిచేయజాలదు. ఇది పూర్వము

నుండియు నున్నది. అట్లే నిపుణ మగునా యాత్మవిద్యయు జీవుని బుద్ధి గత మగుఅజ్ఞానమును నాశము చేయును, జీవస్వరూపమును సృష్టింప జాలదు. కాని ఆత్మ యెల్లపుడు నుండునట్టిదియే.

ఏష స్వయంజ్యోతిరజోఽప్రమేయో
మహానుభూతిః సకలానుభూతిః ।
ఏకోఽద్వితీయో వచసాం విరామే
యేనేషితా వాగసవశ్చరంతి ॥ 35

జీవునికంటె భిన్నుడగుపరమాత్మ స్వప్రకాశుడు, అజుడు, అప్రమేయుడు, సర్వవ్యాపకుడు, చిత్స్వరూపుడు, సర్వజ్ఞుడు, స్వజాతీయ విజాతీయ భేదరహితుడు; వాక్కులకగోచరుడగునా పరమాత్మచే ప్రేరితములై ప్రాణములు, వాక్కులు తమతమ నిర్దిష్టవిషయములయందు ప్రవర్తితము లగును.

ఏతావానాత్మసంమోహో యద్వికల్పస్తు కేవలే ।
ఆత్మన్నృతే స్వమాత్మానమవలంబో న యస్య హి ॥ 36

అభిన్నము, వికల్పరహితము నగునాత్మవస్తువునందు భేదము నంగీకరించుట మనోభ్రమయే ఏలయన. తన యాత్మ కతిరిక్తమైననా భ్రమకుగూడ నితర మగునధిష్ఠాన మేదియు లేదు.

యన్నామాకృతిభిర్గ్రాహ్యం పంచవర్ణమబాధితమ్ ।
వ్యర్థేనాప్యర్థవాదోఽయం ద్వయం పండిత
మానినామ్ ॥ 37

నామరూపములచే గ్రాహ్యము, పంచభూతాత్మకము నగునీ ద్వైతము ను (ప్రపంచమును) పండితాభిమానులగువ్యక్తులు సత్య మనిపలుకు

దురు. కాని యిది అర్థహీన మగువాగాడంబరము మాత్రమే.

యోగినోఽపక్వయోగస్య యుంజతః కాయ ఉత్థితైః
ఉపసర్గైర్విహన్యేత తత్రాయం విహితో విధిః ॥ 38

యోగాభ్యాసము చేయు యోగిశరీరము యోగసాధన పూర్తికాక మునుపే రోగాద్యుపద్రవములచే పీడితమైనచో అతడీయుపాయముల నవలంబింపవలెను.

యోగధారణయా కాంశ్చిదాసనైర్ధారణాన్వితైః ।
తపోమంత్రౌషధైః కాంశ్చిదుపసర్గాన్ వినిర్దహేత్ ॥ 39

శీతాతపములను సూర్యచంద్ర ధారణయోగముద్వారా, వాతాదిరోగములను ఆసనప్రాణాయామములద్వారా, గృహసర్పాది కృతవిఘ్నములను తపస్సు, మంత్రము, ఔషధము మున్నగువానిద్వారా పోగొట్టుకొనవలెను.

కాంశ్చిన్మమానుధ్యానేన నామసంకీర్తనాదిభిః ।
యోగేశ్వరానువృత్త్యా వా హన్యాదశుభదాన్
శనైః ॥ 40

కామాదివిఘ్నములను నన్ను ధ్యానించుటద్వారా నామసంకీర్తనము ద్వారా, అశుభప్రదము లగుదంభము మదము మున్నగువానిని యోగేశ్వరులను అనుసరించుటద్వారా నాశనముచేసికొనవలెను.

కేచిద్దేహమిమం ధీరాః సుకల్పం వయసిస్థిరమ్ ।
విధాయ వివిధోపాయైరథ యుంజంతి సిద్ధయే ॥ 41

ధీరు లగుగొందఱు వ్యక్తులు పూర్వోక్తములు ఇంకను వివిధములు నగునుపాయములద్వారా శరీరమును జరారోగాదిరహితముగను, స్థిర మగు యౌవనముతోగూడిన దానినిగను జేసి పరకాయప్రవేశాదిసిద్ధుల బొందుటకు యోగము నవలంబింతురు.

న హి తత్కుశలాదృత్యం తదాయాసో హ్యపార్థకః ।
అంతవత్త్వాచ్ఛరీరస్య ఫలస్యేవ వనస్పతేః ॥ 42

నిపుణు లగువ్యక్తులు సిద్ధిప్రద మగునీ యోగానుష్ఠానము నాదరింపరు. ఏలయన, ఆత్మ వృక్షమువలె స్థిరమైనది కాని దేహము ఫలమువలె నశ్వరమైనది. అందువలన దేహవిషయక మగుస్థిరత్వసాధనప్రయత్నము నిరర్థకమే యగును.

యోగం నిషేవతో నిత్యం కాయశ్చేత్ కల్పతా
మియాత్ ।
తచ్ఛ్రద్దధ్యాన్న మతిమాన్ యోగముత్సృజ్య
మత్పరః ॥ 43

నిత్యము యోగాభ్యాసపరు డగువాని దేహము జరారోగాదులు లేనిదై సుదృఢ మగును అయినను బుద్ధిమంతు డగుపురుషుడు అట్టి సిద్ధిప్రద మగుయోగానుష్ఠానమునందే శ్రద్ధకలిగి యుండడు

యోగచర్యామిమాం యోగీ విచరన్ మదపాశ్రయః ।
నాంతరాయైర్విహన్యేత నిఃస్పృహః స్వసుఖానుభూః ॥ 44

నన్నే ఆశ్రయించినయోగి యిట్టి యోగచర్యాను శీలనముచే ఆత్మా నుభవసుఖమునందు నిస్పృహుడై విఘ్నములచే నభిఘాతుడు గాడు.

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే పారమహంస్యాం
సంహితాయాం ఏకాదశస్కంధే భగవదుద్ధవ
సంవాదే క్రియాయోగవర్ణనం నామ
అష్టావింశోఽధ్యాయః ॥

ఇట్లు శ్రీమద్భాగవతమహాపురాణములోని ఏకాదశ
స్కంధములోని యిరువదియెనిమిదవ అధ్యాయము
స మా ప్త ము.



# ఇరువది తొమ్మిదవ అధ్యాయము

భాగవత ధర్మ నిరూపణము ; ఉద్ధవుడు
బదరికాశ్రమమునకు వెడలుట.

## ఉద్ధవ ఉవాచ.

సుదుశ్చరామిమాం మన్యే యోగచర్యామనాత్మనః ।
యథాంజసా పుమాన్ సిద్ధ్యేత్ తన్మే బ్రూహ్యాం
జసాచ్యుత ॥ 1

ఉద్ధవుడు పలికెను :- అచ్యుతా! మనస్సు స్వాధీనములో లేనిమానవుడు పైనచెప్పబడిన యోగము ననుష్ఠించుట మిక్కిలి కష్ట మని భావించుచున్నాను. అందువలన అనాయాసముగ పురుషు డుత్తమసిద్ధిని బొందు సుగమ మగు సాధనను నాకు బోధింప వలసినది.

ప్రాయశః పుండరీకాక్ష యుంజంతో యోగినో మనః ।
విషీదంత్యసమాధానాన్మనోనిగ్రహకర్శితాః ॥ 2

పుండరీకాక్షా ! యోగులు తమ మనస్సు నెంతగా నిగ్రహించుకొనుటకు ప్రయత్నించినను వారా కార్యమున కృతకృత్యులు కాజాలకమిక్కిలి కష్టపడుచున్నారు.

అథాత ఆనందదుఘం పదాంబుజం
హంసా శ్రయేరన్నరవిందలోచన ।
సుఖం ను విశ్వేశ్వర యోగకర్మభి-
స్త్వన్మాయయామీ విహతా న మానినః ॥ 3

కమలనయనా ! విశ్వేశ్వరా ! అందువలన సారాసారావివేకచతుర

లగు వ్యక్తులు సంపూర్ణమగు ఆనందము నిచ్చు నీ పాదపద్మములను సుఖముగ నాశ్రయింతురు. కుయోగులు యోగకర్మాభిమానులై నీ చరణకమలముల నాశ్రయింపరు. వారు నీ మాయామోహితులై ముక్తిని బొందజాలరు.

కిం చిత్రమచ్యుత తవైతదశేషబంధో
దాసేష్వనన్యశరణేషు యదాత్మసాత్త్వమ్ ।
యోఽరోచయత్సహమృగైః స్వయమీశ్వరాణాం
శ్రీమత్కిరీటతటపీడితపాదపీఠః ॥ 4

అఖిలబాంధవా! అచ్యుతా! బ్రహ్మాదిదేవతలు ప్రకాశవంతము లగు కిరీటములు గలిగిన శిరస్సులను వంచి నీ పాదపీఠమునకు నమస్కరించుచున్నారు. అట్టి నీవు శ్రీరామావతారమున వానరులతో సఖ్యమును జేసికొంటివి. అనన్యశరణులగు నందుడు, గోపికలు, బలి మున్నగు దాసులకు అధీనుడవైతివి. ఇందులో నాశ్చర్యపడవలసిన దేమియున్నది?

తం త్వాఖిలాత్మదయితేశ్వరమాశ్రితానాం
సర్వార్థదం స్వకృతవిద్ విసృజేత కో ను ।
కో వా భజేత్ కిమపి విస్మృతయేఽను భూత్యై
కింవా భవేన్న తవ పాదరజోజుషాం నః ॥ 5

బలి ప్రహ్లాదాదులపై జూపిన నీ యనుగ్రహ విశేషకథను దెలిసికొనిన యేవ్యక్తి నిఖిల జగదంతర్యామివి, ప్రియుడవు, ఈశ్వరుడవు, ఆశ్రితులకు సర్వపురుషార్థముల నిచ్చువాడవు నగు నిన్ను వదలును నీ? విచ్చిన స్వర్గాదులు ఇంద్రియభోగములు నిన్నే మరపించును. అందువలన వాని నెవడు అనుభవింపగోరును? నీ పాదరజమును సేవించు మాకు లభింపని దేమియుండును?

నైవోపయంత్యపచితం కవయస్తవేశ
బ్రహ్మాయుషాఽపి కృతమృద్ధముదః స్మరంతః ।
యోఽన్తర్బహిస్తనుభృతామశుభం విధున్వ-
న్నాచార్యచైత్త్యవపుషా స్వగతిం వ్యనక్తి ॥ 6

దేవా ! నీవు బయట ఆచార్యరూపముతోను, లోపల అంతర్యామి రూపముతోను నుండి అశుభము లగుజీవుల విషయవాసనలను నాశనము చేసి, వారికి నీ నిజరూపమును జూపుచున్నావు. అందుచే నీవలన వృద్ధి బొందిన భక్తి యనుపరమానందమున మగ్నులై బ్రహ్మజ్ఞానసంపన్ను లగు వ్యక్తులు కల్పాంతముపరకు నీ సేవయందే నియుక్తులై నీవు చేసిన యుపకారమును స్మరించుకొనుచు ఆనందము ననుభవించుచుందురు. ఏమాత్రమును నీ ఋణమునుండి విముక్తులు కాజాలరు.

శుక ఉవాచ.

ఇత్యుద్ధవేనాత్యనురక్తచేతసా
పృష్టో జగత్క్రీడనకః స్వశక్తిభిః ।
గృహీతమూర్తిత్రయ ఈశ్వరేశ్వరో
జగాద సప్రేమమనోహరస్మితః ॥ 7

శుకుడు పలికెను :— అనురక్తచిత్తుడగు ఉద్ధవుడడుగగా జగత్తే క్రీడోపకరణ మైనవాడు, స్వశక్తులచే ముమ్మూర్తులను గ్రహించినవాడు, బ్రహ్మాదులకు గూడ నీశ్వరుడు నగుశ్రీకృష్ణుడు మనోహరముగ నవ్వుచు ప్రేమతో నిట్లు పలికెను.

## శ్రీ భగవానువాచ

హంత తే కథయిష్యామి మమ ధర్మాన్ సుమంగళాన్ ।
యాన్ శ్రద్ధయాఽఽచరన్ మర్త్యో మృత్యుం జయతి
దుర్జయమ్ ॥ 8

భగవానుడు పలికెను:— ఉద్ధవా! మరణశీలుడగు మానవుడు శ్రద్ధతో నేధర్మముల నాచరించి అతిదుర్జయ మగుమృత్యువును గూడ జయించుటకు సమర్థుడగుచున్నాడో, అట్టి సుఖరూపము లగుధర్మములను నీ కుపదేశించుచున్నాను.

కుర్యాత్సర్వాణి కర్మాణి మదర్థం శనకైః స్మరన్ ।
మయ్యర్పితమనశ్చిత్తో మద్ధర్మాత్మమనోరతిః ॥ 9

శాంతభావముతోను, మృదుభావముతోను నాయందే మనోవృత్తుల నుంచి, నా ధర్మమునందనురక్తుడయి, ఎల్లపుడు నన్నే ధ్యానించుచు, నాకొఱకే వర్ణాశ్రమవిహితము లగుసర్వకర్మల నాచరించుచుండవలెను.

దేశాన్ పుణ్యానాశ్రయేత మద్భక్తైః సాధుభిః శ్రితాన్ ।
దేవాసురమనుష్యేషు మద్భక్తాచరితాని చ ॥ 10

సాధువులైన నా భక్తులు నివసించు పుణ్యదేశములయందు నివసింపవలెను. దేవాసురమనుష్యులయందున్న నాభక్తుల నడవడుల ననుసరింపవలెను.

పృథక్సత్రేణ వా మహ్యం పర్వయాత్రామహోత్సవాన్ ।
కారయేద్గీతనృత్యాద్యైర్మహారాజవిభూతిభిః ॥ 11

ఒంటరిగగాని, ఇతరులతో గలిసికాని మహారాజోచితములైన అనగా నుత్కృష్టములైన నృత్యగీతవాద్యాదులచే నా ప్రీతికొఱకు పర్వ యాత్రామహోత్సముల జేయవలెను.

మామేవ సర్వభూతేషు బహిరంతరపావృతమ్ ।
ఈక్షేతాత్మని చాత్మానం యథా ఖమమలాశయః ॥ 12

నిర్మలచిత్తుడయి పురుషుడు ఆకాశమువలె లోపల బయట పరిపూర్ణముగ నున్నవాడను, ఆవరణశూన్యుడను, ఈశ్వరుడను నగునన్ను సర్వభూతములయందును, తనయందును దర్శింపవలెను.

ఇతి సర్వాణి భూతాని మద్భావేన మహాద్యుతే ।
సభాజయన్ మన్యమానో జ్ఞానం కేవలమాశ్రితః ॥ 13
బ్రాహ్మణే పుల్కసే స్తేనే బ్రహ్మణ్యేఽర్కే స్ఫులింగకే ।
అక్రూరే క్రూరకే చైవ సమదృక్పండితో మతః ॥ 14

మిక్కిలి ప్రాజ్ఞుడ వగునుద్ధవా! ఇట్లే కేవలము జ్ఞానము నాశ్రయించి సర్వభూతములయందు నా రూపమే యున్న దనిభావించి బ్రాహ్మణులయందు, చండాలునియందు, దొంగయందు, బ్రాహ్మణుని యుద్దేశించి దానము చేయుదాతయందు, సూర్యునియందు, నిప్పురవ్వయందు, శాంతచిత్తునియందు, క్రూరునియందు, అంతట సమదర్శి యగువ్యక్తియె పండితు డనిచెప్పబడును.

నరేష్వభీక్ష్ణం మద్భావం పుంసో భావయతోఽచిరాత్ ।
స్పర్ధాసూయా తిరస్కారాః సాహంకారా వియంతి హి ॥ 15

సములు, ఉత్తములు, హీనులు నగుసర్వమానవులయందు నేనే యున్నా నని నిరంతరము భావించుపురుషుని అహంకారముతోపాటు స్పర్థ, అసూయ, తిరస్కారము మున్నగునవి శీఘ్రముగనె వినష్టములగును.

విసృజ్య స్మయమానాన్ స్వాన్ దృశం వ్రీడాం
చ దైహికీమ్ ।
ప్రణమేద్దండవద్భూమావాశ్వచాండాలగోఖరమ్ ॥ 16

బంధువులు చేయు పరిహాసమును, తా నుత్తముడ ననుభావమును, లజ్జను పరిత్యజించి పరమేశ్వరుడు సర్వభూతములయందు నున్నాడను బుద్ధితో కుక్క, చండాలుడు, గోవు, గాడిద మున్నగు సర్వజీవులకు భూమిపై బడి సాష్టాంగదండప్రణామము చేయవలెను.

యావత్సర్వేషు భూతేషు మద్భావో నోపజాయతే ।
తావదేవముపాసీత వాఙ్మనః కాయవృత్తిభిః ॥ 17

సర్వప్రాణుల యందు భగవద్భావన కలుగనంతవఱకు మనో వాక్కాయ వ్యాపారాదులద్వారా, ప్రణామాదులద్వారా నన్నుపాసింప వలెను.

సర్వం బ్రహ్మాత్మకం తస్య విద్యయాఽఽత్మమనీషయా ।
పరిపశ్యన్నుపరమేత్ సర్వతో ముక్తసంశయః ॥ 18

ఈవిధముగ నుపాసించువ్యక్తి ఆత్మబుద్ధి యైనవిద్యచే సర్వము బ్రహ్మాత్మకమే యనిభావించి సంశయ రహితుడై సర్వక్రియలనుండి విరతుడు కావలెను.

అయం హి సర్వకల్పానాం సధ్రీచీనో మతో మమ ।
మద్భావః సర్వభూతేషు మనోవాక్కాయవృత్తిభిః ॥ 19

ఉపాయము లన్నింటిలోను మనోవాక్కాయ వృత్తులచే సర్వభూతములయందు నన్నే చూచుట యనుఉపాయమె సరియైన దని నా యభిప్రాయము.

నహ్యంగోపక్రమే ధ్వంసో మద్ధర్మస్యోద్ధవాణ్వపి ।
మయా వ్యవసితః సమ్యక్ నిర్గుణత్వాదనాశిషః ॥ 20

ఉద్ధవా ! నిష్కామ మగుభాగవతధర్మ మారంభమైన నేవిధ మగు వైగుణ్యము నుండదు. ఏలయన, సర్వజ్ఞుడ నగునే నీ ధ్వంసాభావ మగు ధర్మమును చక్కగ నిరూపించితిని.

యో యో మయి పరే ధర్మః కల్ప్యతే
నిష్ఫలాయ చేత్ ।
తదాయాసో నిరర్థస్స్యాద్భయాదేరివ సత్తమ ॥ 21

ఉత్తముడ వగుసుద్ధవా ! భయశోకాదులవలన గలిగిన పలాయనము, అక్రందనము, మున్నగు వ్యర్థకార్యముల నన్నింటిని గూడ పరమాత్మరూపుడ నగు న న్నుద్దేశించి నిష్కామభావనతో జేసినచో వాని కవియే ధర్మస్వరూపము లగును.

ఏషా బుద్ధిమతాం బుద్ధిర్మనీషా చ మనీషిణామ్ ।
యత్సత్యమనృతేనేహ మర్త్యేనాప్నోతి మామృతమ్ ॥ 22

బుద్ధిమంతుల బుద్ధియొక్క, చతురుల చాతుర్యముయొక్క గొప్పతనము, నశ్వరము అసత్యము నగునీ శరీరముద్వారా వినాశరహితము,

సత్యము నగునా తత్త్వమును బొందుటయందే యున్నది.

ఏష తేఽభిహితః కృత్స్నో బ్రహ్మవాదస్య సంగ్రహః ।
సమాసవ్యాసవిధినా దేవానామపి దుర్గమః ॥ 23

దేవతలకు దుర్గమ మగునీ బ్రహ్మవాదసంగ్రహము నంతటిని నీకు సంక్షేపముగను విస్తారముగను జెప్పితిని.

అభీక్ష్ణశ స్తే గదితం జ్ఞానం విస్పష్టయుక్తిమత్ ।
ఏతద్విజ్ఞాయ ముచ్యేత పురుషో నష్టసంశయః ॥ 24

విస్పష్టము, యుక్తియుక్తము నగుజ్ఞానమునుగూడ నీకు పూర్తిగా వినిపించితిని? పురుషుడు దీనిని తెలిసికొనినచో సంశయరహితుడయి ముక్తిని బొందగలడు

సువివిక్తం తవ ప్రశ్నం మయైతదపి ధారయేత్ ।
సనాతనం బ్రహ్మగుహ్యం పరం బ్రహ్మాధిగచ్ఛతి ॥ 25

నా సమాధానముతోగూడ నీ ప్రశ్నను చక్కగ పరిశీలించినవాడు వేదరహస్యము, సనాతనము నగుపరబ్రహ్మమును బొందును.

య ఏతన్మమ భక్తేషు సంప్రదద్యాత్ సుపుష్కలమ్ ।
తస్యాహం బ్రహ్మదాయస్య దదామ్యాత్మా
సమాత్మనా ॥ 26

చక్కగ వా యీ తత్త్వజ్ఞానోపదేశమును నా భక్తుల కిచ్చిన బ్రహ్మజ్ఞానోపదేష్టకు నన్ను నేను సమర్పించుకొందును.

య ఏతత్ సమధీయీత పవిత్రం పరమం శుచి ।
స పూయేతాహరహర్మాం జ్ఞానదీపేన దర్శయన్ ॥ 27

పరమపవిత్రము, పరచిత్తశోధకము నగునీ తత్త్వమును బిగ్గరగా పఠించినవాడు జ్ఞానదీపముతో నితరులకు నన్నెల్లపుడు చూపుచు తాను పవిత్రు డగును.

య ఏతచ్ఛ్రద్ధయా నిత్యమవ్యగ్రః శృణుయాన్నరః ।
మయి భక్తిం పరాం కుర్వన్ కర్మభిర్న స బధ్యతే ॥ 28

శ్రద్ధతోను, మిక్కిలి సావధానముగను నిత్యము దీనిని శ్రవణము చేయువాడు నాయందు భక్తిగలిగి కర్మలచే బద్ధుడుగాడు.

అప్యుద్ధవ త్వయా బ్రహ్మ సఖే సమవధారితమ్ ।
అపి తే విగతో మోహః శోకశ్చాసౌ మనోభవః ॥ 29

మిత్రుడా ! ఉద్ధవా ! నికీ బ్రహ్మతత్త్వము చక్కగ నవగత మైనదా ? నీ మోహము, నీ శోకము తొలగినదా ?

నైతత్త్వయా దాంభికాయ నాస్తికాయ శఠాయ చ ।
అశుశ్రూషోరభక్తాయ దుర్వినీతాయ దీయతామ్॥ 30

ఈ జ్ఞానమును నీవు దాంభికునకు, నాస్తికునకు, మోసగానికి, వినుట కిష్టములేనివానికి, భక్తి లేనివానికి, దుర్వినీతునకు నెప్పుడును ఉపదేశింపరాదు

ఏతైర్దోషైర్విహీనాయ బ్రహ్మణ్యాయ ప్రియాయ చ ।
సాధవే శుచయే బ్రూయాద్భక్తిః
స్యాచ్ఛూద్రయోషితామ్॥ 31

పై దోషములు లేనిబ్రాహ్మణభక్తుడు, ప్రియుడు, శుచియైనవాడు, సాధుస్వభావుడు నగువానికి దీని నుపదేశింపుము. నాయందు భక్తి గలిగి యున్నచో స్త్రీలకు శూద్రులకు గూడ నుపదేశింపుము.

నైతద్విజ్ఞాయ జిజ్ఞాసోర్జ్ఞాతవ్యమవశిష్యతే ।
పీత్వా పీయూషమమృతం పాతవ్యం నావశిష్యతే ॥ 32

రుచి గలఅమృతమును పానముజేసినవానికి ఇక త్రాగవలసిన దేమియు నుండదు. అట్లే యీ తత్త్వమును దెలిసికొనినవానికి ఇక తెలిసికొనదగిన విషయ మేదియునుండదు.

జ్ఞానే కర్మణి యోగే చ వార్తాయాం దండధారణే ।
యావానర్థో నృణాం తాత తావాం స్తేఽహం
చతుర్విధః ॥ 33

ఉద్ధవా ! మానవులకు జ్ఞానము, కర్మ, యోగము, వాణిజ్యము, దండనీతి మున్నగువానిచేత చతుర్విధము అగుమోక్షధర్మకామార్థరూపమగు ఫలము లభించును, నీవంటి యనన్యభక్తులకు ఆనాలుగువిధము లగు ఫలమును నేనే,

మర్త్యో యదా త్యక్తసమస్తకర్మా
నివేదితాత్మా విచికీర్షితో మే ।
తదామృతత్వం ప్రతిపద్యమానో
మయాఽఽత్మభూయాయ చ కల్పతే వై ॥ 34

సర్వకర్మలను వదలి నాయం దాత్మసమర్పణచేసినవాడు నా యిచ్ఛతో

యోగులకంటెను, జ్ఞానులకంటెను మిక్కిలిగ జ్ఞానసంపన్ను డగును పిమ్మట అమృతత్త్వమును బొంది నాతో సమానముగ ఐశ్వర్యమును బొందుట కుపయుక్తు డగును,

## శుక ఉవాచ

స ఏవమాదర్శితయోగమార్గ
స్తదోత్తమశ్లోకవచో నిశమ్య ।
బద్ధాంజలిః ప్రీత్యుపరుద్ధకంఠో
న కించిదూచేఽశ్రుపరిప్లుతాక్షః ॥ 35

శుకుడు పలికెను :— యోగమార్గోపదేశమును సంపూర్ణముగ బొందినవాడయి యుద్ధవు డపుడు సత్పురుషులచే కీర్తింపబడు శ్రీకృష్ణుని వాక్కులను విని బాష్పపరిపూర్ణలోచనుడు, ప్రీతిచే రుద్ధమైన కంఠము గలవాడు, అంజలిబద్ధుడు నగుచు నేమియును పలుకజాలక పోయెను.

విష్టభ్య చిత్తం ప్రణయావఘూర్ణం
ధైర్యేణ రాజన్ బహుమన్యమానః ।
కృతాంజలిః ప్రాహ యదుప్రవీరం
శీర్ష్ణా స్పృశంస్తచ్చరణారవిందమ్ ॥ 36

రాజా ! అనంతరము ప్రేమచే విహ్వల మగుచిత్తమునకు ధైర్యమును జేకూర్చి తాను కృతార్థుడ నైనట్లుగ భావించుకొని యుద్ధవుడు శ్రీకృష్ణ

భగవానుని పాదపద్మములను శిరస్సుచే స్పృశించి కృతాంజలియై యిట్లు పలుకసాగెను.

## ఉద్ధవ ఉవాచ

విద్రావితో మోహమహాంధకారో
య ఆశ్రితో మే తవ సంనిధానాత్ ।
విభావసోః కిం ను సమీపగస్య
శీతం తమో భీః ప్రభవంత్యజాద్య ॥ 37

**ఉద్ధవుడు పలికెను:—** దేవా! ఆదిపురుషుడా! మోహమనుమహాంధకారమున బడియున్న నేను నీ సాన్నిధ్యమువలన నిపుడు బహుదూరము పరుగిడితిని. సూర్యుని (అగ్ని) సమీపమున నున్నవానిని చలి, చీకటి, భయము—అనునవి యేమి చేయును?

ప్రత్యర్పితో మే భవతానుకంపినా
భృత్యాయ విజ్ఞానమయః ప్రదీపః ।
హిత్వా కృతజ్ఞస్తవ పాదమూలం
కోఽన్యత్ సమీయాచ్ఛరణం త్వదీయమ్ ॥ 38

నీవు దయగలవాడవయి నీ మాయచే నపహరింపబడిన విజ్ఞానమయమగుస్వరూపజ్ఞానదీపమును మరల భృత్యుడ నగునాకు సమర్పించితివి. అందువలన నీ యీ యుపకారమును మఱచి యేవ్యక్తి నీ పాదపద్మములను విడచి యితరుల నాశ్రయించును?

వృక్ణశ్చ మే సుదృఢః స్నేహపాశో
దాశార్హవృష్ణ్యంధకసాత్వతేషు ।
ప్రసారితః సృష్టివివృద్ధయే త్వయా
స్వమాయయా హ్యాత్మసుబోధహేతినా ॥ 39

నీవు నీ మాయచే ప్రజాభివృద్ధికై దాశార్హవృష్ణ్యంధకసాత్వత వంశీయు లగుయాదవులతోపాటు నన్ను దృఢ మగుస్నేహపాశముచే బంధించితివి ఇపుడు నీవే ఆత్మతత్త్వజ్ఞానరూప మగుపదునైన శస్త్రము ద్వారా ఆస్నేహపాశమును ఖండించితివి.

నమోఽస్తు తే మహాయోగిన్ ప్రపన్నమనుశాధి మామ్ ।
యథాత్వచ్చరణాంభోజే రతిః స్యాదనపాయినీ ॥ 40

మహాయోగేశ్వరా ! నీకు నా నమస్కారము. నేను నిన్ను శరణుజొచ్చితిని. నీ చరణకమలములయం దనన్యభక్తి కలుగునట్లుగ నన్ను శాసింపుము.

## శ్రీ భగవానువాచ.

గచ్ఛోద్ధవ మయాఽఽదిష్టో బదర్యాఖ్యం
మమాశ్రమమ్ ।
తత్ర మత్పాదతీర్థోదే స్నానోపస్పర్శనైః శుచిః ॥ 41

భగవానుడు పలికెను:— ఉద్ధవా ! నీవు నా యాజ్ఞ

ననుసరించి యిపుడు నా యాశ్రమ మగుబదరికావనమునకు వెడలుము. అచట నా చరణరజముచే పవిత్రముగా జేయబడిన తీర్థజలమునందు స్నాన మును ఆచమనాదులను జేయుము, పవిత్రుడ వగుదువు.

ఈక్షయాలకనందాయా విధూతాశేషకల్మషః ।
వసానో వల్కలాన్యంగ వన్యభుక్ సుఖ నిస్పృహః ॥ 42

గంగానదిదర్శనముచేత సర్వపాపవినిర్ముక్తుడవై నారచీరల ధరించి, కందమూల ఫలముల భుజించి, విషయసుఖములయం దిచ్ఛలేనివాడవై యుండుము.

తితిక్షుర్ద్వంద్వమాత్రాణాం సుశీలః సంయతేంద్రియః ।
శాంతః సమాహితధియా జ్ఞానవిజ్ఞానసంయుతః ॥ 43
మత్తోఽనుశిక్షితం యత్తే వివిక్తమనుభావయన్ ।

మయ్యావేశితవాక్చిత్తో మద్ధర్మనిరతో భవ ।
అతివ్రజ్య గతీస్తిస్రో మామేష్యసి తతః పరమ్ ॥ 44

శీతోష్ణాదిద్వంద్వములయందు సహనము గలవాడవుగను, సుశీలు డవుగను, జితేంద్రియుడవుగను, శాంతుడవుగను, జ్ఞానవిజ్ఞానయుక్తుడవు గను నుండి; నానుండి దెలిసికొనిన భక్తిజ్ఞానవైరాగ్యాదులను ఏకాంత ముగ ననుశీలనము చేయుచు, మనోవాక్కులను నాయందుంచి, నా ధర్మము నందాసక్తుడవై యుండుము. దానివలన త్రిగుణాత్మకము లైనగతులను

(దేవతిర్యఙ్మనుష్యయోనులను) దాటి గుణాతీతుడ వగునన్ను బొందెదవు.

శ్రీ శుక ఉవాచ

స ఏవ ముక్తో హరిమేధసోద్ధవః
ప్రదక్షిణం తం పరిసృత్య పాదయోః ।
శిరో నిధాయాశ్రుకలాభిరార్ద్రధీ-
ర్న్యషించదద్వంద్వపరోఽప్యపక్రమే ॥ 45

శుకుడు పలికెను :- ఆ విధముగ నుద్ధవుడు శ్రీకృష్ణ భగవానునిచే నాజ్ఞాపింపబడినవాడై, ఆయనకు ప్రదక్షిణము చేసి, ఆయన చరణయుగళమును శిరస్సున నుంచుకొని ప్రేమాభిభూతచిత్తుడయి బాష్ప బిందువులచే శ్రీకృష్ణుని చరణముల నభిషేకించెను.

సుదుస్త్యజస్నేహవియోగకాతరో
న శక్నువంస్తం పరిహాతుమాతురః ।
కృచ్ఛ్రం యయౌ మూర్ధని భర్తృపాదుకే
బిభ్రన్నమస్కృత్య యయౌ పునః పునః ॥ 46

దుస్త్యజ మగుప్రేమవలన నెడబాటు కలుగుచున్నందులకు కాత రుడై అయనను విడువలేకపోయెను. అయినను భగవానుని ఆదేశము నకు వశుడై ఆయన పాదుకలయందు శిరస్సునుంచి, మాటిమాటికి నమ స్కరించుచు బహుకష్టముతో బదరికాశ్రమమునకు వెడలెను.

తత స్త్వమంత ర్హృది సంనివేశ్య
గతో మహాభాగవతో విశాలామ్ ।
యథోపదిష్టాం జగదేకబంధునా
తపః సమాస్థాయ హరేరగాద్గతిమ్ ॥ 47

అనంతరము మహాభాగవతు డగునుద్ధవుడు బదరికాశ్రమమునకు వెడలి హృదయమున శ్రీకృష్ణభగవానుని నిలుపుకొని, తపస్సునం దుండి, జగత్తున కేకైకబంధు వగుశ్రీకృష్ణు డుపదేశించిన గతిని బొందెను. అనగా భగవత్సామీప్యమునకు జేరికొనెను.

య ఏతదానందసముద్రసంభృతం
జ్ఞానామృతం భాగవతాయ భాషితమ్ ।
కృష్ణేన యోగేశ్వరసేవితాంఘ్రిణా
సచ్ఛ్రద్ధయాఽఽసేవ్య జగద్విముచ్యతే ॥ 48

యోగేశ్వరసేవితు డగుశ్రీకృష్ణుడు భాగవతప్రధాను డగునుద్ధవున కుపదేశించిన ఈ భగవద్భక్తిమార్గసంమిశ్రిత మగుజ్ఞానామృతమును పరమ శ్రద్ధతో గొలదిగ సేవించినను ముక్తుడగును? వాని సంసర్గముచే జగత్తు కూడ విముక్త మగును.

భవభయమపహంతం జ్ఞానవిజ్ఞానసారం
నిగమకృదుపజహ్రే భృంగవద్వేదసారమ్ ।
అమృతముదధితశ్చాపాయయద్భృత్యవర్గా
పురుషమృషభమాద్యం కృష్ణసంగం
నతోఽస్మి ॥ 49

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే బ్రహ్మసూత్రభాష్యే
పారమహంస్యాం సంహితాయాం వైయాసిక్యా మేకా
దశస్కంధే భగవదుద్ధవ సంవాదే నామ
ఏకోనత్రింశోఽధ్యాయః ॥

వేదకర్త యగుజనార్దనుడు జీవుల సాంసారిక భయమును బోగొట్టుటకై తుమ్మెదవలె సర్వవేదములనుండి సారరూపము జ్ఞానవిజ్ఞానశ్రేష్ఠము నగు భక్తిరసామృతమును సేకరించి తన భక్తులకును, సముద్రమునుండి అమృతమును వెలికిదీసి మోహినీరూపముతో నసురుల వంచించి, తన్ను సేవించు దేవతలకును బంచిపెట్టెను. జగత్కారణుడు, ఆద్యుడు, కృష్ణ సంజ్ఞకుడు నగునా పరమపురుషునకు నమస్కరించుచున్నాను.

ఇట్లు శ్రీమద్భాగవత మహాపురాణములోని ఏకాదశ
స్కంధములోని యిరువది తొమ్మిదవ అధ్యాయము
సమాప్తము.

శ్రీమద్భాగవతాంతర్గతమగు

# శ్రీకృష్ణోద్ధవ సంవాదము

## శ్లోకానుక్రమణిక